శ్రీరామచంద్రాయనమః.

# శ్రీకృష్ణలీలామృతము

వావిలికొలను సుబ్బారాయ

విరచితము.

## భవతారకలీల.

యను

తృతీయ చషకము.

రెండవ కూర్పు.

౧౯౩౮.



[ వెల ౨-౧-౦.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.
శ్రీ గోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః.
శ్రీ శారదాయైనమః.



# శ్రీ కృష్ణలీలామృతము.

## భవతారక లీల.

## తృతీయ చుళుకము.

## సాంత్వన లీల.



ధర్మిష్ఠుండైన ధర్మసుతుం డజాతశత్రుండైన తననిమిత్తంబుగఁ బదునెనిమిది యక్షౌహిణులు నిహతంబయి దేశంబు నిర్యువప్రాయంబును, బాలవృద్ధాతురావశిష్టంబును, విధవాబహుళంబు నగుటయుఁ దా నెట్టివారి సుఖంబునకై రాజ్యకాంక్షవహించె నట్టివారెల్ల రూపుమాయుటయు నందు విశేషించి వంశాంకురంబైన యభిమన్యుం డీల్గుటయు యోజించి యోజించి యింటింట నెగయు నాక్రందనధ్వను లాలించి రాజ్యంబుపై నాశచాలించి సింహాసనంబుఁ దిరస్కరించి వానప్రస్థాశ్రమం బంగీకరించి యడవులనుండ నిశ్చయించియున్న నన్నుం గని భీమార్జున నకుల సహదేవులును బ్రియురాలగు ద్రౌపదియు నె

ట్లెన్ని విధములనో బోధించియు నతనిఁ దేర్పఁజాలకయుండె నంత నర్జునుండు కృష్ణుఁగని నీవైన నిమ్మహారాజునకు మనస్సమాధానంబుఁ గల్గింపుమని వేఁడిన నారదుండు సృంజయున కుపదేశించిన విధంబున.

సీ. బాల్యంబుమొదలు భీభత్సుని కంటెను
దనయెడఁ బ్రీతి యత్యధికమగుటఁ
దనమాట ధర్మరాజున కనతిక్రమ
ణీయ మౌటను మెల్ల డాయనేగి
చందన లిప్తంబు శైత్యార్ద్ర లోపమం
బగు కేలిఁ దన కేల నల్లఁబట్టి
చారులోచనమును హరిసుదంష్ట్రింబు
నగుమోము సూర్యకరావబుద్ధ
తే. పద్మ మనఁగ వికాసశోభను వహింప
మోదసంపదతోడ వినోదసూక్తి
బావ! నామాట వినవయ్య పరమరక్తి
ననుచు నిట్లను భక్తజనార్తిహరుఁడు.

ఉ. ఏమిటికయ్య యూరకయ యేడిచి యేడిచి మేనువాడఁగా
నీమెయి సంతపింప? నిటు లేడ్చిన యంతన చెల్లవారు సం
గ్రామమునందు నీల్గిన నరప్రవరుల్ చనుదెంతురో టుఁ? రా
జా! మదినింత మాత్రము విచారము సేయవ యేమి చెప్పఁదున్.

మ. కలలోఁగాంచిన యా పదార్థములు కల్గన్ నేర్చునే మేల్కనన్?
కలనం గూలిన రాజులట్టిర సుమీ, క్ష్మాభృద్ధృతుల్ వారు వీఁ
పులగాయంబులు లేక పోరిహతులై పూతాత్ములై వీరరాట్
సులభంబౌ దివికేగి నారలు, వృథా శోకింప నీకేటికిన్.

కం. సాంగశ్రుతిపారగులై
యభంగేతర రాజధర్మ పరిపాలకులై
సంగర శూరోత్తములై
యంగంబులు వదలి రేల యడలెద వధిపా.

కం. సుతశోకార్తుఁడు సృంజయు
వెతదీర్పఁగ నారదుండు వినిచిన సూక్తుల్
క్షితిపా! వినిపించెద విను
మతినించుక యీయవయ్య మామాటలకున్.

ఉ. ఈవును నేను నీప్రజలు నెల్లరముం మరణించు వారమే;
కావునఁ జన్నవారికయి కారణ మేమిటు దుఃఖ మొందఁగా?
నీవన నేల భూపతులు నీకును మిన్నలు శౌర్యభాగ్యసం
భావితకీర్తులెందఱో దివంబున కేఁగిరి గాక నిల్చిరే.

కం. వారలచరితంబును వ్యా
హారింతున్ వినుము నీకు నఱఁగెడిని వ్యథా
భారము; మహాత్ము లందఱు
భూరియశోధనులు, విశదముగ వివరింతున్.

కం. ధరణీశ్వర! యీచరిత మనో
హర మాయుర్వృద్ధికరము నఘసంహారమున్
బరుషగ్రహ శమకరమున్
బరిపాటిన్ వినఁగదయ్య వ్యసనము దొలఁగున్.

సీ. ఆవిక్షితుఁడు మరుదాఖ్యుండు విశ్వస్రు
డ్యాగంబుఁ జేయింప నమరగురునిఁ
గోర శక్రప్రియకారి యాతఁడు రామి
సంవర్తు గురుననుజాతు వేఁడి
వేల్వంగ నింద్రుండు ద్వేషించి పైనెత్తఁ
గారించె; నతని యాగమున విశ్వ
దేవతల్ సభ్యులు దేవతల్ పరిచరుల్
సాధ్యులు తోడ్పడి సలిపిరెల్ల

ఆ. నింద్రవరుణ గురుసమేతులై వేల్పులు
క్రతువునాదరించి కనిరి నిలిచి
వానిపాలనమున వసుధ దున్నక పండెఁ
బైరులెల్ల బుడమిఁ బ్రబలియుండె.

కం. ఆతఁడు సలిపిన క్రతువునఁ
బ్రీతినిడిన దక్షిణాలను వేల్పులు మనుసం
జాతులు గంధర్వులు మఱి
ఖ్యాతిగ నొసఁగినది లేదు జ్యోత్స్నావరచంద్రా!

కం. ఆవిభుఁడు జ్ఞాన ధర్మ
శ్రీ వైరాగ్యంబులందు శ్రేష్ఠుఁడు నీకుఱా
నీవరసుతుకంటెను బు
ణ్యావస్థితుఁ డరిగె నేల యడలెదు సుతుకై.

సీ. సార్థకనామ్నిన్నై యలరారె వసుమతి;
పైఁడివర్షంబౌక యేఁడొసంగి
మఘవుఁడేళ్ళుల మత్స్యమకర కచ్ఛపములఁ
గనకమయంబులుగా నొసఁగె;
నవియెల్ల గ్రహియించి యవనీశ్వరుఁడు కురు
జాంగలంబునఁ జల్పె సవనవరము
ధారుణీసురులకు దక్షిణల్ కొదలేక
శాస్త్రసమ్మతిగ నొసంగెనయ్య

ఆ. యతిథియనునృపాలు నాత్మజుండు సుహోత్రుఁ
డనెడి భూమినాథుఁ డతులకీర్తి
యట్టివాఁడు చనియె నమరేంద్రభువికిన్నై
కృతుల నేమి నీదుసుతుఁడు సలిపె?

కం. ఆవిభుఁడు జ్ఞానధర్మ
శ్రీ వైరాగ్యంబులందు శ్రేష్ఠుఁడు నీకుఱా
నీవరసుతు కంటెను బు
ణ్యావస్థితుఁ డరిగె నేల యడలెదు సుతుకై.

సీ. అంగదేశమున బృహద్రథుండనురాజు
విశ్వపదాఖ్య పృథ్వీధరమునఁ
గ్రతుసప్తకంబును గావించె శ్వేతాశ్వ
సాహస్రముల యథాశాస్త్రముగను

గనకపరిష్కృత కన్యాసహస్రముల్
　　వేనవేల్ దంతి వితానములను
హాటకమాలా సమావృత వృషముల
　　శతసహస్రంబుల సంత్యజించెఁ
ఆ. గోట్లకొలఁది నిచ్చె గోవరేణ్యంబుల
సోమపానమునను సురవిభుండు
దక్షిణలను విప్రతతిమదించె నరేంద్ర !
తరమె యతనిదానగరిమ పలుక.

కం. దేవతలన్ గంధర్వుల
భూవరులన్ మున్నుచనిన పురుషులు తత్పృ
థ్వీవరువలె యజియింపరు
భావిని జనియింప రట్టిపరమవదాన్యుల్.

సీ. ఛేటకం బనఁగ సే క్షితియెల్లఁ ద్రిప్పెను
　　నొక్కండ గెలిచె నీ యుర్వినెల్ల
నేకాతపత్రుఁడై యొసఁగి వన్యంబులఁ
　　బశువుల నావుల వాజితతుల
దానంబుగా నిచ్చెఁ దన కెనలేకుండ
　　ధరణిభారము మోచె ధాతమెచ్చ
హరిహయుతోసాటి యయ్యె విక్రమమున
　　రథఘోషమున నించెఁ బృథివినెల్ల
తే. నవ్యకీర్తి యుశీనరనందనుండు
శిబియనంగ నృపాలుండు స్థిరముగాఁగ
క్షమను మనలేక వశుఁడయ్యెఁ గాలమునకు
నట్టి కృతులేమి సల్పె నీయాత్మజుండు.

సీ. వెలితిలేకుండెడు విత్తకోశమువాఁడు
　　యమునానదీతటి నశ్వములను
త్రిశతం బొసంగెను దేవతలకు నిరు
　　వదిటి సరస్వతీ నది తటమునఁ

బహునాళ్లు జాహ్నవీ పరిసరంబున నిచ్చె
నశ్వమేధ సహస్ర మాచరించె
రాజసూయశతంబు తేజుమీఱంగఁ జల్పె
గరముల నభ మీఁదఁగాని యట్లు

ఆ. లతని మీఱరాదు యజ్ఞశతంబుల
హయసహస్రముల ననంతధనము
కణ్వునకు నొసంగెఁ గద భరతుండు శ
కుంతలాసుతుండు గుణధనుండు.

కం. జనకునివలె సమబుద్ధిని
దనుపఁగ లోకులను దశరథప్రభు సుతుఁడుఁ
దనరాఁడు దరిద్రుఁడు మఱి
వినగా దొకకీడు రామవిభు రాజ్యమునన్.

సీ. కాలంబు దప్పక కలిగె వర్షంబులు
పైరులు పచ్చలు ప్రబలుచుండెఁ
గఱవను మాటకే కఱవు దాపురమయ్యెఁ
బ్రాణులకును నీటిభయము దొలఁగె
హానికరంబుగ నగ్ని కాల్పకయుండెఁ
బాములచే మృతిభయము మానెఁ
గడుపార బిడ్డలఁ గనిరి పెక్కుర జనుల్
వేయువర్షములు జీవించియుండి

ఆ. రామయంబుబాధ లాత్మ నెఱుంగరు
కోర్కెలెల్లనిండఁ గూరుచుండెఁ
గన్న సుతులఁబోలె క్ష్మాజనంబులనెల్లఁ
గరుణ రామవిభుఁడు కాచువేళ.

క. తరుఁగులె వాదాడ రనం
బురుషుల వచియింపనేల? భూమీజనముల్
తరలరు ధర్మపథంబునఁ
బొరలరు సత్యమున రామభూవరుఁ డేలన్.

కం. ఇష్టవిహారులు కడుసం
తుష్టులు నిశ్చయులు వీతదోషాచరణుల్
శిష్టులు వ్రతనిష్ఠులు సం
పుష్టులు మానవులు రామభూవరుఁ డేలన్.

కం. గోవులు తూములు పిండెను
బూవులు పండులును జెట్లఁ బొలుపుగనిండెన్
బ్రోవులుగాఁ, బసిబిడ్డల
చావులు లేకుండె రామజనవరుఁ డేలన్.

వ. వనముల నాలుగుంబదియుఁ వర్షములుండె దపస్వియట్టులై
వినుతగతిన్ ఘటించెఁ బదివీతిసవంబు లనర్గళంబుగా
విను పదివేలవర్షములు వెండియు నేఁడులువేయి లోకులన్
మనిచెమహాభుజుండుగుణమండనుఁడారఘురామచంద్రుఁడున్.

కం. రాముఁడు నీలాంబుధర
శ్యాముఁడు నాజానుబాహు వని సుముఖుం డు
ద్దాముఁడు నళినాక్షుఁడు గుణ
ధాముఁడు సాకేతనగర ధాముఁడు భూపా.

సీ. ఎవ్వాని క్రతువున నింద్రుండు సోమము
త్రాఁ డసురేంద్రులఁ ద్రుంచివైచె
నెవ్వాఁడు వేలిమి నిచ్చె భూషితకన్య
కాసహస్రంబులఁ గనకరథము
లంపించి తేరికి హస్తిశతంబుగా
హస్తిహస్తికి వేయి యశ్వములుగ
నశ్వంబునకు వేయి యావులుగా నావు
నావును వేమేఁక లనుసరింపఁ

ఆ. దనసమీపమందుఁ దారసిల్లినయేని
కుఱువునందు గంగ కూరుచుండి
దానఁగాంచెనుర్వి నీనామమును మున్ను
భూరిదక్షిణుఁడు భగీరథుండు.

కం. త్రిపథగయగు జాహ్నవియే
నృపవర్య తనూజయనఁగ నెగడె ధరిత్రిన్
దపనాన్వయుఁడు భగీరథుఁ
డపగత దోషుండనిల్చెనా నిత్యుండై ?

సీ. కీర్తింతు రెవ్వని కీర్తి నేఁటికి విప్ర
వరు లా దిలీపుని వార్త వినుము
వసుపూర్ణ వసుధను వసుధాధిపుఁ డొసంగె
దక్షిణగా వేల్మి తరుణమునను
సవముసవంబున స్వర్ణవారణముల
ఋత్విజులకు దాన మిచ్చుచుండె
యూపచషాలముల్ దీపించెఁ బైఁడివై
తీర్చును గృత్యముల్ దేవతాళి

తే. దేవగంధర్వు లాఋువేల్ దినముదినము
నృత్యమొనరింప వీణవాయించుచుండెఁ
దాన విశ్వావసుండు శ్రోతలు దలంపఁ
దనకుఁ దనకుఁగఁ బాడె నతం డటంచు.

కం. బంగారు భూషణంబులు
రంగారఁగ నతనిదంతి రాజులు మత్తా
పొంగారఁగ వీథులలో
నంగంబులు తెలియలేక యవనిఁ బరుండున్.

ఆ. సత్యభాషణుండు శతధన్వుఁ డానృపు
దర్శనంబుఁ జేయు ధరణిజనులు
నాకమేగిరనఁగ నాతని సుకృతంబు
మహిమ నేమి చెప్ప మనుజవర్య.

కం. వేదాధ్యయన రవంబును
గోదండ గుణారవంబు గొల్లగ నిడుఁడున్
నాదము లీమూఁడే పృ
థ్వీదయితుని వీట నెపుడు వినఁబడుచుండున్.

సీ. యువనాశ్వుఁడను ఱేని యుదరంబునం బృష
దాజ్యంబుచే గర్భ మతిశయిల్ల
నతని పార్శ్వమునుండి యమరులు వెడలించి
యతులిత తేజు నాసుతునిఁగాంచి
యెవ్వఁడు ధాతయయ్యెడు వీని కన విని
యేనయ్యెదనటంచు నింద్రుఁడనుట
మాంధాతయయ్యె నా మానవకునినోర
హరిహయుఁడిడఁ దన యంగుటంబు

ఆ. నదియె పాలుగురియ నదిగ్రోలి బాలుండు
పదియురెండునాళ్ళఁ బదియురెండు
వత్సరములబిడ్డ పగిదిఁ గన్పట్టె నా
తండ యొక్కనాఁట ధరణి గెలిచె.

ఉ. సూరవరేణ్యుఁ డా నముచిసూదనతుల్యుఁడు యౌవనాశ్వుఁ డం
గారు బృహద్రథుం గయుని గాథసుకీర్త్యసితున్ మరుత్తునిన్
బోర జయించె, భాస్కరుఁడు పుట్టుప్రదేశమునుండి గ్రుంకునా
ధారణిదాఁక నాతనిద; దాతయతండు శతాశ్వమేధియై.

ఆ. రాజసూయ శతంబును దేజమెఱయ
సలిపి ద్విజులకు రోహిత ఝషములిచ్చెఁ
యోజనోత్సేధమయి దశయోజనాయి
తమ్ములగువానిఁ గనకమయమ్ము లధిప.

ఆ. అవనిసురులుగొనఁగ నవశిష్టమును దక్క
జనములెల్లఁ బంచికొనిరి తమిని
నట్టికీర్తిశాలి యరిగెనాకమునకుఁ
గాలమును దరింపఁగామి నధిప.

సీ. నహుషమహీపాల నందనుండు యయాతి
జలధిసమేతంబు గెలిచి ధరణి
సింధుపర్యంతంబుఁ జిత్రించెను. దమిరె
చీలపాటగు దవ్వనేలలందు

యజ్ఞవేదులనిల్పి హయమేధశతమును
సలిపి దక్షిణగాఁగ స్వర్ణకుధర
ములమూఁటి నొసఁగె దైత్యుల నెల్లనోడించె
బూరుని రాజ్యసంపూజ్యుఁ జేసి
ఆ. యదువు ద్రుహ్యుఁడనెడి యాత్మజులకు నేమి
ధరణి పంచియిడక దారతోడఁ
దా వనంబుఁ జేరె ధరణీశ ! నీసుతుం
డేమిచేసెనయ్య యెఱుఁగఁ జెపుము.
సీ. సాకారమైన పుణ్యంబని జనులెల్లఁ
దలపోయుచుందురే ధన్యచరితు
నయుతయాజుల వసుధాధీశ్వరులనిల్పె
నతిథిసేవార్థమై యజ్ఞవేళ
నంతకుఁ బూర్వంబుఁ దతనంతరం బటు
క్రతువుచేసినవారు కలుగరనుచు
శ్లాఘించి రెవ్వని సైంధవాధ్వరముల
దాక్షిణ్యశీలి యీ ధరణివిభుఁడు
ఆ. నవ్యకీర్తిశాలి నాభాగునందనుం
డంబరీషునతని ననుగమించి
రెల్లనృపులు దక్షిణాయన మరుగంగ
నతనితోడఁ బుణ్యమనుభవింప.
సీ. చైత్రరథుండగు శశిబిందు వొకనూఱు
వేలభార్యల వేయివేలసుతులఁ
గనియెః వారెల్లరుఁ గాంచనకవచులు
నుత్తమధన్వులై రొక్కఁడొకఁడు
కన్యాశతంబును గైకొనె సతులుగా
వారొక్కరొక్కరు వారణములు
పదిపదులొగాఁ బ్రతివారణమునకును
దేరులు నూఱుగాఁ దేరునకును

ఆ. హయశతంబుగాఁగ నశ్వమశ్వమునకు
నాలు నూఱుగాఁగ నావు నకును
నన్ని మేషములను నందఱుఁ దే వాని
నెల్లవాజివేల్మి నీవి నిచ్చె.

సీ. అధూర్తరజసుండు హయనశతకంబు
హుతశిష్టభోజియై యుండియగ్ని
దానమిచ్చుకోలంది తఱుగని విత్తంబు
ధర్మసంశ్రద్ధ తద్దయునుబెరుఁగ
సత్యంబునందున స్వాంతంబురమియింప
వరములుగాఁ గోరి పడసెవాని
వర్షసహస్రంబు వాజిమేధంబుల
నమవసపున్నమ లంచఁజలిపెఁ

తే. ప్రతిసవాంతంబునఁ జే వేయువార్షవములు
ధేనువుల నూఱువేలును దానమిడమె
వేలుపులసోమమున, నీవి విప్రవరుల
స్వధను బితరులఁ గోర్కుల సతులఁ దనిపె.

కం. నిడివిని నిరువది బారలు
వెడలుపు పదిబార లైన వేదిని బైఁడిన్
బుడమిపతి గయుఁడు దానం
బిడియెన్ దక్షిణగ ఋత్విగీశ్వరతతికిన్.

తే. ఇసుము భాగీరథీనది నెంతగలదొ
యన్నియావుల నొసఁగె నా నమరవిభుఁడు
దానముగనట్టి వాఁడును దరలిచనిరెఁ
గాలమును మీఱ శక్తుండు గామి నధిప.

సీ. రంతిదేవుండను రాజుసంకృతిసుతుం
డింద్రుచే వరముల నిట్లుగోనియె

సన్నులోపంబేని యతిథిలోపంబేని
శ్రద్ధలోపములేక జరుగుఁగాత
మొరులమాచింపక యుండుదుఁగావ్రత
మని మాతఁ డొనరించు యాగములకు
వనములనుండియుఁ బల్లెలనుండియుఁ
బశువులు తమయంత వచ్చుచుండు
తే. జర్మరాసులఁ గాఁచిన సార మేఱు
గాఁగఁ జర్మణ్వతీసమాఖ్యను వహించెఁ
జాలుఁ జాలుననన్ నిష్కశతముమాని
నిష్కసాహస్ర మొసఁగె నా నియమరతుఁడు.
కం. హాటకమయమై యుండెను
బీఁటలు చేటలును ఘటులు వివిధస్థాలుల్
సాటివశంబే కనఁ బతి
పాటిగ నాతం డొనర్చుబహుళాధ్వరముల్.
తే. ధేనువులు వేలకోలఁది వధించిసూద
కారులు సుమృష్టకుండలహారితనులు
తినుఁడుతినుఁడని యిడుచు నీదినమునందు
మునుపటట్టులు లేదని యనుచునుండ్రు.
సీ. సగరుఁ డైక్ష్వాకుఁడు సలిపె సహస్రాశ్వ
సవముల దేవతల్ సంతసింప
రేరాజు వెన్నంటు తారకకోటి నా
సుతులఱువదివేవు రతనివెంటఁ
జనుచుండ్రు హాటక సౌధంబులను వస్తు
పూర్ణంబులిడియె వితీర్ణియగుచుఁ
గోపించి త్రవ్వించెఁ గుతలంబునయ్యది
సాగరంబనఁ [illegible] బ్రశస్తమయ్యె
ఆ. వాంఛలెల్లఁ దీర్చి బ్రాహ్మణకోటికి
నొంటిగాఁడుగుచేసె నుర్వినెల్ల

రాజనర్య సురపరాక్రముఁ డాతఁడు
కాలమును దరింపఁ జాలెనొక్కొ.

సీ. వేనుని తనయుండు పృథునను భూపతి
యభిషిక్తుఁజేయు మార్గ లడవిఁ
బృథివిఁ బృథివిఁజేసి పృథుఁడనఁ బ్రథఁగాంచె
జనములరక్షించె శస్త్రభంగి
క్షతముననుండి రక్షణమొనరించుట
క్షత్రియుండను పేరుఁ గాంచెనతఁడు
ప్రజలాతనినిగని రక్తులమనియంట
ననురాగవశమున నర్యోరాజు

తే. దున్నకయ పండెధారిణి, తూముపాలు
ధేనువులుపిండెఁ, జెట్టులఁ దేనెలుండెఁ
బత్రమునఁ బత్రమున; రోగబాధలేక
సర్వసిద్ధార్థులై జనుల్ సంతసిలిరి.

కం. పొలములలో గృహములలో
నళుకించుక లేక జనము లావాసించెన్
లలితగతి నిచ్చకోలఁదిని
సలిలము స్తంభించెనతడు జలధిఁ దరింపన్.

కం. పురుషత్రయప్రమాణపు
గిరులన్ నవజాతరూప కీలితములఁ దా
నిరువదియొక్కటి భూసుర
వరులకు దానంబొసంగె వాజిసవమునన్. ఆంధ్రజయము.

నృపాలా! నామాటలు నీ వీనులఁ దూరెనా? ఏమో ధ్యానించుచున్నవాఁడవే. చావఁగోరువాని కిడు పథ్యమువలె నా హితభాషణములు వ్యర్థములయ్యెనా యని, నారదుండడుగ సృంజయుండును మునీంద్రా! యమృతతుల్యంబులైన నీపలుకుల మనంబు కలఁకదేఱి ప్రసన్నంబయ్యె. పుణ్యాంబైన పూర్వరాజ చరిత్రంబు విని శోకంబుఁ బాసితినని నారదప్రసాద పునర్లబ్ధ జీవితుండైన

సువర్ణష్ఠీవి యను పుత్రునితో సతంబు సుఖంబుండె. అనిన ధర్మజుం డిట్లనియె.

అయ్యా. సువర్ణష్ఠీవి యనుపేరు సార్థకమా? లేక నేతిబీర కాయవంటిదా? అతనినేల నారదుండు మరల బ్రతికించెం జెప్పు మనినం గృష్ణుం డిట్లనియె.

పర్వత నారదులను దేవర్షులు భూలోకంబునం గొంతకాలము నివసింపఁ గోరి సృంజయుండను రాజుంగని నరేంద్రా! మేము పర్వత నారదులము. భూలోకంబునం గొంతకాలము వసింపం దలంచి వచ్చితిమి. నీయింట నిలువవచ్చునే యనిన నతఁడును దేవర్షులారా! నేనే ధన్యుఁడను నిలువుఁడని వారికిఁదగిన యావాసంబుఁగల్పించి పరిచారకావ్రతయైన సుకుమారియను తనకుమారిని శుశ్రూషకై యప్పగించె. సార్థకనామయగు సుకుమారియు నేమఱక వారి కెల్ల విధంబులఁ బరిచర్య సేయుచుండె.

నారదుని మేనల్లుఁడే పర్వతుఁడు. వారిరువురు భూలోకమునకు వచ్చుసమయంబునఁ దమలో నొకసమయ మొనర్చికొనిరి. ఎవరి మనస్సులో నెట్టి యభిప్రాయమున్నను దాఁపక యొండొరునకు నెఱింగింపవలయును. అట్లు దాఁచినవాఁడు శాపంబున కర్హుఁడగు. అని కలయఁబలికికొని సృంజయునింటం గొన్నినాళ్లుండిరి.

అట్టి సమయంబున సుందరియు సుకుమారియు రాజకుమారియు నగు సుకుమారిపై నారదునకు మనంబునిలిచె. మారనారాచపీడితుండై నారదుండు నానాఁటికి గృశియింపఁ దొడంగెఁగాని యుల్లంబునఁ గలతెఱం గల్లునకుఁ దెలిపినవాఁడు కాఁడు. మామ దురవస్థకుఁ గారణంబు పర్వతుండు నిజతపశ్శక్తి నెఱింగి మామయె నన్ను వంచించెఁగదా యని కుపితుండై మామా మన సమయమునకు విరోధముగ నీ మనోగతంబును దాఁచితివి. కావున శాపార్హుఁడ వైతివి. నీవు సుకుమారిని వివాహమైన వెంటనే నీముఖము వానరముఖంబుగ వికారంబునొందుఁగాక యని శపించె. నారదుండును గోపించి నీకు స్వర్గలోక గమనశక్తి నశియించుఁగాక యని శపించె.

ఇట్లొండొరులు శపించి కోపించి కలసియుండ నొల్లమిఁ బర్వతుం డచ్చోటువిడిచి యెందేని చనియె. నారదుం డచ్చోటనయుండి క్రమక్రమంబుగఁ దన హృదయంబు రాజున కెఱింగింప నతండును నక్కన్య నతనికిచ్చి వివాహంబుగావించె. పెండ్లిపీటలమీఁద వధూవరులుండఁగనే శాపబలంబున నారదు మొగంబు క్రోఁతిమాతి యయ్యె. అట్లయ్యును సుకుమారి మహాపతివ్రతయు వివాహము కేవల కాయసంబంధకర్మమేగాక యాత్మసంబంధమనియు నెఱింగిన మతిమతి గావున నామాత్మవతి నారదు ముఖవికారం బుపలక్షించియు మనోవికారంబు గొనక సర్వవిధముల సేవించుచు నతనిఁ గొలిచియుండె.

ఇట్లుకొన్నినాళ్ళరుగ నొకనాఁడు నారదుండు పురబాహ్య ప్రదేశంబున నొక వనంబున నిచ్ఛారతి విహరించువాఁ డందరుదెంచిన పర్వతుంగనియె. ఇట్లిద్దఱు మామయు మరలఁ గలసికొనిరి. అప్పర్వతుం డప్పుడు మామా! నీవు నాకు నిష్కారణంబుగ స్వర్గ లోక గమనంబు లేకుండఁ జేసితివి. శాపంబు క్రమ్మఱింపుమనిన నీవే కదా తొలుత శపించితివి. నీవు నీ శాపంబు క్రమ్మఱించెదవేని నా శాపంబు నేనుఁ గ్రమ్మఱించెదననియె. పర్వతుం డట్లకావింప నారదుండును దన శాపంబు మాన్చె. వారిరువురు సమాధానపడి గృహంబునకేగ సుకుమారి నారదుంగని యతఁ డెవ్వఁడో పరపురుషుఁడని డాయక పలుకరింపక దూరంబునందె తొలఁగియుండె. పర్వతుం డాబిడకుఁ దమ సమయంబు తెఱంగును దా మొండొరుల కిడిన శాప విధంబును, దన్నివృత్తియు నెఱింగించి యితండు నీ భర్తయ కైకొమ్మని ప్రార్థించె. ఆమెయు సంతసించి యట్ల కావించె. ఆవలఁ బర్వత నారదులు రాజునెడ సంతుష్టులై యాయన కేదైన నుపకారముచేసి పోవలయునని తలంచి యిట్లనిరి.

## సువర్ణష్ఠీవి చరిత్రము.

రాజేంద్రా! నీయాదరణంబున మా మనంబులు సంతసిల్లె. మా యట్టివారికి నీకు మేలు సేయక పోరాదు. నీకు దీర్ఘకాల

ముగఁ బుత్రవాంఛ గలదు. నీవు శక్రతుల్య పరాక్రముఁడు వీరుఁడు నగు కుమారుఁ బడయఁగోరెదవు. అట్టివాఁడ నీ కుదయించును గాని శక్రునిబరిభవించు నతనిని శక్రుబారిఁ బడకుండ నెట్లు రక్షించెదవో సుమా. అతండు సువర్ణష్ఠీవి యగుటచే సువర్ణష్ఠీవియను పేరఁ బ్రసిద్ధిం గనునని పర్వతుండు వరమిచ్చె.

సృంజయుండును మహానుభావా! యింద్రుఁ డెక్కడ? నాకొడు కెక్కడ? నే నెట్లు పురుహూతుబారిని బడకుండ బాలుని రక్షింపఁ గలను? అనుగ్రహించి యిచ్చియుఁ గొఱవర మిచ్చితి రయనిన నింద్రు నందలి పక్షపాతంబునఁ బర్వతుం డేమియుఁ బలుకండయ్యె.

అంత నారదుండు నృపాలా! నీ బాలుఁడు గాలము దీఱెనేని నన్ను స్మరింపుము. నేను బ్రతికించెదనని పలికె.

ఆవలఁ గొన్నినాళ్ళకు నారాజునకుఁ గుమారుండు జనియించె. ఆ బాలుని దేహమునుండి వెడలు సర్వము బంగారమైయుండెఁ గావున సువర్ణష్ఠీవియను పేరతనికిఁ దగియుండె. ఆ యద్భుత చరిత్రము క్రమక్రమంబునభూలోకమునం దెగాక నాకలోకంబునందును వ్యాపించె. ఆవింతవిని శచీకాంతుఁడు సాధ్వసాక్రాంత స్వాంతుఁడై విచారించి యితండు వృద్ధింగనెనా పర్వతుండు వచించినట్లు నా కవమానంబు ఘటించునని వజ్రాయుధంబుగని యోకులిశమా! నీవు సమయము వేచియుండి యానృపాలబాలు వధించి రమ్మనియె. అదియుఁగాచి తిరుగుచుండె.

బాలుండు పంచాబ్దంబులవాఁడయ్యె. ఒకనాఁ డాకుమారుఁడు దాదితోడ గంగాతీరంబునఁ దిరుగునెడ వజ్రంబు వ్యాఘ్రమైవచ్చి యిచ్చిఱతవాని బ్రచ్చి వధించి చనియె. హతుఁడైన రాజసుతుంగని దాదియు మొత్తుకొనుచు వాపోయె. అంతఃపుర కాంతలెల్ల నాక్రందించిరి. రాజును జీవినెత్తురు స్రవించు నురంబుగల కుమారుఁ దొడ నిడుకొని బిట్టు వాపోయె. నారదు వాగ్దానంబు చందం బెఱింగిన రాజరాజానన లతనిదొద్దకుఁ బరువెత్తుచుఁ బోయిరి. నృపాలుండును

నారదము స్మరించె. అంత ధరాకాంతుఁ డాసి నారదుం డింద్రునమ్మతి నక్కుమారుఁ బ్రాప్తజీవుం గావించె. అతండు జనకు ననంతరము పదునొకండువేల యేండ్లు ధరాపాలనంబు గావించి జన్నంబులు పెక్కొనరించి దివంబున కరిగె. కావున నీవును వీతశోకుండవై ధరా భారంబు వహించి క్రతువులొనరించి యశంబు గడింపుమని బోధించి మఱియు నిట్లనియె.

ధర్మనందనా! మ్రందినవారికై మిగుల శోకింపరాదు. అట్లు శోకించువారు మరణించినవానిని మిక్కిలి సంతాపపడఁ జేయుదురు. పంక శంకగలదేని యాప్తదక్షిణలతోడ నానాయజ్ఞములఁ జేయుము. దేవతలను సోమంబునను, బితృదేవతల స్వధను, నతిథుల నన్నపానం బులచేతను, దరిద్రుల వాంఛాపూర్తిచేతను దృప్తులఁ గావింపుము. నీయట్టి తగవరికిట్టి వగపు దగదు. ఎఱుఁగఁదగినదంతయు నెఱింగి తివి. చేయఁదగినవన్నియుఁ జేసితివి, రాజధర్మాదులనెల్ల భీష్మ నారద వ్యాసాదులవలన వింటివి. మూఢుల వృత్తిని నీ వవలంబింపరాదు కావునఁ బితృపైతామహంబగు నవృత్తిని గొనియాడి రాజ్యభారంబు వహింపుము. క్షత్రియులు సత్కీర్తిచే స్వర్గసుఖానుభవ యోగ్యు లగుదురు. భారత రణమృతులందుఁ బరాఙ్ముఖుఁడై హతుఁ డైన శూరుఁ డొకఁడును లేఁడు. రాజా! శోకంబు విడుము. భవితవ్యం బది యట్లయ్యె. నీ వెంతటివంత సంతతంబు సంతపించినను రణ హతులం దొకరినైన మరలఁ జూడఁజాలవు. అంతియకాదు వినుము.

కామాది వక్రమార్గంబు సర్వంబు మృత్యుపదంబు. శమాది యగు నవక్రమార్గంబు మోక్షపదంబు జ్ఞానవిషయం బింత మా త్రంబ. ఇది యెఱుంగక ప్రలాపించువాఁ డేమి చేయఁగలఁడు? నీవా కర్మముల ననుష్ఠించినవాఁడవు కావు. శత్రువుల జయించిన వాఁడవును గావు. నీ శరీరంబునందుండు విరోధుల నీ వెఱుంగలేక యున్నాఁడవు. ఈ విషయంబున నింద్రవృత్ర యుద్ధచరిత్రంబుఁ జెప్పెద వినుము.

## —♦ ఇంద్రవృత్రుల యుద్ధము. ♦—

తొల్లి వృత్రుండు గంధవతియగు భూమి నావేశించి తద్విషయంబు గంధంబు గ్రహించుటం జేసి మహా దుర్గంధంబు వెలువడియె. దానికి నింద్రుండు కోపించి వృత్రునిపై వజ్రంబు వైచిన వృత్రుండును జలంబుల నావేశించి దాని రసగుణంబు హరించె. ఇంద్రుండు నతనిపైఁ గులిశంబు మరలఁ బ్రయోగించె. అచట హతుండై యతండు జ్యోతియందుఁ బ్రవేశించి దాని రూపగుణంబు హరించె. శక్రుండును వానిపై భిదురంబు వైచిన దాని విడిచి యతండు వాయువునందుఁ జొచ్చి దాని స్పర్శగుణంబు హరించె. బిడౌజుండును గినిసి వానిపై హ్రాదిని వైచిన వాఁడు దానిని విడిచి యాకాశంబుఁ జొచ్చి దాని శబ్దగుణంబు హరించె. ఆగ్రహంబునఁ బురందరుండు పవిని వైచిన దానిని విడిచి వృత్రుండు నింద్రునియం దావేశించె. దాన మఘవుండును మోహితుండయ్యె. ఇట్లు మోహితుండైన పాకశాసనుని వసిష్ఠుఁడు తేర్చ నింద్రుండును నదృశ్యంబైన వజ్రంబున నతని వధించె నని వింటిమి. ఈ ధర్మ్యంబు రహస్యంబునగు వృత్తంబు మహర్షుల కింద్రుం డెఱిఁగించె. ఋషులు నా కెఱిఁగించిరి. దీని యర్థంబు నీ వెఱిఁగికొనుము.

## —♦ కృష్ణుఁడు యుధిష్ఠిరునకు వ్యాధిక్రమముఁ దీర్చి తెల్పుట. ♦—

యుధిష్ఠిరా! వ్యాధులు శారీరములని మానసములని రెండు విధములు. ఈ రెంటికి జన్మమునకుఁ బరస్పరసంబంధము కలదు. మానసికము లేక శరీరవ్యాధియును శారీరము లేక మానసికము కలుగదు. శరీరమునఁ బుట్టిన వ్యాధి శారీరమనియు మనస్సునఁ బుట్టినది మానసమనియుఁ జెప్పఁబడును. ఉష్ణము (కఫము–పైత్యము–) శీతము– [illegible] శరీరమునఁ [illegible] ఇవన్నియు సమ[illegible] బడును. శీత మున్ష్ణము – ఉష్ణము శీతమును బాధించును. సత్త్వ రజస్తమస్సులు మూఁడు మనోగుణ

ములు. ఈ మూఁడును సమముగనుండిన వాని మనస్సు స్వస్థమని చెప్పఁబడును. వీనిలో నేదైన నొకటి హెచ్చినపుడు దానిని .. రింప నుపాయములు తెలుపఁబడినవి. శోక మతిశయించెనేని హర్షమును స్మరింపవలయును. హర్షము హెచ్చినపుడు శోకము స్మరణీయము. దుఃఖితుఁడు సుఖస్మరణంబున స్వస్థుఁడగు. లబ్ధసుఖుఁడు దుఃఖమును స్మరించును. నీవు సుఖమును స్మరింపనొల్లవు. దుఃఖమును స్మరింప నొల్లవు. దైవము బలవత్తరముగదా నీ వేమిచేయుదువు ? అటుగాదేని నిన్నిప్పుడు లోపఱుచుకొనినది నీ స్వభావమేమో. ఏకవస్త్రయు రజస్వలయు సభాగతయునగు పతివ్రత పాంచాలసుత సభయందుఁ బాండవులందఱుఁ జూచుచుండఁ బడినపాటు స్మరింపనొల్లవు. రాజ్యభ్రష్టతయు, వనవాసము, జటాసురువలని బాధ, చిత్రసేన యుద్ధము, సైంధవకృత పరాభవము నజ్ఞాతచర్యా క్లేశము, కీచకుఁడు నీ భార్యను గాలఁదన్నుటయు, నీకును భీష్మద్రోణులకు జరిగిన యుద్ధము, వీనిలో నొకటైనఁ దలఁపనొల్లవు.

ఇప్పుడు ప్రతిమనుష్యుఁడు తా నొక్కఁడే యసహాయుఁడై తన మనస్సుతో యుద్ధము చేయవలసినకాలము నీకును దటస్థించినది. నీవు చేసిన పుణ్యపాప కర్మములను సాహాయ్యముగఁ గొని యంతర్ధ్యాన బలముచే నిట్టిదని తెలియరాని రూపముగల మానసము నవలియొద్దు చేరవలసియున్నది. ఈ యుద్ధమున శరములతోనైనను భృత్యులు బంధువులు లోనగువారితోనైనను బనిలేదు. నీ వొకఁడవే యుద్ధ మసహాయుఁడవై చేయవలయును. ఈ యుద్ధమున నీవు జితుఁడవైతివేని యెట్టి నీచగతిని బ్రాపింతువో యెఱిఁగి వర్తించితివా కృతకృత్యుఁడ వగుదువు. ఈ తెలివిగలవాఁడవై భూతముల రాకపోకల విధమెఱిఁగి పితృపైతామహంబైన రాజ్యంబును బాలింపుము.

ధర్మనందనా! రాష్ట్రాది బాహ్యపదార్థముల వదలుటచే మోక్షసిద్ధి లేదు. శారీరద్రవ్యంబులైన కామాదుల వదలుటవలననే సిద్ధి కలుగునో కలుగదో, బాహ్యద్రవ్యముల వర్జించి శారీర ద్రవ్య

ముల నార్జించుటచేఁ గలుగు సుఖధర్మంబులు నీ పగతురకుఁ గలుగుఁ గాక. రెండక్షరములు మృత్యువు. మూఁడక్షరములు శాశ్వత బ్రహ్మము. మమ (నాది) యను రెండక్షరములే మృత్యువు. నమమ (నాదికా) దను మూఁడక్షరములే శాశ్వత బ్రహ్మప్రాప్తికిఁ గారణము. కావున మృత్యువు బ్రహ్మము నను నీ రెండును భూతముల యాత్మ యందే కానరాకయుండి యొండొంటితోఁ బోరెడి. ఈ భూతములకు వినాశము లేమి నియతమైనచో నొకరి దేహములను మఱియొకరు భేదించుట హింసగానేరదు. 'ఇది నాది' యను మమత్వ మెవనికి లేదో వానికి స్థావరజంగమసహితంబైన సమస్త భూరాజ్యము లభించినను దానివలన వాని కేమి ప్రయోజనము? ఒకవేళ వనములోఁ గందమూలాదులు దిని జీవించుచున్నవానికి ధనాదులందు మమకార ముండెనేని వానిపాలిటి మృత్యువు వాని నోరనే యున్నది. ధర్మజా! బాహ్యాభ్యంతర శత్రువుల స్వభావ మెఱింగికొనుము. వానిపాల నెవఁడు పడకుండునో వాఁడు సంసారభయమునుండి ముక్తుఁడగును. లోకము కామాత్మునిఁ బ్రశంసింపదు. నిష్కామవ్యాపారము లోకమున నొకటియు లేదు. అన్ని కామములు మనస్సునకు సంగములు. కావునఁ బండితు లది యాలోచించియే కామమును సంహరింతురు. గతానేక జన్మంబులఁ బలుమాఱు యోగమభ్యసించిన యోగి సారమార్గంబు యోగమొక్కఁడేయని యాలోచించును. దానము వేదాధ్యయనము తపము వైదికకర్మము లివియన్నియుఁ గామ్యములు. కావున నాత్మ కావించునది ధర్మము నీతి గాదనియు, గామమును జయించుటే ధర్మమనియు, నెఱింగినవారు డానాధ్యయ నాదులను ఫలముఁగోరి చేయనొల్లరు. ఈ విషయమునఁ బూర్వులు పఠించిన కామగీతలను వినుము.

## — కృష్ణుఁడు ధర్మరాజునకుఁ గామగీతలఁ దెలుపుట. —

కాముఁ డిట్లనుచున్నాఁడు. యోగబలమునఁ గోరికల జయించు నుపాయ మెఱుఁగని వాఁడెవ్వఁడు నన్నుఁ జంపలేఁడు. ఎవ్వఁడు దేనిని

సాధనముగాఁగొని నన్నుఁ జంపందలంచునో వాని యాయుధమనై మరల జనించుచుండును. వివిధ దక్షిణలతోఁడి యజ్ఞము లొనర్చి నన్నెవఁడు చంపఁజూచునో జంగమములందు నతఁడే ధర్మాత్మునివలె నతని మనస్సులో మరలఁ బుట్టుచుందును. వేద వేదాంత సాధనములచే నన్నెవఁడు చంపఁదలంచునో స్థావరంబులందు ధర్మాత్మునివలె నతనియం దుదయింతును. సత్యపరాక్రముఁడగు నెవ్వఁడు ధృతిబలముచే నన్ను జయింపనెంచునో నేను వాని భావముగానే యగుదును. దానిచేత వాఁడు నన్ను నెఱుఁగఁజాలఁడు. సంశితవ్రతుఁడై యెవఁడు తపస్సుచే నన్ను జయింపనెంచునో నేను వాని తపస్సుగానే వానియందుఁ బుట్టుదును. ఎవ్వఁడు జ్ఞానియై మోక్షము చెందఁగోరి నన్ను జయింపనెంచునో నేను వాని యెదుట యాడుచు నవ్వుచు నుందును. సర్వభూతములందు శాశ్వతుఁడను నవధ్యుఁడను నే నొక్కఁడనే. అని కాముఁ డిట్లు చెప్పెను.

కావున నీవు వివిధ దక్షిణలుగల యజ్ఞము లొనర్పుము. నీ కామమును ధర్మమార్గమునఁబోనిమ్ము. దానివలన నీకుమేలుగలుగు. విధియుక్త దక్షిణలతో నశ్వమేధ మొనర్పుము. ఇతర యాగములను జేయుము. వృథా దుఃఖింపకుము. చచ్చినవారి కేడ్చినంత వారు మరల రాఁబోరు.

అని ధర్మరాజునకు దుఃఖోపశమనంబు గావించె. ఆ పాండవాగ్రజుండు మేకొని పట్టాభిషిక్తుండై వారికివారికిఁ దగినరీతుల దానాదులొనరించి సంతృప్తులఁగావించి యా రాత్రి సుఖంబుండి మఱునాఁటి యుదయంబున నిర్వర్తితకల్యకార్యుండై కృష్ణుంజూడ నేగిన నా మహానుభావుండు ధ్యానరతుండై యచంచలిత గాత్రుండై నిమీలిత నేత్రుండై యున్నంగని ధర్మనందనుం డాయనతో నిట్లనియె. కృష్ణా! యేమిది? నీ వెవరిని ధ్యానించెదవు? ఈ చిత్రచరిత్రంబునకుఁ గారణంబు రహస్యంబుగాదేని యెఱింగింపుమనినఁ గృష్ణుం డిట్లనియె.

శరతల్పగతుండైన భీష్ముఁడు నన్ను ధ్యానించుచున్నవాఁడు. కావున నా మనస్సెల్ల నతనిపై నిలిచె.

సీ. గంగామహాదేవి గర్భమం దెవ్వఁడు
పెరిఁగి వెలింగించె భరతకులము
సాంగంబులగుచున్న సకలవేదములు వ
సిష్ఠుతో నేరిచె శిష్యుఁడగుచు
ధీమంతుఁ డెవ్వఁడు దివ్యాస్త్రములనెల్లఁ
బాండిత్యము వహించి ప్రౌఢిగాంచె
వజ్రి నిర్ఘోషంబు పగిది మ్రోగెడునేని
జ్యానాదమోర్వఁడు శత్రుఁడైన

తే. కన్యకలు ముప్పరకుఁ గాఁగఁ గలనసీమ
రాజవరులను దోలెఁ బరాజితులుగ
నఖిల విద్యల కాధారమైనయట్టి
శాంతనవుపయి నేఁగె నాస్వాంత మధిప!

క. ఇరువది మూఁడుదినంబులు
గురువగు భార్గవునితోడ ఘోరరణమునన్
సరిపోరె నతఁడునన్నున్
శరణాగతుఁడగుట మనము చనె నాతనిపై.

తే. ఇంద్రియగ్రామమంతయు నేకపఱిచి
మనసు బంధించి మేధచే మనుజనాథ!
చిత్తమెల్లను నామీఁదఁ జేర్చియుంటఁ
దద్గతంబయ్యె నాదు స్వాంతంబు నిపుడు.

క. జరగినయవి జరగెడునవి
జరగంగలవెల్ల [illegible] నెఱుఁగంగన్
[illegible] నా [illegible]
ర్వర చంద్రుఁడు లేనిరాత్రివలె నగుఁ జూడ్కిన్.

సీ. కావునగాంగేయుఁ గానఁగాఁ జనుమీవు
సందేహములనెల్లఁ జక్కనడఁగు
నాలుగు విద్యల నాలుగాశ్రమములఁ
ద్రైవర్ణికవిశేష ధర్మములను
రాజధర్మము లెల్లఁ బ్రశ్నింపు మతఁ డస్త
మించిన జ్ఞానంబు కొంచెపడెడు
నని దేవకీసుతుం డాడిన సాశ్రుకం
ఠుండయి కుంతీసుతుండు పల్కు

తే. భీష్మ మహిమంబు నేనును వినినవాఁడఁ
బుణ్యవృత్తులు బ్రాహ్మణుల్ పొగడుచుండ
నీదు నుడులందు లేదు సందియమ్మైన
నీచకల్మషశంక సంకోచపడెద. *

అయినను లోకనాథుండవు నీవు పనిచినదానిఁ జేయకుండెడువాఁడనే. నిన్ను మున్నిడుకొనిపోవ నంగీకరించితి. ఉత్తరాయణం బరుదెంచెనేని యమ్మహాత్ముండు దేహంబుఁ జాలించు. కావునఁ దద్దర్శనం బవశ్యకర్తవ్యంబని సోదరులును సోదరయుక్తుండైన దామోదరుండును దోడురా మితపరివారయుక్తుండై భీష్ముఁ గాననేగె. వ్యాస దేవశ్రవసులు వాత్స్య నారదాసిత వసిష్ఠ వాల్మీకాత్రి విశ్వామిత్ర లోమశ జైమినులు శుక్రుఁడు నశ్మక సుమంతుపైల మహర్షులు దేవస్థాన శాండిల్య దేవల మైత్రేయ హారీత బృహస్పతి చ్యవన సనత్కుమార కపిల తుంబురు మౌద్గల్య తృణబిందు పిప్పలాద వాయు సంవర్త పులహ కచ కాశ్యప పులస్త్య క్రతు దక్ష పరాశర మరీచ్యంగిరః కాశ్య గౌతమ గాలవ ధౌమ్య విభాండ మాండవ్య ధౌమ్ర కృష్ణానుభౌతి కోలూక మార్కండేయ భాస్కరి పూరణకృష్ణ సూతాది తపోధనులును బరివేష్టింప నక్షత్రమధ్యంబునఁ జంద్రుంబోలి

* ఈ చుళుకమునందలి పద్యములన్నియు మదీ యాంధ్రజయములోనివి.

యుండు భీష్ముండు సమాగతుండైన వాసుదేవుంగని ప్రాంజలియై మనోవాక్కాయంబు లొక్కటిగాఁ జేసి విష్ణుజిష్ణు శ్రీకృష్ణు నిట్లు సంస్తుతించె.

—♦ భీష్మస్తవరాజము. ♦—

ఉ. ఏమహనీయమూర్తి భజియింపఁగఁగోరి సవిస్తరంబుగా
నో మతిసంగ్రహంబుగనొ సూక్తులనెయ్యవి పల్కఁబూనితిన్
నామదిఁ గల్గువానిఁ గరుణామతి వాని గ్రహించి భక్తర
క్షామహిమోన్నతుండు సితకంజదళాక్షుఁడు నన్నుఁ బ్రోచుతన్.

ఉ. ఏపరమేష్ఠి హంసు జగదీశు ప్రజాపతి వాస్తవంపు స
ద్రూపమెఱుంగఁజాల రమరుల్ మునులేనియు నట్టిబ్రహ్మమున్
దాపసవంద్యునిం బరముఁ దత్పరుసన్ శుచిసత్త్వు నానత
ప్రాపకు భక్తిఁగొల్చెద ననాద్యు ననంతు శుచిన్ మహామహున్.

కం. నీరూపము జగదీశ్వర
నారాయణుఁ డొక్కఁడెఱుఁగు నాతనిచే సం
సారార్తిభేషజం బని
ధీరమతుల్ సురలు మునులు దెలిసిరి పిదపన్.

కం. ఏవాఁడ వెందుఁ గలిగితి
వీవని గంధర్వమరుదహిప్రవరులు బ్రా
గ్దేవతలును దేవతలును
భావింపఁగఁ జాలరీశ పాపవినాశా.

ఉ. ఎవ్వనియందు భూతతతులెల్ల వసించును, జొచ్చుఁ గల్పమం,
దెవ్వని నాశ్రయించు గుణబృందము సూత్రము రత్నపాళియ
ట్లెవ్వని నాత్మతత్త్వవిదు లెల్లకుఁ గర్తయు భర్తయందు, రే
నవ్విభు నాదిదేవుఁ బరమాత్ము ననంతు సమాశ్రయించెదన్.

కం. విశ్వము సదసద్గ్రథితము
శాశ్వతుఁడగు నెవనియందు స్రజమున నిలుచున్

విశ్వాంగు విశ్వకర్త న
నశ్వరు భజియింతు భక్తి నారాయణునిన్.

గీ. పురుషు సహస్రశీర్షు సాహస్రనేత్రు స
హస్రచరణు మఱి సహస్ర బాహు
ముకుటు వదను విశ్వమయుని నారాయణు
డనఁగఁబడెడు దేవు నాశ్రయింతు.

ఆ. వరద ! యణువులందుఁ బరమాణువవు నీవ
స్థూలములను మిగుల స్థూల మీవ
గురుపదార్థములను గురుతమంబవు నీవ
శ్రేష్ఠతతులఁ జాల శ్రేష్ఠుఁ డీవ.

తే. పాకసముదాయములు ననుపాకములును
గలిత నిషదుపనిషద్ఘోషములును నిన్నె
సత్యకర్ముఁ డటంచును సంస్తుతించు
సత్యసామంబులును నిన్నె సత్త్వమనెడు.

కం. నాలుగు రూపులుగల నిను
నాలుగు గోప్యంపుఁ జేర్ల నతలోకపతిన్
మూల మెఱింగిన వేత్తలు
పోలఁగ భజియింత్రు శుద్ధబుద్ధివ్యక్తుల్.

కం. ఎవ్వనియందుఁ దపంబులు
నివ్వటిలున్ నిత్యముగను నెఱవేర్చినచో
నవ్వి ఫలదంబులగు నెపు
డెవ్వని మొఱఁ జేరు నట్టియీశ్వరుఁ దలఁతున్.

కం. సర్వాత్ముని సర్వేశ్వరు
సర్వజ్ఞుని సర్వశక్తు సర్వు నఖర్వున్
సర్వవిదు సర్వభావను
సర్వాధారుం దలంతు శ్రద్ధాయుక్తిన్.

కం. అరణిని జనించు హుతవహు
సరణిని వసుదేవువలన సతి దేవకి కు
ర్వర వేదభూమిలేఖా
ధ్వరరక్షకుఁ గలిగినట్టి దైవముఁ గొలుతున్.

కం. ఆసలను గోసి యితర
వ్యాసంగము రోసి నిన్నె యనఘాత్ముని మో
హాసక్తిఁ గనుఁగొను శ్రీ
వాసా! తనయాత్మయందు భాసురలీలన్.

కం. అతివాయు శక్రకర్తుని
నతిసూర్య జ్వలన తేజు నారాయణునిన్
అతిబుద్ధీంద్రియుని బ్రజా
పతినిన్ దుర్జ్ఞేయుఁదలఁతుఁ బరమాత్ము హరిన్.

గీ. పురుషుఁడనఁగఁబడెదుఁ బౌరిఁబురాణములందు
యుగముతొలుత బ్రహ్మసూక్తి గనెదు
క్షయము వేళ నీవ సంకర్షణుండవు
నిను నుపాస్యుఁ గొలుతు నీరజాక్ష.

కం. ఒక్కండవయ్యు దేవా!
పెక్కురూపముల నుద్భవించెదు నీవే
నిక్కని యనన్యభక్తులు
చక్కఁగఁ గ్రియలన్ భజింత్రు సర్వార్థప్రదా.

కం. నీవే కోశము జగతికి
జీవచయంబెల్లనున్ వసించును నీయం
దే వలయందలివిహగము
లై విశ్వమ్ములెల్లనుండు ననయము నీలోన్.

కం. మతిఁ దెలియలేరు బ్రహ్మము
ఋతసదసత్పరంబు గ్ర[illegible]
పతివై యనాదిమధ్య
[illegible] సురల్.

కం. సురగంధర్వులు సిద్ధులు
నురగులు ఋషివరులు నసురు లొప్పంగ నిన్నున్
బరమున్ సుఖభేషజమున్
స్థిరమతి నర్చింతు రెపుడు శ్రేయోపేతున్.

గీ. హరి ననాదినిధను నారాయణుని లోక
విభుని నాత్మయోని విశ్వవిష్ణు
నఖిల దేవదేవు నప్రేతు నవ్యక్తు
సంస్మరింతుఁ గొలుతు సన్నుతింతు.

గీ. దైత్యనాశనకార్య తత్పరతయొక్కఁ
డయ్యుఁ బండ్రెండుమూర్తుల నదితిగర్భ
మునను జనియించినట్టి కాంచనసవర్ణు
సౌఖ్యదాతను సూర్యాత్ము సంస్తుతింతు.

గీ. అమరనిచయంబుఁ బూర్వపక్షమునయందు
బహుళమునయందుఁ బితరుల స్వసుధఁ దనిపి
ద్విజుల కెల్లను రాజయి వెలుఁగుచుండు
సౌమ్యరూపుని సోమాత్ము సంస్తుతింతు.

గీ. హుతవహాస్యంబులగు దేవతతులచేత
సకల జగముల భరియింపఁ జలిపి వెండి
హవిసుఁ బ్రథమంబునంద తానారగించు
సవనమూర్తిని హోత్రాత్ము సంస్తుతింతు.

గీ. అతుల సమధిక తేజుండవై మహాత
మంబు నావల వెలుఁగు నే మహితమూర్తిఁ
దెలిసినంతన మృత్యువు దొలఁగునట్టి
జ్ఞానగమ్యుని జ్ఞేయాత్ము సంస్తుతింతు.

గీ. శస్తమైన బృహద్వృక్ష సవమునన్ బృ
హత్తమంచు మహాధ్వరమందు నగ్ను
లందు నధ్వర్యువని విప్రబృందమెల్ల
సన్నుతించెడి వేదాత్ము సంస్తుతింతు,

గీ. వాక్యసముదాయమెవనికిఁ బాపములగు
సంధు లొప్పారు గనుపులై స్వరచయంబు
వ్యంజనంబులు భూషలై యక్షరాఖ్య
జగతిసురులెన్ను వాగాత్మ సంస్తుతింతు.
గీ. మూఁడులోకంబు లోలి సముద్ధరింప
నెవఁడు యజ్ఞాంగ సూకరాకృతివహించి
యీవసుంధర రక్షింప నెత్తినట్టి
సారసత్త్వుని వీర్యాత్మ సంస్తుతింతు.
గీ. ఋగ్యజుస్సామముల కెల్ల నిక్కయగుచుఁ
బంచహవిరాకృతిని బూని ప్రాకటముగ
సప్త తంతుస్వరూపమై జానుమీఱు
సర్వ వందితు యజ్ఞాత్మ సంస్తుతింతు.
గీ. నాలుగింటను మఱియును నాలుగింట
రెంట నేనింట వెండియు రెంట నెవనిఁ
గూర్చి హోమంబు గావింత్రు కోవిదాగ్ర
జాతులమూర్తి హోమాత్మ సంస్తుతింతు.
గీ. ఏ సుపర్ణుండు యజురాఖ్య వాసిగాంచు
ఛందములుమేను శీర్షంబు సవముగాఁగఁ
దనరఁగా రథంతర బృహత్పక్షుఁడైన
సకల సంధాత స్తోత్రాత్మ సంస్తుతింతు.
గీ. విశ్వసృష్టికిఁగా ఋషుల్ వేయిసవము
లొప్ప సత్రంబు సాగింప నురిదిగఱుల
పక్షియై వారలకుఁ గానఁబడినయట్టి
సర్వమూలునిఁ దార్క్ష్యాత్మ సంస్తుతింతు.
గీ. ముక్తిఁ గాంక్షించు సజ్జనపుంజములకు
ధర్మ సద్వ్యవహార సాధనము లొగ్గి
సత్య మాధారముగ భవజలధి సేతుఁ
జక్క బంధించు సత్యాత్మ సంస్తుతింతు.

గీ. భిన్న ధర్మంబులన్ నెఱవేర్చువారు
వేఱువేఱు ఫలంబు లభీష్టపడుచు
భిన్న ధర్మాళి నర్చింతు రెన్న రీశు
సర్వమయు నట్టి ధర్మాత్మ సంస్తుతింతు.

గీ. సర్వ మెవ్వనివలనన జన్మమొందుఁ
గామ మయమైన దేహంబుఁ గలుగు సర్వ
భూత తతులకు నున్మాద హేతువెవఁడు
స్వాంతభవు నట్టి కామాత్మ సంస్తుతింతు.

గీ. వ్యక్తమందు మహర్షు లవ్యక్తు నెవని
రోయుచుందురొ క్షేత్రజ్ఞుఁ డై యెవండు
క్షేత్రమునయందుఁ జక్క నాసీనుఁడగునొ
సత్యమయు నట్టి క్షేత్రాత్మ సన్నుతింతు.

గీ. పదియు నాఱుగుణంబులఁ బరివృతునిని
నాత్మ దృక్కును నాత్మస్థుఁ డైనయెవనిఁ
బదియునేడవ వానిఁగ మదిఁ దలంత్రు
సాంఖ్య జనులట్టి సాంఖ్యాత్మ సంస్తుతింతు.

గీ. విడిచి నిద్దుర శ్వాసంబు బిగియఁబట్టి
సంయతేంద్రియులగుచును సంతసమున
యోగు లెవ్వని గాంతురు జ్యోతిరీతి
స్వాంతముల నట్టి యోగాత్మ సంస్తుతింతు.

గీ. పాపములయట్లు పుణ్యముల్ పాఱఁదోలి
మరలఁ బుట్టెదమనుభీతి మాని శాంతు
లగుచు సన్న్యాసు లెవ్వని నాశ్రయింత్రు
సౌఖ్యకరు నట్టి మోక్షాత్మ సంస్తుతింతు.

గీ. అగ్నియాస్యంబు దివిశిరం బాకసంబు
నాభి ధారిణిపదములు నయనములును
సూర్యుఁడుగ దిగ్వితానంబు శ్రోత్రములుగ
జానుమీఱిన లోకాత్మ సంస్తుతింతు.

గీ. మాస ఋత్వయన శరదంశములచేత
యుగములందు నావర్తించుచున్నవాని
సర్గలయముల కర్తయై జరగువాని
శాశ్వతుని హరిఁ గాలాత్మ సంస్తుతింతు.

గీ. ప్రజ్వలద్వహ్ని భీషణ జాలికలను
యుగ సహస్రంబు కడపట నుగ్రభంగి
లోకముల భూతతతుల భక్ష్యీకరించు
సర్వ సంహారు ఘోరాత్మ సంస్తుతింతు.

గీ. ఆహరించి సమస్త భూతాళి నొకట
ప్రబలి లోకంబు నేకార్ణవంబుఁ జేసి
యేకతంబుగ బాలుఁడై యెలమిఁ గూర్కు
సర్వకారణు మాయాత్మ సంస్తుతింతు.

గీ. వేయిశిరములు గలిగిన వేల్పునకును
నాదిపూరుషునకు నమితాత్మునకును
కామకంధి చతుష్టయ కాండసుప్త
శాంతునిఁ యోగనిద్రాత్మ సంస్తుతింతు.

గీ. పుష్కరాక్షునాభిపుష్కరమునయందుఁ
బుష్కరం బొకండు పుట్టెఁ దొలుత
సంభవించె దాన సర్వజగంబు లా
మూలపురుషుఁ బద్మమూర్తిఁ దలతు.

గీ. వారిధరతతి కేశ సంభారములును
నంగ సంధుల నిమ్నగ లమరియుండ
నుదరమున నాల్గు సంద్రంబు లొదిగియుండ
సంరమించెడు తోయాత్మ సంస్తుతింతు.

గీ. సర్గ మెవ్వానిచేతను సాగుచుండు
విక్రియను గాంచు సర్గంబు [illegible]
జొచ్చు నెవ్వానిఁ బ్రళయంబు వచ్చువేళ
శ్రద్ధచే నట్టి హేత్వాత్మ సంస్తుతింతు.

గీ. శర్వరులయందు నెవఁడు నిషణ్ణుఁడగుచుఁ
బగల విష్ఠితుఁడగుచు నెవ్వాఁడు మెలఁగి
యప్రియప్రియముల సాక్షియయినయట్టి
జాగ్రదాకృతి ద్రష్టాత్మ సంస్తుతింతు.

గీ. కార్యములనెల్ల నెవ్వఁ డకార్యుఁడగుచు
ధర్మకామార్థముగను దత్పరుఁడు నగుచు
వెలుఁగు వైకుంఠుఁ డనురూపుఁ గలుగు దేవు
సర్వఘటకునిఁ గార్యాత్మ సంస్తుతింతు.

గీ. బ్రాహ్మణులు నీదువక్త్రంబు బాహుయుగము
క్షత్రవర్ణంబు వైశ్యులు సక్థితలము
పాదములయందు శూద్రులు పరఁగునట్టి
శర్మదాయిని వర్ణాత్మ సంస్తుతింతు.

గీ. అన్నపానేంధనమయంబ వగుచు రసము
ప్రాణములు వర్ధిలంగ వ్యాపకుఁడవగుచు
భూతధారణ కార్య సంపూజ్యతఁగను
శస్త చరితునిఁ బ్రాణాత్మ సంస్తుతింతు.

గీ. ప్రాణికోటుల ప్రాణధారణముపొంటె
నన్నమును నాల్గువిధముల నాహరించి
నదియు జీర్ణింప జఠరంబునందు నగ్ని
సరణి వర్తించు పాకాత్మ సంస్తుతింతు.

గీ. విషయములయంద సాదరవృత్తి మెలఁగు
వారు వైషయికంబులై వఱలు గుణవి
తానములచేత విషయగోప్తగ వచించు
చతుర చర్యుని గోప్త్రాత్మ సంస్తుతింతు.

గీ. అప్రమేయ శరీరంబు దీప్రముగను
సర్వగతములు బాహు లోచనములొప్పఁ
బార హీనమహా పరిమాణపటిమ మమరు
సర్వ నిలయుని దివ్యాత్మ సంస్తుతింతు.

గీ. పరుఁడు కాలంబుకంటెను బరుఁడు యజ్ఞ
మునకు సదసత్తులకుఁ బరుండను నెవం డ
నాది యయ్యును విశ్వాది యగు నెవండు
సర్వవిభు నట్టి విశ్వాత్ము సంస్తుతింతు.

గీ. వైద్యుతుండును జఠరసంవర్తి మఱియు
పావకుండును శుచి సర్వభక్షణముల
దహనుఁడగుచును లోకంబుఁ దనరఁజేయు
శస్తతేజస్వి వహ్న్యాత్ము సంస్తుతింతు.

గీ. ప్రభువు శ్రీమంతుఁడెవఁడు భూభరణకేళి
సలుపుచుండు రసాతల స్థాయియగుచు
నట్టి భగవంతుని ననంతు నవ్యయాత్ము
సాధు వందితు శేషాత్ము సంస్తుతింతు.

గీ. జ్వలన సూర్యేందు తారకావర్గమునకు
మొనసి తేజస్సులగు దివ్యమూర్తులకును
తేజ మెవ్వండు గూర్చు స్వతేజమునను
నట్టి భగవంతుఁ దేజోమయాత్ముఁ దలఁతు.

గీ. భూతపంచకావస్థితముగఁ బరంగు
నాత్మసుజ్ఞానమును జ్ఞానమని యెఱింగి
వేవి జ్ఞానంబుచేతఁ బ్రాపింతు రట్టి
సకల వేదిని జ్ఞానాత్ము సంస్తుతింతు.

గీ. పరమ ఋషులును సాధ్యులు భక్తియుక్తి
సాంఖ్య యోగంబులను వినిశ్చయము దెలిసి
యెవని తత్త్వంబు సారంబు నెఱుఁగువారు
జ్ఞానమయునట్టి గుహ్యాత్ము సంస్తుతింతు.

గీ. కేల దండంబు శిరమునఁ దూలు జడలు
ప్రేలు పొట్టను గలుగు శరీర [illegible]
దాల్చి కమండలువ్వును నిత్యంబు వెలయు
సత్త్వవర్తిని బ్రహ్మాత్ము సంస్తుతింతు.

గీ. మూఁడు కన్నులు ధరియించి మూఁడు మొనల
వాలు దాలిచి భస్మలేపనము గలిగి
యూర్ధ్వ లింగస్వరూపమై యొప్పు త్రిదశ
సంఘ నాయకు రుద్రాత్ము సంస్తుతింతు.

గీ. అర్ధ చంద్రుని శీర్షంబు నందుఁ దాల్చి
విషధరంబులు యజ్ఞోపవీతములుగ
శూలముఁ బినాకమును దాల్చి కేల లోక
శంకరుండగు రుద్రాత్ము సంస్తుతింతు.

గీ. దేవకీ గర్భమున వసుదేవునకును
యదుకులంబున జనియించి యబ్జచక్ర
గదలు హస్తాంబుజంబులఁ గ్రాలు దురిత
సంహరణుని దేవాత్ముని సంస్తుతింతు.

గీ. తలల పుఱ్ఱెల పేరులు దాల్చి మేన
వ్యాఘ్ర చర్మాసనుండయి భస్మములను
మేనియందెల్లఁ బూయు నమేయరూపు
సారె కెదలోన రుద్రాత్ము సంస్తుతింతు.

గీ. సర్వపాశానుబంధన సంచయముల
సకలలోకరక్షాక్రియా శాలి యగుచు
మొనసి భూతకదంబంబు మోహపఱచు
శక్తిమంతుని మోహాత్ము సంస్తుతింతు.

గీ. సర్వగతుఁడయి నిత్యంబు సకలజీవి
హృదయములయందుఁ జైతన్యరీతి నిలిచి
తనుతఁ దనరి సర్వాతీతతరుఁడునైన
సారసాక్షుని సూక్ష్మాత్ము సంస్తుతింతు.

గీ. పంచభూతాత్మభూతుఁడై ప్రబలిభూత
నిచయములకెల్ల నాదియై నిధనమునకు
హేతువై ద్రోహ మోహ కోపేతరతను
జరుగువేల్పును శాంతాత్ము సంస్తుతింతు.

గీ. ఎవనియందుండు సర్వంబు నెవనివలనఁ
గలుగు నెవ్వఁడు సర్వంబు గలుగునెల్ల
యెడల సర్వమయుండు నెవ్వఁడట్టి
సకలు భగవంతు సర్వాత్మ సంస్తుతింతు.

గీ. భోగ సాహస్రరచితవరా భూరిదివ్య
నాగరాజవిభూషితా భోగదుగ్ధ
విపులపర్యంకమున నిద్ర రమణఁగొనెడు
శార్ఙ్గకోదండు నిద్రాత్మ సంస్తుతింతు.

గీ. రుద్రు లాదిత్యులు వసుమరుత్తు లశ్వి
సీతనూజులు విశ్వులు నిఖిలసురులు
వసువులును సిద్ధసాధ్యు లెవ్వాఁడో యట్టి
చక్రహస్తుని దేవాత్మ సంస్తుతింతు.

* * * * *

అని స్తుతించి నమస్కరించినఁ గృష్ణుండు నిజకటాక్షంబున నతని దేహతాపంబు వాపి, గాంగేయా! నీతోడ ధర్మజ్ఞానం బంతరించుఁగాపున నీ వీధర్మనందనునకు నెఱుఁగఁదగినవెల్ల నెఱిగింపుమనిన నాయనయు నట్ల కావించె. ఆవల నుత్తరాయణం బరుగుదేర భీష్ముండు కృష్ణ సన్నిధి దేహంబు చాలించె. కృష్ణసమాహితులై పాండవులు హస్తినాపురంబున కరుదెంచి సుఖంబుండిరి.

ఇట్లు భగవంతుండైన శ్రీకృష్ణుండు ధర్మనందనుండును ధర్మిష్ఠుఁడునైన యుధిష్ఠిరు సింహాసనంబునఁ బ్రతిష్ఠించి దేశంబు నకంటకం బొనరించి,

శ్లో. పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే.

అను తన నియమంబును సంపూర్ణంబుగా నిర్వహించినవాఁడయ్యె.

అంత నొక్కనాఁడు కృష్ణుఁడు ద్వారకానగరమునకుఁ బోవ నుద్యుక్తుఁడగుటయు నది యెఱింగి దివ్యసభాంగణంబునఁ గృష్ణుని

తోడ నిచ్ఛావిహారంబు సలుపుచుండు సమయంబున నర్జునుండు గృష్ణునితో నిట్లనియె.

మహాత్మా! యుద్ధసమయమున నీ ప్రభావంబు తెలిసికొంటిని. నీ యైశ్వర రూపంబుఁ గంటి. అప్పుడు సౌహృదబలంబున నీవు వచించిన వాక్యములను మఱచితిని. అవి మరలమరల వినఁ గౌతూహలం బయ్యెడిని. నీవు ద్వారకకుఁ బోవ యత్నించుచున్నవాఁడ వగుట నా కవి మరలఁ దెలుపుమనినఁ గృష్ణుఁ డిట్లనెఁ.

---

## దేశిక లీల.

## అనుగీత.

అర్జునా! యప్పుడు నీకు సనాతనము రహస్యము నగు ధర్మమును బోధించితిని. ధర్మతత్త్వము శాశ్వతలోకవిషయ ముపన్యసించితిని. నీవు మతిమాలినవాఁడవై గ్రహింపనైతివి. ఇది నాకు మిక్కిలి యప్రియమైనది. అది యంతయు నిప్పుడు చెప్పుటకు స్మృతి కలుగదు. నీవు శ్రద్ధా హీనుండవు. దుర్బుద్ధివి. అప్పుడు చెప్పినదంతయు నిప్పుడు చెప్ప సాధ్యపడదు? అప్పుడు నేను నీ కుపదేశించినది బ్రహ్మము నెఱుంగుటకు సుపర్యాప్తము; యోగయుక్తుఁడనై నీకుఁ పరబ్రహ్మ విషయముఁ జెప్పితిని. ఆ విషయమైన పురాణేతిహాస మొండుగలదు వినుము. దీనినినీవుమనస్సుననిలిపితివేని యుత్తమగతిని బ్రాపింపఁగలవు.

ఒకానొక బ్రాహ్మణుఁడు స్వర్గబ్రహ్మలోకములనుండి మాకడకు వచ్చెను. ఆయనను మేము పూజించితిమి. మే మడుగఁగా మా కాయన చెప్పిన విషయము నీకుఁ జెప్పెద వినుము. మాతో బ్రాహ్మణుఁ డిట్లనియె. నీవు మోక్షధర్మమునుగుఱించి ప్రశ్నించుచున్నవాఁడవు. నీ వీ విషయముఁ జెప్ప నన్నుఁ గోరుట లోకులయం దలి దయచేతఁగాని నీ నెఱుంగక కాదు. కావున నేను జెప్పెడు మాటలను సావధానుఁడవై వినుము,

మున్ను కాశ్యపుఁడను బ్రాహ్మణుఁడు తపోయుక్తుఁడు, ధర్మవిత్తముఁడు, శాస్త్రరహస్యవేది, యూహాపోహములయందు నిపుణుఁడు, వేదరహస్యజ్ఞుఁడు, జ్ఞానవిజ్ఞాన పారగుఁడు, లోకతత్త్వార్థ కుశలుఁడై, సుఖదుఃఖముల నెఱింగి జాతిస్మరణ తత్త్వజ్ఞుఁడై, పాపపుణ్య కోవిదుఁడై, కర్మములచే దేహి యొందు నుచ్చనీచ గతులఁగని సిద్ధుఁడై ముక్తుని వలెఁ దిరుగుచుఁ బ్రశాంతుఁడు సంయతేంద్రియుఁడునై తటాలున కానరాకపోవు మార్గమెఱిఁగి, యంతర్హితులైన సిద్ధులతోఁ జక్రధరులతో సంచరించుచు, నేకాంతమున వారితో సంభాషించుచు, దేనియందును దగులుపడక గాలివలెఁ దిరుగుచు నొకానొక బ్రాహ్మణుఁ డాసి తాను విన్న గుణములన్నియు నాయనయం దుండుటగని సభక్తిఁ దచ్చరణంబుల వ్రాలి నమస్కరించి గురువునొద్ద శిష్యుఁడువోలెఁ జేతులు కట్టుకొని వినయయుక్తుఁడై యతని యనుగ్రహమునకై వేచి యుండె. ఇట్టి సద్గుణములచే నా సిద్ధుఁడు సంతోషించి శిష్యునితోడఁ బ్రసన్నుఁడై యిట్లనియె.

నానావిధ కర్మములచేతను, కేవల పుణ్యయోగముచేతను మనుష్యు లీ లోకములో నానా గతులనుగాని స్వర్గలోక స్థితినిగాని పొందుదురు. అత్యంతసుఖ మెందును గానరాదు. శాశ్వతస్థితియు నెందును లేదు. అతికష్టపడి సంపాదించిన గొప్ప పదవులనుండి మరలమరల భ్రష్టులై పడుచుందురు. కామక్రోధవశుఁడనై యాంశకుఁ బాలుపడి పాపము నాచరించుటవలన నా కనేకములు నీచములు దుఃఖకరములు నగు గతులు ప్రాప్తించెను. మరలమరలఁ జచ్చితిని. మరలమరలఁ బుట్టితిని. అనేకవిధములైన యాహారముల భుజించితిని. నానావిధములైన చన్నులనుండి పాలుద్రావితిని. పెక్కు తరగతులుగల తల్లులు, పరస్పర భిన్నగుణులైన తండ్రు లెందఱో యైరి. విచిత్ర సుఖదుఃఖముల ననుభవించితి. ఎన్నిమారులో ప్రియపదార్థములను జనులను బాసితిని. ఎన్నితడవలో యప్రియ పదార్థములను జనులనుగూడి యుండవలసివచ్చెను. ఎంతో కష్టపడి సంపాదించిన ధనము నష్టమయ్యెను. ఇతరులవలనను బరులవలనను

మిగులఁ గష్టములు నవమానములు పడితిని. శరీర సంబంధములు మానస సంబంధములు నగు బాధల ననేకములకు లోనైతిని. ఉగ్రములైన యవమానములు బంధములు వధలు ననుభవించితిని. నరకములలోఁబడి యమలోకమున యాతనలకు లోపడితిని. ముసలితనము రోగము సర్వదా యేదో యొక వ్యసనము ద్వంద్వబాధలు లోకమున నెన్నియో లభించెను. ఆవల నొకానొకప్పుడు నాకు మనస్సులో నేమి యీపుట్టుట యేమి యీ గిట్టుట యేమి దుఃఖానుభవము. ఎప్పటికి వీనినుండి తప్పించుకొనుట యని మిక్కిలి నిర్వేదము నైరాశ్యము జనించెను. ఇట్లు విచారించి విచారించి మిగుల దుఃఖితుఁడనై లోకతంత్రములను సుఖములను దుఃఖములను నన్నిటిని వదలుకొంటిని. అప్పు డీ మార్గమెఱిఁగి దీని ననుష్ఠించితిని. ఆవల మనశ్శాంతి కుదురుపడ నిప్పుడు నీవు చూచు సిద్ధి కలిగెను. దీనిని విడిచిపోయిన పిమ్మట నీ లోకమునకు మరల రాను. నేను సిద్ధిని బొందువఱకుఁ బ్రళయమువఱకు లోకములగతియు నాకుఁ గలుగఁబోవు నుత్తమగతియుఁ బరిక్షించుచుందును. ఇట్టి యుత్తమసిద్ధి పొందినవాఁడనై యిక్కడనుండి సత్యలోకమున కరిగి యందుండి బ్రహ్మపదము నొందెదను. ఈ విషయమున నీవు సందేహింపవలదు. నేను మనుష్యలోకమునకు మరల రాను. నీ కేమి కావలయునో కోరుము. నీ యుద్దేశ్యము నాకుఁ దెలియును. అది నెఱవేఱు కాలము వచ్చినది. కావుననే నేను నీ కిది చెప్పవలసివచ్చెను. శీఘ్రకాలముననే నీ లోకమువిడిచి పోయెదను. నీ నడవడికిఁ దెలివికి మిగుల సంతసించితిని. నీ కోరుచొప్పున నీవు తెలియఁదగిన విషయము నుపన్యసించెదను. నీ బుద్ధి శ్లాఘ్యము. దాననే నీవు నన్నెఱుఁగఁగలిగితివి.

అనిన నమ్మహీసురుఁడు సిద్ధుని పదముల వ్రాలి నమస్కరించి యిట్లనియె. మహాత్మా ! యీ దేహ మెట్లు నశించును ? ఎట్లు మఱియొక దేహము ప్రాప్తించును ? ఎట్లనేక జన్మకష్టములు పలుమాఱనుభవించి ముక్తుఁడగును ? కొంతకాలము ప్రకృతి సాంగత్యము గలిగియు జీవుఁడు ప్రకృతిదత్తమైన తద్దేహంబు నెట్లు విడువఁగలఁడు?

జీవుఁడు శరీరమును వదలి యెట్లు తద్భిన్నంబైన బ్రహ్మాండమును బొందును ? మనుష్యుఁడు తానార్జించిన శుభాశుభకర్మంబుల ఫలంబుల నెట్లనుభవించును ? దేహరహితుండైన జీవుం డెచ్చట కర్మఫలముల ననుభవించును ? అని యడిగిన సిద్ధుఁ డీ ప్రశ్నములకు వరుసగ నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

ఆయుష్యకర్మంబు లీ దేహమునందే శీఘ్రఫలదంబగు. ఆయుఃకీర్తికరంబులైన కర్మంబులుచేయు దేహి వేఱొక దేహంబుఁ బ్రాప్తించు సమయంబున నాయువు క్షయింపఁగా విపరీతకార్యంబులు చేయ నారంభించు. వినాశము సమీపింప బుద్ధియు విపరీతమగును. నిజ దేహ సత్త్వబలకాలంబులఁ దెలిసినవాఁడును దెలియనివాఁడును నపరిశుద్ధాత్ముఁడై విరుద్ధాహారమును మితిమించి యకాలంబుల భుజించును. అట్టి సమయంబున హానికరంబైన కార్యంబులఁ జేయును. ఒక్క సమయమున నెక్కుడుగ భుజించును. వేఱొక సమయంబునఁ బస్తులుండును. పరస్పరము విరోధించు దుష్టాన్నపానముల నామిషంబుల సేవించు. గురుపదార్థంబుల నమితంబుగ భుజించు. లేదేని మున్ను భుజించిన బదార్థము జీర్ణింపకముందే భుజించును. దేహ పరిశ్రమము సురతము నతిమాత్ర మొనరించును. మలమూత్రముల విడువవలసి యుండినను బనులయందలి యాసక్తిచేత విడువక బిగించును. రసవంతమైన దానిని మిక్కిలి భుజించును. పగట నిద్రించును. జీర్ణముకాని యాహారము దాని సమయము వచ్చినప్పుడు వాయు పైత్యాది దోషములఁ గలిగించును. ఇట్లు దోషము లుద్భవించుటచే రోగములు పుట్టును. అవి ప్రాణముల హరించును. కొన్ని సమయంబుల నివి యురిపోతలు లోనగు విపరీతవిధంబులఁ బరిణమించుటయుఁ గలదు. ఆ కారణములచేత జీవి కా శరీరము వదలి[illegible] నేను జెప్పినది చక్కఁగ బోధపఱచికొనుము. తీవ్ర[illegible]యు ప్రేరితంబై [illegible]బున నుష్ణంబు ప్రకోపించి, దేహమంతయు వ్యాపించి [illegible] ప్రాణముల ని[illegible]ంచును. ఉష్ణంబు తీవ్రమై ప్రకోపించి, జీవస్థానముల భేదించి వానివాని [illegible] నాఁపును. అంతట

బాధపడుచు జీవుఁడు దేహమును వదలును. మర్మస్థానము లిట్లు భేదిల్ల వేదన సహింపలేక జీవుఁడు దేహమును విడఁబాయు. జంతువులకుఁ బ్రాణము పోవునట్టి వేదనయు గర్భప్రవేశమునాఁటి వేదనయు గర్భము వెలువడునప్పటి వేదనయు సమానములు. సమస్త జంతువులు జననమరణ దుఃఖపీడితములు. అంగసంధులు భేదిల్లును. గర్భమునీటిచే మిక్కుటమగు బాధ కలుగును. తీవ్రవాయు ప్రేరితంబై శైత్య మతిశయించును. దానివలన దేహరూపమున నున్న పంచభూతములు తమ కూడికనుమాని విడివడిపోవును. పంచభూతమయంబగు దేహంబునందుండి ప్రాణాపానములని పేరొందిన వాయువులు కష్టముమీఁద శరీరము వదలి యూర్ధ్వముగఁ బోవును. ఇట్లు ప్రాణవాయువు దేహమును వదలిపోవ నుచ్ఛ్వాస నిశ్వాసములు నిలుచును. దేహమున వేఁడిలేక శ్వాసములేక కాంతితొలఁగి తెలివిమాని చేష్టలు వదలి యుండువానినే మృతుఁడందురు. దేహధారి మున్నే స్రోతస్సులవలన విషయములను తెలిసికొనుచుండెనో వాని మూలమున నిప్పుడు తెలిసికొనలేఁడు. ప్రాణంబు లాహారసంభవంబులు. వానిని దేహమందు సనాతనుఁడగు జీవుఁడే యాస్రోతస్సుల యందుఁ గలిగించుచున్నాఁడు. దేహమునందుఁ బంచభూతములొక్కొక్కచోట దృఢముగ సంక్షీభవించియుండును. వానినే మర్మస్థానము లందురు. దీనికి శాస్త్రము ప్రమాణము. ఆయాయువు పట్టులు భిన్నములుకాఁగా జీవుఁడు జంతువులహృదయంబులఁ బ్రవేశించి శీఘ్రముగఁ బ్రాణాధారమగు దేహసత్త్వమును నిరోధించును. అప్పుడు సచైతన్య ముండియు దేహి యేమియుఁ దెలిసికొనలేఁడు. మర్మస్థానములు సంవృతములగుటవలనఁ దమస్సుచే జ్ఞానము కప్పుపడిపోవును. అప్పుడు జీవుఁడు నిలువ స్థానములేక వాయువుచేఁ జలనము నొందును. ఆకాలమున దారుణమై దీర్ఘమగు నుచ్ఛ్వాసమును విడుచుచు నచేతనమగు దేహము వణఁకఁగ జీవుఁడు దేహమును వదలిపోవును. జీవుఁడు దేహమును వదలినను వాఁడు చేసిన పుణ్యపాపకర్మములు వానిని వదలక నలువంకల నంటుకొనియే యుండును. జ్ఞానసంప

న్నులు శ్రుతనిశ్చయులు నగు బ్రాహ్మణులు జీవుఁడు పుణ్యుఁడో పాపియో తెలిసికొనఁగలరు. కన్నులుగలవారు చీఁకటియందు వెలుఁగు మిణుఁగురు పుర్వునుజూచి తెలిసికొనురీతి జ్ఞాననేత్రముగల యోగసిద్ధులు దివ్యచక్షువులచే జీవుఁడు గర్భమునఁ బ్రవేశించుటయుఁ బుట్టుటయు దేహమునువదలి పోవుటయుఁ జూతురు. జీవుని వివిధస్థానములు శాస్త్రమువలన నెఱుఁగవలయును. జంతువులుండు నీభూమియే కర్మభూమి. ఇందు శుభాశుభములైన కార్యంబులొనర్చి యా కర్మములకుఁ దగినట్టు కొంచెమో గొప్పో భోగము లనుభవించును. ఇందుఁ బాపకర్మము లాచరించువారు నరకము పాలగుదురు. తలక్రిందుగఁ గూలు నీగతి మిగులఁ గష్టమైనది. ఇందు మనుష్యులు వండఁబడుదురుగదా. కావుననే మోక్షము దుర్లభము. దానంజేసి తన్నుఁ దాను రక్షించుకొనుటకుఁ బ్రబలప్రయత్నము చేయవలయును. ఊర్ధ్వలోకమునకుఁ బోయినవారి గతులు వివరించెదను వినుము. వానిని వింటివేని యే కర్మము మంచిదో యేది చెడ్డదో యను విషయమున నీకు నిశ్చయజ్ఞానము కలుగును. ఆ లోకములు నక్షత్రరూపములుగను చంద్రమండల రూపముగను నున్నవి. ఈస్థానములు పుణ్యము చేసినవారివని యెఱుఁగుము. అందేగినవారు వారిందుఁజేసిన పుణ్యకర్మఫలము క్షయింపఁగా మరలమరల నా స్థానములందుండి పడిపోవుదురు. ఆ స్వర్గమందును గొప్పఁదని కొంచెమని మధ్యమని తరగతులు గలవు. ఆ స్వర్గమందుఁ దమకంటె నెక్కువ తరగతియం దుండువారిని జూచువారికి సంతోషము లేదు. ఇతరుల యభ్యుదయముఁ గని యతృప్తి పడుచుందురు. ఈ గతులు నీకు వివరించితిని. ఇఁక జీవుఁడు గర్భస్థుఁడగు విధమును దెలిపెద వినుము.

పుణ్యకర్మములకుఁ బాపకర్మములకు నీ లోకమున నాశములేదు. వానికి వానికిఁ దగినట్టు లాయా దేహమునందుఁ దవిలి యవి జీవుని ఫలముఁ గుడువఁజేయుచుండును. ఒక ఫలబీజమును నాటిన దాని వలన బుట్టువున నెన్నియో ఫలము లుద్భవించునట్లు శుద్ధమైన మనస్సుతోఁ జేయు పుణ్యము విస్తార ఫలము నొసఁగును. పాప మన

స్సుచేఁ జేయు పాపములు నట్లే ఫలించును. జీవుఁడు మనస్సును ముందుంచుకొని కార్యములుచేయుటయందు వర్తించును. కావున కామక్రోధ యుక్తుఁడై కర్మముల నాచరించి జీవుఁడెట్లు గర్భమునఁ బ్రవేశించునో యావిధమును దెలిపెద వినుము.

రక్తముతోఁగూడి శుక్లము స్త్రీల గర్భాశయమునఁ బ్రవేశించి పూర్వ కర్మబలంబున శుభమో యశుభమో యగుక్షేత్రముగ నేర్పడుచున్నది. క్షేత్రగతుండయ్యు జీవుఁడు సూక్ష్ముఁడగుటచేతను నవ్యక్తుఁ డగుటచేతను దేనికిని సక్తుఁడుగాఁడు. కావుననే యతఁడు శాశ్వత బ్రహ్మమనఁబడును. సర్వభూతముల కతఁడే బీజము. అతని చేతనే జంతువులు జీవించుచున్నవి. ఆ జీవుఁడు సర్వభూతముల గర్భముల నన్నిభాగముల నావేశించి ప్రాణస్థానములం దన్నిటనున్న వాఁడై మనోగుణమును బురస్కరించుకొని ప్రాణరక్షణమును గావించును. ఆ కారణముచే మనస్సుతోఁగూడి గర్భమంగములఁ గదలింప నారంభించును. ఇనుమును గరఁగించి బొమ్మవంటి యచ్చులోఁ బోసిన బొమ్మవంటి యాకారముగల దెట్లగునో యట్లే జీవుని ప్రవేశ విధము నెఱుంగుము. అగ్ని యినుపగుండునందుఁ బ్రవేశించి దాని నెల్ల నెట్లు వేడిగఁ జేయునో యట్లే జీవుఁడును దేహమునందని యెఱుంగుము. దీపంబు తానొక్కచోనుండియు నింటినెల్ల నెట్లు ప్రకాశింపఁ జేయునో యట్లే జీవుండును దేహమునంతయుఁ బ్రకాశింపఁజేయును. పూర్వదేహమునఁ జేసిన కర్మము శుభమో యశుభమో యది సర్వమీ దేహమున ననుభవించును. ఆ పూర్వకర్మము క్షీణించిపోవ నాజన్మమునఁ జేసినకర్మముల ననుభవింప వేఱొక దేహమున బ్రవేశించుచుండును. మోక్షసాధన యోగధర్మంబు నాచరించువఱకు నిట్లు మరల మరల జన్మించుచుండవలయును. జనన మరణము లను సుడిగుండములోనుండి తప్పించుకొనిపోయి జీవి సుఖపడు ధర్మము నీకఁ జెప్పెదను వినుము.

దానము, వ్రతము, బ్రహ్మచర్యము, యథోక్త వ్రతధారణము, దమము, ప్రశాంతి, భూతదయ, సంయమము, ఆనృశంస్యము, పరుల

ద్రవ్యము గ్రహింపకుండుట, సమస్త భూతముల విషయమున వంచనములేక వాని కపాయము కలిగింపక వర్తించుట, తల్లిదండ్రుల సేవ, దేవపూజ, అతిథిపూజ, గురుపూజ, శౌచము, ఇంద్రియ నిగ్రహము, శుభకర్మములయందు వర్తించుట, ఇవి సజ్జనవ్రతములని చెప్పఁబడును. ఇట్టి ధర్మవర్తనము ప్రజలను శాశ్వతముగ రక్షించును. సజ్జనులాచరించు ధర్మమే సదాచారము. అది యుభయలోకములఁ బ్రయోజన పడును. ఈ సదాచారమును సజ్జనులయందు ధ్రువముగ నెలకొని కానవచ్చును. ఈ ధర్మమున నుండువాఁడు దుర్గతిపాలు గాఁడు. లోకము భ్రష్టమైనపుడది మరల సజ్జనాచారముచేతనే యుద్ధరింపఁబడును. వీరిలో యోగి యుక్తుఁడగుఁ గావున శ్రేష్ఠుఁడు. ఏయే ధర్మమున నెప్పుడెప్పు డెట్లెట్లు వర్తింపవలయు నట్లట్లువర్తించు పురుషుఁడు దీర్ఘకాలమున సంసారము క్రిగను. ఈవిధముగఁ బూర్వకర్మమును సమస్త జంతువు లనుభవించును. ఈ భూమిమీఁద మరల మరల జన్మించుట కదే కారణము.

ఏ కారణముచే శరీర గ్రహణములు తొలుతఁ గలిగెనని కొందఱు సందేహింతురు. ఆవిషయము చెప్పెద వినుము. సర్వలోకపితామహుండైన బ్రహ్మ తొలుత శరీరమును గ్రహించినో స్థావర జంగమాత్మకమైన త్రిలోకమును సృజించెను. తొలుతఁ బ్రధానమును శరీరులచేతనమును సృజించెను. అదియే సర్వలోకముల వ్యాపించియున్నది. దానినే యుత్తమమని యెఱుఁగుదురు. దీనిపేరు క్షరము. దీనికంటె నుత్తమమైనది యక్షరము. అదియే యమృతము. ఈ మూఁటిలో వేఱువేఱుగ భావించినచోఁ బ్రతి పురుషునందు క్షర మక్షరమను రెండును గానవచ్చును, తొలుత గోచరించినవాఁడై బ్రహ్మ స్థావరములను మహాభూతములను దొలుత సృజించెను. ఈ భూతములకుఁ గాలపరిమాణము, భూతములందు మరల మరల రాకపోకలను, గల్పించెను. ఆత్మ సాక్షాత్కారమును గలిగి పూర్వజన్మవిషయజ్ఞానముగల మేధావి యెట్లు చెప్పనో యట్లు చెప్పెద వినుము. సుఖదుఃఖములు లనిత్యములనియుఁ గాయము మమేధ్యస్థానమనియు, నది

కర్మచయమువలన నశించునది యనియుఁ, దలఁచుచు నెవ్వఁ డిందలి కించిత్సుఖమును దుఃఖముగానే యెంచునో యట్టివాఁడు దాఁటరాని యీ ఘోర సంసారసాగరమును దరించును. దేహము జరామరణ రోగపీడితమయ్యుఁ బ్రధానతత్త్వ మెఱింగినవాఁడు చేతనావంతంబులైన సమస్తభూతంబు లందలి చైతన్యమును సమముగాఁ జూచును. అట్టివాఁడు పరమపదమును వెదకువాఁడై తదితరములందెల్ల నిర్వేదముఁ జెందును. ఈ విషయమై యున్నదున్నట్లు నీ కుపదేశించెదను. శాశ్వతము నవ్యయము నగు పదమునుగుఱించిన యుత్తమజ్ఞానమును దెలిపెదను.

ఎవ్వఁ డేకాంతముగఁ గూర్చుండి మౌనియై కొంచెమైన దేనిని జింతింపక క్రమక్రమముగ స్థూలములనెల్ల సూక్ష్మములఁ గలుపునో వాఁడు నిరారంభకుఁడగును. సర్వమిత్రుఁడు సర్వసహుఁడునై శమమున రక్తుఁడై జితేంద్రియుఁడై భయరోషములులేక కామమును జయించినవాఁడును, సదాశుచియై సర్వభూతములు తనవలెనే యని యెంచుచు నియతేంద్రియుఁడై మానాభిమానముల నదలినవాఁడును, జననమరణములందును సుఖదుఃఖములందును లాభాలాభములందును, బ్రియాప్రియములందును సమబుద్ధి గలవాఁడును, గోరికలెల్ల మాని యెవ్వరి నవమానింపక నిర్ద్వంద్వుఁడై వీతరాగమైన మనస్సుగలవాఁడును, శత్రుహీనుఁడును బంధుహీనుఁడును ననపత్యుఁడు ధర్మార్థకామ వర్జితుఁడు నిరాకాంక్షియగువాఁడును, ధర్మాధర్మముల పొంతఁ బోవక పూర్వసంచిత కర్మఫలముల నాశింపక యుత్తమగతి నొందఁగోరి ప్రశాంతాత్ముం డగువాఁడును, నకర్ముఁడు నవికాంక్షుఁడునై జగ మశాశ్వత మనియు నస్వస్థ మనియు నవశమనియు సర్వదా జన్మమృత్యు జరాయుతమనియు నిశ్చయజ్ఞానము గలిగి వైరాగ్య బుద్ధియుక్తుఁడై తనయందలి దోషములందే దృష్టి నిలుపువాఁడును శీఘ్రకాలమునందే యాత్మ బంధములవలన విడివడును. ఆత్మ రూపరసగంధ స్పర్శ శబ్ద పరిగ్రహరహితమని తెలియరానిదని యెవ్వఁడెఱుఁగునో వాఁడు ముక్తుఁడు. పంచభూత గుణహీ

నుఁడని, యమూర్తియని, యకారణుఁడని, యగుణుఁడయ్యు గుణ
ముల ననుభవించునని యాత్మ నెవ్వఁడు చూచునో వాఁడుముక్తుఁడు.
శరీర మానస సంబంధములైన కోరికలనెల్ల వదలినవాఁడు కట్టెలు
లేని యగ్ని యాఱిపోవునట్లు మెల్లగ నిర్వాణమును బ్రాపించును.
సర్వ సంస్కారములను వదలి నిర్ద్వంద్వుఁడై దేనినైన నిది నాది
యని తలంపక తపస్సుచే నింద్రియముల నడపించువాఁడు ముక్తుఁడే.
ఇట్టివాఁడు సర్వసంస్కార నిర్ముక్తుఁడై సనాతనము పరమము సశాం
తము నచంచలము నిత్యము నక్షరము నగు బ్రహ్మమును బొందును.
ఇఁక దేనిని దెలిసికొనిన యోగు లాత్మను జూడఁగలరో దేనికంటె
నుత్తమమైనది లేదో యట్టి యోగశాస్త్రమును జెప్పెద వినుము.

తొలుత దీవ్రముగఁ దపస్సుచేసి యావల మోక్షయోగము
నకై యత్నింపవలయు. వ్రతాదులచే దేహమును దహింపఁజేయని
వాఁడు మోక్షయోగాధికారి గాఁజాలఁడు. తపస్వి యింద్రియముల
నుపసంహరించి మన స్సాత్మయందు నిలుపవలయును. తపస్వియై
సర్వదా యేకాగ్రచిత్తుఁడై దంభాహంకార వర్జితుఁడై ప్రజ్ఞావంతుఁ
డగు బ్రాహ్మణుఁడు తనయందలి యాత్మను గనుఁగొనఁ గలఁడు. ఏ
సాధు వాత్మయందు మనస్సు నిలుపఁ గలుగునో యట్టివాఁ డేకాంత
శీలుఁడై యాత్మావలోకనము గలవాఁడగును. మనోనిగ్రహము
గలిగి యోగియై పరిశుద్ధ మనస్కుఁడై జితేంద్రియుఁ డైనవాఁడు
గాఢ యోగాభ్యాసముచే నాత్మ నవలోకించును. కలలో నొకని
రూపముఁ జూచినవాఁడు మేలుకనినతరువాత వానిని జూచి వాఁడే
వీఁడని యెట్లు గుర్తించునో యట్టులే సమాధియం దాత్మలోఁ గనిన
దానినే సమాధినుండి లేచిన పిమ్మటను వెలుపలఁ గనుచున్నాఁడు.
ముంజయనెడి దర్భలోనుండి నడిమి బెండువంటి పోగును వేఱుగ
లాగి చూచునో యట్లు యోగి యగువాఁడు దేహమునుండి యాత్మను
వేఱుగఁ దీసి చూచుచున్నాఁడు. ముంజగడ్డియే శరీరమనియు నందలి
యిషీకమే యాత్మయనియు యోగవిదులు నిదర్శనము చెప్పుదురు.
ఏ దేహధారి చక్కఁగ నాత్మను జూడఁగలుగునో వానిని మించిన

వాఁడు మూఁడులోకములందును లేఁడు. వాఁడే మూఁడులోకములకుఁ బ్రభువు అట్టివాఁ డెన్ని దేహములైన వాని యిష్టానుసార మెత్తుచుండునుగాని కర్మబద్ధుఁడై మనుష్యునివలె దేహధారి గాఁడు. జరామరణముల జయించి దేనికిని సంతోషింపఁడు శోకింపఁడు. వాఁడు యోగయుక్తుఁడై దేవతలకును దేవత్వమును గలిగించును. వాని కిష్టము వచ్చినపు డశాశ్వత దేహమును వదలి యవ్యయ బ్రహ్మమును బొందును. లోకమంతయు నశించుట కనులారఁ జూచియు భయపడఁడు. సర్వభూతములు క్లేశపడుచుండినను వాఁడు దేనికిని గ్లేశపడఁడు. యోగయుక్తుఁడగువాఁడు నిస్పృహుఁడు శాంతచిత్తుఁడునై సంగస్నేహజాతంబులైన ఘోరములైన దుఃఖశోకము లను మలములచేఁ జలింపఁడు. వానిని శస్త్రములు ఛేదింపవు. మృత్యువు చెనకదు. అంతకంటె సుఖతరమైన దేదియు ముల్లోకముల నతనికిఁ గానరాదు. చక్కని యోగముతోఁ గూడినవాఁడై మనస్సు నాత్మయందు నిలిపి జరాదుఃఖముల వదలి సుఖముగ నిద్రించును. అట్టివాఁడు మనుష్యదేహమును విడిచి తన కిష్టమైన దేహమును ధరించును. అనుభవించుదానికై యెప్పుడు విచారపడరాదు. తన మనసుచేఁ దన్నుఁ జూచుకొనుచు యోగయుక్తుఁడై యుండువాఁ డింద్రునైన లక్ష్యముచేయఁడు. ఏకాంతశీలుఁ డెట్లు యోగయుక్తుఁ డగునో వినుము.

వేదములఁ జెప్పఁబడిన మార్గము ననుసరించి యేదేహము నందుఁ దా నున్నాఁడో యా దేహములోపల మనస్సును నిలుపవల యునుగాని వెలుపలికిఁ బోనీయరాదు. దేహమునఁ దానుండు హృదయమందు బాహ్యాభ్యంతర సంచారముగల మనస్సునఁ జూడ వలయును. ఏ దేహమున నే హృదయమునఁ దన్నుఁ దానిట్లు చక్కఁగఁ జూచుకొనునో వాని మనస్సు వెలుపలికిఁబోదు. ఏ దేహము హృద యమునఁ దానుండునో యా హృదయమునందే బాహ్యాభ్యంతర సంచారముగల మనస్సును దృఢముగ ధరింపవలయును. అట్లు చూచు నేని మనస్సు బాహ్యసంచారమునకై పోదు. ఇంద్రియముల నియ

నుంచినవాఁడై సద్దు చప్పుడులేని నిర్జనారణ్యముననుండి యేకాగ్ర చిత్తుఁడై తన్నుఁదాను ధ్యానింపవలయును. దంతములు – చెక్కిళ్లు – నాలుక–మెడకంఠము వీనితోఁ గార్యములు చేయునప్పుడు వీనిపై మనస్సు నిలుపవలయును. అట్టులే హృదయమును హృదయబంధనముల గుఱించియు ధ్యానింపవలయును.

అని చెప్పిన మేధావియగు శిష్యుం డిట్లనియె.

భుజింపఁబడిన యన్నమెట్లు జీర్ణించును? అది యెట్లు రసమగును? మరల నెత్తు రెట్లగును? అది మాంసమును మేదస్సును నరములను, నెముకలను నెట్లుపోషించును? బలమెట్లు వృద్ధియగును? నీరసములైన మలము లెట్లు దేహమునుండి వెలికిఁబోవును: ఉచ్ఛ్వాస నిశ్వాసము లెట్లు కలుగును? ఈ దేహమున జీవుఁ డే ప్రదేశమున వసించును? ఎట్టి చేష్టలచే జీవుఁడు దేహమును భరించును? ఈ దేహమును విడిచి వేఱొక దేహములోనికిఁ బోవునపు డెట్టి వర్ణముగల యెట్టి దానికై పోవును? ఇవన్నియు యథాతథ్యముగ నుపదేశింపుమనిన సిద్ధుఁ డిట్లనియె.

ఒక యమూల్యపదార్థమును గదిలోనుంచి మనస్సంతయు దానియందే యుంచునట్లు తన కాయమునఁగల జీవునియందే నిశ్చల మనస్సంతయు నుంచవలయును. ఏమాత్రము ప్రమాదపడక యక్కడ నాత్మను వెదకవలయును. ఈ ప్రకారము సర్వదా వెదకు వానికి జీవుఁడు సాక్షాత్కరించును. దానివలన వాఁడు ప్రధానమును దెలిసికొనిన వాఁడగును. ఈ విధమునఁగాక జీవుఁడు కన్నులచేతను సర్వేంద్రియములచేతను గ్రహింపఁబడఁజాలఁడు. మనస్సనుదీపముతో వెదకిన మహాత్మ గానవచ్చును. ఆ మహాత్మ యన్నిచోటులఁ బాదములుపాణులు నన్నిచోటులఁ గన్నులు ముఖములు శిరస్సులు చెవులునై సర్వత్ర వ్యాపించియుండును. జ్ఞానోదయము వలన దేహమునుండి వెడలిపోవు జీవుఁడు తన్నుఁదాను ముంజయందలి యీనెను వెలుపలఁ దీసినట్టు తెలిసికొనఁ గలఁడు. ఆ విధముగ దేహమును వదలి కేవల బ్రహ్మమును బొందును. తన్నుఁదాను మనస్సుచే నవలీలగఁ దెలిసికొనును. ఈ విధముగ

బ్రహ్మమును నాశ్రయము చేసికొని యావల భగవంతునియందు మోక్ష మనుభవించును. బ్రాహ్మణా! యీ సర్వరహస్యము నీకుఁ దెలిపితిని. ఇఁక నీ యిష్టము వచ్చినట్లు పొమ్మనిన నతఁడును వెడలి పోయెను. ఇట్లు నా కా బ్రాహ్మణుఁడు చెప్పి యాయనయుఁ దిరోధానము నొందెను.

అర్జునా! నేను చెప్పినదంతయు శ్రద్ధతో వింటివా? యుద్ధరంగమున నీవు తేరిపై నుండునపుడు నేను నీకుఁ జెప్పిన దిదియే. ఇది కలవరపాటు గలవారికి, సంగము వదలనివారికిఁ బరిశుద్ధమైన యంతరంగము లేనివారికిఁ దెలియ సాధ్యపడదు. ఇది దేవతలలోని రహస్యము. మనుష్యుఁ డెవ్వఁ డిదివఱకు వినలేదు. నీవుగాక మనుష్యులందు దీనిని వినఁదగినవాఁడు లేఁడు. దీనిని వ్యాకుల మనస్కుఁ డెఱుఁగఁదగఁడు. పార్థా! కర్మములు చేయువారు దేవలోకమునకుఁ బోదురు. ముక్తిమార్గమున వర్తింప యత్నించువారినిఁ గని దేవత లసూయపడుదురు. తమకంటె మనుష్యు లుత్తమపదవికిఁ బోదురు గదా యని వారికి మనోవేదన. కావున మనుష్యు లట్టిమార్గమున వర్తింప వా రిష్టపడరు. బ్రహ్మమును బ్రాపించి దుఃఖహీనుఁడై సదా సుఖియై యుండుగతి యుత్తమగతి. పాపజాతి స్త్రీవైశ్య శూద్రులంతైన నెవ్వరైనను నీ మార్గమున నుండి కేవల పరమగతిని బ్రాపింతు రన నిఁక స్వధర్మనిరతులగు బ్రహ్మజ్ఞాననిష్ఠులు బహుశ్రుతులునైన బ్రహ్మక్షత్రియుల విషయమై చెప్పనేల? ఇంతకంటె సుఖకరమైనది లేదు. బుద్ధి శ్రద్ధ శక్తి గలిగి యీ విధముగ సర్వదా విడువక వర్తించువాఁ డాఱుమాసములలో యోగియగును.

—♦ కృష్ణుఁ డర్జునునకు దంపతీసంవాదము చెప్పుట. ♦—

అర్జునా! యీ విషయమున దంపతీసంవాదమను నొక యితిహాసము గలదు వినుము. ఒక బ్రాహ్మణస్త్రీ యొంటరిగఁ గూర్చుండిన తనభర్తను జ్ఞానవిజ్ఞాన పారగునిఁ జూచి యిట్లనియె. నాథా! భర్త చేయు పుణ్యములు భార్యకును బ్రాపించుననియు, భర్తపోవు లోకములకు

భార్యయుఁ బోవుననియు శ్రుతులవలన వింటిని. నీవు కర్మములేవియుఁ జేయక, భార్యకుఁ బతియేగతి యని తెలియక యూరక కూర్చుండి యున్నాఁడవు. ఇట్టి నిన్ను మగనిఁగాఁగల నే నేలోకములకుఁ బోదునో చెప్పుము. అనిన విని శాంతాత్ముఁడైన యా బ్రాహ్మణుఁడు నవ్వుచు భార్యతో నిట్లనియె.

ఓసీ! నీ మాటలకు నేను గోపింపను. ఏది గ్రాహ్యమని యేది దృశ్యమని యేది శ్రావ్యమని కర్మముచేయఁబడునో దానినిగర్మములుకర్మ మందురు. జ్ఞానములేక కర్మములు చేయువారు మోహముపాలే యగుదురు. లోకమున నొకక్షణమైనఁ గర్మముచేయక యూరకుండ సాధ్యపడదు. భూమిమీఁద జన్మించినది మొదలు మనస్సు చేతనో వాక్కుచేతనో కాయము చేతనో శుభమో యశుభమో యేదో యొకవిధమైన కర్మము చేయకయుండు టసాధ్యము. కనవిన వచ్చునట్టి కర్మములను రాక్షసులు ధ్వంసము చేయుచుండుటచే వానిని వదలి నా దేహమందుండు నాత్మస్థానమును మనస్సుచేతఁ జూచుచున్నాఁడను. అందే నిర్ద్వంద్వుఁడగు బ్రహ్మముండును. అందే సోముఁడు నగ్నియు నుందురు. అందే బుద్ధిప్రేరకుఁడగు వాయువు భూతధారకుఁడై సంచరించును. ఆ స్థానమునిమిత్తమై యోగయుక్తులై బ్రహ్మాదు లక్షరము నుపాసింతురు. దానికై విద్వాంసులు సువ్రతులు శాంతచిత్తులు జితేంద్రియులు నగువారు యత్నింతురు. దానిని ముక్కుచే మూర్కొనరాదు. నాలుకచే నాకరాదు. దేహముచేఁ దాఁకరాదు. అది మనస్సుచేతనే తెలియఁబడును. అది గన్నులకు వీనులకు నతిక్రమించినది. అది గంధము రసము స్పర్శము రూపము శబ్దములేనిది. దానివలననే లోకతంత్రమంతయు వర్తించుచున్నది. దానియందేనిలిచియున్నది ప్రాణాపాన వ్యానోదానసమానములను ప్రాణవాయువులు దానినుండియే వెడలుచున్నవి. మరల దానియందే ప్రవేశించుచున్నవి. అపాన ప్రాణములనడుమ నుదానము వ్యాపించియున్నది. కావున నిద్రించు పురుషునిఁ బ్రాణాపానములు వదలిపోవు. ఏది ప్రాణవాయువులను నుపాలనము చేయునో దానిని నుదానమందురు. ఈ విధముగఁ బ్రాణ

వాయువుల వలననే లోక వ్యవహారము జరగవలయును. అవి జీవు ననుసరించియుండి యతని వివిధోపాధుల ప్రాప్తికిఁ గారణము లగుచున్నవి. ఆ ప్రాణవాయువు లుదానమునకు లోపడి వర్తించును. ఆ యుదానము తపస్సుచే నియమింపఁబడును. కావున బ్రహ్మవాదులు భగవత్ప్రాప్తికై తపస్సు చేయుదురు. దేహమున సంచరించుచు నన్యోన్యసక్తములైన యన్ని వాయువులనడుమ వైశ్వానరుఁడను నగ్ని యేడు జ్వాలలతో వెలుఁగుచుండును. ఘ్రాణము - జిహ్వ-కన్నులు - త్వక్కు-శ్రోత్రము-మనస్సు-బుద్ధియను నేడును వైశ్వానరుని జ్వాలలు మూర్కొనఁబడునవి తినఁబడునవి చూడఁబడునవి స్పృశింపఁబడునవి వినఁబడునవి యాలోచింపఁబడునవి యెఱుఁగఁబడునవి యివి యేడును వైశ్వానరునకు సమిధలు. మూర్కొనువాఁడు భక్షించువాఁడు చూచువాఁడు తాఁకువాఁడు తెలిసికొనువాఁడు వినువాఁడు నాలోచించువాఁడు వీ రేడువురు శ్రేష్ఠులైన ఋత్విజులు. ఓసి ముగ్ధురాలా ! యెఱుఁగఁగల హోత లేడాహుతులను నేడువిధముల నేడగ్నులయందు వేల్తురు. ఘ్రేయము పేయము దృశ్యము స్పృశ్యము శ్రావ్యము మంతవ్యము బోద్ధవ్యమునునవి యేడును సమిధలని చూడుము. ఈ విధముగ విద్వాంసు లేడింటిని నేడగ్నులయందు నేడువిధముల వేల్చి వానిని దను గర్భములందే సృజించుచున్నారు. పృథివ్యప్తేజో వాయ్వాకాశ మనోబుద్ధులను నేడును నన్నిటికిని జన్మకారణములు. హవిస్సైనగుణములన్నియు నగ్నివలనఁ గలిగిన గుణమునఁ బ్రవేశించును. ఇట్లు ప్రవేశించి లోపలనే వసించియుండి మరల నానాగర్భముల జన్మించుచుండును. భూతముల కుత్పత్తికిఁ గారణమగు దానియందుఁ బ్రలయకాలమున నణఁగియుండును. దానినుండియే గంధము దానినుండియే రసము, దానినుండి రూపము దానినుండి స్పర్శము దానినుండి శబ్దము దానినుండి సంశయము దానినుండి నిష్ఠ జనించును. దీనికే యేడువిధములైన సృష్టియని పేరు. పూర్వులందఱు దీని నిట్లెఱిఁగియున్నారు. పూర్ణమగునది పూర్ణాహుతులచేఁ దేజస్సుచేఁ బూర్ణమగుచున్నదని బోధించెను.

అనిన నర్జునుం డిట్లనియె. కృష్ణా! తెలిసికొనఁదగిన దానిలో శ్రేష్ఠమైన బ్రహ్మవిషయము నాకుపన్యసింపుము. నీ యనుగ్రహము వలన నిట్టి సూక్ష్మ విషయములందు మనస్సానందించుచున్నది. అనినఁ గృష్ణుఁ డిట్లనియె.

—♦ శ్రీకృష్ణుఁ డర్జునునకు గురుశిష్య సంవాదంబుఁ దెలుపుట. ♦—

ఈ విషయమున గురుశిష్య సంవాదంబను పురాణేతిహాసము గలదు. చెప్పెద వినుము. బ్రహ్మచర్య వ్రతనిష్ఠుఁడును, గురుభక్తుఁడును; సుశీలుఁడును, వినయసంపన్నుఁడును, జిజ్ఞాసువు నగు శిష్యుఁ డొకఁడు తన గురువును సమీపించి నమస్కరించి సవినయంబుగ నిట్లనియె.

గురువరా! నన్నుఁ గొన్ని సందేహములు బాధించుచున్నవి. వానిని దీర్ప నీవుగాక సమర్థుఁ డెవ్వఁడును లేఁడు. నేనెందుండి వచ్చితిని? మీ రెందుండి వచ్చితిరి? జంగమ స్థావరములైన భూతములన్నియు దేనినుండి కలుగుచున్నవి? దేనివలన జీవించుచున్నవి? వాని కాయఃపరిమాణ మెంత? సత్యమనఁగా నేమి? తపస్సనఁగా నేమి? గుణములనఁగా నేమి? మేలొసఁగు మార్గమేది? సుఖమేది? దుష్కృత మేది? బ్రాహ్మణోత్తమా! యీ ప్రశ్నముల కన్నిటికి యథార్థముగఁ బ్రత్యుత్తర మిమ్మనిన గురుం డిట్లనియె.

నాయనా! ఋషిశ్రేష్ఠ సేవితంబైన యీ ధర్మమును బూర్వము బ్రహ్మదేవుఁడే కొందఱు ఋషీశ్వరులకు బోధించెను. బ్రహ్మఋషులకు బోధించిన విధమున నేను నీకుఁ దెలిపెదను. తెలిసికొనఁ దగిన దానిలో శ్రేష్ఠమైనది జ్ఞానము. అన్నిటియందు సంగము వదలుటయే యుత్తమ తపస్సు. నిరాబాధమైన జ్ఞానతత్త్వ మనఁగా సమస్తభూతములయందుండు నాత్మను నెవ్వఁ డెఱుంగునో వాఁడు వాని యిష్టప్రకారము సంచరింప సమర్థుఁడై యుత్తముఁడని భావింపఁబడును. సమస్త పదార్థము లొక్క దానియందే వసించియుండుటయు, మరల నదియే విడివడిపోవుటయు, నానా విధములఁ గానవచ్చువానియం దేకత్వము నెవ్వఁ డెఱుఁగునో వాఁడు దుఃఖభాగి కాఁడు. ఎవఁడు కొంచె

మైనను దేనిని గోరఁడో, దేనియందు నిది నాది యను నభిమాన ముంచఁడో వాఁ డీలోకమునసే బ్రహ్మభూతుఁ డగుచున్నాఁడు. ప్రధాన మనఁబను ప్రకృతితత్త్వము సర్వభూతముల యుత్పత్తి విధము నెఱిఁగి నేను నాది యను భావము లేక యుండువాఁడు నిస్సంశయ ముగ ముక్తుఁడే. అవ్యక్తము బీజముగను, బుద్ధి స్కంధముగను, మహాహంకారము శాఖలుగను, నింద్రియము లంకురములు జనించు బొరియలుగను, పంచమహాభూతములు పూమొగ్గలుగను, శుభా శుభములను నాకులను బూవులను సదా గలిగించుచు సర్వబ్రహ్మమే బీజముగాఁగల సమస్తభూతములకు నాధారమైయుండు సూక్ష్మభూత ములు రెమ్మలుగాఁగల వృక్షతత్త్వము నెఱిఁగి దానిని జ్ఞానమనెడి కత్తిచే నఱకి యమరత్వమును బ్రాపించువాఁడు జనన మరణముల నుండి విడివడుచున్నాఁడు. పూర్వకల్పములకు సంబంధించి సనాత నమై సిద్ధులకు జక్కఁగాఁ దెలిసిన భూత భవిష్యద్వర్తమానములయు, ధర్మార్థకామములయు నిశ్చయజ్ఞానము నీకుఁ దెలిపెద వినుము. దాని నెఱింగి మతిమంతు లిందే సంసిద్ధులగుచున్నారు. తొల్లి బృహస్పతి భరద్వాజులు గౌతముఁడు భార్గవుఁడు వసిష్ఠ కశ్యప విశ్వామిత్రాదులు తరింపఁగోరి సర్వమార్గముల వర్తించి స్వకర్మములచే విసివి పరి శ్రాంతులై వృద్ధుఁడగు నాంగిరసు మున్నిడుకొని బ్రహ్మను గానసరిగి యాయనకు నమస్కరించి సవినయముగ నిశ్శ్రేయసకరంబైన దీనిఁ బ్రశ్నించిరి. సాధువు కర్మమె ట్లాచరింపవలయును ? కిల్బిషమువలన నెట్లు ముక్తుఁడగును ? మాకు శుభమార్గము లెవ్వి ? సత్యమననేమి ? సుకృతమన నేమి ? ఎట్లు వర్తించిన నుత్తర దక్షిణ మార్గంబులు లభించును ? నరకమన నేమి ? మోక్షమన నేమి ? భూతములకు జనన మననేమి ? మరణమననేమి ? అని యడిగిన ఋషీశ్వరులకుఁ జతుర్ముఖుం డిట్లనియె.

## —♦ సత్యప్రశంస. ♦—

స్థావర జంగమంబులగు భూతంబులు సత్యమువలనఁ బుట్టు చున్నవి. తపమను కర్మముచేనవి జీవించుచున్నవి. సువ్రతమే జీవితము,

అవి తాముచేసిన కర్మముచేతనే తమ జన్మస్థానమగు బ్రహ్మమునుండి వేఱువడి నైష్కర్మ్యముచే మరల బ్రహ్మమును బొందుచున్నవి. గుణ యుక్తమైన సత్యమునకుఁ బంచలక్షణములు నియతములు. బ్రహ్మము సత్యము. తపస్సు సత్యము. ప్రజాపతి సత్యము. సత్యమువలననే భూత ములు పుట్టుచున్నవి. భూతమయమైన జగత్తు సత్యము. ఆ కారణము చేతనే యోగపరాయణులు నతీత క్రోధసంతాపులు నియత ధర్మసేతు వులునగు విప్రులు సదా సత్యమునే యాశ్రయింతురు. పరస్పర నియ తులై జ్ఞానవంతులై ధర్మసేతుప్రవర్తకులైనవారిరీతులుచెప్పెదవినుఁడు. వర్ణములు నాలుగు. ఆశ్రమములు నాలుగు. ధర్మ మొక్కటే. అది నిత్యము. దానికిఁ బాదములు నాలుగని జ్ఞానులు చెప్పుదురు. పూర్వ మనీషులు నడచినట్టులు బ్రహ్మప్రాప్తికి నియతమైనట్టియు శుభము క్షేమంకరమునగు మార్గము చెప్పెదవినుఁడు. ఈ పరమపదమార్గ

## —♦ఆశ్రమచతుష్టయ ప్రశంస ♦—

మితరులకుఁ దెలియదు. మొదటిది బ్రహ్మచర్యము. రెండవది గార్హ స్థ్యము. మూఁడవది వానప్రస్థము. దాని కావలిది యధ్యాత్మము. జ్యోతి, ఆపస్సు, ఆకాశము, ఆదిత్యుఁడు, వాయువు, ఇంద్రుఁడు, ప్రజాపతి వీ రధ్యాత్మము లభింపకుండువఱకుఁ గానరారు. ఆ యధ్యా త్మ మార్గమును జెప్పెదవినుఁడు.

ఫలములు మూలములు గాలి భుజించుచు వనములఁ గాఁ పురంబుండు వానప్రస్థము తొలిమూఁడు వర్ణములవారికి విధింపఁ బడినది. అన్ని వర్ణములవారికి గార్హస్థ్యముప్రశస్తమైనది. ధర్మమునకు శ్రద్ధయే ముఖ్యలక్షణమని ప్రాజ్ఞులు చెప్పుదురు. ఈ విధముగ మీకు దేవలోక మార్గము చెప్పితిని. వీనిని జ్ఞానముగల సజ్జను లాచరింతురు. ఇవి ధర్మ సేతువులు. వీనిలో నేదైన నొకటి నియతముగా నాచరించు వారు, కాలక్రమమున భూతముల జనన మరణ విధాన మెఱుఁగు దురు. ఇఁక నన్ని పదార్థములందుండు భూతములను వాని భాగము లతోఁ జెప్పెదను.

మహ త్త-అవ్యక్తము-అహంకారము-పదునొకొండింద్రియములు, పంచమహాభూతములు పంచభూత విశేషములు భూతసృష్టికిఁ గారణములని వేదములు చెప్పును. ఈ తత్త్వము లిరువదినాలుగు. ఈ తత్త్వముల యుత్పత్తివినాశమెఱుంగు పండితుఁడు మోహమునకు వశపడఁడు. ఉన్న దున్నట్టు లీ తత్త్వములను గుణములను దేవతలను నెఱుంగువాఁడు పాపరహితుఁడై బంధములనుండి విడివడి నిర్మల లోకముల సుఖించును.

## —♦ త్రి గు ణ ప్ర శం స. ♦—

అవ్యక్తము - అనుద్రిక్తము-సర్వవ్యాపి - ధ్రువము-స్థిరము - నగునదియే తొమ్మిది ద్వారములు మూఁడు గుణములు పంచధాతువులు గల పురమగుచున్నది. వస్తువుల వివరించి తెలిసికొను మనస్సుతోఁ గూడఁ బదునొకటిచే వ్యాప్తములు. బుద్ధిని స్వామిగఁగలిగినదియే పరమైకాదశము. మూఁడు గుణములు, పంచభూతములు, నింద్రియ సముదాయ మొకటి, యహంకారము, బుద్ధి యివి పరమైకాదశము. ఈపదునొకొంటిని మరలమరల మూఁడు స్రోతస్సులు భరించియుండును. ఈ మూఁడు స్రోతస్సులు మూఁడు నాడులు. ఇవి గుణాత్మకములై ప్రవర్తించుచుండును. సత్త్వము రజస్సు తమస్సనునవియే మూఁడు గుణములు. ఈమూఁడును నొకదానితో నొకటి జతగూడి పరస్పర మాశ్రయించి పరస్పరాను జీవులై యొకదాని నొకటి ననువర్తించుచుండును. అవి యన్యోన్యసక్తంబులై యుండు. పంచ ధాతువులు త్రిగుణాత్మకంబులై యుండు. తపస్సత్త్వంబులు, సత్త్వరజస్సులు, రజస్సత్త్వములు, సత్త్వతమస్సులు మిథునంబులగు. ఎచ్చటఁ దమస్సు నియమిత మచ్చట రజస్సు వర్తించును. రజస్సు నియమితమైనచోఁ డ సత్త్వంబు ప్రవర్తించును. తమస్సు నిశాత్మకము. అది మూఁడు గుణములు మోహమను పేరునుగలది. దాని లక్షణ మధర్మము. పాపకర్మంబులం దది నియతమై కానవచ్చును. ఇది తమస్సు స్వరూపము. ఇది యితర గుణములతోఁ గలసి యుండును.

రజస్సు ప్రకృత్యాత్మకము. కార్యము వెంటఁ గార్యము చేయుచుండుట దాని లక్షణము. దాని ప్రవర్తనమువలన సన్నిభూతములందుత్పత్తి కానవచ్చును.

సర్వ భూతములందుఁ బ్రకాశము లాఘవము శ్రద్ధ యివిసత్త్వ

## —♦ తమోగుణ లక్షణము. ♦—

లక్షణములు. ఇఁక వీని గుణతత్త్వములు చెప్పెదవినుము. అజ్ఞానము సమ్మోహము, అత్యాగము, కర్మములందునిర్ణయబుద్ధి లేకుండుట, నిద్ర, స్తంభభయలోభ శోకములు, సుకృత దూషణము, మఱపు, అపక్వబుద్ధి, నాస్తిక్యము, భిన్నవృత్తులందు వర్తించుట, యుక్తాయుక్తజ్ఞానహీనత, గ్రుడ్డితనము, నీచగుణవృత్తులందు వర్తనము, కార్యములు చేయకయే చేసినట్లును జ్ఞానము లేకున్నను జ్ఞానిననియుఁ జెప్పుకొనుట స్నేహభావము లేకుండుట, వికృతభావము, అశ్రద్ధ, మూఢభావన, ఋజుత్వము లేకుండుట, యితరులతోఁ గలసి మెలసి యుండలేకుండుట, పాప కార్యాసక్తి, తెలివి లేమి, తన్ను గొప్పగా నెంచుకొనుట, భేదము, ఇంద్రియజయము లేమి, నీచకార్యగమనము, లోనగు నివి యన్నియుఁ దమస్సు గుణములు. భావ సంజ్ఞితములై తమస్సునకు సంబంధించినభావము లన్నియుఁ దమస్సు గుణములనియే చెప్పఁబడును. సర్వదా పరులనిందించుట, దేవబ్రాహ్మణ విరోధము, అత్యాగము, అతిమానము, మోహము, కోప, నోర్పు లేమి, భూతములందు మచ్చరము, లోనగు నివి తామసవృత్తములు వ్యర్థకార్యములు చేయఁబూనుట, వ్యర్థత్యాగము, వ్యర్థభక్షణ మివియుఁ దమోగుణములు. అతివాదము, సహనము లేమి, దురభిమాన మాత్సర్యములు, శ్రద్ధలేమి యివియుఁ దమోవృత్తములే. పాపకర్ములు శాస్త్రమర్యాదకు లోపడనివారు తామసులని యెన్నఁబడుదురు. ఇఁకఁ బాపకర్మనిరతులగు వారి జన్మస్థానములవివరించెద. వీరుఘోరనరకములపాలై స్థావరములుగాను బశువులుగాను వాహనములుగాను ఘాతుకమృగములుగాను, సర్పములుగను, క్రిమికీట పక్షులుగను, నండజములు

గను, జతుప్పాత్తులుగను, నున్మత్తులు, చెవిటివాండ్రు, మూఁగలుగను, బాపరోగులుగను, దామ చేసిన పాపముల లక్షణములు గలవారై తామసులు జనింతురు.

ఇఁక నిట్టివారికిఁ బుణ్యకర్మల యుత్తమలోకములు లభించు విధముఁ జెప్పెదను. స్వకర్మనిరతులై లోకక్షేమముఁ గోరు బ్రాహ్మణులచే సత్కర్మములందు వినియోగింపఁబడి మనుష్యేతర జాతులందు జనించినవి పుణ్యలోకములం గాంచునని వేదములు చెప్పుచున్నవి. ఇట్టులే యవి తమ శ్రేయస్సునకై యత్నించి తుదకు బ్రాహ్మణులు పొందులోకములనే పొందును. ఈవిధముగ మనుష్యేతర జాతులందు జనించినవియు వాని వానికర్మములచేఁ బునరావృత్తిధర్ములైన మనుష్యులుగా జనించు. పాప యోనులందును, జంతువులరగను, మూఁగలుగను, నస్పష్ట వాక్కులుగను జన్మించినవారును, క్రమ క్రమముగ శూద్రజాతి దాఁటి యుత్తమజాతులఁ బుట్టుదురు. కామాసక్తియే మహామోహము. సుఖముఁగోరు ఋషులు మునులు దేవతలును మోహము పాలగుచున్నారు. తమోమోహ మహామోహక్రోధ మరణాంధతామిశ్రములు దానికి బంచక్లేశములు. బ్రాహ్మణోత్తమా! తమోలక్షణములు దానికిఁ సంబంధించిన గొప్ప కొలఁది గుణములన్నియు వివరించితిని. అసత్యమునందు సత్యబుద్ధి యుండుటే తమోగుణ లక్షణము. వీనిని మనస్సునం దుంచుకొని వర్తించువాఁడు తమోగుణముచే విడువఁబడును.

## —♦ రజోగుణ లక్షణము. ♦—

ఇఁక రజోగుణమును వివరించెద వినుము. సంతాపము చక్కఁదన, మాయాసము, సుఖదుఃఖములు, చలివేఁడుము, ఐశ్వర్యము, విగ్రహము, సిద్ధి, హేతువాదములు, రతి, క్షమ, బలము, శౌర్యము, మదము, రోషము, వ్యాయామము, కలహ, మీర్ష్య, కోరిక, లోభితనము, యుద్ధము, మమత్వము, ప్రజాపాలనము, వధ, బంధము, పరిక్లేశము, క్రయవిక్రయములు, నఱకుట, విఱుచుట,

పగులఁగొట్టుట, పరులరహస్యముల వెల్లడించుట, యుగ్రము, దారుణ, మాక్రోశము, పరధనానురాగము. లోకచింత, యనుచింత, మచ్చరము, పరనింద, వృథాశాస్త్రము, మృషావాదము, వికల్ప పరిభాషణము, నింద, స్తుతి, ప్రశంస, ప్రతాపము, పరధర్షణము, పరిచర్య, గురుశుశ్రూష, సేవ, తృష్ణ, సామర్థ్యము. వ్యూహము, సయము ప్రమాదము, పరివాదము, పరిగ్రహము, మఱియు, స్త్రీ పురుషులందు భూతములందుఁ బదార్థములందు నిండ్లయందు లోకమున వేఱువేఱుగఁ బెక్కువిధములఁ గానవచ్చు సంస్కారములు, సంతాపమవిశ్వాసము, వ్రతములు, నియమములు, ప్రతిఫలముఁ గోరి చేయు దానములు, స్వాహాకారము, నమస్కారము, స్వధాకారము, వషట్కారము, యజన యాజనము లధ్యయనాధ్యాపనములు, దాన ప్రతిగ్రహములు, ప్రాయశ్చిత్తములు, మంగళ కార్యములు, నా కిది కావలయు నది కావలయు నను కోరిక యితరుల గుణములవలనఁ గలిగిన స్నేహభావము, ద్రోహము, మాయ, నికృతి, మానము, స్తైన్యము, హింస, జుగుప్స, పరితాపము, ప్రజాగరము. దంభము, దర్పము, రాగము, భక్తి, ప్రీతి, ప్రమోదనము, జూద, మపవాదము లాడుట, స్త్రీనిమిత్త సంబంధములు, నృత్యవాదిత్ర గీతములు, వీనికి సంబంధించిన ప్రసంగములు, నీ మొదలయిన వన్నియు రజోగుణ సంబంధ గుణములు. భూత భవిష్యద్వర్తమానములను గుఱించి యాలోచించువారు త్రివర్గ నిరతులు. కామవృత్తులు, సర్వకామ సమృద్ధి సంతుష్టులు, నగువారు రాజసవృత్తి నవలంబించి స్వర్గమునకంటె నధమములు భూమికంటె నుత్తమములగు లోకముల పాలగుదురు. వీరు మరలి మరలి భూమిపై జన్మించుచు. నిందలి. సుఖముల తోనే సంతోషించుచుందురు. రజోగుణమును గుఱించి విస్తరించి చెప్పితిని. దీనిని సర్వదా మనస్సులో నుంచుకొనువారు రాజస గుణములచే ముక్తులగుదురు.

ఇఁక మూఁడవదియగు నుత్తమగుణమును వివరించెద వినుఁడు. ఈ సత్త్వగుణము సర్వభూతహితమై, సజ్జను లనుష్ఠించునదియై

యనిందితమైనది. ఆనందము, ప్రీతి, గొప్పతనము, ప్రాకాశ్యము, సుఖము, గర్వము లేమి, యౌదార్యము, సంతోషము, శ్రద్ధ, క్షమ, ధృతి, యహింస, సమత్వము, సత్య, మక్రోధ, మార్జన, మనసూయ, శౌచము, దాక్ష్యము, పరాక్రమ మివి సాత్త్వికగుణములు. యోగ యుక్తుఁడు జ్ఞానము, వృత్తము, సేవ, శ్రమము, వ్యర్థములనితలఁచు వాఁడు పరలోకమున నుత్తమ సుఖమునుబొందును. అహంకార మమ కారములు వదలి, యాశమాని. యందఱయందు సముఁడై కామ హతుఁడు కాకుండుటే సజ్జనుల సనాతనధర్మము. నమ్మిక, లజ్జ, యోర్పు, త్యాగము, శౌచము, సోమరితనము లేకుండుట, క్రౌర్యము లేమి, మోహము లేమి, దయ, ఇతరుల నిందలాడకుండుట, హర్షము, తుష్టి, విస్మయము, వినయము, సాధువృత్తి, శాంతి, కర్మశుద్ధి, భావశుద్ధి, సంఘమునుండి మోచనము, లపేక్ష, బ్రహ్మచర్యము, సర్వపరిత్యాగము, స్వేష్టప్రాప్తియం దాశ లేకుండుట, ధర్మమునం దస్ఖలనము, దాన యజ్ఞాధ్యయన వ్రత ప్రతిగ్రహ ధర్మతపములు వ్యర్థములను జ్ఞానము నివి సాత్త్వికగుణములు. ఇట్టి గుణములుగల వారై ధర్మసక్తులై సాధుదర్శనులగు బ్రాహ్మణులు సర్వపాప ముక్తులై నిశ్శోకులై జరా మరణములు లేని దివ్యశరీరముల ధరించి యచ్చట నిష్టమువచ్చిన శరీరములతో సుఖింతురు. ఇట్టివారు దేవతలవలె నీశిత్వ వశిత్వ లఘుత్వాణుత్వాదులను సంకల్పమాత్రముననే చేయఁ గలరు. వీ రూర్ధ్వలోకగాములు. వీరే దేవతలై ప్రకృతిచేతనే యన్నిటినిమార్ప శక్తిగలవారగుదురు. వారు కోరినవన్నియు వారికి లభించును. ఇది సాత్త్విక వృత్తము. దీని నెఱింగినవారు ఫలాసక్తి రహితులై సత్త్వగుణ నిష్ఠులగుదురు.

తమోరజసత్త్వగుణములు సంపూర్ణముగ వేఱువేఱుగునట్లు చెప్ప నసాధ్యము. అవి యొకదానితో మఱియొకటి కలసియే గాన వచ్చుచుండును. అవి యన్యోన్యానురాగముగలవై యన్యోన్యాను జీవులై యన్యోన్యాశ్రయములై యొకదాని నొకటి యనువర్తించు చుండును. సత్త్వము వర్తించుచున్నంతకాలము రజస్సు వర్తించును;

ఎంతవఱకు స_త్త్వతమస్సులు వ_ర్తించు నంతవఱకు రజస్సు వ_ర్తించును, ఇవి మూఁడును గలసిమెలసియే గుంపుగఁ గూడి యాత్ర జరపు చుండును. ఇవి సంఘముగ నే దేహమున హేతువుకలిగియు లేకయు వ_ర్తించుచుండును. తమస్సతిశయించియుండు తిర్యగ్గాతులందు రజస్స ల్పముగను, స_త్త్వ మల్పతరముగనుండు. రజస్సతిశయించి యుండు మధ్యగతులందుఁ దమస్సల్పముగను, స_త్త్వ మల్పతరముగనుండు, స_త్త్వ మతిశయించియుండు నూర్ధ్వగతులందుఁ దమస్సల్పముగ రజస్స ల్పతరముగనుండును. ఇంద్రియవికారములకు స_త్త్వమే జన్మభూమి. అది ధ్యే ప్రకాశకరమైనది. స_త్త్వమునకంటె నుత్తమమైనది లేదు. స_త్త్వమందుండు వారూర్ధ్వలోక గతులగుదురు. రజస్సులు మధ్యమున నుందురు. జఘన్యగుణ యుక్తులైన తామసు లధోగతులగుదురు. శూద్రులందుఁ దమస్సు, క్షత్రియులయందు రజస్సు, బ్రాహ్మణులందు స_త్త్వము విశేషించి యుండును. స్థూలదృష్టిచేఁజూచినను నందఱ యందన్నియు సంఘముగ వ_ర్తించుట తెలియనగు. ఇవి యొండొంటిఁ గలయక వేఱుగనుండుట విని యెఱుఁగము. సూర్యోదయము కుత్సితచోరులకు భయావహము. పాంథులు మధ్యాహ్నమున నెండ వేఁడిమిఁ దపింతురు. సూర్యుఁడు స_త్త్వగుణ ప్రధానుఁడు. కుత్సిత చోరులు తమోగుణ ప్రధానులు. పాంథులఁ దపింపఁజేయు వేఁడిమి రజస్సు. ప్రకాశించు సూర్యరశ్మి స_త్త్వగుణము. సంతాపము రజోగుణము. పర్వములందలి గ్రహణములు తమోగుణము. ఈ విధముగ జ్యోతిర్మార్గములందు గుణత్రయ పర్యాయంబుగ నాయాఁ విధముల వ_ర్తించు స్థావరములందు గుణత్రయ పర్యాయంబుగ నాయావిధముల వ_ర్తించు స్థావరములందుఁ దమస్సు లతిశయించు చుండు. రజోగుణబలంబున వానియందు మార్పులు కలుగును. వానియందలి స్నేహభావము స_త్త్వగుణము. ఇట్టులే పగలు మూఁడు విధములు రాత్రులు మూఁడువిధములు. మాసములు పక్షములు, సంవత్సరములు ఋతువులు సంధులు మూఁడువిధములు. దానము యజ్ఞము లోకము దేవతలు విద్యలు మూఁడువిధములు. భూత

భవిష్యద్వర్తమానములు ధర్మార్థ కామములు, ప్రాణాపానోదాన ములు మూఁడువిధముల నట్లట్ల పర్యాయంబుగఁ బ్రవర్తిల్లు. ఈ మూఁడుగుణములు నవ్యక్తములై నిత్యములై యుండు. గుణత్రయ సృష్టి సనాతనము. ఈ మూఁడు గుణములుగల యవ్యక్తము చీఁకటై తెలియరానిదై శివమై నిత్యమై జన్మస్థానమై సనాతనమై ప్రకృతియై వికారమై ప్రలయమై ప్రధానమై ప్రభవమై యనుద్రికమై యనూనమై ధ్రువమై సత్తై యసత్తైయుండు. అధ్యాత్మ చింతచేయు వారీ పేర్ల న్నియు నెఱుఁగఁదగు. అవ్యక్తనామములు గుణములు వానిగతులు నెవ్వఁడు యథార్థముగ నెఱుఁగునో వాఁడు ముక్తదేహుఁడై సర్వగుణ వర్జితుఁడై నిరామయ సుఖమునొందును.

అవ్యక్తమునుండి దొలుత మహామతియగు మహాత్ముఁడుత్పన్ను డయ్యెను, సర్వగుణము లీయనయందుండి ప్రభవించెను. ఇదియే సృష్టియందు మొదటిది. మహాత్మ, మతి, విష్ణువు, జిష్ణువు, శంభువు, వీర్యవంతుఁడు, బుద్ధి, ప్రజ్ఞ, యుపలబ్ధి, ఖ్యాతి, ధృతి, స్మృతి, యివి మహాత్మకుఁ బర్యాయ నామములు. ఆయన నెఱిఁగి బ్రాహ్మణులు మోహముపాలఁబడరు. ఆయనకు సర్వత్ర కాలు సేతులు కన్నులు శిరస్సులు ముఖములు వీనులుగలవు. ఆయన సర్వవ్యాపి మహాప్రభా వముగల పురుషుఁడై యందఱ హృదయములందుండును. అణిమ, లఘిమ, ప్రాప్తి, యీయనకు సంబంధించినవి. ఆయనయే సర్వ ప్రపంచమున కీశ్వరుఁడు; జ్యోతిస్సు, అవ్యయుఁడు, బుద్ధిమంతులు, సద్భావనిరతులు, ధ్యాననిష్ఠులు, యోగనిత్యులు, సత్యసంధులు, జితేంద్రియులు, జ్ఞానులు, నలుబ్ధులు, జితకోపులు, ప్రసన్న మన స్కులు, ధీరులు, నిర్మములు, నిరహంకారులు, నాయనయందే యుం దురు. వీరందఱు సంగముక్తులై మహత్త్వమునొంది యుత్తమపుణ్యా గతులు ప్రాపింతురు. అట్టివారు సర్వలోకములందును మోహము పాలుగారు. సృష్టియందు విష్ణువే ప్రథముఁడు. ఆ ప్రభువు తనంతఁ దానే కలిగెడివాఁడు. ఇట్లు హృదయ గుహయం దుండువాఁడును లోక ప్రభువును, గుణములకుఁ బరుడైనవాఁడును, బురాణపురుషుఁ

మును, విశ్వరూపుఁడును, హిరణ్మయుఁడును, బుద్ధిమంతులకుఁ బరమ గతియునగు విష్ణువు నెఱుంగు మతిమంతుఁడు బుద్ధిని దాఁటువాఁ డగును. తొలుత బుట్టిన మహత్తున కహంకారమని పేరు. 'నేను' అనునదియే రెండవ సృష్టి. అహంకారమునుండి భూతములు కలిగెను. దాని వికారములే యవి యందురు. అది తేజస్సు, చేతన, ధాతువు ప్రజాసర్గము. అదియే ప్రజాపతి. అదియె దేవత. అదియే దేవతలయు మనస్సునుత్పత్తిని గలిగించునది. మూఁడులోకముల సృష్టించునది. అదియే "యిదంతయు నేను" నను నభిమానముగలది. అధ్యాత్మ జ్ఞానతృప్తులకును, మునులకు, నాత్మధ్యాన నిష్ఠులకును, స్వాధ్యాయవ్రత సిద్ధులకును, నదేలోకము. అదిసనాతనము. భూతాదియు భూత కారకుఁడనగు నతఁడే భూతములనెల్ల నిట్లు సృజించును. ఇవన్నియు నాయన వికారములే. ఆయన వలననే యివన్నియుఁ గదలుచున్నవి. స్వతేజస్సుచే లోకమును వెలిఁగించును.

అహంకారమునుండి భూమి వాయు తేజస్సు జల మాకాశ మనెడి పంచభూతము లుత్పన్నములయ్యెను. వాని గుణములైన శబ్ద స్పర్శన రూపరస గంధక్రియలవలన జంతువులు మోహపడుచున్నవి. మహాభూతప్రలయము సమీపించినపుడు సర్వప్రాణులకు మిక్కిలి భయము పొడమును. దేనినుండి యేది సంభవించునో దాని యందది మరల లీనమగుచున్నది. అనులోమముగ నుత్తరోత్తరముగ జనించిన వన్నియుఁ బ్రతిలోమముగ లీనమగును. స్థావరజంగమము లిట్లు లీనమగు కాలంబున స్మృతిమంతులగు జ్ఞానులు లీనులుగారు. శబ్ద స్పర్శ రూపరస గంధములైదును గరణయుక్తములైన క్రియలునవిత్యములు. మోహమను పేరుగలవి లోభముచే జనించి విశేష భేదము లేకనిత్యముగాక రక్తమాంస సాంగత్యముకలవై యన్యోన్యోపజీవులై యాత్మకు వెలియై దీనములై శక్తిహీనములై యుండును. ప్రాణాపాన వ్యానోదాన సమానములను నైదు వాయువులు నంతరాత్మ సంబంధములు. అవి వాఙ్మనోబుద్ధులతోఁ గలసి యష్టాత్మక మగుచున్నది. త్వగ్ఘ్రాణశ్రోత్ర చక్షూరసనావాక్కు లెవనికి వశపడియుండునో యెవని

మనస్సు శుద్ధమో, బుద్ధి ఋజుమార్గమునుండి వ్యభిచరింపదో, యీ యనిమిది యగ్నులచే నెవని యహంకారము దహింపఁబడదో యట్టి వాఁ డుత్తమమైన బ్రహ్మమును బొందును. ఇంద్రియములు పదు నొకొండు నహంకారసంభవములు. శ్రోత్రము త్వక్కు చక్షుస్సు జిహ్వ నాసిక పాదములు పాయూపస్థములు హస్తములు వాక్కనునవి యింద్రియములు. ఈపది మనస్సుతోఁగలసి పదునొకొండగుచున్నవి. ఈ పదునొకొంటిని జయించిన పిమ్మట నాత్మ ప్రకాశించును. ఇందైదు జ్ఞానేంద్రియములు. ఐదు కర్మేంద్రియములు: శ్రోత్రాదులు జ్ఞానేం ద్రియములు. పాదాదులు కర్మేంద్రియములు. మనస్సు రెంటను జేరుచున్నది. బుద్ధి పండ్రెండవ యింద్రియము. ఇది యేకాదశేంద్రి యముల వరుస. ఇవి తెలిసిన బుద్ధిమంతులు సర్వము కృతమనియే తలంతురు. భూతములకు జన్మస్థానములు భూమి జలాకాశములు మూఁడే కాని నాల్గవది లేదు. అండజములు, నుద్భిజ్జములు, స్వేదజ ములు, జరాయుజములని జన్మములు నాలుగు విధములు. ఖేచరములు కొన్ని గలవు. అవియు సరీసృపము లండజములని యెఱుఁగవలయు. చెమటలోఁ బుట్టు కృములులోనైనవి స్వేదజములు. ఇది రెండవజన్మ క్రమము. ఇది జఘన్యము. కాలక్రమమున భూమిని బెకలించుకొని వచ్చునవి యుద్భిజ్జములు. రెండు పాదములు పెక్కు పాదములు తిర్యగ్గమనము గలవియు జరాయుజములు. వీనిలోఁ గొన్ని వికారా కారములు గలవియుఁ గలవు. సనాతనంబైన బ్రహ్మయోని ద్వివిధము. తపము పుణ్యకర్మము నని విద్వాంసులు తలంతురు. యజ్ఞము, యజ్ఞవేళ దానము, వేదాధ్యయనము, ననునివి పుణ్యకార్యములు. కర్మము బహువిధములని వృద్ధానుశాసనము. ఇదంతయు నెఱిఁగిన వారు పాపముక్తు లగుదురు. ఇఁక నింద్రియముల వివరించెద.

## ——♦ భూతేంద్రియముల కధ్యాత్మాది నిరూపణము. ♦——

ఆకాశము ప్రథమ భూతము. అధ్యాత్మము చెవి, అధి భూతము (విషయము) శబ్దము, అధిదైవతము (అధిష్ఠాన దేవత) దిక్కులు. రెండవది వాయువు: అధ్యాత్మము త్వక్కు. అధిభూతము

స్పృశింపువిషయము. అధిదైవతము విద్యుత్తు. మూఁడవది జ్యోతి. అధ్యాత్మము చక్షువు. అధిభూతము రూపము. అధిదైవము సూర్యుఁడు. నాలుగవది జలము. అధ్యాత్మము జిహ్వ, అధిభూతము రసము, అధిదైవతము సోముఁడు. ఐదవది పృథివి. అధ్యాత్మము ఘ్రాణము, అధిభూతము గంధము, అధిభూతము వాయువు. ఈ విధముగఁ బంచభూతములు నాలుగు తెగలయ్యె. ఇఁకఁ దక్కిన యింద్రియముల గుఱించివివరించెద. అధ్యాత్మము పాదములు. అధిభూతము గమనము. అధిదైవతమువిష్ణువు. అధోగమనముగల యపానమునకు నధ్యాత్మము పాయువు. అధిభూతము మలము, అధిదైవము మిత్రుఁడు. సర్వభూతములకు జన్మకారణమైన యుపస్థ మధ్యాత్మము, శుక్ర మధిభూతము. దైవతము ప్రజాపతి. అధ్యాత్మము హస్తములు, అధిభూతము కర్మములు, అధిదైవము శక్రుఁడు. మనఃపూర్వకమై సర్వదేవతాసంబంధముగల వాక్కధ్యాత్మము. అధిభూతము మాట. అధిదైవతము వహ్ని. అధ్యాత్మము మనస్సు. ఇది పంచభూతములందు సంచారముగలది. అధిభూతము సంకల్పము. అధిదైవతము చంద్రుఁడు. అధ్యాత్మ మహంకారము. ఇదియే సర్వసంసారకారణము అధిభూత మభిమానము. అధిదైవతము రుద్రుఁడు. అధ్యాత్మము. బుద్ధి. ఇది యాఱింద్రియముల జరుపును. అధిభూతము తెలియఁదగినది. అధిదైవత మహస్సు. ఈ జ్ఞానముగలవారు జ్ఞానులనఁబడుదురు.

ఇంద్రియము లింద్రియార్థములు పంచమహాభూతము లివి యన్నియు మనస్సుచే ధరింపఁబడవలయును. ఇవన్నియు మనస్సంభవములు. కావునఁ దద్భిన్నములు కానేరవు. సర్వము మనస్సునందు క్షీణింపఁ జేయుటే జన్మసుఖము. జ్ఞానసంపన్ను లదియే యుత్తమమని భావింతురు.

సూక్ష్మభావకరము శుభమునగు నివృత్తిమార్గమును మృదుపు[illegible] దారుణముగను నిఁక వివరించెద. గుణములు గుణములు కావని తలంచుట, సంగరాహిత్యము, నైకాంత[illegible] బ్రహ్మచింతనము,

వీనినే సుఖమందురు. ఇది మార్గ మొక్కటియేకాని పెక్కులు లేవు. తాఁబేలు తన యంగములను దనలోనికి ముడుఁచుకొనునట్లు కామము నుల్లములోనణంచుకొని సర్వసంగములు వదలుకొనినవాఁడు సుఖపురుషుఁడు. కామములెల్ల మనస్సులోనణఁచి తృష్ణారహితుఁడై, ధ్యానయుక్తుండై, సర్వభూతములకు సుహృత్తు మిత్రుఁడు నగువాఁడు బ్రహ్మభూతుఁడగును. విషయములందుఁ గోరికల యింద్రియముల నిరోధించి గ్రామములు వదలి మననశీలుఁడగువాఁ డధ్యాత్మాగ్నిని బ్రజ్వలింపఁజేయును. కట్టెలు వేయుచుండ నగ్ని వెలుఁగునట్టు లింద్రియ నిరోధముచే నాత్మ ప్రకాశించును. ప్రసన్నాత్ముఁడై యెవఁడు సర్వభూతములు తన హృదయమందున్నట్లు భావించునో యప్పుడు స్వప్రకాశముచే సూక్ష్మమునకంటె నతి సూక్ష్మమయి యుత్తమమగు దానిఁ బురుషుఁడు ప్రాపించును. ఈ దేహమునకు నగ్నిరూపము. జలము రక్తాది ద్రవ్యప్రవాహము. వాయువు స్పర్శనము. భూమి గంధము ధరించునది, ఆకాశము శబ్దము, దృష్టి సూర్యుఁడు గాఁ గలది యనియు, నధ్యాత్మవిదులు చెప్పుదురు. రోగశోక సమావిష్టమనియుఁ, బంచస్రోతస్సులఁ గూడినదనియుఁ, బంచభూత యుక్తమనియు, నవద్వారములు గలదనియు, జీవాత్మ పరమాత్మలను దైవత యుగ్మంబు గలదనియు, రజోయుక్తమనియు, నపవిత్రమగుటచేఁ జూడ యోగ్యముగానిదనియు, వాతపిత్తశ్లేష్మము లను త్రిగుణములు నేడు ధాతువులుగలదనియు, నన్నిటియందు నాసక్తికలదనియు మోహయుక్తమనియు నీ శరీరమును జెప్పుదురు. ఇది జీవలోకంబున దుశ్చరము. బుద్ధియే యాధారముగాఁగలది. మోక్షము దుస్సాధ్యమగుట వలన నీ దేహము జనన మరణ చక్రంబునఁదగిలి సదా భ్రమించుచుండును. కావున దేహమే కాలచక్రము. ఈ దేహము భయంకరమై యగాధమై మోహమను పేరిటిసముద్రము ఇదియె సర్వజగమును సృజించును. సంకుచితమును జేయును. మోహింపఁజేయును. నిద్రింపఁ జేయును. ఇంద్రియ నిరోధంబున దుస్త్యజంబులైన కామ క్రోధ భయ లోభ ద్రోహానృతంబులను నరుఁడు విడువ:

శక్తుఁడగును. త్రిగుణములను బంచధాతువులను గెలిచినవాఁడు దివంబున నంతములేని యుత్తమస్థానము నొందును. పంచేంద్రియములను నొడ్డులు, భయావహమైన ప్రవాహము, మోహమనెడి మడుఁగులుగల నదిని దాఁటువాఁడు కామక్రోధముల జయించును. అట్టివాఁడు సర్వదోష విముక్తుఁడై మనస్సు మనస్సుననుంచి తనయందలి యాత్మను గనుఁగొనును. అంతియగాక యప్పుడప్పు డొక్కటిగాను పెక్కులుగాను మాఱుచుండు సర్వ భూతములందలి యాత్మను దన యాత్మతోఁ జూచుచున్నాఁడు. ఒక దీపముచే నూఱు దీపములను జూడఁ గలిగినట్లు తన యాత్మను దెలిసినవాఁ డన్నిరూపములఁ జూడఁ గలుగును. అతఁడే విష్ణువు మిత్రుఁడు వరుణుఁడు ప్రజాపతి యగ్ని. అతఁడె ధాత విధాత ప్రభువు సర్వతోముఖుఁడు. అతనియందు సర్వభూతహృదయుఁడైన మహాత్మ ప్రకాశించును. అతనినే విప్రులు సురాసురులు యక్షపిశాచపితృ గరుడరాక్షసులు భూతగణములు మహర్షులు సదా స్తోత్రము చేయుచుందురు.

## ఉత్తమపదార్థ నిరూపణము.

మనుష్యులలో క్షత్రియులు రజోగుణ ప్రధానులు. అట్లులే వాహనములలో నేనుఁగులయందును, నరణ్యవాసులలో సింహమునందును, బశువులలో మేకలయందును, బిలవాసులలో సర్పములందును, గోవులలో వృషభములందును, స్త్రీలలోఁ బురుషులయందును, రజోగుణము ప్రధానము. మఱ్ఱి, నిమ్మ, రావి, బూరుగు, శింశుపము, మేషశృంగము, కీచక మను వెదుళ్లు వృక్షరాజములు. హిమవంతము, సహ్యము, పారియాత్రము, వింధ్యము, త్రికూటము, శ్వేతము, నీలము, భాసము, కాష్ఠవంతము, భృశస్కంధము, మహేంద్రము, మాల్యవంత మనునవి పర్వతరాజములు. గణములలో మరుద్గణము శ్రేష్ఠము. గ్రహములకు సూర్యుఁ డధిపుఁడు. నక్షత్రములకుఁ జంద్రుఁడు, పితరులకు యముఁడు, నదులకు సముద్రుఁడు. జలములకు వరుణుఁడు, మరుత్తుల కింద్రుఁడు, వేఁడిమ్ములకు నర్కుఁడు,

వెలుఁగులకుఁ జంద్రుఁడు, భూతముల కగ్ని, బ్రాహ్మణులకు బృహస్పతి, యోషధులకు సోముఁడు, బలవంతులకు విష్ణువు, రూపములకుఁ ద్వష్ట, పశువులకు శివుఁడు, యజ్ఞములకు దక్షిణ, వేదములకు ఋగ్వేదము, దిక్కులకు నుత్తరము, విప్రులకు సోముఁడు, సర్వరత్నములకుఁ గుబేరుఁడు, దేవతలకుఁ బురందరుఁడుఁ బ్రభువు. పరిజలయందుఁ బ్రజాపతి శ్రేష్ఠుఁడు. సర్వభూతములందును బ్రహ్మమయుఁడనగు నేను గొప్పవాఁడను. సమస్తమునకు స్వయంభూతుఁడైన మహావిష్ణువు రాజాధిరాజు. అతఁడే యన్నిటికి నీశ్వరుఁడు. అతఁడే విభుఁడు. అతఁడే ప్రజాపతి నర కిన్నర యక్ష రక్షో గంధర్వోరగ దేవ దానవ నాగాది సర్వమునకు నావిష్ణువే యధిపతి. కాముకలగు స్త్రీలను సరించువారిలోఁ బార్వతియగు మహేశ్వరి యధికురాలు. స్త్రీలయందును శ్రేష్ఠురాలు. ప్రీతి సుఖకారిణులగు స్త్రీలయందుఁ దేజోవతులైన యప్సరసలు శ్రేష్ఠురాండ్రు. రాజులు ధర్మకాములు. బ్రాహ్మణులు ధర్మసేతువులు. కావున రాజులు బ్రాహ్మణరక్షణము ప్రయత్నంబునఁ గావింపవలయును. ఎవని రాజ్యమున సాధువులు దుఃఖింతురో సర్వగుణహీనుఁడై యతఁ డధోమార్గగామియగు. ఎవని రాజ్యమున సాధువులు సురక్షితులో వాఁడు నాలోకమున నానంద మనుభవించు.

## —♦ పదార్థధర్మలక్షణ నిరూపణము. ♦—

ఇఁక నియతధర్మలక్షణముఁ దెలిపెదను. అహింసయే ధర్మలక్షణము. హింసయే యధర్మలక్షణము. దేవతలు ప్రకాశలక్షణులు, మనుష్యులు కర్మలక్షణులు. ఆకాశ లక్షణము శబ్దము. వాయు లక్షణము స్పర్శము. జ్యోతిస్సు లక్షణము రూపము. జల లక్షణము రసము. సర్వభూతధారిణి భూమిలక్షణము గంధము. అచ్చులని హల్లులని సంస్కారముపొందిన వాక్కులక్షణము శబ్దము. మనస్సు లక్షణము చింత. మనస్సు చింతించిన విషయములను బుద్ధివ్యవసాయములచే దృఢీకరించుచున్నది. వ్యవసాయముచే బుద్ధి సర్వము తెలిసికొనుచున్నది. సందేహములేదు. మనోలక్షణము ధ్యానము.

తాము చేయునది ప్రకటించుకొనకుండుట సాధులక్షణము. యోగ లక్షణము, కార్యములందుఁ బ్రవృత్తి. సన్న్యాసిలక్షణము జ్ఞానము. కావున జ్ఞానమును సంపాదించిన వెనుకనే బుద్ధిమంతుఁడు సన్న్యసింప వలయు. జ్ఞానయుక్తుఁడైన సన్న్యాసి పరమగతినొందును. ద్వంద్వాతీతుఁడై తమోమృత్యు జరాదుల దాఁటును. ఇఁక గుణగ్రహణమును వివరించెద. భూమిగుణమైన గంధము నాసికచే గ్రహింపఁబడును. ఘ్రాణస్థమైన వాయువు గంధజ్ఞానమున విధింపఁబడినది. జలగుణమైన రసము నాలుకచే గ్రహింపఁబడును. జిహ్వయందుండు సోముఁడు రసజ్ఞానమున విధింపఁబడెను. తేజస్సు గుణమైన రూపమును నేత్రములు గ్రహించును. చక్షుస్సునందుండు నాదిత్యుఁడు రూపజ్ఞానమున విధింపఁబడెను. వాయుగుణమైన స్పర్శమును ద్వక్కు గ్రహించును. త్వక్కునందుండు వాయువు స్పర్శమును గ్రహించుటయందు విధింపఁబడెను. ఆకాశగుణమైన ఘోషమును జెవులు గ్రహించును. చెవులయందుండు దిక్కులు శబ్దమును దెలిసికొనును. మనోగుణమైన చింత ప్రజ్ఞచే గ్రహింపఁబడును. బుద్ధి యధ్యవసాయముచేతను, మహత్తు ధ్యానముచేతను గ్రహింపఁబడును. అవ్యక్తమైన ప్రకృతి నిశ్చయించుటచే సర్వము గ్రహించును. తాను దెలివియుఁ బదార్థములు పరస్పర భిన్నము లను తెలివియుఁ బ్రకృతి గ్రహించుచున్నది. "నే నిట్టివాఁడను, అది యట్టిది" యను జ్ఞానము ప్రకృతి వలనఁ గలిగినదని గ్రహింపవలయును. నిత్యుఁడు నిర్గుణాత్మకుఁడునైన క్షేత్రజ్ఞునిఁ దెలిసికొన లక్షణములు లేవు. కావునఁ జిహ్నరహితుఁడైన క్షేత్రజ్ఞుఁడు కేవల జ్ఞానలక్షణుఁడు. క్షేత్రజ్ఞుఁడు గుణ కారణమైన శరీరమునందు వసించును. అది కానరాకయుండినను నేను జూచుచున్నాను. వినుచున్నాను. తెలిసికొనుచున్నాను. దానిని బురుషుఁడు తెలిసికొనును గావుననే క్షేత్రజ్ఞుఁడని చెప్పఁబడును. గుణముల వ్యాపారములను క్షేత్రజ్ఞుఁడు చక్కఁగా జూచుచున్నాఁడు. పలుమాఱు సృజింపఁబడుచున్న యచేతనములగుటచేఁ దాము సృజింపఁబడుచున్నామని తమతమ నాదిమధ్యాంతము లున్నవని గుణములు దెలిసికోఁజాల

కున్నవి. గుణములకు గుణమువలనఁ గలిగిన వానిని క్షేత్రజ్ఞుఁడు మాత్రమే దాఁటి పరమై గొప్పదియగు దానిని బొందగలఁడు. ఇతరమునకు దేనికి నదిశక్యముగాదు. కావునఁ దత్త్వమెఱింగినవాఁడు గుణములను బుద్ధిని వదలి క్షీణదోషుఁడై గుణములను దాఁటి క్షేత్రజ్ఞునిఁ బ్రవేశించుచున్నాఁడు. నిర్ద్వంద్వుఁడు, నొకరికి నమస్కరింపనివాఁడు, స్వధాకారహితుఁడు, నచలుఁడు, ననికేతుఁడు నగు క్షేత్రజ్ఞుఁ డన్నిటికంటెఁ బరుఁడును విభియు.

ఇఁక నాదిమధ్యాంతములు గలిగిన రూపనామములు గలవానిని వివరించెదను. మొదటిది పగలు, ఆవల రాత్రి; మాసములు శుక్లాదులు: నక్షత్రములు శ్రవణాదులు: ఋతువులు శిశిరాదులు. గంధములందు భూమి యాది. రసములందు జలము. రూపములం దగ్ని, స్పర్శములందు వాయువు, శబ్దమునకు నాకాశము మొదలని యెఱుంగవలయు. భూతములందు మొదటివానిని దెలిపెదను. ప్రకాశించువానియందు సూర్యుఁడు, భూతములం దగ్ని, సర్వవిద్యలయందు సావిత్రి, దేవతలయందుఁ బ్రజాపతి, సర్వవేదములం దోంకారము, వాయువులందుఁ బ్రాణవాయు వాదియని యెఱుంగవలయు. ఛందస్సులందు గాయత్రి, నలుగాల జీవములం దావు, మనుష్యులందు బ్రాహ్మణులు, పక్షులందు డేగ, యజ్ఞములందు హుతము, ప్రాఁకులాడువానియందు సర్పములు, యుగములందుఁ గృతయుగము, రత్నములందు బంగారు, ఓషధులయందు యవలు, భక్ష్య భోజ్యములం దన్నము, త్రావనుపయోగించు ద్రవపదార్థములందు జలము, స్థావరములందు బ్రహ్మక్షేత్రమైన ప్లక్షము. ప్రజాపతులయందు నేను నుత్తములని గ్రహింపవలయు. నాకంటె నుత్తముఁడు స్వాయంభువు నచింత్యాత్ముఁడునైన విష్ణువు. పర్వతములందు మహామేరువు మొదటిది. దిక్కులందు విదిక్కులందుఁ దూర్పు మొదటిది. నదులందుఁ ద్రిపథయగు గంగ మొదటిది. సరస్సులందు సముద్రము మొదటిది. దేవదానవ పిశాచోరగ రక్షో నర కిన్నర యక్షులకు నీశ్వరుఁడు ప్రభువు. సర్వప్రపంచమునకు బ్రహ్మమయుఁడు విష్ణువు మొదటివాఁడు,

త్రిలోకముల నాయనకంటె శ్రేష్ఠమైన దేదియు లేదు. ఆశ్రమము లందు గార్హస్థ్యము శ్రేష్ఠము, లోకమున కాది యవ్యక్తము, అంతము నదియే. దినము లస్తమయాంతములు. రాత్రు లుద యాంతములు. సుఖాంతము దుఃఖము దుఃఖాంతము సుఖము. సంచిత ధనములు క్షయాంతములు. పెరిగినవానికి విఱుగుట యంతము. సంయోగములు వియోగాంతములు. జీవితము మరణాంతము. కృతములన్నియు వినాశాంతములు. పుట్టువు మరణాంతము. ఈ లోక మున స్థావర జంగమములన్నియు నశాశ్వతములు. ఇష్టము దత్తము తపస్స్వాధ్యాయనము నియమములు వ్రతములు నివియన్నియు వినాశాం తములు. జ్ఞానము మాత్ర మంతములేనిది కావున జ్ఞానముచేత శుద్ధుడై శాంతాత్ముఁడు జితేంద్రియుఁడునై యహంకార మమకార ములు వదలిన వాఁడు ముక్తుడగును.

ఇఁక సంసారచక్రము ప్రవర్తించువిధము వినుము. దానికి బల ము బుద్ధి. స్తంభము మనస్సు. బంధన మింద్రియసమూహము. నాభి పంచమహాభూతములు. చుట్టువలయము గృహము. జరాశోక సమావిష్టము. వ్యాధివ్యసనములు సంతానము. అది దేశకాల సంచారము గలది. శ్రమవ్యాయామములు దాని ధ్వని. అహో రాత్రములు దాని తిరుగుటలు. శీతోష్ణములచేఁ జుట్టఁబడియున్నది. సుఖదుఃఖము లతుకుసంధులు. క్షుత్పిపాసలు మేకులు. ఛాయాఽతప ములు చక్రమార్గములు. అది తెప్పపాటులోఁ గలవరపఱుచును. శోకమోహ జలాకీర్ణము. అది యెప్పుడు తిరుగుచుండును. అచేత నము. మాసములపక్షములచే గుణింపఁబడును. దానికి సమత్వము లేదు. అన్నిలోకముల సంచరించుచునే యుండును. తమస్సు బురద. దానిని ద్రిప్పునది రజోవేగము. అహంకారముచే దీప్తము. గుణస మూహ మండలము గలది. ఆశాభంగమువలన నగు నప్రీతియే బిగు వులు. శోకసంహారముల నడుమ నది తిరుగుచుండును. అది క్రియా కారణ యుక్తము. అది నిడుపై రాగముచే విస్తరించుచుండును. ఇచ్ఛాలోభముచే నిలుకడలేక యుండును. అది యజ్ఞానజనితము,

దాని పరివారములు భయమోహములు. దాని కార్యము ప్రాణుల మోహింపఁజేయుట. ఆనందప్రీతుల వంకకై గమనించును. కామ క్రోధములు దాని స్వాధీనపదార్థములు. మహత్తాదిగ భూతము లంతి ముగాఁగలది. అది యవ్యక్తము. సృష్టి లయములు దాని చిహ్న ములు. మనోవేగము గలది. నిలుపు లేనిది. ద్వంద్వయుక్తమై యచే తనమైన యీ సంసారచక్రమును వదలవలయును. సంక్షేపింపవల యును. ఈ కాలచక్రప్రవృత్తి నివృత్తులు యథార్థముగఁ దెలిసి కొనువాఁడు మోహవశుఁడు కాఁడు. అట్టివాఁడు క్లేశవిముక్తుఁడై ద్వంద్వాతీతుఁడై ముక్తుఁడై సర్వపాపచ్యుతుఁడై పరగతిని బ్రాపించును.

## —♦ గృహస్థ ధర్మములు. ♦—

బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము నని యాశ్రమములు నాలుగు. గార్హస్థ్య మన్నిటికి మూలము. ఈ యా శ్రమములకు విధింపఁబడిన విధుల ననుసరించి పారముముట్ట వర్తిం చుట శ్రేయస్కరము. కీర్తికరము. సంస్కారముచేఁ బరిశుద్ధుఁడై యథావిధి వ్రతములాచరించి గుణవిశిష్టమైన వంశమున జనించి వేదాధ్యయనముఁ గావించి గురువునాజ్ఞగొని తనయింటికి మరలి పోవలయు. స్వదార నిరతుఁడై శిష్టాచారమున నిలిచి, జితేంద్రి యుఁడై పంచమహాయజ్ఞములు శ్రద్ధావంతుఁడై కావింపవలయు. దేవతలకు నతిథులకుఁ బెట్టఁగా మిగిలినది భుజింపవలయు. వేదోక్త కర్మము లాచరింపవలయు. యథాశక్తి యథావిధి యజ్ఞము లొనరింప వలయు. పాణిపాద చపలుఁడు నేత్రచపలుఁడు కారాదు. మనన శీలుఁడై యుండవలయు. వాక్చాపల్య మంగచాపల్యము లేకుండ వలయు. ఇట్టివాఁడు శిష్టుఁడు. యజ్ఞోపవీత మెల్లవేళ ధరింపవలయు. తెల్లని వస్త్రములు కట్టవలయు. శుచివ్రతుఁడై యుండవలయు. యమదానంబులందు నియతిగలిగి శిష్టసహవాసము గావింపవలయు. సన్న్యాసి వెదురుకఱ్ఱను నీటిచే నిండిన కమండలువును ధరింప వలయు ఆచమనీయార్థము పాదధావననిమిత్తము శౌచవిధానార్థముగ

సజలకమండలువు ధరింపవలయు. అధ్యయన మధ్యాపనము యజనము యాజనము దానము ప్రతిగ్రహము నను నీ యాఱువృత్తులు గృహస్థుఁ డాచరింపవలయును. ఇం దధ్యాపనము యాజనము పరిశుద్ధాత్ముల నుండి ప్రతిగ్రహము బ్రాహ్మజీవిక కృత్యములు. తక్కిన మూఁడు వేదాధ్యయనము యజ్ఞాచరణము దానము మూఁడు వర్ణములవారి ధర్మకార్యము. ధర్మజ్ఞుఁ డీమూఁటియందుఁ బ్రమాదపడరాదు. శుచియు మననశీలుఁడునై దాంతి మైత్రి క్షమసర్వభూతసమత్వము యథాశక్తి నాచరించు గృహస్థుఁడు బ్రాహ్మణుఁడు స్వర్గమును జయించును.

## —♦ బ్రహ్మచారి ధర్మములు. ♦—

పూర్వోక్తరీతిని యథావిధి యథాశక్తి వేదాధ్యయనంబుఁ గావించి బ్రహ్మచారి బ్రహ్మచర్యవ్రతుఁడై స్వధర్మనిరతుఁడై సర్వేంద్రియముల నియమించి మననశీలుఁడై సత్యధర్మపరుఁడు శుచియునై గురుహితప్రియం బాచరించుచు గురువునాజ్ఞగాని యన్నమును నిందింపక భుజింపవలయు. భైక్ష్యంబును హవిష్యంబు గావించి భుజింపవలయు. విధియుక్తముగ నిలువవలయును, కూర్చుండవలయును, విహరింపవలయును. శుచియు సమాహితుఁడునై ద్వికాలముల నగ్నిని వేల్వవలయు. బిల్వదండముగాని పాలాశదండముగాని ధరింపవలయును. తెల్లని నారచీరగాని దూదివస్త్రముగాని మృగాజినముగాని సర్వము కాషాయముగఁగాని యెఱ్ఱగఁగానియుండు వస్త్రమును ధరింపవలయు. మౌంజి మొలత్రాడుగఁ గట్టవలయు. జడలు ధరింపవలయు. ప్రతిదినము స్నానము చేయవలయు. ఎల్లవేళల యజ్ఞోపవీతము ధరింపవలయు. వేదాధ్యయనము గావింపవలయు. వ్రతముల లోపింపరాదు. నిర్మల జలముల దేవతర్పణమును నియతభావముతోఁ గావింపవలయు. ఈ విధము వర్తించు బ్రహ్మచారి శ్లాఘ్యుఁడై యూర్ధ్వరేతస్కుఁడై స్వర్గమును జయించును. వాఁడుత్తమపదంబుఁ బ్రాపించి మరల జన్మింపఁడు.

## —♦ వానప్రస్థ ధర్మము.* ♦—

సర్వసంస్కారములు నొందినవాఁడు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించిన పదపడి గ్రామము విడిచి యరణ్యమునకుఁ బోయిమునియై సంగరహితుఁడై వానప్రస్థుఁడుగ నుండవలయు. కృష్ణాజిన మొండె నారచీర యొండెఁ గట్టి సాయం ప్రాతఃకాలముల స్నానమాచరించుచు నరణ్యచారియై గ్రామమును మరలఁ జొరరాదు. సకాలమున వచ్చిన యతిథుల నర్చించి తాను ఫలములో యాకులో చామలో నాహారముగఁ గొనుచుండవలయు. దీక్షననుసరించి వరుసగ వీనిని నడవియందుఁ బుట్టిన నీటినొండె గాలినొండె నాహారముగఁ జేసికొనవలయు. వచ్చిన యతిథిని ఫలముల శాకాదుల నర్చింపవలయు. అంతియగాక జాగరూకుఁడై తనయొద్దనున్న యితరాహార మేదైన నీయవలయు. దేవతలకు నతిథులకు నివేదించి శేషమును మానము వహించి భుజింపవలయు. మనసున నసూయాదుల కెడమీయరాదు. అల్పముగ భుజింపవలయు. భగవంతుని మాత్రమే యాశ్రయించి యుండవలయు. దాంతి మైత్రి క్షమ గలవాఁడై యుండవలయు. గడ్డము మీసము పెంపవలయు. క్షౌరము కారాదు. సత్యధర్మపరాయణుండై వేదాధ్యయన హోమములు గావింపవలయు. దేహము శుద్ధముగనుంచుకొని నేర్పరియై సర్వదా యడవియందే యుండి యేకాగ్రచిత్తుఁడై యింద్రియనిగ్రహము గలవాఁడై వానప్రస్థుఁడు స్వర్గమునుజయించును. మోక్షకాంక్షగల బ్రహ్మచారిగాని గృహస్థుగాని వానప్రస్థుఁడుగాని వానికి వానికి నియమితములైన వృత్తులఁ జరింపవలయు.

## —♦ సన్న్యాసి ధర్మము. ♦—

సన్న్యాసి సర్వభూతముల కభయం బొసంగవలయు. నిష్కర్ముఁడై యుండవలయు. సర్వభూత హితము, మైత్రి, సర్వేంద్రియ నియతి, మనసముగలవాఁడు కావలయు. యాచింపక యాదృచ్ఛి

* వానప్రస్థ సన్న్యాసము లీ కాలమున నిషిద్ధములు.

కంబుగ లభించిన యాహారమును గ్లుప్తముగఁ గొనవలయు. యాచించెనేని యిండ్లయం దందఱు భుజించిన పిమ్మటఁ, బొగరాఁజుట నిలిచిన తరువాత, వంటపాత్రములు కడిగిన పదపడి మోక్షకామి భిక్ష మర్థింపవలయు లభించిన సంతోషముగాని లభింపకుండిన వ్యసనము గాని కారాదు. ప్రాణము శరీరమున నిలుచుట కెంతకావలయునో యంతమాత్రమే భిక్షింపవలయును గాని యెక్కువ భిక్షింపరాదు. నలువురితోపాటు లాభము కోరరాదు. గౌరవించినవారి యింట భుజింపరాదు. గౌరవింపఁబడినపుడు భుజింపరాదు. సన్న్యాసికి భిక్షవేసి నమస్కరింపరాదు. అటులెవరైన నమస్కరించిరేని యాదిన మతఁ డుపవసింపవలయు. తన్నెవరైన గౌరవించి పూజింతురో యను జుగుప్సచే సన్న్యాసి తలదాఁచుకొని యుండవలయు. ఇతరులు భుజింపఁగా మిగిలిన యెంగిలియన్నముగాని చేఁదు వగరు కారము గల పదార్థముగాని రసవంతములైన వానినిగాని దీపుగాని తినరాదు. ప్రాణములు నిలుపుటకు దేహయాత్ర సాగుటకు మాత్రము భుజింపవలయు. ఇతరుఁడు భిక్షించిన యన్నము దాను భక్షింపరాదు. తా నితరుల భిక్షకు నాటంకము గలిగింపరాదు. భిక్షాటనమునకై మఱియొక భిక్షకునితోఁ డఁ బోరాదు. జనశూన్యమైన యిల్లుగాని యడవిగాని చెట్లమొదళ్లుగాని నదినిగాని కొండగుహగాని నిలుచు నెలవుగఁ జేసికొనవలయును. వేసవియందు నొకరాత్రియొకగ్రామమం దుండవలెను. వానకాలమంతయు నొక్కచోటనే యుండనగు. సూర్యనిర్దిష్టమైన మార్గమున భూమిమీఁదఁ బురుగువలె నడవవలయునుగాని జనకల్పితమైన వెలుఁగున నడవరాదు. జీవహింస గావింతునో యను భయముచే దయగలిగి నేలఁజూచుచు నడవవలయు, దేనిని గూడఁబెట్టరాదు. స్నేహముగలచోట వసింపరాదు. మోక్షకామి యగువాఁడు నిర్మలజలముతోఁ దన యన్ని కార్యములు తీర్చుచుండవలయును. అతఁ డెల్లవేళలఁ దాను ముంచుకొనియో చేఁదియో తెచ్చిన నీట స్నానమాడవలయునుగాని యేళ్ళయందును సరస్సులయందును మునుఁగరాదు. అహింస బ్రహ్మచర్యము స

మార్జవ మక్రోధ మనసూయ దమము పైశున్యము నను నెనిమిది గుణములుగలవాఁడు గావలయు. అపాపము నిర్వంచనము, నిర్వక్రము నగు వృత్తిఁ జరింపవలయు. అతిథికిఁ దనకు లభించినదానిలో నిస్స్పృహుఁడై యొక కవళమైన నీయవలయు. ధర్మముగ లభించినదానినే భుజింపవలయు. ఇష్టమువచ్చినట్లు చరింపరాదు. కూడుగుడ్డ తప్ప మఱిదేనిని నెవరిచ్చినఁ గైకొనరాదు. ఆహారమైనను దా నప్పుడెంత తినఁగలఁడో యంతమాత్రమే గ్రహింపవలయును గాని యెక్కువ గొనరాదు. దానము గొనరాదు. చేయనురాదు. పరుల ద్రవ్యములఁ దాను గ్రహింపరాదు. యాచింపను రాదు. ఒకసారి యనుభవించిన పదార్థమందు మరల రెండవసారి యనుభవించు కోరిక కలిగించునంత ప్రీతి యుంచరాదు. ఏదైనఁ గార్యము చేయుటయందు నితరుల పదార్థముగానట్టి మన్ను నీళ్ళు గులకరాలు నాకులు పూలు పండ్లు గ్రహింపవచ్చును. శిల్పమున జీవింపరాదు. బంగారుఁ గోరరాదు. ఒకరిని ద్వేషింపరాదు. అడుగనివానికి నుపదేశింపరాదు. తన వస్తువులని వేనిని జేర్చుకొనరాదు. శ్రద్ధచేఁ బవిత్రమైనదానినే భుజింపవలయు. వివాదము కూడదు. దేనియందు నాసక్తి గారాదు. ఏ ప్రాణితోడను మిగుల స్నేహము చేయరాదు. ఫలాశ, హింస, పదార్థసంచయము దీనితోఁగూడిన యేకార్యమైనను దాను జేయరాదు. తనకై యితరులచేఁ జేయింపబడరాదు. అన్నితలంపులు వదలి కొంచెముతోఁ దృప్తిపడుచు నిలువ నీడలేక చరించుచుఁ జరాచరభూతములం దన్నిట సముఁడై వర్తింపవలయు. ఎట్టివానినైనను భయపెట్టరాదు. ఒకరికిఁ దాను భయపడరాదు. ఎవనియందు సమస్తభూతములు నమ్మికకలవై యుండునో మోక్షాధికారులలో వాఁడే మొదటివాఁడు. కడచినదానిని రాఁబోవుదానిని జింతింపరాదు. జరుగుచుండుదానిని నుపేక్షింపవలయు. నియతచిత్తుడై కాలమున కెదురుచూచు చుండవలయును. కన్నులచేఁ గాని మనస్సుచేఁగాని యెప్పుడు పరుల నెగ్గాడరాదు. పరోక్షమున నొండెఁ బ్రత్యక్షమున నొండె దుష్కార్యము చేయరాదు. తాఁ భేటివలె

నింద్రియములను నుపసంహరించి యింద్రియ మనోబుద్ధుల క్షీణింపఁ జేసి కోరికలులేక తత్త్వమెఱింగి నిర్ద్వంద్వుఁడు నిర్మమకారుండునై నిస్స్పృహాకారుఁడై యెవరికినమస్కరింపక నిర్యోగక్షేముఁడై యాత్మ చింతన చేయుచు నాశలను గుణములను మాని శాంతుఁడు నిరాసక్తుఁడు నిరాశ్రయుఁడునై యాత్మసంగము నాంపక యుండువాఁడు నిస్సందేహముగ ముక్తుఁడు.

కాలు సేతులు వీఁపు శిరస్సు నుదరము గుణకర్మములులేక యేకమై విమలమై స్థిరమై గంధరూప రసస్పర్శశబ్దములులేక యనాసక్తము నమాంసమునై భావింపఁదగనదై నిశ్చింత మవ్యయము దివ్యమునై యింటనుండియు సర్వభూతములయందుండు నాత్మను నెవరు చూతురో వారు ముక్తులు. అచ్చట బుద్ధికిఁగాని యింద్రియములకుఁగాని దేవతలకుఁగాని వేదయజ్ఞోత్తమలోకములకుఁగాని తపోవ్రతములకుఁగాని ప్రవేశములేదు. జ్ఞానవంతులుమాత్రమే ప్రాపించు దానికి చిహ్నములులేవు. కావున నలింగ ధర్మజ్ఞుఁడైనవాఁడు ధర్మవర్తనమునఁ జరింపవలయు. గుణ ధర్మ మాశ్రయించి విజ్ఞానమార్గమున జరించుచు జ్ఞానియయ్యు మూఢునివలెనై ధర్మమును దూషింపక చరింపవలెను. సాధుధర్మమును నిందింపక తానెట్లు ప్రవర్తించిన నితరులు తన్నవమానింతురో యిట్లు శాంతుఁడై నడచుకోవలయును. ఇట్టి వృత్తిసంపన్నుఁడైనవాఁడు మునిశ్రేష్ఠుఁడు. ఇంద్రియములను నింద్రియార్థములను బంచమహాభూతములను మనోబుద్ధ్యహంకారములను నవ్యక్తమును బురుషుని దత్త్వనిశ్చయముచే నెఱుంగవలయును. అట్టివాఁడు సర్వబంధముక్తుఁడై ముక్తినొందును. ఇదంతయు నంతకాలమునఁ దత్త్వవేత్త యేకాగ్రచిత్తుఁడై ధ్యానించిన నిరాశ్రయుఁడై ముక్తుఁడగును. ఆకాశమునందలి వాయువువలె సర్వసంగములు మాని సంచితపాపములవలన విడివడి నిరాతంకుఁడై పరమపదంబుఁ బ్రాపించును.

నిశ్చయమెఱింగిన వృద్ధులు సన్న్యాసమును దపమందురు. బ్రహ్మయోనులగు బ్రాహ్మణులు జ్ఞానము పరబ్రహ్మమందురు. అతి

దూరాత్మకమైన బ్రహ్మము వేదవిద్యవలన నెఱుఁగఁదగు. అదినిర్ద్వం ద్వము నిర్గుణము నిత్యము నచింత్యము గుణము నుత్తమము. దానిని జ్ఞానముచేతను దపస్సుచేతను ధీరులగువారు గందురు. నిష్కల్మషమనస్కులు పూతులు రజోగుణహీనులు నమలులు దానిని గందురు. సన్న్యాసనిరతులు బ్రహ్మవిదులునగువారు తపస్సుచే క్షేమ మార్గమగు పరమేశ్వరుఁ గాంతురు. తపము దీపము, ఆచారము ధర్మ సాధకము, జ్ఞానము శ్రేష్ఠము, సన్న్యాస ముత్తమతపస్సు తత్త్వవిని శ్చయముచే నిరాబాధమై జ్ఞానము నెఱింగి సర్వభూతములయం దుండు నాత్మ నెవఁడెఱుఁగునో వాఁడే సర్వజ్ఞుఁడు. సహవాస వివాస ములను నానాత్వమునం దేకత్వము నెవఁడుచూచునో వాఁడు దుఃఖముక్తుఁడగును. ఎవఁడు దేనిని గోరఁడో దేనిని నవమానింపఁడో వాఁ డీలోకమునందుండియు బ్రహ్మభూతుఁడయినవాఁడే ప్రధాన గుణతత్త్వము సర్వభూతవిధానము నెఱిఁగి నిర్మముఁడు నిరహంకారుఁడు నగువాఁడు నిజముగ ముక్తుఁడు. నిర్ద్వంద్వుఁడు నిర్నమస్కారుఁడు నిస్స్వధాకారుఁడు నగువాఁడు నిర్గుణము నిత్యము నిర్ద్వంద్వమునగు బ్రహ్మమును బ్రశమనముచే నొందును. గుణమయములైన సర్వ శుభా శుభ కర్మములు సత్యానృతములు వదలినవాఁడు ముక్తుఁడే. సనాతన మై సర్వభూతములకు జీవనాధారమైన బ్రహ్మవృక్ష మవ్యక్తమను వృక్షమునఁ బుట్టెను. దానికి బోదె బుద్ధి. అహంకారము చిగుళ్లు. ఇంద్రియములు బొరియలు. మహాభూతములు కొమ్మలు. రెమ్మలు శుభాశుభ ఫలములు. ఇది సదా యాకులుగలిగి సదా పుష్పించి యుండును. ఈవృక్షమును దత్త్వజ్ఞానమను కత్తిచేఁ దునుకలుగ నఱికి జనన మరణ జరాదులకుఁ గారణమైన సంగమనెడి పాశములను వదలి యహంకార మమకారములు లేనివాఁడు నిజముగ ముక్తుఁడగును. దీనియందు నచేతనములు నిత్యములు స్థిరములు నగు రెండుపక్షులు గలవు. దీనికంటెఁ బరమైనది చైతన్యముగలది మఱియొకటిగలదు. ప్రకృతి జ్ఞానరహితమై యచేతనమువలెఁ గన్పట్టు నంతరాత్మ ప్రకృతి కంటెఁ బరమగుదాని నెప్పుడు దెలిసికొనుచున్నదో యప్పుడు క్షేత్ర

జ్ఞానము గలిగి గుణముల నతిక్రమించు తెలివిగలదై సర్వము నెఱింగి సర్వపాపములనుండి విముక్తమగుచున్నది.

కొందఱు బ్రహ్మమును వృక్షముగను గొందఱు వనముగను గొంద ఱవ్యక్తముగను గొంద ఱనామయముగను భావింతురు. అందఱును నిది యవ్యక్తమందుఁ బుట్టి యవ్యక్తమందు లీనమగుచున్నదని తలంతురు. ఎవఁ డంతకాలమునం దొకసారి శ్వాసము విడుచునంతమాత్రకాలమైనను సముఁడై యాత్మను గూడినవాఁడై యుండునో వాఁడు ముక్తికర్హుఁడు. ఱెప్పపాటు కాలమైనను నాత్మను నాత్మయందుఁ గదియించి యాత్మను బ్రసన్నమును జేసినవాఁడు విద్వాంసులుపోవు నవ్యయస్థానమునకుఁ బోవును. ప్రాణాయామ విధానము చొప్పునఁ బదిటఁగాని పండ్రెంటఁగాని * ప్రాణముల మరల మరల నియమించినవాఁ డిరువదినాల్గింటి కావలనుండు దానిని బొందుచున్నాఁడు. తొలుత నిట్లు ప్రసన్నమైన యాత్మగలవాఁడు కోరినదెల్లఁ బొందుచున్నాఁడు. అవ్యక్తమునుండి పుట్టినదానియందు సత్త్వగుణ మెప్పు డతిశయించునో యపుడు మోక్షయోగ్యత కలుగుచున్నది. సత్త్వము నెఱింగినవారు దానికంటె నుత్తమమైనది లేదందురు. పురుషుఁడును సత్త్వమును నాశ్రయించి యున్నాఁడని యూహించి తెలిసికొనవచ్చును.

పురుషప్రాప్తి యితరవిధముల లభింపదు. అహింస క్షమ ధృతి యార్జవము సమత్వము సత్యము జ్ఞానము త్యాగము సన్న్యాసము ననునివి సాత్త్వికవృత్తములు. దీనినిబట్టి బుద్ధిమంతులు సత్త్వమే పురుషుఁడని యనుమానించుచున్నారు. కొందఱు క్షేత్రజ్ఞుఁడే ప్రకృతియనుచున్నారుగాని యదిసరిగాదు. ప్రకృతికంటెఁ బురుషుఁడు భిన్నుఁడనుటయు సరిగాదు. ప్రకృతి పురుషులకూడికయు వేఱిమియు నెఱుఁగవలయు. అట్టులే యేకత్వము నానాత్వము వానికిఁ జెప్పఁ

*యమాద్యష్టాంగములు + తర్క వైరాగ్యములు = ౧౦. యమాద్యష్టాంగములు + మైత్రీ, కరుణా, ముదిత, ఉపేక్ష = ౧౨. †ఇరువదినాల్గవ తత్త్వమాత్మ.

బడెను. అది పండితాభిప్రాయము. మేడిపండునందు దానియందలి దోమయందు నైక్యమును బృథగ్భావమును గానవచ్చుచున్నది. నీరు దానిలోనిచేప వేఱు వేఱుకదా. అట్లులే ప్రకృతి పురుషుల కుండి కయు. తామరాకునకు నీటిబిందువున కెట్టి సంబంధమో ప్రకృతి పురుషుల కట్టి సంబంధమే.

అని బ్రహ్మ పలుకఁగా విని విప్రు లిట్లనిరి. ధర్మమార్గములనేక ములు భిన్నములు పరస్పర విరుద్ధములు గానవచ్చుచున్నవి. ఇందేది తప్పక యనుష్ఠింపవలయునో మేము నిష్కర్షింపఁ జాలకున్నారము. మరణానంతర మది యున్నదని కొందఱు లేదనికొందఱు నందురు. కొందఱు సర్వము సందేహమందురు. కొంద అంతయు నిశ్చయమే యందురు. కొందఱు నిత్యమని కొంద అనిత్యమని కొందఱు కలదని కొందఱు లేదని కొంద అదిమూఁడని కొందఱు రెండని కొంద అది సంకీర్ణమని బ్రహ్మజ్ఞులే చెప్పుచున్నారు. ఒక్కఁడది యేకమనును. మఱియొకఁడు భిన్నమనును. ఒక్కఁడు పెక్కులనును. కొందఱు దేశ కాలములు కలవనినఁ గొందఱు లేదందురు, కొందఱు జడలుధరింతురు, కొందఱు బోడులు, కొందఱు దిగంబరులు, కొందఱు స్నానము చేయరు, కొందఱు దినమునకు మూఁడుమార్లు మునుఁగుదురు, కొంద ఆహారముఁగొందురు, కొందఱుపవాసములుందురు, కొందఱు కర్మములు మేలందురు, కొందఱు భోగములఁ బ్రశంసింతురు, కొందఱు ధనములఁ గోరుదురు, కొందఱు దారిద్ర్యమునుగోరుదురు, కొందఱు ధ్యానాద్యుపాయముల సాధింపవలయునందురు. కొందఱు లేదందురు, కొంద అహింసారతులు, కొందఱు హింసారతులు, కొందఱు పుణ్యములచేఁ గీర్తి సాధ్యమందురు, కొందఱు కాదందురు, కొందఱు సద్భావనిరతులు, కొందఱు సంశయచిత్తులు, కొందఱు సుఖమును మెత్తురు, కొందఱు ధ్యానము మేలందురు, కొందఱు యజ్ఞములను దానములను శ్లాఘింతురు, ఒకఁడు తపస్సు వేఱొకఁ డధ్యయనము నింకొకఁడు జ్ఞానము నొండొకఁడు సన్న్యాసముఁ గొండాడును, భూతచింతకులు సర్వము స్వభావమందురు, ఒకఁడు సర్వము గొప్పగాఁ

జెప్పును, ఒకఁడు దేనిని మెచ్చుఁడు. ఇట్లు విప్రులు బహువిధములఁ జెప్పుటచే నిందు శ్రేయస్కరమేదో గ్రహింపఁజాలకున్నారము. వారు వారు తాము మెచ్చుదానినే యిది శ్రేయస్కరమిది శ్రేయస్కరమని మెచ్చుచుందురు. కాబట్టి శ్రేయస్కరమేదో చెప్పుము. ప్రకృతి పురుషులకు నే కారణముచే సంబంధము కలిగెను. అని యడిగిన యా బ్రాహ్మణులకు బ్రహ్మ యథార్థవిషయ మిట్లు చెప్పెను.

మున్నొకగురువు తన శిష్యునకుఁ జెప్పినదెల్ల వివరించెదను. అది యంతయువిని నిశ్చయించుకొనుఁడు. దేనిని హింసింపకుండుట ప్రథమధర్మము. అదియే నిర్భయమై శ్రేష్ఠమై ధర్మలక్షణమైనపదము. నిశ్చితదర్శనులగు వృద్ధులు జ్ఞానమేసుఖమని చెప్పిరి. కావున శుద్ధజ్ఞానమువలన సర్వరూపములు నశించును. హింసారతులు నాస్తికులు లోభమోహయుక్తులు నరకములఁబడుదురు. ఫలములనుగోరి కర్మములు చేయువారు మరల మరల జన్మించుచుందురు. శ్రద్ధావంతులై ఫలములు గోరక కార్యములు చేయుధీరులు సాధుదర్శనులు. ఇఁక ప్రకృతి క్షేత్రజ్ఞసంయోగ వియోగముల గుఱించి వివరించెద. ఇందొకటి విషయము. ఒకటి విషయి పురుషుఁడు, విషయము ప్రకృతి. ఈ రెంటికిఁగల సంబంధము మేడిపండు పురుగులవంటిదని ముందే చెప్పితిని. అనుభవింపఁబడునది ప్రకృతి. అది యచేతనమగుట తా ననుభవింపఁ బడుచుండుట దానికిఁ దెలియదు. అనుభవించువాఁ డెఱుఁగును. ప్రకృతి యనిత్యము, ద్వంద్వయుక్తము క్షేత్రజ్ఞుఁడు నిర్ద్వంద్వుఁడు నిత్యుఁడు నిర్గుణాత్మకుఁడు విభాగశూన్యుఁడు, అన్నిట నుండువాఁడు, జ్ఞానయుక్తుఁడై యన్నిటియందు సమముగ వర్తించువాఁడు. నీటియందలి తామరపాకువలె నన్నిగుణములతో సంపర్కము కలిగినను సక్తుఁడుగాఁడు. తామరాకునంటుఁ జలించు నీటిబిందువులవలె నిస్సందేహముగాఁ బురుషుఁ డసంయుక్తుఁడు. ప్రకృతి పురుషుని ద్రవ్యము మాత్రము. ప్రకృతి పురుషులకుఁ గల సంబంధము ద్రవ్యమునకుఁ గర్తకుఁ గలసంబంధమువంటిది. దీపము తీసికొని చీఁకటిలోఁ బోవువానివలెఁ బరమర్షులు ప్రకృతియను నెడి దీపమును గొనిపోవుచుం

నురు. ద్రవ్యము గుణములుండువఱకు దీపము వెలుఁగుచుండును. ద్రవ్యము గుణములు క్షీణింపఁగా దీప మాఱిపోవును. పురుషుఁడవ్యక్తుఁడు. ప్రకృతిగుణము వ్యక్తము. బుద్ధిలేనివానికి వెయ్యి చెప్పినను జ్ఞానము కలుగదు. దానిలో నాలుగవ భాగము చెప్పినను బుద్ధిగలవాఁడు సుఖపడును. ఈ విధముగ ధర్మసాధన ముపాయముచేఁ దెలియఁదగినది. ఉపాయము దెలిసిన బుద్ధిమంతుఁడు మిక్కిలి సుఖించును. దారిబత్తెములేక ప్రయాణముచేయువాఁడు త్రోవలోమిగుల శ్రమపడును. పారమునొందలేక చావనుగూడఁ జచ్చును. అటులే కర్మములందు ఫలముగలదో లేదో సందేహము. దారిబత్తెము జ్ఞానము. వాఁడువాఁడు చేయు పుణ్యపాపముల వలననే వానికి సుఖము గలదో లేదో తెలియును. మునుపు చూడని నూతనమార్గమునఁ గాల్నడ దీర్ఘప్రయాణముచేయుట యెట్టిదో జ్ఞానములేనివాని దేహయాత్రయు నట్టిది. శీఘ్రగమనముగల గుఱ్ఱములను గట్టిన తేరెక్కి ప్రయాణముచేయుట యెట్టిదో బుద్ధిమంతుల గమన మట్టిది. కొండమీఁదికిఁ బోయినవాఁడు భూప్రదేశమును మరల చూడ నట్లుత్తమజ్ఞానము సంపాదించినవాఁడు వేదోక్త యాగాదికర్మముల నాచరింపఁబనిలేదు. మిట్టపల్లములుగల నేలయందుఁ దేరిపైఁ బోవుటయు శ్రమకరమని దెలిసికొని యెంతవఱకు సుఖముగఁ దేరిపైఁ బయనింపవచ్చునో యంతవఱకు రథముపై బయనించి యావల బుద్ధిమంతుఁడు దానిని వదలును. అట్లే తత్త్వము యోగము తెలిసిన మేధావియు నెంతవఱకుఁ గర్మములు తనకు సుఖకరములో యంతవఱకుఁ గావించి యావల వానిని వదలును. ముందుముందుండు స్థానములఁ దెలిసికొని క్రమముగఁ బయనించు బాటసారివలెఁ దెలివిగలవాఁడును నొకదానివెనుక నొకటి యేది కర్తవ్యమో తెలిసికొని వర్తించును. మొదట ఫలకాంక్షచేఁ గర్మము నాచరించి యావల ఫలకాంక్ష విడిచి కర్మములొనర్చి యావల జ్ఞానమునొందును. వీనినే వరుసగఁ గర్మమని యోగమని పరమహంసత్వమని యందురు. ఘోరసముద్రమును నోడలేక తన చేతులతోనే యీఁదువాఁడు చచ్చును. తెలివిగల

వాఁడు తెడ్డులుగల నావను సంపాదించుకొని బడలిక లేక యావలి యొడ్డుచేరి నావను వదలి నిర్మమత్వమును బొందును. రథికపదాతు లకుఁ గల భేదము మున్నే చెప్పితినిగదా. స్నేహముచే మోహము పాలయి యాపద నొందినవాఁడు నావను గట్టిచుకొనియుండు బెస్త వానివలె మమత్వమును బాయక యందంచే చుట్టఁబెట్టబడుచుండును. నావయెక్కి నేలమీఁదఁ బోవ సాధ్యపడదు. రథమెక్కి నీట ప్రయాణము చేయరాదు, అట్లే భిన్నవిషయములకు భిన్నకర్మమార్గ ములు విధింపఁబడినవి. ఎవఁ డెట్టికర్మము చేయునో యట్టిఫలమునే వాఁ డనుభవించును. గంధము రసము స్పర్శము రూపము శబ్దము లేనిదై మనోబుద్ధులచే గ్రహింపరాని దేదియో యది ప్రధానమం దురు. ప్రధానము వ్యక్తము. అవ్యక్తముగుణమే మహత్తు. ప్రధాన భూతమైన మహత్తు గుణమే యహంకారము. అహంకారమువలనఁ గలిగినవే పంచమహాభూతములు. వీని గుణములే విషయములు. అవ్యక్తము బీజధర్మము కలది. అది ప్రసవించుగుణము కలది. గొప్ప మాత్మయుఁ బ్రసవమనియు బీజధర్మము గలదనియు వింటిమి. అహం కారము ప్రసవమే. అదియు బీజధర్మము గలదియే. పంచమహా భూతములు బీజధర్మము ప్రసవధర్మము గలది. అం దాకాశమొకటి, వాయువు రెండు, నగ్ని మూఁడు, జలము నాలుగు, చర స్థావర సంకులమైన భూమి యైదుగుణములు గలది. శబ్ద స్పర్శ రూప రస గంధము లనునవి యైదుగుణములు. ఈ యైదును భూమిగుణములు. భూమి గుణమైన గంధ మనేకవిధములు. ఇష్ట మనిష్టము తీపు పులుసు కారము దూరవ్యాపి సమీపవ్యాపి స్నిగ్ధము రూక్షము విశదమని గంధము పదివిధములు. శబ్ద స్పర్శ రూప రసములు జల గుణములు. ఉప్పు తీపు పులుసు కారము చేఁదు వగరని రసము లాఱువిధములు. శబ్ద స్పర్శ రూపము లగ్నిగుణములు. తెలుపు నలుపు రక్తవర్ణము నీలము పసు పరుణమని, పొడుగు పొట్టి లావు సన్నమని రూపము పది భేదములు గలది. శబ్ద స్పర్శములు వాయు గుణములు. ఉష్ణము శీతము మృదువు [illegible] స్నిగ్ధము విశదము

కఠినము చిక్కణము శ్లక్ష్ణము పిచ్ఛిలము దారుణము మృదువన స్పర్శమునఁ బండ్రెండు భేదములు. శబ్దమొక్కటి యాకాశ గుణము. షడ్జము ఋషభము గాంధారము మధ్యమము పంచమము, విషాధము ధైవత మిష్ట మనిష్టమని శబ్దమున భేదములు. ఆకాశ ముత్తమ భూతము. దానికిఁ దరువాత నహంకారము. అహంకారమున కావల బుద్ధి. బుద్ధి కావల నాత్మ. దాని కావల నవ్యక్తము. దాని కావలఁ బురుషుఁడు. భూతములం దుత్తమభూతములు కర్మవిధియు సర్వభూతములకు నాత్మయైనవాఁడును నగువానిని దెలిసినవాఁడు ముక్తుఁడగును.

పంచభూతములకు మనస్సు నియామకము. భూతముల నియమించునది సృజించునది మనస్సే. మహాభూతముల యధిష్ఠాతయు మనస్సే. ప్రభుత్వము సేయు బుద్ధియే క్షేత్రజ్ఞుఁడు. సారథి గుఱ్ఱములను గట్టినట్టులు మన స్సింద్రియములఁ గట్టును. ఇంద్రియములు మనస్సు బుద్ధి క్షేత్రజ్ఞునకుఁ గట్టఁబడి యుండును. బుద్ధియను కళ్లెము గల యింద్రియములను గుఱ్ఱములుపూన్చిన తేరినెక్కి జీవాత్మ సంచరించుచుండును. బ్రహ్మమయమైన తేరికి నింద్రియసమూహము గుఱ్ఱములు. మనస్సు సారథి, బుద్ధి పగ్గములు ఇట్టి బ్రహ్మమయ రథమును దెలిసినవాఁడు మోక్షము పాలుగాఁడు. ఈ బ్రహ్మవనమునకు నాది యవ్యక్తము. తుద విషయములు. చరాచరములు దానియం దున్నవి. సూర్యచంద్రములు దాని వెలిఁగింతురు. గ్రహనక్షత్రములచే నలంకరింపఁబడినది. నదీ పర్వతజాలము ననుభూషణములచే నలుప్రక్కలఁ జెక్కఁబడినది. వివిధ జలములచే శోభితమైనది. సర్వభూతములకు జయింపరానిది. సర్వప్రాణులకు నదియే గమ్యస్థానము. ఇట్టి బ్రహ్మవనమందు క్షేత్రజ్ఞుఁడు సంచరించును. లోకమున గల చరాచర సత్త్వములన్నియుఁ దొలుత లీనమైపోవును. తరువాత భూతగుణములు లీనములగును. ఆవల భూతములు లీనమైపోవును. దేవ మనుష్య గంధర్వ పిశాచాసుర రాక్షసులు లోనగువారు స్వభావమునఁచే సృష్టింపఁబడిరిగాని క్రియలవలనంగాదు. కారణమువలనఁ

గాదు. ప్రపంచ స్రష్టలైన బ్రహ్మలు నిత్యే మరలమరలఁ బుట్టుచుం దురు. సముద్రమునందలి యలలవలె భూతములనుండి పుట్టినవన్నియు భూతములందే యాయాకాలమున లీనమగుచున్నవి. విశ్వసృష్టియగు భూతములకంటె మహాభూతములు పరములు. ఆ వైదింటిని దాటినవాఁడు ముక్తుఁడు. మనస్సుచేతనే బ్రహ్మ సర్వము సృజించెను. ఆ విధముగఁ దపోబలముచే ఋషులు దేవత్వముఁ బ్రాపించిరి. అట్టులే ఫలమూలముల భక్షించుచుఁ దపస్సుచేయుచు సిద్ధులైనవారు ము ల్లోకములను తపస్సుచేతనే కనఁజాలుదురు. ఓషధులు నౌషధములు నానావిద్యలు తపస్సుచేతనే లబ్ధములు. సాధనముల కన్నిటికిఁ దపమే మూలము. పొందరానివి తెలియరానివి జయింపరానివి చనరానివి నన్నియుఁ తపస్సుచే సాధ్యములు. సారాయి త్రాగువాఁడు, బ్రహ్మ హత్య చేసినవాఁడు, దొంగ, గర్భపాతము గలిగించినవాఁడు, గురు తల్పగుఁడును, దపస్తప్తుఁడై కిల్బిషములఁ బాయును. మనుష్యులు పితరులు, దేవతలు పశువులు మృగములు పక్షులు నితర చరాచర భూతములు తపస్సునందు నిలిచి యా తపస్సుచేతనే సిద్ధిపొందుచు న్నవి. తపస్సుచేతనే దేవతలు స్వర్గమును బొందిరి. ఫలములఁగోరి కర్మములు చేయుచు నహంకారయుక్తులగువారు బ్రహ్మసాన్నిధ్యముఁ జేరుదురు. శుద్ధమైన ధ్యానయోగముచే మమకారాహంకారములు విడిచినవా రుత్తమమైన లోకమును నవ్యక్తమును బొందుదురు. ప్రసన్నమనస్కులై ధ్యానయోగరతులై యాత్మనెఱింగినవా రవ్యక్త సుఖచయ మనుభవింతురు. రజస్తమోవర్జితులై కేవల సత్త్వాయుక్తులై యవ్యక్తతత్త్వమునుండి పుట్టి మరల నచ్చటికే యేగువారు సర్వ పాపముక్తులై విభాగరహితులై సర్వము సృజింతురు. అట్టివానిని క్షేత్రజ్ఞుఁడని తెలియవలయును. వేదములఁ జదివినవాఁడు వేదజ్ఞుఁడు కాఁడు. క్షేత్రజ్ఞునిఁ దెలిసినవాఁడే వేదజ్ఞుఁడు. మనస్సును నియ మించి యాత్మనిగ్రహము గలవాఁడై ముని కూర్చుండవలయును. ఎవఁ డెట్టిదానియందు మనస్సు నిలుపునో వాఁ డట్టివాఁడే యగును. ఇది సనాతన రహస్యము. అవ్యక్తము మొదలు విషయముల వఱకు

సర్వము విద్యాలక్షణమని యెఱుంగవలయును. 'మమ' యను రెండక్షరములు మృత్యువు. 'నమమ' యను మూఁడక్షరములు శాశ్వత బ్రహ్మము. మందబుద్ధులు కర్మమును బ్రశంసింతురు. వృద్ధులగు మహాత్ములు కర్మమును బ్రశంసింపరు. కర్మమువలననే పంచభూతములు పదునొకం డింద్రియము లీ పదునాఱింటితోఁ గూడిన దేహముతో జంతువు పుట్టుచున్నది. విద్య (జ్ఞానము) దేహాభిమానముగల జీవుని యభిమానమును మ్రింగుచున్నది. అమృత భోజులగు యోగులు దీనినేకదా కాంక్షింతురు. కావున సంసారసాగరము నావలియొడ్డుపై దృష్టినిలిపినవారు కర్మములపై స్నేహముంచరు. శుద్ధాత్మ జ్ఞానమయుఁడు గాని కర్మమయుఁడు గాఁడు. వశ్యాత్ముని, సంగరహితుని, నమృతుని, నిత్యుని, గ్రహింపరానివానిని; శాశ్వతుని, నక్షరుని, నెవఁ డెఱుఁగుచున్నాఁడో వానికి మృతిలేదు. అపూర్వుఁడు, నకృతుఁడు, నిత్యుఁడు, నజితుఁడు, నమృతాశులకు నిట్టివాఁడని యెఱుఁగరాని వాఁడు నగు నాత్మని నిట్టివాఁడని యెవ్వఁ డెఱుఁగునో వాఁ డీబలిష్ఠ సాధనములచే నగ్రాహ్యుఁడు నమృతుఁడు నగును. సంస్కారముల నెల్లఁ బాయఁజేసి యాత్మ నాత్మయందే నియమించువాఁ డంతకంటె శ్రేష్ఠుఁడు లేని బ్రహ్మము నెఱుఁగుచున్నాఁడు. చిత్తము ప్రసన్నమైన వెంటనే శాంతి కలుగుచున్నది. ప్రసన్నచిత్తమునకు సర్వము స్వప్నమువలె నుండుటే లక్షణము. జ్ఞాననిష్ఠులగు ముక్తులగతి యిదియే. వీరు లోకప్రవృత్తులన్నియుఁ బరిణామములవలనఁగలిగినగతి కదా యని చూతురు. ఇదియే విరక్తులగతి. ఇదియే సనాతనధర్మము. జ్ఞానులప్రాప్తి యిదియే. ఇదియే యనిందితవృత్తము. సర్వత్ర సమదర్శియై సర్వభూతములందు సముఁడై నిస్స్పృహుఁడై కోరికలు లేని వాఁ డిట్టిగతిని బొంద సాధ్యపడును. బ్రాహ్మణులారా! మీకు సర్వమును వినిపించితిని. ఈ ప్రకారము శీఘ్రముగ సిద్ధిఁబొందుఁడు. అని బ్రహ్మవాక్యములు వినిపించి గురువిట్లనియె. ఆ బ్రాహ్మణు లా ప్రకార మాచరించి యుత్తమలోకములు బ్రాపించిరి. కావున నీవు బ్రహ్మవాక్యముల నేను వచించినచొప్పున నడిచి సిద్ధిఁబొందుము.

అని చెప్పి కృష్ణుం డర్జునున కిట్లనియె అర్జునా! గురువు చెప్పినట్లు నడచుకొని శిష్యుఁడు కృతకృత్యుఁడై మోక్షసిద్ధిఁ గాంచెను. అనిన నర్జునుం డిట్లనియె. కృష్ణా! నీవు చెప్పిన బ్రాహ్మణుఁ డెవఁడు? శిష్యుఁ డెవఁడు? వీరినిగుఱించి నేను వినఁగోరుచున్నాఁడను నిజము చెప్పుము. అనినఁ గృష్ణుం డిట్లనియె.

నేను గురువను. నా మనస్సే శిష్యుఁడు. నీయందలి ప్రీతిచే నీ కీరహస్య మెఱిఁగించితిని. కురుకులోద్వహా! నాయందు నీకుఁ బ్రీతిగలదేని నీవిపుడు విన్న యధ్యాత్మవిషయ మెల్లప్పుడు చక్కఁగ నభ్యసింపుము. ఈ ధర్మము నీవు చక్కఁగ నాచరించితివేని సర్వపాప ముక్తుఁడవై మోక్షముఁ గాంతువు. ఇదిగో నీకు యుద్ధకాలమందును నుపదేశించితిని. కావున దీనియందు మనసునిలుపుము. అర్జునా! నా తండ్రిని సందర్శించి చాల దినములయ్యెను. నీవు సమ్మతింతువేని యాతనను జూడఁబోయెదను. అనిన నర్జునుం డిట్లనియె.

ఈశ్వరా! నీ యిష్టముచొప్పున వర్తింపుము. మాకెల్ల నీవే ప్రభువు. కావున నీ వెంతఁడినను మమ్ముఁ బాలించుచుందుము. లోకాత్మకా! నారాయణా! నమస్కారము. మనోబలముచేఁ దప స్సశక్యము. అవిద్యచేఁ గర్మము హతము. అర్థహీనతచే దాన మసాధ్యము. కావునఁ గలియందు నీ నామస్మరణమే కర్తవ్యము. నీవు ద్వారకకుఁ బోవఁ గోరుదువేని పొమ్ము. హస్తినాపురమునకు నేఁడు పోయి ధర్మజున కెఱింగించి పోవుట తగును

అనినఁ గృష్ణుఁడు దారకుఁ దేరుదేర నియోగింప నతండును జవంబున నరదంబుఁ బన్ని కొనివచ్చె. అంతఁ గృష్ణార్జునులు సపరివారంబుగ హస్తిపురంబునకు బయనించి పోవుచుండఁ ద్రోవలో నర్జునుండు కృష్ణుంగని యిట్లనియె.

యదూత్తమా! నీ యనుగ్రహంబునఁగదా నీ వను నావ నండఁగొని మేము సంగరంబను సాగరంబుఁ దరించి దరిచేరి నిహతకంటకంబైన రాజ్యంబును గాంచఁగలిగితిమి. విశ్వాత్మకా! నమస్కారము. నాపైని నీ దయ యెంతమాత్రమో యంతమాత్రమే నేన్ను ని న్నెఱుఁ

గుహను. ఎవఁడు నిన్ను నెంత యెఱుఁగఁదగునని నీ సంకల్పమో యెంతయో యతఁ డెఱుఁగఁగలఁడుగాని యంతకెక్కువ యెఱుఁగ లేఁడుకదా. జగత్సృష్టి రక్షణ లయములు నీకుఁ గ్రీడలు. సర్వము నీయందె నెలకొనియుండు. చతుర్విధ భూతచయములు భూపవ్యాకాశ ములు నీవుగాదే కలిగింతువు. వెన్నెల నీ చిఱునవ్వు. ఋతువులు నీ యింద్రియములు. సదాగతియగు వాయువు నీ నిశ్వాసము. నీ క్రోధమే మృత్యువు. లక్ష్మీదేవి నీయందే వసించు. రతియు దుష్టియు ధృతియు శాంతి మతి కాంతి చరాచరములు నీవేకదా. యుగాంత ప్రలయము నీవకదా కూర్తువు. నే నెంతకాలము వర్ణించినను నీ గుణములన్నియు వర్ణింపఁ జాలను గావునఁ గృష్ణా నమస్కారము. నారద దేవల వ్యాస భీష్ములవలన నీవు దురాధర్షుఁడవని వింటిని. నా యందలి ప్రీతిచే నీవు దేని నుపదేశించితివో దాని, జక్కఁగ నాచ రించెదను. సంగర రంగంబున మున్న నీచే దగ్ధమైన యరిసైన్య మునుగదా పదపడి నేను వధించుచుంటిని. ఆశ్చర్యము. నీ బుద్ధి పరాక్రమము వలనఁగదా కర్ణాదుల నేను వధింపగలిగితిని. కావున నేది మేలో యది నీవే యాలోచించి చేయుము. నీవు చెప్పినట్లు నడచుకొనెదనని చెప్పుచు హస్తినాపురంబు డాసి నగరిఁజొచ్చి గాం ధారీ ధృతరాష్ట్ర విదుర ధర్మజ భీమ నకుల సహదేవులను సుభద్రా ద్రౌపదులను గాంచి నమస్కరింపఁదగువారి నమస్కరించి పిన్నవా రిని కౌఁగిలించి యాదరించె. ఆవలఁ గృష్ణు నభిప్రాయంబు నర్జునుఁడు ధర్మజున కెఱింగింప నతండును వల్లెయని యంగీకరించి యిట్లనియె.

కృష్ణా! నీ యనుగ్రహంబునఁ దరిఁజేరితిమి. నిన్ను మే మెట్లు సత్కరింపఁగలము. నీవు ద్వారకకరిగి తల్లిదండ్రుల దర్శించి మరల నా చేయు నశ్వమేధయాగంబుఁ జూడ సబంధుఁడవై యరుదెమ్ము. అనినఁ గృష్ణుఁడు ధర్మనందనా! నేనును నా సర్వద్రవ్యంబులు నీయవి. మేము నీవారము. నీ యిచ్చచొప్పున వినియోగింపుమని వీడుకోలు వడసి మెల్లవారు తోడ నరుదేర సుభద్రఁ దోడ్కొని సాత్యకి దాను బయనించె.

---

## ద్వారకాలీల.

### శ్రీకృష్ణుండు ద్వారక కరుగుట.

ఇట్లు ప్రయాణసన్నాహనం బొనర్చి ధర్మజుచే వీడుకోలువడసి యనుజ్ఞాతుండై యాలింగనంబుగావించి నమస్కరించి పిన్నవారి యాలింగనాభివాదంబుల నంగీకరించి రథారోహణంబుం గావింపం దద్విరహతాపంబున కోపని ద్రౌపదీ కుంత్యుత్తరా గాంధారీ ధృతరాష్ట్ర యుయుత్సు కృప ధౌమ్య నకుల సహదేవ వృకోదరాదులు మోహపరవశులైరి. అది యట్లుకదా యగు సజ్జన సాంగత్యంబు వలన దుష్టసాంగత్యంబు వదలిన బుధుండు శ్రవణరసాయనంబును గీర్త్యమానంబు నగు హరికీర్తి విని యాయనను నెట్లు విడువంగలండు? ఇట్లుండ దర్శన స్పర్శన సల్లాప శయనాసన భోజనంబుల సర్వదా యాయనయందే చెందంబుం బొందుపఱచిన కుంతీనందనాదు లెల్ల తద్విరహంబు సైఁపరు. అందఱును స్నేహసంబంధంబుల కతంబున ఔప్వార్పక యాయనయందే దృష్టినిలిపి చూచుచు నింపుసంపుం జరించిరి. దేవకీనందనుండు గృహంబువీడి పయనింపఁగని యుత్కంఠాతిరేకంబున కనుంగొలుకుల వెలువడనున్న కన్నీటిని నశుభశంక లోలో నణంచికొనిరి.

అంత మృదంగ శంఖ భేరీ వీణా పణవ గోముఖ నాదంబులు విస్తరిల్లె. దర్శనకాంక్ష ప్రాసాద శిఖరారూఢలైన కౌరవస్త్రీలు ప్రేమ వ్రీడాస్మితేక్షణలై కృష్ణుపైఁ బుష్పంబులు వర్షించిరి. ప్రియుండైన యర్జునుండు ప్రియతముండైన కృష్ణునకు రత్నదండంబును ముక్తాదామ విభూషితంబు నగు శ్వేతచ్ఛత్రంబుం బట్టె. ఉద్ధవ సాత్యకులు వ్యజనహస్తులైరి. అందందు విప్రులు ప్రాకృతగుణరహితుండును, జ్ఞానశక్త్యాది షాడ్గుణ్య స్వభావుండును నగు యదుపతి నామరూపానురూప సత్యాశీర్వచనంబులు పేర్కొనుచుండిరి. కృష్ణాసక్తచిత్తలైన హస్తినాపురీ మత్తకాశినులు సర్వశ్రుతి మనోహరంబులైన వాక్కుల నిట్లు పరస్పరంబు సల్లాపించిరి.

అక్కా? సత్త్వాది గుణంబు లున్మేషింపకపూర్వము కర్మరూప శక్తులు నిద్రాళువులై ఫలప్రదానంబునఁ బ్రవర్తింపకమున్న ప్రలయ దశయందు జగదాత్మయు నీశ్వరుఁడు నగు తాను నివృత్త సృష్ట్యాది సంకల్పుఁడై యున్నసమయంబునఁ బృథివ్యాది భూతంబులు నామ రూప విభాగరహితంబులై యుండఁ దోఁచులేక యొక్కఁడై యుండు పురుషుం డీయనయేకదా. అవునమ్మా యవును. అట్లొక్కఁడు నద్వితీయుండై యుండి మరల నిజవీర్యచోదితంబై స్వసంకల్ప ప్రేరితంబై జీవుల మఱుఁగువడఁజేయు ప్రకృతిసృష్టి కున్ముఖంబుగాఁగ నం దంతరాత్మగాఁ బ్రవేశించి నామరూపంబులులేని జీవులకు నామ రూపంబులు గల్పింప వేదప్రవర్తకుం డైనయతం డీ శ్రీకృష్ణుండే. అమ్మా యట్లైనచో జితేంద్రియులు జితప్రాణులు నైన సూరులు భక్తియుక్తులై యాకారణంబున నిర్మలచిత్తులై యంతఃకరణంబు శోధించి గాంతురో యట్టివాఁ డీ కృష్ణుఁడేకదా. అవునే యెవని చరితంబులు వేదాంతంబులఁ దత్త్వోపదేష్టలు గీర్తింతు రేయీశ్వరుం డొక్కఁడై యుండి లీలచే జగంబు సృజించు రక్షించు హరించు జగదంతరాత్ముఁడై యుండియుఁ దద్గతదోషంబుల నంటఁబడక యుండువాఁ డీ కృష్ణుఁడే. అట్టి మహానుభావుండైన పరమపురుషుండు తమో నిర్మగ్నులై రాజు లధర్మప్రవర్తకులై చరింప దుష్టశిక్షార్థంబు శిష్టరక్షార్థంబు నిజస్వభావధర్మంబులైన యైశ్వర్యము సత్యము శ్రోతృ వక్తృ పుణ్యావహకర్మము దయ యశస్సు విడనాడక యుగయుగంబున శుద్ధసత్త్వమయ రూపంబుల ధరించుచుండు. ఆకారణంబుననే యిప్పుడు యదుకులంబున నవతరించి దాని శ్లాఘ్యంబుగావించి యీ శ్రియఃపతి పలుమాఱు తాను సంచారంబుగావించుట మధువనంబు పావనంబయ్యె. ఆహా! స్వర్గలోక యశంబుఁ దిరస్కరించుచు భూలోకంబునఁ బుణ్యయశోదంబైన * కుశస్థలీపురంబు చేసిన పుణ్యంబే పుణ్యంబు. ఏలందువా, యందలి ప్రజలు దరహాస సుందరవదనుండై యనుగ్రహార్థం బందువసించు నీ పరమపురుషు స్వపతిగా నిత్యం బవ

* కుశస్థలి = ద్వారక.

లోకింతురుకదా. ఈయనను పాణిగ్రహణంబుఁ గాంచిన స్త్రీలు సత్యంబుగఁ దొలిజన్మంబుల వ్రతస్నాన దాన హోమాదులఁ గావించిన వారే. కావుననేకదా సఖి యీయనయందు మనంబునిలిపి గోప స్త్రీలు పలుమా అధరామృతంబుఁ బానంబు గావింతురు. మత్తుం డైన చైద్యుని మథించి వీర్యశుల్కయగు రుక్మిణిని హరించె. అట్టులే జాంబవతీ సత్యాదుల గ్రహించె. నరకాసురవధ గావించి షోడశ సహస్రస్త్రీల వివాహమయ్యె. వారలకెల్లఁ బతియై యీ కమ లాక్షుండు రుక్మిణీ యిటరమ్ము. జాంబవతీ యిది తెమ్ము. లక్షణాయటు పొమ్మని యీవిధముగ హృదయంగమోక్తులఁ బిలుచుచు వారి నెట్టి వేళ విడనాడక తిరుగుచుండు. ఇట్టి పుణ్యసాధ్వులే కదా యపవిత్ర మమార్దవంబైన స్త్రీత్వంబు పరమసాధువుగఁ జేయువారు. అని యిట్లు పలుకు పురతరుణుల వాక్యంబులు వినుచు శ్రీకృష్ణుండు సమందహాసావలోకనంబుల వారల నభినందించుచుఁ జని నిజరక్ష ణార్థంబు ధర్మజుండు పంపిన సేనావారంబుగొని స్నేహకారణంబున దూరాగతులై విడిచిపోవలేని కౌరవుల నెట్టెట్లో మరలించి ద్వార కాభిముఖుండై చనుచు మధ్యేమార్గంబున నుతంకాశ్రమమున నిలిచి

## —♦ శ్రీకృష్ణుం డుతంకు దర్శించుట. ♦—

నమ్మహాభావు సందర్శింప నతండును గృష్ణుండు కురు పాండవు లకు సంధికుదిర్చి వచ్చుచున్నాఁడని తలఁచి యాచేత మిగులఁ బ్రశం సించెఁగాని కృష్ణుండు పాండవావశేషంబుగ ససైన్యులై సబాంధవ ముగఁ గౌరవులును బాండవ సేనావారము హతమగుటవిని రోషించి యిట్లనియె. కృష్ణా! నీవు శక్తిమంతుఁడవయ్యు నయుభయంబుల సంధి కుదుర్పక యుపేక్షించి యెల్లభూపతుల హతులం గావించితివి. ఇట్టి నీ కీర్తి ప్రశంసనీయంబు గాదు. కావున నిన్ను శపించెద ననినఁ గృష్ణుఁ డిట్లనియె.

బ్రాహ్మణోత్తమా! నా ప్రత్యుత్తరంబు వినువఱకు క్షమిం పుము. ఆవల నీ యిష్టము వచ్చినట్లు గావింపుము. నీవు మహా తప

స్నంపన్నుండవని గురుభక్తుండవని యెఱుంగుదు. శ్రమించి తపశ్శక్తి నార్జించితివి. అట్టి నీ శక్తి వ్యర్థపడుటకు నా మనస్సు సమ్మతింపమిఁ జెప్పుచున్నాను. బ్రాహ్మణునకు క్షమ స్తవ్యముగాని క్రోధముగాదు. క్రోధంబునఁ దపస్సెల్ల నాశపఱచికొనెదవు? నీ శాపమువలన నా కెట్టి కీడును గలుగఁ జాలదుగాని నీ తపస్సు వ్యర్థవ్యయ మగుట మాత్రము సత్యము. నే నెవఁడని నీవు నన్ను శపింపఁదలఁచితివి? సత్త్వ రజస్తమస్సులు మూఁడును నన్నాశ్రయించి యుండును. బ్రహ్మ విష్ణ్వీశ నామంబుల నేన సృష్టిస్థితిలయంబులఁ గావింతు. ప్రణవాత్మ కుఁడను నేన. సర్వభూతములు నాయందున్నవి. నాగ గంధర్వ యక్ష, రాక్షసాది గణంబులెల్ల నావలనఁ గలిగినవని యెఱుంగుము. సదసత్తులని వ్యక్తావ్యక్తములని క్షరాక్షరములని చెప్పఁబడునవి సర్వ ము మదాత్మకములు. వైదికధర్మములన్నియు మదాత్మకములు. సదస త్తులు సదసత్తులకుఁ బరమైనది సర్వము నావలనఁ గలిగినవే, దేవ దేవుఁడును సనాతనుఁడు నైన నాకంటె పరమైనది వేఱొండు లేదు. ఓంకార మాదిగాఁగల వేదములు నేనని యెఱుంగుము. అధ్వ ర్యుఁడు కల్పకుఁడు హవిస్సు నుద్గాత సర్వము నేనని యెఱుంగుము. ప్రాయశ్చిత్తమునఁ జెప్పఁబడు మంగళవాచకంబులచే నన్నే స్తోత్రము చేయుదురు. సర్వభూత దయాత్మకమగు నా మనస్సునందు జనించిన జ్యేష్ఠపుత్రునిగ ధర్మ నెఱుంగుము. లోకమున నిప్పుడుండునట్టియు లోకమువిడిచి పోయినట్టియు వారి సాహాయ్యముచే నా పుత్రుని రక్షించుటకై యాయారూపముల వేసముల నానాయోనులయందు నేను ముల్లోకముల జనించుచుందును. నే నాకార్యార్థమె పుట్టి ముల్లోకముల విష్ణునని బ్రహ్మయని శక్రుఁడని పేరొందితి. సర్వభూత సమూహమునకు సృష్టికర్తను సంహారకర్తను నేన. నా స్వధర్మమును నేను విడువక పాపభోజనులగు వారినెల్ల సంహారించుచుండుదు. యుగ యుగమునఁ బ్రజల హితముఁగోరి ధర్మసేతువు కట్టుటకై యాయా యోనులయందు నేను ప్రవేశించుచుందును. భృగునందనా! దేవయోనులం దెప్పుడు ప్రవేశింతునో యప్పుడు నిస్సంశయ

ముగ దేవతలవలెనే వర్తింతును. గంధర్వయోనిఁ బ్రవేశించినప్పుడు సర్వము గంధర్వునివలెనే చరింతును. అట్టులే నాగ యక్ష రాక్షసు లందు జనించినప్పు డాయా కులమర్యాదల చొప్పున నడచుచుండుదు. ఇప్పుడు మనుష్యునియం దుండి వర్తించుటఁ జేసి మనుష్యులవలెనే చరింప వలయును గావునఁ గృపణుఁడనై కౌరవులఁ బ్రార్థించితి. వారు మోహపరవశులై నామాట పాటింపరైరి. క్రుద్ధుఁడనై గొప్ప ముప్పు తప్పదని చెప్పి భయపఱిచితిని. మరలి సౌమ్యము వహించితి. సామదానభేదమార్గముల సంధికై యెంతో శ్రమించితి. వా రధర్మ సంయుక్తులు గావునఁ గాలపాశవశులై ధర్మయుద్ధమునఁ జచ్చి స్వర్గ మేగిరి. లోకమునఁ బాండవులు కీర్తిభాజనులైరి. నీవడిగిన విషయము నంతయు వివరించితిని. అనిన నుతంకుం డిట్లనియె.

జనార్దనా! నీవు జగత్కర్తవని యెఱుంగుదు. నిస్సందేహ ముగ నాకీజ్ఞానము నీ యనుగ్రహఫలము. నామనస్సు నీయందు నిల్చుటచేతనే సుప్రసన్నమైయుండు. నా కోప ముపశమించె. కృష్ణా! నాయందు నీకనుగ్రహము కలదేని నీ వైష్ణవరూపంబుఁ గనఁ బఱుపుము. అనినఁ గృష్ణుం డాయనకుఁ దొల్లి యర్జునునకుఁ జూపిన వైష్ణవరూపంబుఁ గనఁబఱిచె. మహాభుజంబును, సహస్ర సూర్యప్రతి మంబును, జ్వాలత్పావకోపమంబును, సర్వతోముఖంబును నై యాకాశమెల్ల నావరించియుండు విశ్వరూపంబును గని విస్మయావిష్ట మనస్కుఁడై యుతంకుం డిట్లనియె.

విశ్వాత్మ! విశ్వకారణా! విశ్వసంభవ! నీపాదములు భూమి యంతయు వ్యాపించెను. శిర స్సాకాశము నంతయుఁ గప్పెను. అంతరాళ ముదరముచే వ్యాప్తము. హస్తములు దిక్కులు నిండెను. ఈ సర్వము నీవుగాఁ దోఁచెదవు. అక్షయ్య మనుత్తమమునగు రూప ముపసంహరింపుము. నీవు మరల నీశాశ్వతస్వరూపము ధరిం పుము. అని వేఁడినఁ గృష్ణుండును బ్రసన్నుఁడై వరంబుఁ గోరు మేసంశయ మనిన నతండును నాయందనుగ్రహించి నా కీరూపముఁ జూపితి చాలు. అనినఁ గృష్ణుఁడును మహాభాగా! నాదర్శనం

బమోఘము. నీకు వరమొసంగక పోరాదు. కోరుమనిన నేను వరము కోరు టవశ్యమని నీ యభిప్రాయమేని యీ యెడారియందు నేను గోరిన చోటనెల్ల జలంబు లభింపఁజేయుము, ఈ మరుభూమిని జలంబు దుర్లభం బనినఁ గృష్ణుండు నీకు జలంబు వలసినపుడు నన్ను స్మరింపుమని ద్వారక కరిగె.

ఆవల నొకపరి మరుభూమి సంచరించుచు నుతంకుండు తృషితుండై జలకాంక్షఁ గృష్ణుస్మరించె. అప్పుడు దిగంబరుండును మలసంకితగాత్రుండును శ్వయూథ పరివృతుండును భయంకరుండునునై యధఃకాయమునుండి నీరు స్రవించుచుండ నొకమాతంగుం డెదురఁ దోఁచి యుతంకునితో నిట్లనియె.

ఉతంకా! రమ్మ. పిపాసాపీడితుఁడవైన నిన్నుఁ గనిననుకంప పొడమెడిని. వచ్చి యీ జలంబుఁ ద్రావుమనినఁ దపస్వి యామాలని దేహంబునుండి స్రవించు నీరు గొననొల్లక యతని రూక్షంబుగఁ బలికెను. చండాలుఁడును బ్రాహ్మణా! రారమ్ము. అంబుపానంబు గావింపుమని పలుమాఱు పిలిచిన రోషకలితస్వాంతుడై యతండు త్రావనొల్లండయ్యె. ఇట్లు ప్రత్యాఖ్యాతుండై యాపుల్కసుండు కుక్కలతోడ నంద యదృశ్యుండయ్యె. అదిగని యుదంకుండు లజ్జించి యిది కృష్ణుని వంచన యని తలంచుచుండ నా మార్గంబుననే శంఖచక్రగదాధరుండైన శ్రీకృష్ణుం డరుదెంచిన నుదంకుం డిట్లనియె. కృష్ణా! బ్రాహ్మణునకు మాలవాని గొడలి నీళ్లు దప్పితీరఁ ద్రావనిచ్చు నీచరితంబు యుక్తంబుగాదు. అనినఁ గృష్ణుండు విప్రోత్తమా! నీయోగ్యతకు నీకెట్టిది ప్రియమో యట్టి దానినే నేను నీకొసంగితినిగాని నీవు తెలిసికొనలేక పోయితివి. నీ కమృత మిమ్మని నీకై నే నింద్రునిఁ బ్రార్థించితి. అతండును మర్త్యులమృతపానార్హులుగారని కావున మఱి యేవరమైన నాయన కిమ్మని వచించె. నేనును నమృతమే యిమ్మని మఱిమఱి బలవంతపెట్టితి. అంత నింద్రుండు ప్రసన్నుండై యిట్లనియె. ఆయన కమృతమే యవశ్యదేయ మందువేని నేను జండాలరూపంబు ధరించి యాఘన

కిచ్చెద. ఆయన దానిని గ్రహించెనా సరి. ప్రత్యాఖ్యానము చేసెనా నే నతని కెట్లును నమృత మీయంజాలనని సమయంబు పలికి యిట్లు గోచరించె. నీవును దిరస్కరించి పంపితివి. నేనేమి చేయుదును? అయినను మరల నీ కొక యుపకార మొనర్చెద. నీకుదకంబు కావలసినవేళ నన్ను స్మరింపుము. వారిదంబు లవారిగ వారిఁ గురియు వాని కుదంకమేఘంబులనియే పేరేర్పడును. అని యనుగ్రహించి కృష్ణుండు తిరోహితుండయ్యె. ఇప్పటికిని మరు భూమియం దుదంకమేఘములు వర్షించుచుండును. అట్లు కృష్ణుం డుదంకునకు వరమిచ్చిచని కురుజాంగల పంచాల శూరసేన బ్రహ్మావర్త కురుక్షేత్రమత్స్యసారస్వతంబులు దాఁటి మరుధన్వంబు నతిక్రమించి యానర్తంబుఁ జొచ్చె.

ఇట్లు స్వరాష్ట్రంబైన యానర్తంబుఁ జొచ్చి యచ్చటివారల విషాదంబు శమింపఁజేయునో నాఁ బాంచజన్యంబొత్తె, జగద్భయంకరులకు భయంకరంబైన యా నినదంబు విని తజ్జనపదంబుల జనంబులు రవికి దీపం బర్పించినట్లు పూజాద్రవ్యంబులు గొని యాత్మారాముండును బూర్ణకాముండును నగు నప్పురుషోత్తముఁ దండ్రిని బిడ్డలట్లే గదసి హర్షగద్గదవాక్యంబుల నిట్లనిరి.

కృష్ణా! శచీశ వాగీశ సనకసనందనాది వందితంబులును, క్షేమార్థులకుఁ బరాయణంబులును నగు నీ పదాంబుజంబులకు నమస్కరించుచున్నారము. మాకుఁ దల్లివైనను దండ్రివైనను దోడైనను నీడయైనను సుహృదుండవైనను గతివైనను గురుడవైనను దైవమైనను సర్వమ్ము నీవే కావున మా కెయ్యది యభ్యుదయంబో యది గావింపుము. నాకలోకవాసులకును జూడ దుర్లభంబై సుందరంబై ప్రేమస్మితస్నిగ్ధ నిరీక్షణంబైన నీ యాననంబును మేము చూడఁగలుగుట ధన్యులవార మైతిమి. అంబుజాక్షా! మిత్రదర్శనార్థంబు నీవు కురుమధు జనపదంబుల కరిగిన దినంబులందు నిమిష మొక కల్పంబై సూర్యుఁడులేని కన్నులవలె నగుదుము. అని వచింప భక్తవత్సలుండు వారి సమాధానపఱిచె. కృష్ణుని రాకవిని ద్వారకాపురవాసులు

నగరంబు నెల్లెడఁ బలువిధంబుల శృంగారించిరి. తోరణంబులు గట్టిరి. ధ్వజంబు లెత్తిరి. వాకిండ్ల రంగవల్లులు దీర్చిరి. యదుకుల శ్రేష్ఠుం డును శ్రేష్ఠుండు నగు హరి యాగమనంబు విని వసుదేవోగ్రసేనా క్రూరబలరాములును, ప్రద్యుమ్న చారుదేష్ణ సాంబాదులును హర్ష వేగంబున శయనాసన భోజనాదుల విడిచి యెచ్చట నెట్లున్నవా రట్టులే బయలుదేఱి దంతావళంబు మున్నిడుకొని బ్రాహ్మణ మంగళ పదార్థయుక్తులై యెదురేగిరి. లసత్కుండల కపోల వదనలగు వార ముఖ్యలును నుత్తమశ్లోక చరిత గానపరాయణులై నటనర్తక గంధర్వ సూత మాగధ వందులును జనిరి. ఇట్లు వచ్చినవారి నెల్లరఁ దగురీతి నాదరించి జనక గృహంబున కరిగి యేడ్వురు తల్లులకుఁ గృష్ణుండు సవినయంబుగ నమస్కరించె. స్నేహస్నుత *పయోధరలగు నా తల్లులు హర్షవిహ్వలితాత్మలై పుత్రునిఁ దొడపైఁ గూర్చుండఁబెట్టు కొని యానందాశ్రుల నతని శిరంబు నభిషేకించిరి. అంత వారల యనుమతిగొని సర్వకామ పూర్ణంబై యనుత్తమంబైన స్వగృహంబుఁ జొచ్చి షోడశసహస్ర పత్నుల ప్రాసాదంబుల కరిగె. వచ్చుచున్న చిరకాల ప్రవాసిఁ బ్రియుం దూరంబునంద కని సంజాత మనోమ హోత్సవలై రుక్మిణ్యాది పత్నులు వ్రతంబుతోడ † నాసన శయనాదుల విడిచి వెంటనే లేచి వ్రీడాలోచన వదనలై దేహంబులఁ గౌఁగిలింపఁ దడవు సహింపలేక దూరంబునంద మనంబుల మేనఁ బులకలెగయఁ గౌఁగిలించిరి. అంతఁగాంతుండు డాయఁ గుమారుల నందిచ్చు నెపం బునను, నేత్రంబులను, నంతరాత్మ చేతను నగాధ స్నేహయుక్తలైన యా సాధ్వులు పరిరంభించిరి.* వారు నిలుపుకొన నెంత యత్నిం చియు దార్ఢ్యంబులేని కారణంబున నా లజ్జావతుల కనుఁగొలఁకులనుండి

---

* స్నుత=చేఁపిన. † వ్రతము = క్రీడాం శరీరసంస్కారం, సమాజోత్సవ దర్శనం ! హాస్యం పరగృహేయానం, త్యజేత్ప్రోషిత భర్తృకా॥ యన్నట్లుశృంగార సుఖాదుల మానియున్న వ్రతము.

* వయస్సువచ్చిన పుత్రులు ప్రద్యుమ్న సాంబాదులు కూడనుండిన కారణముచే దేహములచేఁ బ్రత్యక్షముగఁ గౌఁగిలింప వలనుపడక పోవుటచేత.

బాష్పంబులు స్రవించె. కృష్ణుండును వారలనెల్లఁ దగురీతి నూరార్చె. ప్రేమభూములగు నవ్వారారోహలు కృష్ణుండు తమ పార్శ్వమం దుండినను, నేకాంతంబున నుండినను దచ్చరణ యుగళంబు వారికిఁ బ్రొత్తప్రొత్తలై కానిపింప నొకనిమిషమేనియు నాయనను విడనాడఁ జాలకుండిరి. చంచలయగు లక్ష్మియే తన స్వభావంబు విడిచి పేరు నిరర్థకంబుగ నెవ్వాని పాదంబుల విడువక యాశ్రయించు నట్టివాని నెవ్వారు వీడఁబాసి యుండనోపు. స్వమాయచే నరలోకంబున నవ తరించిన భగవంతుం డా స్త్రీలతోఁ బ్రాకృతునివలెఁ గ్రీడించుచు వారల సమ్మోదపఱుచుచుండె. పురహరుండును నెవ్వారి సుందర దరహాస భ్రూవిలాసంబులఁ గని చాపం బావల వైచె. మదనునకుఁ జాపలంబునఁ గానిపని నెవ్వారు కటాక్షలేశంబున సాధింతు రట్టి యుదారభావలు స్త్రీసహస్రంబులు కృష్ణుని మనంబును దమ వంచనో పాయంబుల మోహింపఁజేయఁజాలరైరి కాని కృష్ణుండును వారిని వన కేళుల జలక్రీడల వేలాపిపాసకరంబులఁ బలువిధంబుల నానందింపఁ జేయుచు విలాస గమనాలాపాలోకనస్మితంబుల నర్మహేలాపరిష్వంగం బుల వారి హృదయంబు నాఁచికొనియె. ఆ చారుహాసినులు మనం బెల్లఁ గృష్ణునందే నిలిపి యున్మత్తలవలె జడములవలెనై యితరకార్య ములు మాని యాయననే చింతించుచుఁ బలుకుఁగుడిగి యొక్కొక్క వేళ నిట్లు పలుకుచుండిరి.

ఓసి కురరీ! యీ రాత్రివేళఁ గృష్ణుండు నిద్రించుచుండ నీ వేటికే పండుకొనకుండ నొల్లక విలపించెదవు? నిద్రాభంగము గావించుట నీకుఁ దగునుసుమా. అపరాధము నీది కాదు. అరవిం దాక్షుని హాసోదార లీలావలోకనంబుల గాఢనిర్భిన్న హృదయవైన మావలె నీవును నిద్రగానక వగచెదవు కాంబోలు.

ఓసి చక్రవాకీ! యీ రేయి ప్రియునిఁ గానక కన్నులుమూసి కొని యున్నదానవా లేక యయ్యో సకరుణంబుగ విలపించుచున్న దానవా. మావలెఁ బతిదాస్యంబె పరమార్థసాధకంబుగ నెంచి శ్రీపాదంబును శిరంబున ధరింపందలఁచెదవా యేమి?

ఓయి సముద్రుఁడా! నీక నిద్దురలేక జాగరణంబుసేయుచు నెల్లవేళల నూరక ధ్వనించుచుందువు. మాకుఁ బట్టిన దుర్దశ నీకును బట్టెనా యేమి? కష్టము కష్టము. ముకుందుండు మా కుచకుంకుమాది లాంఛనంబుల హరించినట్లు నీ శ్రీకౌస్తుభాది లాంఛనంబులు కూడ హరించెఁగదా.

చంద్రుఁడా! బలితంబైన క్షయముచేఁ బీడితుఁడవగుటఁ గాఁబోలు నీ కిరణంబులచేఁ జీఁకట్లఁ జక్కఁగ విరియింపఁ జాలకున్నవాఁడవు. విరించిజనకుండు వచించిన రహస్యంబుల మఱచి తదేకచిత్తలమై స్తబ్ధవాక్కులమైన మావలె నీవును గానఁబడెదవు. ఓరి మందమారుతుఁడా! నీకు మేమేమి యప్రియము గావించితిమి. అనంగ జనకు నపాంగావలోకనంబుల నిర్భిన్నహృదయలమై తపించు మమ్ము నేరములేకయే మన్మథుని బ్రేరేంచి బాధింపఁ జేసెదవు.

ఓసి ముగ్ధా! యేల ధ్యానించెదవే. ముందు కొనవచ్చు వికాసోన్ముఖంబగు కుందసుమంబును గ్రహింపరాదా? నాకేటికే యీ హీనము. అట్లైన నీకెట్టి పుష్పమునందే ప్రీతి? శ్రుతిశిరోభూషావిశేషాయిత పున్నాగప్రియనే నేను. వానియందేమి విశేషమే. గళితసూనపున్నాగామోదప్రకర్షంబున గోవులును వానిని వెదకుచుండును. ఇంక నామాట చెప్పనేటికే.*

శ్రీమంతుఁడైన మేఘుఁడా! శ్రీకృష్ణునకు నిక్కముగ నీవే ప్రియుండవు. ఏలన మావలె నీవును శ్రీవత్సాంకు నిశ్చలత ధ్యానించు

*ముందు కొనవచ్చు కుందము=ముకుందము. హీనము = మువర్ణములేనిది. కుందగ్రహణము చేయరాదా యని యొకతె యడుగ నది నాకేటికి నేను ముకుందగ్రహణాభిలాష గలదానని వేఱొకతె ప్రత్యుత్తర మిచ్చుచున్నది. శ్రుతిశిరోభూషావిశేషాయిత పున్నాగప్రియను=(1) చెవియందు శిరస్సునందు భూషణము వంటిదైన సురపొన్నపూవునందుఁ బ్రీతిగలదానను (2) వేదశిరస్సునందు భూషణప్రాయమైన పురుషశ్రేష్ఠుని (కృష్ణుని) యందుఁ బ్రీతిగలదానను. గళితసూన = జాతిన పుట్టువులు గలయనఁగా నజుఁడని భావము. ఆమోదము = కల్యాణ గుణగణము. గోవులు = వేదవాక్యములు.

చున్నవాఁడవా ? ఉత్కంఠాతిరేఖంబునఁ మావలె దలఁచుకొని తలఁచుకొని నీవును మీఁదమీఁద బాష్పధారలఁ గార్చుచున్నవాఁడవు. ఇది యుక్తమే. ఆయన ప్రసంగము దుఃఖకరమని మేము నెఱుంగుదుము.

ఓ కోకిలా ! మాప్రియుని కంఠస్వరమువంటి స్వరముచే మృతసంజీవక వాక్కుల నీవు భాషించుచున్నావు. ఓకలకంఠమా ! నీకు మేలెది సేయఁగలమో చెప్పుము. శుకరాజమా ! యదుదేవ సచ్చరితంబుల గానంబొనర్పుము. విరహానల తప్తంబులైన మా హృదయంబులను రమారామారమణకథాసుధాధారలఁ దడిపితివేని నిన్నుఁ క్షీరంబుల నభిషేకింతుము.

క్షితిధరా ! కదలవు మెదలవు పలుకొక్కటైనఁ బలుకవు. ఏదో గొప్పవిషయం బాలోచించునట్లు తోఁచెడి. శ్రీకృష్ణు చరణంబులను బయోధరంబుల ధరించు కోరికగల మావలె నీవును శిఖరంబుల ధరింపఁ గోరెదవా ? సింధుసింధుర గమనలారా ! శ్రీకృష్ణు ప్రణయావలోకనములేక తపించు హృదయంబుల మిక్కిలి కృశించియుండు మావలె మీరును ప్రియభర్తృసంగమము గానలేక యెండఁబాఱిన మడుఁగులతో వాడిన కమలంబులతోఁ జిక్కియున్నవారు.

ఓ హంసమా ! నీకు స్వాగతము. ఇందు గూర్చుండుము. ఇవె పాలు ద్రావుము. మధువైరికథలఁ జెప్పుము. నీవు దూతవని యెఱింగితిమి. ఆ యజితునకు సేమమేకదా ? చంచల ప్రేమగల యతండు మాతోడ రహస్యంబుగ, జెప్పినపలుకులు స్మరించునా ! స్మరించుటచేఁగదా నన్ను మీకడకు మిమ్ముఁ దోడుకొనిరాఁ బంపెనందువా ! క్షుద్రదూతా ! మేమేల యతని భజింతుమే నీవే యా కాముని నిచ్చటికిఁ దోడ్కొనిరమ్ము పోకుము పోకుము, నిలిచి మాపలుకు విన్నము. మమ్ము వంచించి యొక శ్రీతోడ రమించుచున్నవాఁడు. మా స్త్రీలలో నట్టి యేకనిష్ఠగలది లక్ష్మి యొకతెయే. మే మట్టివారము గాముసుమా. అని యిట్లాభాషలు ప్రేమావేశ

భరంబునఁ గాతరచిత్తలై కృష్ణు సమక్షంబునను బరోక్షంబునను బలుకుచుండిరి. ఇంతయేల తదేకధ్యాన నిష్ఠాగరిష్ఠలైన యా ప్రేష్ఠలు కృష్ణుండు తమ కౌఁగిట నుండినను విస్మృతచిత్తలై మా కృష్ణుఁ డేఁడీ మా కృష్ణుఁ డేఁడీ కృష్ణాకృష్ణాయని పిలుచుచు రోయుచుందురు *

యోగీశ్వరేశ్వరుండైన శ్రీకృష్ణునందుఁ దదేకధ్యాననిష్ఠలై సర్వదా యాయననే చింతించుచు వారెల్ల ముక్తలైరి. తన పేరు విన్నంత మాత్రమున స్త్రీలమనంబు బలవంతంబుగ నాకర్షించు శ్రీకృష్ణుండుతన్నేకవిధములఁ బాడుచుఁ గనులారఁ గనుచునుండు సుందరుల డెందంబు లాకర్షించు టేమివింత? లోకభర్తను దమభర్తగాఁ గొని ప్రేమచేఁ బాదసంవాహనాదులఁ బరిచర్యసేయ నా తోయజాక్షు లెంత తపంబుసేసి జన్మించిరో. ఇట్లు వేదోక్తకర్మ లనుష్ఠించుచు గృహస్థుడై యుండి తదాశ్రమస్థులకు ధర్మార్థకామంబు లాచరించు మార్గంబుఁ దెలిపె. ఆయనకుఁ బదునాఱువేల యెనుబదినూర్ల మంది భార్యలైరి. అందురుక్మిణ్యాదు లెనమండ్రు ముఖ్యభార్యలు. అందఱు భార్యలకు నొక్కొక్కతెకుఁ బదుగురు పదుగురు పుత్రులు జనించిరి. అందఱిలోఁ బ్రద్యుమ్నుఁడు దీప్తిమంతుఁడు భానుఁడు సాంబుఁడు మిత్రుఁడు బృహద్భానుఁడు మిత్రవిందుఁడు వృకుఁ డరుణుఁడు పుష్కరుఁడు దేహబాహుఁడు శ్రుతదేవుఁడు సునందనుఁడు చిత్రభానుఁడు వరూథుఁడు కవిన్యగ్రోధుఁడు నను కొడుకులు ననిరుద్ధుఁడను మనుమఁడు ముఖ్యులు. త్రివక్రయం దుదయించిన పుత్రుం డుపశ్లోకుం డనువాఁడు కృష్ణానువ్రతుండై నారద శిష్యుఁడై ముక్తిదంబైన సాత్వతతంత్రంబు ప్రతిపత్తి సౌకర్యమునకై నాతిసంగ్రహంబుగ నాతివిస్తరంబుగ వచించె. అందే స్త్రీశూద్రదాసులకును విష్ణుప్రాపకంబులైన తాపపుండ్రాది సంస్కారంబులు పేర్కొనం

---

* దీనిని బోపదేవుఁడు వైచిత్ర్య విప్రలంభనమని తన ముక్తాఫలాది గ్రంథముల వ్రాసియున్నాఁడు. గొఱ్ఱె చంకఁబెట్టి గొల్ల వెదుకురీతి యని చంకలోబిడ్డ నుంచుకొని యూరంతయు వెదకు నిల్లాలనియుఁ గలదుగదా అత్యంత ప్రేమచేఁ గలుగు మైమఱపు దీనికిఁ గారణము. ఇదియే పరమ విరహాసక్తి.

బడిరి. యదుకులంబునఁ బుట్టినవారిసంఖ్యఁ జెప్పఁ దరంబుగాదు. యదుకుమారుల కాచార్యులే మూఁడుకోట్ల యెనుబదివేవురని యీక్షణ కారి శిష్యు లెందఱో, దేవాసుర యుద్ధంబులఁ జచ్చిన దానవులు ఘోరకర్ములు భూమియందు జన్మింప వారి నెల్ల వధింప భగవంతుఁడు కృష్ణుఁడు దేవతలతోడ ధరణి నవతరించె. వారె నూటొక్క కుల ముల వారైరి. ఇట్లవతరించి పరస్పర సంఘర్షణంబున వెదురుపొదల దహింపఁజేయు వాయువువలె నిరాయుధుండై రాజుల నెల్ల భారత రణరంబున మరణింపఁజేసి ధర్మనందనుచే ధరారాజ్యంబు ధర్మయుక్తం బుగఁ బాలింపజేసె.

అంత మఱికొన్ని దినంబులకు ధర్మజుం డశ్వమేధక్రతువు నుప క్రమించుచున్నాఁ డనినవార్త యాలకించి తదధ్వరంబుఁ జూడ బలభ ద్రాది బంధుసమేతుఁడై కృష్ణుండు సుభద్రం దోడ్కొని మరలి కరి నగరంబునకుఁ జనుదెంచె.

ఆ సమయంబునఁ బాండవు లశ్వమేధ ధనసంచయార్థంబు హిమవంతంబున కరిగియుండిరి. ధృతరాష్ట్ర విదురాదులు రామకృష్ణా దుల గౌరవించి తగిన విడుదుల డించిరి.

## —♦ శ్రీకృష్ణుం డుత్తరాకుమారు బ్రతికించుట. ♦—

ఇట్లు కృష్ణుండు హస్తినాపురంబున నుండుసమయంబున నుత్తర కుమారుఁ బ్రసవించె. ఆశిశువు జన్మించిన తోడనే యశ్వత్థామ ప్రయుక్త బ్రహ్మశిరోనామకాస్త్ర జ్వాలల మడిసె. అతని జననంబు విని హర్షాంబుధి నోలలాడు జనంబులు మఱునిమిషంబున శోకసాగ రంబున మునింగిరి. శిశుమృతి విని కృష్ణుఁడు యుయుధానుతోడ నంతఃపురంబునకుఁ బోయి తన్నుఁ జేరఁ గనుచు విలపించు కుంతిం గనియె. ఆమెయు జుట్టి ద్రౌపదీ సుభద్రలు దక్కిన బంధువుల భార్య లును గన్నీరు మున్నీరుగ [illegible]బులు గావించుచుండిరి. [illegible] కృష్ణుం గని యయ్యా కృష్ణా! నీ మేనల్లుని పుత్రుండు పుట్టినప్పుడె దశ్వత్థామాస్త్రజ్వాలల [illegible]. ఈ శిశువు

నంద మాయెల్లర ప్రాణంబులు పాండవుల ప్రాణంబు లున్నయవి. ఇతండు మృతుండైన మేమెల్ల హతులము. మా యందఱకుఁ బిండ ప్రదాన కార్యంబు భారం బీతనియందున్నది. ద్రౌణి యైషీకంబున బ్రహ్మాస్త్రంబు ప్రయోగించినపు డీ మృతబాలు బ్రతికించెదనని పలికితివి. నీమాట యిప్పుడు సార్థకపడనిమ్ము. అభిమన్యుం డుత్తరతోడఁ దొయ్యలీ! నీ తనయుఁడు నా మేనమామలతోడ నస్త్రశస్త్రాది విద్యలును రాజనీతి శాస్త్రంబులును గఱచునని చెప్పుచుండె. అతని వాక్యంబులు బొల్లుపోనీకుము. నీవే మాకు దిక్కు. నీవే గతియని హా యని యేడ్చుచు నేలఁబడియె.

సుభద్రయు సోదరుం డాసి యన్నా! యర్జును మనుమం డేగతి పాలాయెఁ గంటివే. భీమసేనుపై ద్రౌణి ప్రయోగించిన బాణ ముత్తరా విజయుల మీఁదను నామీఁదను బడియె. నా కనుఁ ప్రోల నా మృతశిశు వుండుటచే నాయస్త్రంబు నాహృదయం బున నాటి వదలిపోకున్నది. ఈ వార్తవిని ధర్మజభీమార్జున నకులసహదేవు లేగతిఁ బోదురు? కృష్ణా! పాండవులకెల్ల నభిమన్యుండు ప్రీతి పాత్రుండు. వారి ప్రాణంబులెల్ల నీశిశువునంద నిలిపియున్నవారు. అశ్వత్థామ పాండవ స్త్రీగర్భదాహంబు గావించిన సమయంబున నీవు కుపితుండవై యోరీ బ్రాహ్మణాపశదా! నీ వుత్తరాగర్భస్థ శిశువును వధించితివేని నేను వానికి మరల బ్రాణము లిచ్చెద నంటివి. ఏదీ యిప్పుడీయభిమన్యు పుత్రుని బ్రతికింపుము. ఈ నిసుంగు పునర్జీవితుండు కాఁడేని నాకును వానితోడిద గతియని నమ్ముమని విలపింప వారినెల్లర నూరార్చి శ్రీకృష్ణుండు శిశువును బ్రతికింతును బోదము రండని పురుటిల్లు డాయనేగె. ద్రౌపదీ సుభద్రలు మున్నుగాఁ జని యుత్తరా! శ్రీకృష్ణు డిట కరుదెంచుచున్నవాఁడని చెప్పిన నయ్యామయు వస్త్రంబు సవరించుకొని పాపని నెత్తికొనివచ్చి వెన్నుని పదంబులపై వైచి శోకంబు రూపంబుగొనినరీతియై కంసారాతితో నిట్లనియె;

గోవిందా నమస్కారంబులు. వీఁడె నీ మేనల్లుని పుత్త్రుండు. చూడుము. అశ్వత్థామాస్త్రంబునఁ జూఁడి ప్రాణమువీఁడి పడియు

న్నవాఁడు. ఈఘోరకార్యంబొనర్చి యాబ్రాహ్మణుం డేమిలాభంబు పొందఁగలఁడో కదా. వానిగతి యెట్లయిన నగుఁగాక. ఆయన యస్త్రంబున శిశువుమాత్రమే గాక నేనును నభిమన్యుండును గూడ హతులమైతిమి. కృష్ణా! యీశిశువును బ్రతికింతునని మున్నె వాగ్దాన మొనర్చితివి. ఈ శిశువు మరల లబ్ధజీవుఁడు గాఁడేని నేను భూమిపై జీవించుదానఁ గాను. వీనితండ్రి యెంత కృతఘ్నుఁడో యెంత నిర్దయుఁడో వీఁడు నట్టివాఁడవై పైతృక రాజ్యలక్ష్మినెల్ల వదలి స్వేచ్ఛమైఁ జనియె. అభిమన్యుండు రణరంగమునకుఁ బోవువేళ నీవు రణమున మరణముగాంచితివేని నేను సహగమనంబు గావింతునని బాస చేసితిఁగాని ఛీ పాపిష్ఠ ప్రాణాశ కారణంబునను నీ శిశువు హేతువునను నట్లుగావింపనైతి. ఇప్పుడు నే నందులకుఁ బోయితినేని నా ప్రాణేశ్వరుఁడు నన్నేమనునని పెక్కుతెఱంగులఁ బ్రలపించి చీర తొలంగి పోవుటయు నెఱుంగక మూర్ఛిల్లి నేలవ్రాలె. సుభద్రా ద్రౌపదీ కుంతులు నట్టివార యైరి. అప్పుడు వారినెల్లర నూరార్చి కృష్ణుం డాచమించి సుదర్శన ప్రయోగంబున బ్రహ్మాస్త్రం బుపశమింపఁజేసి యా యర్భకుంగని నిర్మలచిత్తుండై యెల్లరు విన నిట్లనియె.

ఉత్తరా! నే నింతకు మున్ను కల్లలాడినవాఁడనుగాను. నావాక్యంబులు సత్యంబులగుఁ జూడుమని "నేను నవ్వులకైన నసృతమాడనేని, యుద్ధమునుండి మరలనేని యీశిశువు ప్రాణయుక్తుం డగుఁగాక. నాకు ధర్మంబు ప్రియంబేని నంతకంటె బ్రాహ్మణులును బ్రియులగుట సత్యమేని యభిమన్యు సుతుండు లబ్ధజీవుం డగుఁగాక. అర్జునుపట్ల నే నెన్నఁడు విరోధభావంబు వహించినవాఁడఁ గానేని యీశిశువు బ్రతుకుఁగాక. సత్యము ధర్మము నాయందు నిత్యంబుగఁ బ్రతిష్ఠితంబులై యుండునేని యీ బాలుఁడు ప్రాణయుక్తుం డగుఁగాక. కంస కేశులను ధర్మమార్గమున నేను వధించియుండుట సత్యమేని యీ కుమారుఁడు పునర్జీవితుఁ డగునుగాక" యని వచించి శ్రీకృష్ణుండు దేవతార్చితమైన పాదతలంబున నాకుఱ్ఱని నాపాదమస్తకంబు స్పృశించె. తత్క్షణంబున నాశిశువు లబ్ధప్రాణుండై [illegible] నారంభించె. ఎల్లవా

రును దాము పునర్లబ్ధ జీవితులమని సంతసించిరి. హిమవంతంబునుండి మరలి వచ్చిన పాండవులును దద్వార్త విని నష్టవంశం బంకురించె నని ప్రమోదాయత్త చిత్తులైరి. ఆవల నశ్వమేధం బుపక్రమింపఁ బడియె. అశ్వపాలకుండై యర్జునుం డరిగి హింసాభిరతుండుగాక యజ్ఞియాశ్వంబుఁ బట్టిన రాజుల నోడించె.

---

## చిత్రలీల.

---

### హంసధ్వజుండు యజ్ఞాశ్వంబును బట్టుట.

ఆ యశ్వంబు సకలదేశ సంచారముచేయుచుంబోయి చంపకా పుర ప్రాంతంబున నిర్భయ స్వాంతంబున విహరింపఁ దద్వృత్తాంతంబు భటులు తత్పురవల్లభుండైన హంసధ్వజున కెఱింగించిన నతం డిట్లు తలపోసె. దైవానుగ్రహంబున భగవద్దర్శనంబునకు నాకు మంచి సమయం బొదవె. ఈ మఖవాజిని నేఁ బట్టిన విడిపింప నర్జునుండు చాలఁడు. కావునఁ దద్రక్షణార్థంబు కృష్ణుఁ డవశ్యంబు వచ్చు. నాకు దర్శనం బిచ్చునని తలఁచి యత్తురగంబును బట్టి కట్టివైవ యోధుల నియమించి యుద్ధసన్నద్ధుండై సమస్త సేనలతో బురంబు నిర్గమించి చనుచు శంఖ లిఖితులను పురోహితులతో నిట్లనియె. బ్రాహ్మణోత్త ములారా! యశ్వనిరోధంబున బలవద్విరోధంబు ఘటిల్లె. రణకరణ చణుండైన పురుషుఁ డొక్కండేని నగరంబున నిలువరాదు. సేనను వెంబడింపక వెనుఁబడిన జనునిఁ దప్తతైల కటాహంబునఁ ద్రోయుఁ డని యాజ్ఞాపించె. ఆ హంసధ్వజునకు సురథుఁడు, సుధన్వుఁడు, సుబలుఁడు, ధర్మబాహుఁడను కుమారులు నలుగురు గలరు. అందు సుధన్వుఁడు తల్లికి సోదరికి వందనమాచరించి యాశీర్వచనంబు గైకొని తన మందిరంబున కరిగి నిజసతియగు ప్రభావతికిఁ దన సమర గమనంబు వచించిన న య్యించుఁబోఁడి యా వల్లభున కిట్లనియె.

## ప్రభావతి సుధన్వుని యుద్ధమునకుఁ బోనీక యాఁగుట.

ప్రాణేశ్వరా! సంగరరంగంబునకు నీవు పోవలదని వారింపను, నీవు నేఁటిదాఁక ఋతుధర్మము తప్పని ధర్మశీలివిగాన నా కోర్కిదీర్చి పదపడి యేగుమనిన నతం డిట్లనియె. కామినీ! యిదేటిమాట. దాని కిదాసమయము? రాజు సర్వసేనతోఁ బురంబు నిర్గమించె. వెనుఁబడిన వారిని గ్రాఁగెడునూనె కాగులో వైవుఁడని యాజ్ఞాపించె. నేఁబోక యింతకుఁ దడవాయె. ఇంకను దడసినఁగార్యంబు తప్పు. ధర్మశీలివని నన్నుఁ బ్రశంసించితివి. అట్టివాఁ డెట్లు నీతోడ దివాసంగమంబుఁ గావించుఁ జెప్పుము. నీవు యువతివి. ఋతుకాలంబునకుఁ గొఱంతి లేదు. కావున సంకిలిపెట్టక పోనిమ్మనినఁ గామశరపీడితయగు నప్పడఁతి యిట్లనియె.

నాథా! ప్రీతియుఁ బరలోకభీతియుఁ దప్పి యిట్లు భాషించెద వేల? నేఁటితోఁ బదునాలుదినంబులు నిండె. రాజాజ్ఞోల్లంఘనంబున గ్రాఁగెడునూనెలో భటులు వైతురని జడిసెదవుగాని భ్రూణహత్యకు నిన్ను యమకింకరు లేమిచేసెదరో యెఱుంగవైతివి. అని యాతనిం బోనీయక యురంబున నిజగురుపయోధరంబులు బిగ్గనొత్తుచు నమ్మత్తకాశిని శ్రీగంధవృక్షంబును నాఁడుపాము పెనఁగొన్నట్లు తత్తఱంబున నతనిఁ గాఁగిలించి పాన్పుపైకిం గొనిపోయి తన కార్యంబు ముగించుకొని విడిచె.

## సుధన్వుఁడు తప్తతైలంబునఁ ద్రోయఁబడుట.

ఇట్లు ప్రబుద్ధుండు మదనాజ్ఞాబద్ధుండై ప్రియాంగనాకరవల్లీ నిబద్ధుండై యుండ సుధన్వుండు సమరాంగణంబునకు రాక యింటనిలిచెనని హంసధ్వజుండు విని కనలి యతనిఁ బట్టి కట్టి తప్తతైలంబునఁ ద్రోయ శంఖలిఖితుల కప్పగింపుఁడని భటుల కాజ్ఞాపించె. వారును జని తమ కెదురైె సంగ్రామోత్సాహంబున నేతెంచు రా కుమారుఁ గని రాజాజ్ఞనుల్లంఘించిన నతండు పతియాజ్ఞయు, జనకాజ్ఞయు,

రాజాజ్ఞయు ననుల్లంఘనీయంబులు. పతియు జనకుఁడు రాజునగు నా తండ్రియాజ్ఞ యెట్లు నుల్లంఘింతునని వారికిఁ బట్టుపడి శంఖలిఖితుల యొద్దకుఁబోవ వా రతని నెల్లరు చూచుచుండఁ దప్తతైల కటాహంబునఁ ద్రోచిరి. సుధన్వుఁడును హరిహరీయని సలసలఁ గ్రాఁగు కాఁగు నందు దుమికె. ఇట్లతఁడు దుముక నా తైలంబు చిటపటలులేక పొంగక పొరలక నురుగులేక యెప్పటియట్ల యుండె. కంఠదఘ్నంబయిన యా నూనెయందు నాతని వదనకమలము కాళిందీజలంబులోని యరవిందంబుఁ బోలుచుండెఁగాని వాడదు, కాంతి వీడదు. అదిగని శంఖలిఖితులు నూనె క్రాఁగదో యింద్రజాలమోయని సంశయించి నారికేళంబొండు దానవైచిన నది పటాలుమని పగిలి పెంచి కలై చుట్టియున్న ప్రజల నొప్పించె. అప్పు డా శంఖలిఖితు లా నృపనందను నొప్పిరవెడలించి యితండు ప్రహ్లాదుంబోలె నత్యంత హరిభక్తుండు. నిష్కారణ మితని నొప్పించితిమి. దీనికిఁ బ్రాయచిత్తము వేఱొండులేదని తా మా తైలంబున దుమికిరి. వారి కృత్యంబునకు దేవతలు హర్షించి వారి నిరువుర నిరపాయులఁ జేసిరి. రా జీవార్త సమగ్రంబుగ నాలకించి యందఱ క్షమించె.

## —♦ అర్జున సుధన్వుల యుద్ధము. ♦—

సుధన్వుండును సర్వసేనాధిపత్యంబు గైకొని రయంబునఁజనీ యనికిఁ గడఁగి కిరీటిం దాఁకి వీఁక మెయి యనీకంబొనరించి మించి యర్జునా! మున్ను వెన్నుండు సారథియైయుండ నీ బంటుతనంబు సెల్లె. ఇం దయ్యాటలు పాటికిరావని పరాక్రమించి యతని సారథిం ద్రుంచి శరపరంపర నొప్పించిన విజయుండును జేయునదిలేక కృష్ణు స్మరించె. కంసాంతకుండును గర్ణాంతకుఁ దేరిపై సన్నిహితుండై పగ్గంబులు గేలఁగొనియె. అదిగని ఫల్గునా! నీకు వాసుదేవుండు తోడయ్యె. కానిమ్ము. వితగా నలుగులు సెలవగు నాలం బేటికి? ధీరుఁడవేని ప్రతిన పట్టుమన నతండు శరత్రయంబున నీ శిరంబు ధరడొల్ల నేసెద. వేయనైతినేని సగాండీవంబుగ నగ్నిఁజొచ్చెదననియె. సుధన్వుండును నీవడ

రించు బాణముల మూఁటిని ద్రుంపకున్న బ్రహ్మహత్యాపాతకుఁడనై సర్వ పుణ్యంబులు నశింప నరకంబున కేగెదనని శరశతకంబు ప్రయోగింప నవ్వేగంబునకు నర్జును తేరు కుమ్మరిసారెపోలె దిర్దిరఁ దిరిగె. కృష్ణుం డెట్టకేలకు దాని నదిమిపట్టి యాఖండలుపట్టితో నిట్లనియె.

సాహసప్రియా! నాతో నాలోచింపక నీవు దుష్కరంబైన ప్రతిన పట్టితివి. వీఁడేకపత్నీవ్రతుఁడగుట నీ కసాధ్యుండు సుమా యనిన నర్జునుం డిట్లనియె.

నీతోడ నాలోచించియా భక్తులు కోరికలఁ గోరెదరు. వారు కోరు కోరికల నొడఁగూర్చుభారము నీది. నా భక్తుల యోగక్షేమము నేన వహింతునని నీవు పలుకలేదా? ఇంతకుఁ బ్రేరకుఁడవు నీవుగాక మఱియెవరని యొక శరము వింట సంధించి సుధన్వుపై నైచె. కృష్ణుండును దాను గోవర్ధనమెత్తిన తేజంబు దానియందునిచె. సుధ న్వుండును నబ్బాణంబును దుత్తునుకలుచేసి పార్థునొప్పించిన నతండు రెండవ నారాచంబు సంధించె. శ్రీకృష్ణుండు విశ్వభూదానఫలం బద్దానియందుంచె. సుధన్వుండు దానిని ఖండించె. ఇట్లు రెండమ్ములు వమ్మలై దుమ్ములోఁగలసిన రోషంబు భీషణంబుగ నర్జుండు మూఁడవ నారసంబు తెగనిండఁదీసి నైచిన నందు శ్రీకృష్ణుండు నిజతేజో విశేషంబును రామావతార సంచితంబగు సముచిత పుణ్యఫలం బును బాణఫలంబునఁ బ్రతిష్ఠించె. ఇట్లు తీవ్రంబై వచ్చు నా శిలీ ముఖంబును సుధన్వుం డొక్కబాణంబున రెండుగ ఖండించె. ఖండించినను నది వ్యర్థంబుగాక యందు ముంగలితునుక తటాలున నెగసివచ్చి సుధన్వుశిరంబు నఱికిన నది హరినామస్మరణంబు గావిం చుచు వియచ్చరను చరణంబుల వ్రాలఁబడియె. అతని తేజంబు కృష్ణునందుఁ గలసె.

అతనిపాటు గని సురథుండు క్రోధానల దందహ్యమానుం డగుచు శ్వేతవాహనుఁదాఁకి పుంఖానుపుంఖంబులుగ శరవారం బవారిగఁ గురిసిన నరుండును నీడఁబోక యతనితో మహాహవం బొన రించి యతనివధించె. పుత్రశోక సంతప్తుఁడయ్యు వీరవ్రతనిష్ఠుఁడై

హంసధ్వజుండు హనుమద్ధ్వజుతోఁ గయ్యంబుసేయరాఁ గృష్ణుండు తేరుడిగ్గి యతని డాయనేగ నతండును రథావరోహణంబు గావించి కృష్ణుఁ జేరనరిగె. కృష్ణుండతని నూరార్చి మాతోడ నీకేల యాలంబు. నీ యట్టివాఁడు యజ్ఞవిఘ్నంబాపాదింప నెత్తికొనఁదగ వేయని సమాదానపఱిచి నెయ్యంబు పాటింపఁజేసె.

ఆవల నాహయంబు చనునెడఁ బ్రోవలో మయూరధ్వజుండను రత్నపురాధినేత యశ్వమేధంబు సేయ సమకట్టి తనపట్టి తామ్రధ్వజుండు రక్షకుండుగా విడిచిన యశ్వం బెదురయ్యె. అంతఁ దామ్రధ్వజ కపిధ్వజసేనలకు హోరాహోరి పోరు ఘోరంబయ్యె. తామ్రధ్వజుండు కిరీటిం దాఁకి నిశితవిశిఖ జాలంబుల డీలుపడఁ జేసినఁ గని కృష్ణుండు వీఁడు క్రీడికి నసాధ్యుఁడని యతనిపై వైవఁ జక్రంబుఁ గొనుటయుఁ దామ్రధ్వజుండు దిగ్గన నాయన మీఁదికి లంఘించి చక్రంబుతోడి కేలుపట్టి నులిమి తనపై నరుండేయు శరంబుల సరకుసేయక యిరువుర మూర్ఛితులఁజేసి యర్జును సవనాశ్వంబుఁ గొని నిజపురంబునకుం జని గుంతీదేవకీసుతుల నిర్జించి హయంబుఁ గొని తెచ్చుట విన్నవింప ఖిన్నుడై మన్నీఁ డిట్లనియె.

కుమారా! బాల్యంబున నెంతటి యకార్యంబొనర్చితివి. యజ్ఞరూపియు యజ్ఞఫలప్రదాతయు కృష్ణుండెకదా. అట్టి యప్పురుషోత్తము నొప్పించిన మన జన్మంబెవ్వనికి నెక్కు? ఆయన చరణంబు శరణంబని మెప్పింప వలయునుగాని రణంబు కారణంబుగ నొప్పింపఁదగునా? ఆయన మనకొసంగిన బలపరాక్రమంబు లాయనపై విక్రమించుటకా? కార్యంబు దప్పె. ఇప్పుడు వా రెందున్నవారో రేయి యయ్యె. వేకువఁ దరలి మరల వారి వారువంబు వారి కర్పింపవలయునని భార్యాయుక్తుఁడై యాలోచించు చుండె.

సవనహయంబు గానరామికిఁ బాండవసైన్యంబు దైన్యంబు నొంది కర్తవ్యతామూఢమైయుండ నర్జునుండు కృష్ణుంగని వాసుదేవా! మనతో దురంబొనర్చిన వీరుం డశ్వంబుగొని యెందేగె,

వధింపుము. కయ్యంబున వాని మట్టుపెట్టి మన తురంగంబుఁ జయ్యన నే దెచ్చెద ననినఁ గృష్ణుం డిట్లనియె.

## కృష్ణార్జునులు మయూరధ్వజు పురంబునకు బ్రాహ్మణ వేషంబులఁ బోవుట.

మనతోడ రణంబొనర్చిన శూరుండు రత్నపురినాయకుండైన మయూరధ్వజపుత్రుండు గుఱ్ఱంబునుగొని పురంబునకరిగె. వారి తెంపుసొంపు చూడ నభిలషింతువేని నా వెంటరమ్మని సేనలనెల్లఁ దత్పురంబు వెలుపల నిలిపి తాను ముసలిబ్రాహ్మణవేషంబు ధరించి బ్రహ్మచారియై యర్జునుండు తోడరా రేయియయ్యు గృహకుడ్య రత్న కాంతుల కతంబునఁ జీకటియనునది యెఱుంగని రత్నపురంబుఁ బ్రవేశించి వీథులవెంటఁజనుచు నప్పౌరులు సరససల్లాపములఁదను హరినామకీర్తనంబు గావించు వర్తనంబునకు నబ్బురపడు బలసూదను నందనుతోడ వేగుఁబోకదాఁక నొక్కెడనిలిచి వేకువ స్నానసంధ్యాది క్రియాకలాపంబులు నిర్వర్తించి యజ్ఞవాటంబునకుఁజని దీక్షితుండై పుత్ర మిత్ర కళత్రామాత్యపురోహిత సహితుండై యున్న య న్నరేంద్రుఁగని యాశీర్వదింప నమ్మహీరమణుం డిట్లనియె.

బ్రాహ్మణోత్తమా ! నేను నమస్కరించుటకుమున్న నీ వాశీర్వదించుట శపించుటగదా యనిన మాయావిప్రుఁ డిట్లనియె. రాజేంద్రా! మే మర్థులమై నిన్నర్థింప వచ్చినవారమగుట మున్నుగ నాశీర్వదించితిమి. దాన నీకు లగ్గుగాని యెగ్గులేదు. నీ వర్థిజనకల్ప భూజమని విశ్వసించి వచ్చితిమి. ఇచ్చెదవేని చెప్పెద ననిన నతం డిట్లనియె.

ధరామరా ! నాయొద్దకు వచ్చిన యర్థులు వ్యర్థులై పోయిన వారు లేరు. ఏదికోరిన నిచ్చెద ననినఁ గృష్ణుం డిట్లనియె.

నృపాలా! నేను ధర్మపురవాసిని. పేరఁ గృష్ణశర్ముఁడ. ఇతండు నాశిష్యుఁడు. నీ పురోహితుండగు సుశీలునింటఁ గన్నియ యుంట

విని నా పుత్రునకడుగువాఁడనై యతనితోడ నీపురప్రాంత కాంతారంబున వచ్చుచో నొకసింగం బాఁకటిపెల్లున నాసుతుంబట్టికొనియె. నేనును మృగరాజా! నాకొక్కండె కుమారుండు. వీనిని నీవు వధించిన నార్ధ్వ్యకక్రియాశూన్యుఁడనై నివాపంబులకుఁదొలంగి నరకంబు పాలఁబడుదు. నా శరీరంబు భక్షించి యతని విడువుమని వేఁడిన నాహర్యక్షం బిట్లనియె.

తపంబులఁ గృశించి యెముకలగూఁడై యున్న నీమేన నెత్తురా మాంసమా యేమున్నదని నిన్నుఁదిందును. ఈయూరిరాజు లెస్సదిని పోతరించి యున్నవాఁడు. వాని శరీరంబున వలపటిసగంబుఁ గొనివచ్చి యిచ్చి నీ యిచ్చుచొప్పున నీ కుమారుఁ దోడ్కొనిపొమ్ము. నీవచ్చునంతకు నంతకుపాలి కనుపక నీసుతుఁ గాచెద ననియె. రాజా! బ్రాహ్మణుఁడను. వృద్ధుఁడను. ఏకపుత్రికుఁడను. నా యూర్ధ్వలోకంబులు నీ హస్తగతంబులై యున్నవి. సత్యనిష్ఠుఁడవై సింహంబు కోర్కి దీర్చెదవేని వల్లెయనుము. మరణభీతుఁడవేని పొమ్మనినఁ బోయెదమనిన నప్పుడమి తేఁ డిట్లనియె.

ఆడి తప్పుటయుఁ బరస్త్రీఁ గామించుటయు, నాకుఁ గాని వావి. నీపుత్రు రక్షించెద. భయపడకుమని జ్యేష్ఠనందనుండైన సుచిత్రుని రాజ్యాభిషిక్తుం గావించి యజ్ఞవాటంబునందు వేదిపై హరినామస్మరణంబు గావించుచుఁ గూర్చుండె. అప్పు డాయన ధర్మపత్ని కుముద్వతి యరుదెంచి ప్రాణేశ్వరా! నీలో సగభాగంబ కదా బ్రాహ్మణుఁడు కోరె. భర్తలో సగము దేహము భార్యకదా. నే నాసింగంబునకు నాహారంబుగఁ బోయెద. నీవు లెమ్మనిన నందనుం డరుదెంచి జనకా! పితా వై పుత్ర యనుశ్రుతి కలదుగదా. తండ్రియే సుతుఁడై జనించును గావున నీ మాఱు నేఁ బోయెద ననినఁ గపటబ్రాహ్మణుం డిట్లనియె.

స్త్రీభాగంబు త్యాజ్యంబనికదా సింగంబు కుడివైపు మాత్రము కోరె. అదియునుగాక నప్పాడుమృగము దయాహీనమై సతియొక వంకను సుతుఁ డొకవంకను అంపమును బట్టుకొని కోయవలయు

నవియు నిర్దేశించె. అనిన నట్లు కానిమ్మని రాజు దారసుతుల సమాధానపఱిచిన వారిరువురు అంపముఁగొని రాజుశిరంబుఁ గోయఁ దొడంగిరి. ఆ సమయంబున నా నృపాలు నెడమకంట నీరు స్రవించె. అదిగని విప్రుండీ యేడుపుఁగొట్టు దానంబు నాకేల? దుఃఖించుచు నిచ్చు దానంబు పాపనిదానంబు గావున గ్రాహ్యంబు కాదని పోవం దొడంగిన నతీసుత బోధితుండై ధరాకాంతుఁడు భూమీసురుతో నిట్లనియె.

ఆర్యోత్తమా! నీవు దక్షిణదేహార్ధంబు యాచించితివి. ఆ వైపు కన్నీరు రాదయ్యె. దక్షిణార్ధంబు మాత్రము దానపాత్రంబయ్యె నేఁ గానైతిఁగాయని వామార్ధంబు శోకించెఁగాని బాధచే నేనేడ్చి యుండిన నిరువైపు నీరుగాఱియుండదా? కావున నీ భాగంబుఁ గొమ్మ నిశ నమ్మన్నిని వాక్యంబులకుఁ గృష్ణుండు హర్షించి యిట్లనియె. వదాన్యోత్తమా! నీ ధైర్యంబు దానదీక్షాస్థైర్యంబు శ్లాఘ్యంబు సంతసించితి. ఇఁక నీవు యజ్ఞకర్మ మారంభింపుమని హస్తమస్తక సంయోగంబున నిర్విఘ్నం గావించిన నతం డిట్లనియె.

దేవాదిదేవా! దేవతాసార్వభౌమా! యజ్ఞ దానతపంబులు నీవు ప్రసన్నుఁడవగుటకే కదా కర్తవ్యంబులు. నీవు ప్రత్యక్షమై సంతోషించితివనుచుండ నా కిఁకఁ గర్మంబులఁ జేయనేల? నా తనూ జాతుం డవినీతుండై ధనంబుఁ బాఱవైచి యుంతఁ దెచ్చినట్లు నిన్ను విడనాడి తురంగంబుఁ గొనివచ్చె. అయిన నదియు ఫలకారి యయ్యె. నా సుతు నేరంబు క్షమింపుమనినఁ గృష్ణుండును నతని సంతుష్టిఁజేసి పురందర నందనుతోడ మూఁ డహోరాత్రంబులందుండి యావల హస్తినాపురంబునకు ముందుగ నొంటిమైఁజని యర్జునురాక ధర్మనందనున కెఱింగించె. ధర్మనందనుండును దమ్ముని సుఖాగమనంబు విని హర్షించి శ్రీకృష్ణుం గని యిట్లనియె.

కృష్ణా! చిరకాలముగ నన్నొక సందేహము బాధించుచున్న యది. అర్జునుండు మాలో మిగుల బుద్ధిమంతుఁడు, సుగుణనిధి. ఇ

ట్లుండియు నెక్కువ కష్టముల కతఁడే పాలగుచున్నాఁడు. దీర్ఘ కాలము ప్రవాసియై బాటసారివలెఁ ద్రోవనడచుటయందే యాయన కాలము వ్యయమగుటచే సతతము దుఃఖభాగి యగుచున్నాఁడు. ఇంత కాయన దేహలక్షణంబులందు దోషమేదియుఁ గానరాదు. నీ వెఱుఁగుదు వేని కారణము వచింపు మనినఁ గృష్ణుం డిట్లనియె.

ధర్మనందనా ! నీవు వచించినది సత్యము. ఆయనయందు దోష మేదియుఁ గానరాదుగాని పిక్కలు వాని క్రిందిభాగ మొక్కటిగ బలిసి యుండుటయే దోషము. దానిచే దుఃఖభోగియయ్యె. అనినఁ దన ప్రియునందు దోషము వచించెనని యసుభూషణుం జుఱచుఱ ద్రౌపది యోరగంటఁ జూచె. ఇట్లు తన సఖుండగు నర్జునునెడఁ దన సఖియగు పాంచాలి కనఁబఱిచిన ప్రియంబునఁ గృష్ణుండును సంతసిల్లె. ఆవల నర్జునుండు సహాశ్వుండై పురంబు బ్రవేశించె. యథావిధి యజ్ఞంబు సాంతంబుగఁ బ్రవర్తిల్లె. యజ్ఞాంతంబునఁ గృష్ణాదులు మరల ద్వారక కరిగిరి.

---

## గర్వభంజన లీల.

### శ్రీకృష్ణుండు రుక్మిణీదేవితో నర్మోక్తులాడుట.

సంసారసాగరంబున మునిఁగి తేలు జీవకోటి స్వకైంకర్యంబునఁ దరింపఁ గరుణాపరుండై కరణకళేబరంబుల నొసఁగియు దరిగానక దుఃఖించునెడఁ బ్రళయకాలంబున విశ్రాంతిరూపంబైన హితమాచరించియు రక్షించు లీలాకల్పిత విశ్వుండు విశ్వేశ్వరుండు జగద్గురుండు స్వకృతధర్మ మర్యాదలఁ బాలించుకొఱకు యదుకులంబునఁ బుట్టిన సనాతనుం డజుం డొక్క రాకానిశాకాలంబునఁ బూర్ణచంద్రోదయ సమయంబున రుక్మిణీ గృహంబున సద్యఃఫుల్లమల్లికామతల్లికాదామంబులచేతను, వాని సువాసనల కాసపడి వడివడిఁ బఱతెంచు తుమ్మెదల చేతను, వాతాయన రంధ్రమార్గంబుల లోనికరుదెంచు తొగలచెలి కాని తొగరు వెలుంగులచేతను, బరిసర పారిజాతనవవనామోదవాత

పోతంబులచేతను జాలరంధ్రములనుండి వెలువడు నగరు మహిసాక్షి ధూపధూమంబులచేతను విరాజిల్లు చంద్రశాలాంతరంబునఁ బంపు వెన్నెలలతో నెకసక్కెంబులాడు మేలిముత్తెంబుల సరంబులు వ్రేలు మేలుకట్టుల దీపించు మంచంబునఁ బాలనురుగువలె మృదువై ధవళం బైన యుత్తమాస్తరణంబున యథాసుఖంబుగఁ గూర్చుండి యుండె.

ఇట్లు సుఖోపవిష్టుండైన వల్లభుంగని పయోధర కుంకుమరాగ శోభితంబులగు హారంబుల కాంతులు జలుగు దువ్వలువలోనుండి వెలికి దుముకుచుండ, నితంబబింబకరంబిత నవరత్నచయ సముదం చిత కాంచీకలాపం బచంచల చంచలాలతికల నీనుచుండఁ, జరణ కంజంబుల శింజినీరవంబు పంచబాణ శింజారావంబున కామ్రేడి తంబుగఁ జేరనరిగి రుక్మిణీదేవి చెలికత్తెచేతి రతనపుఁబిడివింజామరంబు దాను గైకొని యంగుళీయ రత్నకాంతి మేఘంబునడుమ మెఱయు మెఱుపుఁదీఁగనాఁ గృష్ణు వదనసదనంబున దోబూఁచులాడఁ గర కంకణ ఝణఝణత్కారంబు మనోహరంబుగ నిజలోచన చకోరం బులు వల్లభు ముఖచంద్రునందు నిలిపి సేవించుచుండె.

అంతఁ గృష్ణుండు మానవరూపధారిణియు, మహాలక్ష్మియు, ననన్యగతికయు, ననన్యపతికయు*, ననురూపరూపయు, నలకకుండల పతక కంఠవదనోల్లసత్స్మితయునగు నిజవల్లభ శుకవల్లభ జనని రుక్మిణిం గని ప్రీతుండై దరహాస భాసుర వదనారవిందుఁడై ♦ యరవింద లోచనుం డిట్లనియె.

రాజకుమారీ! లోకపాలకైశ్వర్యులును, మహానుభావులును, శ్రీమంతులును, రూపౌదార్య బలపరాక్రమసంపన్నులునగు భూపా లురు నిన్నుఁ గామించిరి. స్మరదుర్మదులైన చైద్యాదులు వారై నిన్ను గోరివచ్చిరి. నీయన్నయుఁ దండ్రియు నిన్ను వారికీయ నిశ్చయించి

* అనన్యపతిక=ప్రత్యవతారమందును బతిరూపమున కనురూపమైన రూప మును ధరించి యాయన నంటియుండునది.

♦ దరహాస......డై=ముందు చెప్పెడిమాటలు నవ్వులాటలకై చెప్పఁబడెను గాని కోపముచే విరసబుద్ధిచేఁ జెప్పఁబడలేదని భావము.

యుండిరి. అట్టి నీకీడైన * వారినేల వరింపవైతివి? సుభ్రూ! § రాజుల భయంబున సముద్రము నిల్లుచేసికొని యుండువారము. శ్రీబలయుక్తులు మమ్ము ద్వేషించుచుందురు. ¶ రాజుల సింహాసనములకు మేము తలుచు $ వచ్చువారము గాము, అస్పష్టమార్గులము † లోకుల నడవడికి లోబడి యుండువారము కాము ‡ మే మిట్టివారమని యెఱుంగక మమ్ము వరించు మించుఁబోణులు ప్రాయికముగ దుఃఖపడుదురు.

---

* నీకీడైనవారిని=1. నీకు + ఈడైనవారిని, 2. నీకు సమానులు గాకుండుటచే నీ కీడునకుఁ గారణభూతులనువారినని యర్థాంతరము.

§ సుభ్రూ=శిశుపాలాదుల నేల వరింపవైతి వనినంతమాత్రముననే రుక్మిణి ప్రణయకోపముచే గనుబొమలల్లార్చి ముడివెట్టుటకని యావిలాసమునకు మనస్సులో సంతోషించియు నింకను గోపముకలిగించి యా శృంగార మనుభవింప నింకను బలుకుచున్నాఁడు. పొలయలుక నాఁటి రతియని ప్రసిద్ధి గలదుకదా.

¶ ఐశ్వర్య బలమత్తులు భగవంతుని స్మరింపరు. మీఁదు మిక్కిలి దేవుఁడా గీవుఁడా యనుచుందురు.

$ తలచు=1. యాదవులు యయాతి శాపంబున సింహాసనమెక్క నర్హులు గారు. 2. శ్రీరామావతారమందువలె నెప్పుడైన నొకసారి సింహాసనమెక్కుట గలదుగాని ప్రత్యవతారమందును లేదు. ఉభయవిభూతి నాయకుండు పరమేష్ఠి నగు నాకుఁ బ్రాకృతజనులెక్కు సింహాసన మేలయని యుపచారార్థము.

† అస్పష్టమార్గులము=1. యాదవకులమునఁ బుట్టిన క్షత్రియులమో నందాదులు పెంచుటచే గోపకులమో కొందఱటు కొంద ఱిటు పలుకుదురు. మా నడక కొందఱు తప్పందురు. కొంద ఱొప్పందురు. 2. భగవంతుని మార్గము లెవ్వఁడెఱుంగును. దుర్జ్ఞేయస్వరూప స్వభావుఁడనని యుపచారార్థము.

‡ లోకుల . . = 1. ఊరంతయు నొక త్రోవ యులిపిగొట్టున కొక త్రోవ యన్నట్టు నలువురుపోవు త్రోవనఁ బోవువారము గాము. లోకవిరుద్ధమార్గ మనుసరించు వారము. 2. లోకగుణాతీతునకు లోకమర్యాద లెట్లనుసరణీయములగును. భగవంతుండకర్మవశ్యుఁడు.

మేము నిష్కించనులము. నిష్కించన జనప్రియులము * కావుననే యో తనుమధ్యా! కులైశ్వర్య మదోన్మత్తులు మమ్ము నిచ్చగింపరు ‡ ధన జన్మైశ్వర్య రూపములయందు సమానముగ నుండువారికే వివాహము మైత్రి కుదురునుగాని యుత్తమాధములయం దెన్నటికిఁ గుదురదు§. చెలియా! దూరాలోచనములేక గుణహీనులు వృధాభిక్షుశ్లాఘ్యులు ¶ నగు మమ్ము వరించితివి. నీకు ననురూపుఁడగు క్షత్రియోత్తము సేవింపుము. అట్లైన నీ కిహపరలోకసుఖంబులు లభించు $ చైద్య సాల్వ జరాసంధ దంతవక్త్రాది నృపులును నీయన్నయగు రుక్మియు నన్ను ద్వేషించుటచే వీర్యమదాంధులు గర్వితులు నగు వారి గర్వమునణంప వారినెల్లర జయించి నిన్ను దోడితెచ్చితిమి గాని వాస్తవమున మే ముదాసీనులము. భార్యాపుత్రార్థకామ

---

* నిష్కించనులము = 1. రాజ్యాధికారము లేకుండుటచే రాజపిండము దిని జీవించు దరిద్రులము. కావున దరిద్రులే మాయందుఁ బ్రీతిగలిగి యుందురు. 2. కొంచె మేదియుఁ బొందవలసినది లేనివారు నిష్కించనులు. పరిపూర్ణుడైన భగవంతునకు నేది లోపముగలదు. నిష్కించన జనులు=దేనిమీఁదను గోరిక లేకుండుటచే దేనిని సంపాదించి యుంచుకొనని యేకాంతభక్తులు నాయందుఁ బ్రీతి సేయుదురు.

‡ నీవు కులైశ్వర్యము గలదానవయ్యు ననన్యార్హ శేషత్వము అనన్యశరణ్యత్వము అనన్యభోగ్యత్వము నను నాకారత్రయము గలదానవగుట నన్ను వరించుట యుచితమే యని యుపచారార్థము. లక్ష్మీదేవి భగవంతునకు మాత్రమే దాసి. ఆయన మాత్రమే రక్షకుఁడుగాఁ గలది. ఆయనతో మాత్రమే భోగించునది. అట్టి దాయనను విడిచి యెందుబోవును.

§ నీవు నన్ను వలచుటకు ధనాదులు కారణములు కావు. వాస్తవభక్తియు దాస్యవాంఛ, కావున మన యిరువురకుఁ దగును. చైద్యాదుల విషయమున నీకు దాస్యవాంఛ భక్తి లేవు కావున నీవు వారి నొల్లకుండుట తగుననియుపచారార్థము.

¶ వృధా=1. ఇతరప్రయోజనము లేక. 2. నాసేవయే ప్రయోజనముకాఁ గల భిక్షులు=నారదాదులు.

$ ఆమెచేసిన దీకార్యమేకదా.

కులముగాము. * ఆత్మానుభవ లాభములచేఁ బూర్ణులమై సంగరహితులమై చేష్టారహితులమై స్వప్రకాశముచే వెలుఁగుచు గృహమందు వర్తింతుము, అని భక్తరక్షాదీక్షుండైన పుండరీకాక్షుండు "నా వల్లభుండు నన్నెప్పుడును బాయఁడు, తక్కిన సవతులందుఁ బోలె నుదాసీనుఁడు కాఁడు, నాకు వశవర్తియై సర్వదా యుండు"నని గర్వించిన నిజవల్లభ వాల్లభ్యగర్వం బుడుప నిట్లు పలికి యూరకుండె. ‡ త్రిలోకాధిపతియు భగవంతుఁడునగు నిజప్రియువలన మున్నెన్నఁడు వినని యప్రియంబులు విని భీతయై మేనువణఁక దురంత చింతాక్రాంత స్వాంతయై యా కాంత చెమ్మటచే మేనెల్లఁదడియ కన్నీరు జాలువాఱఁ శోకంబు మేరమీఱ గరఁగి కాఱు కాటుకనీటఁ జందనచర్చాభ్యర్చిత స్తనంబులమీఁది దుకూలంబు మఱకపడ నరుణశ్రీ సఖంబైన వామచరణాంగుష్ఠ నఖంబున నేలవ్రాయుచు నధోముఖియై యయ్యో! పాపము! వెక్కివెక్కి యేడ్చుచునిలఁబడియుండె. ఇట్లత్యంత దుఃఖభయశోకాకుల చిత్తయగు నత్తన్వికి దుఃఖాతిశయంబున డగ్గుత్తికపడియె. మనంబు పరవశంబయ్యె. చేతి వింజామర నేల జాఱె. పెనుగాలికి వణఁకు కదళివలె వణఁకుచు మూర్ఛముంప నత్తపస్విని నేలఁగూలె.

హాస్యప్రౌఢి యెఱుంగని యాప్రియురాలి ప్రేమబంధంబు కృష్ణుండుగని సకరుణుండై తానును భీతునివలెఁ గంపించి వెంటనే

---

* లోక సంగ్రహార్థము సంసారివలె నటించుచున్నాఁడుగాని రక్తిగలిగి కాఁడని భావము.

‡ గోపికా గీతలలో గోపికలు చెప్పిన "నిజజనస్మయ ధ్వంసనస్మిత" నవ్వులతో నేనీవారి గర్వమును ధ్వంసముచేయువాఁడా యనుట నిచట స్మరించునది. ఎట్టి వారికిని నే విధమైనదిగాని గర్వము వినాశసూచకము. తన భక్తులు నశింపగూడదని భగవంతుని వ్రతము. కావునఁ దనవారియందుగల యట్టి లోపము నవ్వులతోనే హరింపజేయును. అత్యంత శాంతచిత్తులైన సనకసనందనాదులను జయవిజయులపై నల్పహేతువున నలుగఁజేసి తమయందుఁ గ్రోధగుణలేశమున్నదని వారి మనస్సునకు వచ్చునట్లు చేసెఁగదా. ధర్మరాజుచే నబద్ధమాడించి యాయన లోభగుణమును వెలికిఁ దీసెను. ఇట్లే తక్కినవి యూహించునది.

పానుపు డిగి నాలుగుచేతుల నామె నెత్తికొని శయనంబునఁ బరుండఁ బెట్టి కురులుముడిచి పాణికమలంబున ముఖంబునిమిరి కనుఁదమ్ముల వెడలు జలబిందువులఁ దుడిచి బాష్పవారిధారలఁ దడిసిన స్తనంబులఁ దుడిచి యనన్యవిషయయగు నప్పరమ పతివ్రతను బాహువులఁ బరిరంభించి కృపణప్రభుండు కృపచే హాస్యప్రౌఢి భ్రమచిత్త యగు చిత్తజాతుజనని నప్రియాలాపానర్హాను సాంత్వవాక్యముల నూరార్చుచు నిట్లనియె.

వలదు వలదు రుక్మిణీ! వలదు వలదు. దుఃఖింపకుము. ప్రేయసీ! నాపైఁ గినియకుము. నీవు నన్నే బరమప్రాప్యునిఁగ నమ్మియుండుట యెఱుఁగుదుఁ గోపావేశంబునఁ బ్రేమసంరంభమున వణఁకు మోవి గల నెమ్మోమును, నదరెడు గండస్థలంబును, జలించు సుందర భ్రుకుటీతటంబును గల మోముఁదమ్మి వీక్షింప నాసపడి నిన్నుఁ బరిహాస మాడితి. ప్రణయకలహంబునఁబోవు గడియలే కదా గృహములందు వర్తించు గృహస్థులకుఁ బరమసుఖావహంబు. అని యిట్లు భగవంతుం డూరార్చిన నదిపరిహాసోక్తియని యెఱింగి రుక్మిణీదేవి పతి తన్ను విడుచునను భయంబు దక్కి * లజ్జాహాసంబుల రుచిరంబులైన నునుఁ జూపులు పురుషోత్తము ముఖపంకజంబున నిలిపి యిట్లనియె.

---

* రుక్మిణీదేవి లక్ష్మీదేవియే యైనను మగని యభిప్రాయ మెఱింగియున్నను మగఁడు చనవిచ్చెనుగదా యిఁక నేమిభయమని నిశ్చయురాలై యుండునది కాదు. ఉత్తమస్త్రీ మగండెంత యెక్కువగఁ దనకుఁ జనువిచ్చునో యంత యెక్కువ యణఁకువ భయము గలిగి తానేమి తెలివితక్కువపని చేసినను జనవిచ్చుటచే గర్వించితినని మగఁడు తలఁచునేమో యని భయముకలిగియే వర్తించును. భగవంతునకుఁ దానే యపచారము చేయకున్నను వియోగకారణము లేకున్నను రామావతారము నందువలె, నీ యవతారంబున గోపికలనువలె నే హేతుకారణంబునఁ దన్ను నెడఁ బాయునో యని యంతగ భయపడెను. పతివ్రతలు పతివియోగవాక్యమును గాఢ సహింపఁజాలరు, అది యుత్తమ భక్తి లక్షణము.

అరవిందలోచనా! నీవు మందలించినది సత్యము * స్వరూప స్వభావ వైభవంబుల నీకు నేను సమానురాలను గాను. స్వమహిమాభిరతుండవైన త్రిలోకనాయకుండవు నీ వెక్కడ? గుణప్రకృతియు నజ్ఞగృహీతపాతయునగు నే నెక్కడ? †

ఉరుక్రమా! రాజులభయంబునఁబోలె సముద్రము నిల్లుచేసికొని యుండువార మన్నమాటయు సత్యము. అయినను నది యాత్మ

---

* నీకు సములగువారిని వరింపుమని పలికితివని యనువాదమంతైనను నావాక్యములు చెప్ప నోరురాక నీవు చెప్పినమాట యని సూచించెను.

† నిన్ను విడువవలయునను తలంపుచేఁ గాదు నీమాటలు వినవలయుననిపరిహాసమునకై యట్లు పలికితినని కృష్ణుండు చెప్పుటచే రుక్మిణియుఁ దదనుగుణముగాఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నది. నీకు నేను సమానురాలను గానంటివి సత్యము. నీకంటె నేనే యుత్తమురాలను. త్రిలోక విభాగము నా సహాయమునఁ గదా యేర్పడెను. నా సహాయము లేకుండిన నీ లోకవ్యవహార మెట్లు జరపఁగలవు? నీ మహిమలోకము వారి కెట్లు తెలియును? నేను లేకున్న నీకు రూపనామక్రియలును లేవుగదా. నిన్నర్చించు బ్రహ్మాదులు నన్ను నర్చించుచున్నారు. వారి యభిమతముల నేను నొసఁగుచున్నాను గదా. అంతియ కాదు. లోకులందఱు ముందు నాపేరు (లక్ష్మీనారాయణులని) చెప్పుచున్నారు. విష్ణుభక్తులు (అ+జ్ఞ) ముందు నన్నర్చించి యావల నిన్నర్చించుచున్నారు, అని మాటకుమాట యుక్తి వినయము చెడకుండఁ జెప్పుచున్నది.

గుణప్రకృతి=నీ గుణముల ననువర్తించు స్వభావము గలదాన నగుట నే నీ యిష్టము చొప్పున నడచుకొనుదాననే గాని స్వతంత్రించి పోవుదానను గాను. అజ్ఞగృహీతపాద=నీ విచ్చు మోక్షసుఖ మెట్టిదో యెఱుఁగని మూఢులు ధనమువలని సుఖముఁగోరి నన్నుఁ బ్రార్థించుచున్నారు. తెలిసినవారును నేను స్వతంత్రనని యుపాసింపరు. నీకుఁ బరతంత్రనని యెఱిఁగి పురుషకారమునకై యుపాసింతురు. అరవిందలోచన=నీ నేత్రసౌందర్య మనుభవించుటయందే నా మనస్సు కాలమంతయు వినియోగింపఁబడుచున్నవి. కావునఁ దక్కిన దేహసౌందర్య మెన్నఁ డనుభవింతును అట్టి సుందరుఁడవు నీవెక్కడ? నేనెక్కడ? కావున గుణములందు రూపమునందు నీకు నేను సమానురాలను గాననుట సత్యము,

స్వరూపా! నిమిత్తమాత్రము. కుత్సితేంద్రియ గుణయుక్తులైన జీవులు నిత్యము నీయందుఁ బ్రీతివహింప రనుటయు సత్యము.*

రాజ సింహాసనములకుఁ దఱచు రానంటివి. అదియు సత్యమే. నరకహేతువని నీ పాదసేవకులే త్యజించినదానిని నీవేల కోరెదవు?

అస్పష్టమార్గులమని యంటివి. సత్యము. భవచ్చరణారవింద మకరందబిందు పానతుందిలులైన మునిసందోహములకే నీమార్గం బిట్టి దని తెలియరాకుండఁగా విషయాసక్తులైన నరపశువు లెట్లు నీ మార్గ మూహింప సాధ్యపడు. నిన్ననుసరించి చరించువారి చేష్టితమే లోకచేష్టితమున కతీతమైయుండ సర్వేశ్వరుండవైన నీచేష్టిత మలౌకిక మగుట యేమి చిత్రము?

నీవు పొందఁదగిన దేదియు లేకుండుటచే నిష్కించనుఁడవగుట సత్యమే కాని దరిద్రుఁడవు కావు. బ్రహ్మాది సమభ్యర్చిత పాదపద్ముఁడు శ్రీపద్ముఁడు దరిద్రుఁడెట్లగు? పూజార్హులైన నారదాదు లకించనులు. వారికి నీవు ప్రియతముఁడవగుట సత్యము. ఇంద్రియ తర్పణపరాయణు లైనవా రభిమానముచే వివేకశూన్యులై కాలరూపంబున వారి యా యువును నీవు హరించుచుండుట నెఱుఁగరు. సమస్తపురుషార్థ స్వరూ

* ఉరుక్రమా=పాదవిన్యాసముచేతనే మూఁడులోకములను వశపఱిచికొను వాఁడా! నీవా యీ క్షత్రియాధములకు భయపడుదువు? వారు రాజులు (దేహాగుణ ములచే రాజిల్లువారు) గావున దుష్టునిఁజూచిన దూరముగ నుండుమన్నట్లు నీవువారితోఁ గలియక దూరముగ దుర్గమంబైన జలదుర్గంబున నుందువు. అంతియకాదు. నీవుసను ద్రముసం దుండుట నిలువ నీడలేక కాదు. నానిమిత్తముగ నాయందలి ప్రేమచే నా తండ్రియగు క్షీరసముద్రునందు వసింతువు. ఇంతయు నీవు నారాయణుఁడవు గదా (జలములం దుండువాఁడు). ఆత్మస్వరూపా=ఇంతయు నీ వగాధసముద్రమున గూఢ ముగ నున్నాఁడ వన నేమి? అంతర్యామివై యన్నిభూతములందును గూఢముగఁ దెలియరాక యున్నాఁడవనికదా. జీవుఁడు నిద్రాస్వప్నాదిగుణభయముచేతనో యన నిద్రాప్రలయములయందు నానందమయ కోశమున నుండునట్లు నీవును స్వరూపానం దార్థముందువు. క్షీరాబ్ధి శ్వేతద్వీపద్వారకాదులందుండు భక్తులు ముక్తులునిన్ను సేవింప ననుకూలపడుటకై కదా యందందు వసింతువు. సజ్జనులనిర్మలహృదయమే క్షీరాబ్ధి.

పుఁడవు. ఫలరూపుఁడవు. ఆత్ముఁడవు. అట్టి నీ దాస్యంబుగోరి తక్కిన వన్నియు వదలునట్టి సుమతులకు నీకుఁ దారతమ్యముండుట యుచితమే. అట్లుగాకున్న సేవ్యసేవక భావంబెట్లు కుదురు ? రతివలన సుఖదుఃఖము లాశించువారియందుఁ దారతమ్య ముచితముకాదు. అట్టి వారునీకుఁ దగరుగాని నీ పాదసేవ చేయఁగోరు దాసికనగు నాకును స్వామివగు నీకును దారతమ్యముండుట సముచితమే. భిక్షుశ్లాఘ్యుఁడ నంటిని. ప్రపంచసంబంధ మంతయు వదలి సర్వభూత సుహృత్తులయిన సన్న్యాసులు నిన్ను శ్లాఘించుట చేతనే యాత్ముఁడవు నాత్మప్రదుఁడవగు నిన్ను వరించితి. నీవు కనుబొమలార్చినంతన కాలవేగంబున బ్రహ్మేంద్రులును శుభరహితులగుదు రనఁ దక్కినవారిం గుఱించి చెప్పనేల ? శార్ఙ్గధనుష్టంకార మాత్రమున రాజులనెల్లఁ బాఱఁదోలి పశువులఁ బాఱఁదోలి తన భాగము హరించు సింహమువలె నన్ను హరించితివి అట్టి నీవు వారికి భయపడి సముద్రమున దాఁగితి వనుట సరిగాదు. నీ దాస్యలాభంబుఁ గోరి రాజ్యంబు వదలి వనములఁ బ్రవేశించిన యంగుఁడు పృథువు భరతుఁడు యయాతిలోనగు రాజశేఖరులు నిన్నుపాసించి యుపాసన దశయందును ద్వదనుభవాత్మకసుఖ మనుభవించిరి. కాని యేమి చెడిరి ? సజ్జన వినుతంబును మోక్షప్రదంబును శ్రీ సమాశ్రయంబును నగు నీ పాదారవిందంబులనెడు పద్మంబుల పరిమళంబు మూర్కొనిన యేస్త్రీ వివేకముకలదేని కల్యాణగుణ నిలయంబగు నిన్ను విడిచి జనన మరణ బాధితుండును బహుభయ పీడితుండును నగు వేఱొకని వరింపఁదలంచు. కావున జగన్నాయకా ! నైహికాముష్మిక పూర్ణ కామంబులొసగూర్చునిన్ను నాకు వరణీయుండవని వరించితి. సంసార మార్గంబున భవదనురూప రూపంబు లెత్తుచుండు నాకు సంసారావసానంబగు భవదీయ చరణంబులె సర్వదా శరణమగుగాక యని ప్రార్థించుచున్నాను. అని విన్నవించి క్షత్రియోత్తము వరింపుమనిన మాటఁ దలంచి కోపరక్త లోచనయై యేనఁట యాక్షత్రియాధముల వరింప వలయునఁట యని వారిని దూషించుచు మెటికలువిఱిచి యిట్లనియె.

అచ్యుతా! భవదీయ చరిత్రం బీలోకంబుననో హరపరమేష్ఠి సభల యందో కర్ణగోచరంబుగాని స్త్రీకి నాఁడుపె త్తనము ముఖ్యముగాఁగల యిండ్లయందు * గాడిదలవలె నెద్దులవలెఁ గుక్కలవలెఁ బిల్లులవలె భృత్యులవలెఁ జరించు పురుషులు నీ చెప్పిన రాజులు పతు లగుదురు గాక. చర్మము మీసము వెండ్రుకలు గోళ్లు వీనిచేతఁ గప్పఁబడి లోపల నెముకలు మాంసము నెత్తురు పురుగులు మలము కఫవాత పిత్తములు గల నడమగపీనుఁగును నీ పాదారవింద మకరందబిందువును మూర్కొనని మూఢురాలు తన కాంతుఁడని సేవించునుగాక * అంబుజాక్షా!

---

* గాడిదలు=కేవలము బరువును మోయునవి. ఎగసి కాలం దన్నినను నాఁడు దాని వెంటఁబోవునవి. ఎద్దులు = ఎప్పుడు పాటుపడి యితరులకు మంచి యాహారము కల్పించియిచ్చి తాము వారికిఁ బనికిరాని పదార్థములు (గడ్డి) వేయఁ దిని యుండునవి. కుక్కలు = అవమానించి వేయఁగాఁ దినునవి. వాకిటఁ గావలిపడి యుండునవి. పిల్లులు = అతివినయముతో భయముతో నెంగిలికూడుతిని దిరుగునవి. కాలిదెబ్బలు తినియు సిగ్గులేక మఱిమఱి లోపలికి వచ్చునవి. భృత్యులు=ఎప్పుడేమి యాజ్ఞాపింతురో యని చేతులు కట్టుకొని నిలఁబడియుండువారు. ఇట్టిగుణములుగల మగవారు భగవచ్చింతనములేని నిర్భాగ్యరాండ్రకుఁ బతులగుదురుగాక. హర పరమేష్ఠి సభలందు = బ్రహ్మకు శివునకుఁగూడ వినయోగ్యమైన నీచరిత్రము.

* నీకు సమానుఁడైనవాని వరింపుమనిన కృష్ణువాక్యమునకిది ప్రత్యుత్తరము. నేను సచ్చిదానంద స్వరూపను గావున సచ్చిదానంద స్వరూపుఁడవగు నిన్ను నాకుఁ దగినవాఁడవని వరించితిని. తక్కినవా రెట్లు నాకు సమానులగుదురు? ఎవతె నీ పాదారవింద భజనాదులను ద్వదనుభవములేక చర్మములోనైనవానిచేఁ గప్పఁబడిన యెముకలు మాంసము లోనైనవిగలదేహము గలవగునో యట్టిదానికి నట్టిపురుషులే మగలగుదురుగాక. నీ యనుభవ మతిశయించిన పిమ్మటఁ దమ దేహములందేజుగుప్స జనించుచుండఁగా లితరములందు జనించు టేమివింత. ఒకసారి నిన్నుఁ దలచువారు దాని యనుభవసుఖమెఱిఁగి పలుమాఱు నిన్నే సేవింతురు. అట్టివారుకూడ నీ కను కూలురుగానుండు ప్రాకృత జనులతోనే కలసిమెలసి యుండరన నీఁక నాయట్టి వారునీకు విరోధులుగా నుండువారిని గోరుటన నెట్టిదని భావము.

రుక్మిణీదేవికివలె స్త్రీలకందఱకు భగవంతుఁడే మగఁడగునా? ఆయనతప్ప దక్కిన పురుషులెల్ల నడపీనుఁగులే కదా యని స్త్రీలు వివాహములు మానుకొనవల యునా యని సందేహము కలుగవచ్చును. స్త్రీనాలి పురుషుఁడుగాని భగవత్సేవ

నీ వుదాసీనుఁడనని చెప్పుకొంటివి. ఆత్మ రతుఁడవును నాయందు నతిశయితదృష్టి లేనివాఁడవు నగు నీ చరణకంజములందు నాకు ననురాగము నిలువనిమ్ము * ప్రపంచసమృద్ధికై నీవు రజోగుణమును విశేషముగఁ గైకొన్నప్పుడైన నన్నుఁజూచెదవుగదా. అదియే నాయందలి పరమకృపగా నెంచెదను.† స్త్రీలు తమ కనుకూలపతుల వరించుటకు తపముచేసినఁగాని ముక్తిలేదు. ఈవిషయమున స్త్రీలకుఁగల సౌకర్యము పురుషులకు లేమి నిశ్చయము. భగవత్కథలు వినుచు నట్టి భగవంతుఁడే తనకుఁ బతిగా లభించెనని విశ్వసించి యవ్యభిచార భక్తితో భగవంతునకుఁజేయు సకలవిధోపచారములు పతికే చేయుచుండవలయునుగాని పతిమనుష్యమాత్రుఁడను తలంపురారాదు. నీళ్లుపోసినను భోజనము పెట్టినను ప్రక్కలోఁ బరుండినను సాక్షాద్భగవంతునకే యివియన్నియుఁ జేయుచున్నానని స్త్రీ తలంచుటకు సాధ్యపడును. పదునొకొండు విధములైన భక్తిమార్గములలో నీ కాంతాసక్తి యనునది యొకటి. ఏపదార్థమును, నేదేవతను బూజించినను దాని నిమిత్తముచేసికొని ఫలమిచ్చువాఁడను నేనేయని భగవంతుఁడు చెప్పెను. కావున దృఢభక్తి ప్రధానముగాని యెదుటనుండు పదార్థము గాదు. "యాదృశీభావనా యత్రసిద్ధిర్భవతితాదృశీ" యని కలదుగదా. శిలలను భగవంతుఁడని పూజించినవారికి భగవంతుఁడు వారి కోర్కెల దీర్చుచుండ జీవత్పతులను భగవంతుఁడని భక్తితో సేవించు వారికేల భగవంతుఁడు ప్రసన్నుఁడుగాఁడు? స్త్రీ తాను స్త్రీనని తలంచి భగవంతునకు స్నానపాన సేవా రత్యాదుల సంతోషపఱుచుచున్నానని విశ్వసించుట సుకరము. పురుషుఁడు తాను స్త్రీనని తలంచుట దుష్కరము. అట్లైనచోఁ గొందఱు గోపికలేల తమ పతులను వదలి కృష్ణువెంటఁ బోయిరను సందేహము కలుగవచ్చును. ఆవిషయము నీతికయందుఁ జర్చింపఁబడును.

*ఆత్మారాముఁడవగుటను నాయం దతిశయించిన దృష్టిలేనివాఁడ వగుదువు గాక. నీయందు నాకుఁగల ననురాగము దొలఁగనీకుము. ఉన్నదున్నట్లులుండనిమ్ము. అదియే నాకు లాభము. అంతకుమించి నిన్నేమియుఁ గోరుదానఁ గాను.

† రజోగుణము ప్రకృతిసంబంధము. 1. లక్ష్మి ప్రేమస్వరూప శక్తియైనను దన పరికరములలోఁ జేరిన (యవనికా మాయా జగన్మోహినీ) ప్రకృతికిఁ దనకు నభేదము చెప్పుచున్నది. జగత్సృష్టియందైనను నన్ను నీవు గ్రహింతువుకదా. ఆమాత్రము చాలునని భావము. 2. అతిశయితదృష్టి లేనివాఁడవు= నేను నీ స్వరూపశక్తిని గావున నీ వభిన్నదృష్టివే యగుదువు. రజోగుణము=రాగగుణము. జగత్సృష్టి నీవేచేసి నా యనుమోదనార్థము నావంకఁ జూచెదవుగదా. అదియేయత్యంతప్రేమగా నెంచెదను.

యసత్యముకాదు. కాశీరాజపుత్రి యంబ సాల్వుని వరించెఁగదా. అట్టులే కొందఱు కన్యలకుఁ గొందఱియందు ననురాగము కలుగును. వివాహితయు మనస్సునందైనఁ గ్రొత్తక్రొత్త పురుషులఁ గామించుచుండు. బుద్ధిమంతుఁ డిట్టి ఱంకుటాలిని భరింపరాదు. భరించెనేని యుభయలోక భ్రష్టుఁడగును. అని దీనయై సవినయంబుగ విన్నవించిన యాయన్నుల మిన్ననుగని వెన్నుండుమన్ననమెయి నిట్లనియె.

సాధ్వీ ! నీ పలుకులువినఁగోరి నగవులకై ములుకులవంటి పలుకులు పలికితి. కలికీ ! యలుగకుము. నా వాక్యంబులకుఁ దాత్పర్యంబుగ నీవు ప్రతిభాషించినదంతయు సత్యంబు. మదభిప్రాయానుసారంబు. కామినీ తిలకమా ! కామరహితవై నీవు కామించిన మత్పదానురాగంబు కల్యాణీ ! యేకాంతభక్తవగు నీయందు సర్వదా యున్నదియే. అనఘా ! నా పోటుమాటల నీవు చలించినను నీబుద్ధి నాయందుండి తొలఁగినది కాదు. దీనివలన నీ పాతివ్రత్యంబు స్పష్టంబయ్యె. కొందఱు నా భక్తులమని పేరుపెట్టికొని మోక్ష ప్రదాతనగు నన్ను మోక్షంబుఁగోరక నామాయచే మోహితులై తపోవ్రతచర్యల దాంపత్యసుఖంబుఁ గోరుదురు. ముక్తిప్రదాతనగు నన్నుఁ దపోవ్రత చర్యల భజించి నా యనుగ్రహంబు పడసియు మందభాగ్యులు కొందఱు నన్నుఁ గోరిక సంపదలకుఁ బతినైన నన్ను నరకమునందును లభించు క్షణభంగురంబులైన తదితరకామంబుల విషయ సుఖంబుల సంపదలఁ గోరుదురుగాని దంపతి సంగమంబు నరకప్రాయం బని యెఱుంగరు. గృహేశ్వరీ! నీవు నా యందు మిక్కిలి నిక్కపుఁ జొక్కపు మక్కువ యుంచితివి. సంసారబంధంబూడఁ దన్నుఁ జాలునిట్టిభక్తి దుర్జనులకు నెంతయు దుస్సాధంబు. ఇఁక దురభిప్రాయంబు గలిగి యింద్రియ తర్పణ పరాయణులై వంచనపరలైన స్త్రీలకు నిది యంతకంటె సుదుష్కరంబని చెప్పవలయునా ? నీయట్టి ప్రేమవతియగు నిల్లాలు గృహంబులఁ గానరాదు. వివాహకాలంబున రాజలోకంబు నెల్లఁదృణీకరించి బ్రాహ్మణుచే నాకు రహస్య

వార్తఁ బంపితివి. మఱియు వివాహసమయంబున నీ యన్నకు విరూప కరణంబు గావించిన నాఁడును ద్యూత సభయందు నీ యన్నను వధిం చిన నాఁడును మద్వియోగభీతిని దుఃఖమెల్ల నణఁచుకొని యొక్క మాటయైన ననిన దానవు కావు. ఈ కారణంబుననే మేము నీచే జితులమైతిమి. అంబుజాక్షి! నీవు నన్నుఁ బ్రసాదింపవేని నూఱు జన్మంబులందైనను దపముచేఁ గృశించి ప్రాణంబులు విడుతునని నీవు చెప్పి పంపిన సందేశ వాక్యంబునకు నేను రాక తడయునెడ నింక నీ జీవమేటికి? విడుతునని సిద్ధపడి యుండుటయుఁ దలఁచి దానికి సమ మైన ప్రతికార్యముఁ జేయలేమిని నీయెడల మిగుల హర్షించుచున్నా రము. అని యిట్లు నరలోకంబు విడంబించి సురతసల్లాపంబు గావించి యా మించుబోణితో రమించె.

## —♦ కృష్ణుండు ధర్మరాజును బలియొద్దకుఁ గొనిపోవుట. ♦—

ధర్మరాజు రాజ్యమేలు సమయంబునఁ బ్రతిదినము పదివేవురు బ్రాహ్మణులకు వెండి పళ్ళెరములలో భోజనము పెట్టుచుండెను. ఇట్లు కొంతకాలము చేయఁగా నాయన మనస్సులో మనమింత యన్నదా దానముచేయుచున్నారముగదా యను గర్వము కొంచెము పొడమెను. ఆయన మేలుకోరు కృష్ణుఁడు శ్రేయోవినాశకరంబగు గర్వం బాయన మనస్సున నావేశించుట యెఱిఁగి దానిని రూపుమాప సమయము వేచియుండెను. ఒకనాఁడు భ్రాతలు మంత్రులు నమాత్యులు మహ ర్షులు లోనగు వారిచే నిండిన సభయందుఁ బూర్వరాజుల వృత్తాం తము లుపన్యసింపఁబడునెడఁ గొందఱు మహర్షులు బలిచక్రవర్తిని బహువిధములఁ బ్రశంసించుచు

శా. అర్థుల్ వేఁడరు, దాతలుం జెడరు, సర్వారంభముల్ పండు, బ్ర
త్యర్థుల్ లేరు, మహోత్సవంబులను దేవాగారముల్ పొల్చుఁ,బూ
ర్ణార్థుల్ విప్రులు, వర్షముల్ గురియుఁ గాలార్హంబులై,ధాత్రికి
సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్.

భాగవతము.

అని వచించి యిట్టి మహానుభావుఁడు భగవత్కరుణాకటాక్ష విశేషంబున నిప్పటికి జీవించి యున్నవాఁడుకదా యనిరి. ఆ పలుకు విని ధర్మరా జట్టి మహాత్ము భక్తాగ్రేసరు నెట్లు దర్శింప నగునోయని యాలోచింపఁ గృష్ణుఁ డిట్లనియె.

ధర్మనందనా! నీ వాపరమపుణ్యాత్ము దర్శింప నభిలషించెద వేని నేను దోడుకొనిపోయెద రమ్మనిన నాఁడునయు వల్లెయని యంగీకరించె. అవలఁ గృష్ణుం డొకనాఁడు తన యోగబలంబున ధర్మరాజుం దోడుకొని రసాతలంబున కేగి తమరాక విన్నవింపుఁడని దౌవారికులకుఁ దెలుపవారేగి కృష్ణ యుధిష్ఠిరులువచ్చి వాకిట నున్నవారని బలికి నెఱిఁగించిరి. ఏల లోపలికి విడువక జాగుచేసితిరని వారల గదిమి బలిచక్రవర్తి వేగమరుదెంచి యర్ఘ్యపాద్యాదులొసంగియప్పరమాతిథివరుల సకల విధముల సత్కరించి లోనికిఁదెచ్చి యుచితాసనాసీనులఁ గావించె. వారును సుఖోపవిష్టులైరి. అంతఁ గృష్ణుఁడు బలిరాజేంద్రుం జూచి యిట్లనియె.

మహాభాగా! యీ ధర్మనందనుఁడు మా మేనత్తకుమారుండు. పాండవాగ్రేసరుండు. మహాధర్మాత్ముఁడు. దానకళానిధానంబు. ఈయనకు సముఁడు భూతలంబున లేఁడు. మహాదాతవగు నీ ప్రఖ్యాతి విని నీదర్శనంబు సేయఁగోరి యరుదెంచె. ఈ పవిత్రచరిత్రుఁడు ప్రతిదినము పదివేల బ్రాహ్మణులకు వెండిపళ్ళెరంబుల నన్నదాన మొనర్చుననిన బలి యిట్లనియె. అయ్యా భగవంతుఁడా! యీయన ప్రతిదినము క్రొత్తగఁ బదివేల వెండిపళ్లెరములఁ జేయించుచున్నాఁడుగా! యనిన శ్రీకృష్ణుం డిట్లనియె,

దానవేంద్రా! క్రొత్తగ దినదినము పళ్ళెరములఁ జేయించుట లేదు. అవి ప్రాఁతవే. ఒకసారిగఁ జేయించి యుంచుకొని వానినే ప్రతిదిన ముపయోగించుచుండును. అనిన బలిచక్రవర్తి హారిహారి యని చెవులుమూసికొని జొటజొట కన్నీరుగార్చెను. సకలభూత

భావజ్ఞుండు హరి యూరకుండెనుగాని ధర్మరాజు నిర్వాణుండయ్యెను. అంత రుక్మిణీకాంతుండు వింధ్యావళి కాంతుంగని యిట్లనియె.

దానకళాకోవిద ! యేమిది కన్నీరుగార్చెదవు. ఈయన దాన వైభవము నీకును సద్భుతావహంబై యానందబాష్పము లురలం జేసెనా యనిన బలిధరాకాంతుం డిట్లనియె.

ఈకాలమున భూలోకము నికృష్టస్థితియు రాజుల లోభగుణము దలచి కన్నీరు గార్చితిని. ఈమహాత్ముండు ప్రతిదినము బ్రాహ్మణులకు నెంగిలి బోకులలో భోజనము పెట్టుచున్నాండుగా ! వస్త్రము పాన పాత్రము భోజనపాత్ర మొకండుపయోగించినదానిని వేఱొకడుప యోగింపరాదను నియతి భూలోకమునుండి తొలంగిపోయినదా? అది యెట్లయిన నగుంగాక నిత్యము పదివేవ్వురు బ్రాహ్మణులు రాజపిండము నకై కాచుకొని పడియుండవలసినంత దుర్దశకు వచ్చినారా ? తమకు నింటం గినుటకుం జాలినంతయుండినచో నొకండేల రాచకూటికై కాచుకొని పడియుండును ? ఇందఱు బ్రాహ్మణులు దారిద్ర్యదశ ననుభవించుచున్నారుగదా యని వగచెదను. కూటికిః బరాధీనుండగు బ్రాహ్మణుండు తన వర్ణాశ్రమధర్మము లెట్లు సకాలమున సవిధిగ నిర్వహించుకొనంగలండు? తనకుం దినం బిండము లేనివాం డతిథుల నభ్యాగతుల నేమి యాదరించు ? నీబావధర్మరాజు పాండురాజుకొడుకే యిట్లయినచో నింక నితరరాజులు తరాజులేకదా. నేను భూలోకమున నున్నకాలమునం బ్రతిదినము పదుగురు బ్రాహ్మణులయిన దొరకుట దుర్లభము. వారును మార్గమునడచువారై యాసమయమునకు మా యింటివాకిటిమీందుగం బోవువారు నాచేం బ్రార్థితులై యతి కష్టముమీంద నాయింటికి వచ్చుచుండిరి. దానము లిచ్చిన రాజ ద్రవ్యము మాకేటికని నిరాకరించుచుండిరి. అందఱు ధనధాన్యములు గొడ్డుగోదలు కలవారై యుండిరి. కావున వారందఱొకరికి నిచ్చు చుండిరిగాని పుచ్చుకొనకుండిరి. నిర్విచారముగ స్వధర్మమున వర్తించు చుండిరి. ఇప్పుడాకాలమంతయు మాఱిపోయెంగదా. బ్రాహ్మణులు దరిద్రులై రాచపిండము నాశించి బ్రదుకువారైరిగదా యని శోకిం

చితి. అనిన నవ్వదాన్యసత్తము వాక్యంబులు విని కౌంతేయాగ్రజుండు సిగ్గునం దలవంచుకొనియె. శ్రీకృష్ణుండును నేఁడెంతయు ముచ్చట లాడి సెలవుతీసికొనెదమని చెప్పి ధర్మనందనుతోడ మరల స్వస్థానంబున కరుదెంచె.

## ఆనిరుద్ధవివాహము. రుక్మివధ.

రుక్మిణీసోదరుండైన రుక్మికి రుక్మవతియను కన్యాలలామంబు గలదు. రుక్మికృష్ణునెడ బద్ధవైరుండయ్యుఁ జెలియలియందలి ప్రీతిచేఁ దనకూఁతు నామె కుమారుఁడు మూర్తిగొన్నమారుఁడైన ప్రద్యుమ్నున కీయ నిశ్చయించి స్వయంవరంబుఁ బ్రకటించె. ఆ స్వయంవరంబున రుక్మవతి ప్రద్యుమ్ను వరించె. అది చూపోపక యసూయాపరులైన రాజవరులు దన్నుఁ దాఁకుటయుఁ బ్రద్యుమ్నుండు వారి నెల్లరఁ బరాజితులఁగావించి నూతన వధువుతోడ ద్వారక కరుదెంచె. రుక్మవతీప్రద్యుమ్నుల సుతుం డనిరుద్ధుండు.

తన యన్నకు భర్తకుఁగల తీరనివైరమునకుఁ దెగుదలగావింపఁ గోరి రుక్మిణీదేవి తనమనుమఁడగు ననిరుద్ధునకు రుక్మి మనుమరాలగు రోచన యను కన్నియనిచ్చి వివాహంబుగావింపఁ గోరెను. విరోధులతోడి బాంధవం బశాస్త్రీయం బధర్మంబని యెంచియు సోదర ప్రీతికై రుక్మిరోచనను ననిరుద్ధునకు వివాహంబుఁగావింప నిశ్చయించె. బలరాముఁడును రుక్మిణీకృష్ణప్రద్యుమ్నాదులును భోజకటకంబునకుం బోయిరి. యథావిధి వివాహంబు ప్రవర్తిల్లుచుండె. ఆసమయంబునఁ గళింగరాజు రుక్మితో నిట్లనియె. భోజరాజేంద్రా! యాదవులు నీకుఁ బగవారుగదా. బలరాముండు ద్యూత క్రీడయందు నభిలాష గలఁడుగాని నేర్పరిగాఁడు. నీవో యక్షక్రీడయందు మహాసమర్థుండవు. విన్నాణంబున నిన్నుమించినవారులేరు. కావున జూదంబున బలరాము నోడించి యవమానింపమని దుర్యోధనునకు శకునిఁబోలె నుపదేశించుటయు నమ్మూర్ఖుండు పరబుద్ధి వినాశకరమగుట యాలోచింపక జూదము కారణంబుగనైన కౌరవపాండవ నాశనంబు మఱచి గర్వాతి

రేకంబున సంఘుండై బలరాము జూదంబునకుం బిలిచె. ఇట్లు రుక్మి బలరాములు నెత్తమాడుచుండిరి. తొలుదొల్త బలరాముఁడు దానొడ్డిన యొడ్డులన్నియు నోడె. అది కని కళింగుఁడు దంతములు వెడలఁబెట్టి పకపకనవ్వె. తరువాత రుక్మి లక్షనిష్కంబులు పందెముంచుటయు దానిని బలరాముఁడు గెలిచె. ధర్మవిధంబున బలరాముండు గెలిచినను రుక్మి తానే గెలిచితినని వంచకుఁడై వాదించె. సహజారుణలోచనుఁడగు తాలాంకుండు కోపంబున ద్విగుణీకృత రక్తాక్షుండై పదివేలొడ్డి గెలిచె. వంచకుండైన రుక్మి యాపందెమును దానే గెలిచితిననియు వలయునేని సభికుల నడుగుమనియు వాదించె. కళింగాదులు రుక్మిపక్షమ వచించిరి. అప్పు డాకాశవాణి ధర్మమార్గంబున బలరాముండే గెలిచెనేని యెల్లరు విన ఘోషించె. దానిని నడ్డసేయక యా జూదరి రుక్మి బలరామునితో నిట్లనియె.

ఓరి గోపాలుఁడా! యడవులలోఁ బసుల మేపుటయందు విన్నాణులగు మీకు నక్షక్రీడయందు దక్షత యెట్లుగలుగు? చెట్లకు బాలుఱ్ఱ వలఁతులగు మీరు శరసంధానకళాకోవిదు లెట్లగుదురు? జూదంబున నన్ను గెలుచునంతటి మానిసివా నీవు? అని విడ్గారించి పూర్వవైరస్మృతిఁ బలికిన హాలధరుండును క్రోధంబున విజృంభించి యందున్న పరిఘంబుగొని రుక్మితల పగులమొత్తి వెఱచి పరువిడు కళింగుని మున్ను పండ్లిగిలించి నవ్విన కారణంబున దంతంబులురాల మొత్తె. తక్కినవారు భీతులై పరువిడిరి. ఇది విని కృష్ణుం డేమి చెప్పిన రుక్మిణీబలరాముల కెవ్వరికేమి మనస్సునొచ్చునోయని యూరకుండెను. అవల నందఱుఁ బెండ్లికూఁతుం దోడుకొని ద్వారక కరుదెంచిరి. ఉభయపక్ష స్నేహము బలపఱుప నెంచిన రుక్మిణీదేవి తలంపు దైవవైపరీత్యంబున రుక్మిగర్వకారణంబున విపరీతంబుగఁ బరిణమించె.

శిష్టజనానుగ్రహ దుష్టజననిగ్రహ భూభారావతరణార్థంబు భూమిపై లీలామానుషవేషంబున నవతరించిన విరించిజనకుండు కృత్యంబును గృతంబును గర్తవ్యశేషంబును నాలోచించి యిట్లు తలపోసె. మద్దర్శనస్పర్శన సంభాషణాదులఁ గోరిన మద్భక్తులకు భక్త

రాండ్రకు వారివారి యిష్టంబుచొప్పునఁ గామంబు దీర్చితి, ధర్మ దూషకులై భూమికిభారంబుగనున్న దైత్యులనెల్ల రామసమేతుండనై పొలియించితి. దుర్ద్యూత హేళన కచగ్రహణాదుల నిమిత్తంబుచేసి శీఘ్రఫలకారియగు కలహంబు రాజులందు జనింపఁజేసి యన్యోన్య హతులఁ గావించితి. కార్యశేషం బించుకగలదు. ఈ యాదవులు మదాశ్రితులై వదాన్యులై బ్రహ్మణ్యులై నిత్యవృద్ధోపసేవులై యైశ్వర్య బలపరాక్రమంబుల నతుల్యులగుట వీరెట్టివారికి నజయ్యులు. వీరు ప్రమత్తులు, నాపరోక్షంబున వీరి చిత్తవృత్తు లెట్లుండునో యసంఖ్యాకులైన వీరి పుత్రపౌత్రప్రపౌత్రు లెట్టివారగుదురో వీ రధర్మనిరతులై వర్తించెదరేని పొంగిన సముద్రముంబోలె వీరి నెవ్వ రాపఁగలరు? కావున వెదురునఁబుట్టిన నగ్నివలె వీరిలో వీరికి నంతఃకలహంబు కల్పించి పూనినకార్యంబు నిశ్శేషంబు గావించి నిజధామంబున కేగెదనని యాలోచించె. *

## మునులు యాదవుల శపించుట

పుణ్యనివహంబులు మంగళావహంబులు గాయజ్జన కలిమతాపహంబులు నగు కార్యంబులొనర్చి యదుసదనవాసుండైన శ్రీనివాసుండు కాలాత్మకుండు సత్యసంకల్పుఁడు నీశ్వరుఁడునగు హరిసంకల్పప్రేరితులై విశ్వామిత్రాసితకణ్వ దుర్వాసోభృగ్వంగిరసులును, కశ్యప వామదేవాత్రివసిష్ఠ నారదాదులును, ద్వారవతీసమీపమున నుండు పిండారకంబను తీర్థంబున కరుదెంచిరి.

ఆసమయంబునం దందుఁ గ్రీడాపరాయణులైన యదునందనులు జాంబవతీసుతుండైన సాంబునకు స్త్రీవేషంబు వేసి వారికడకుఁ దోడ్కొనిచని యవినీతులై వినీతులంబోలె నిట్లనిరి.

" బ్రాహ్మణులారా! నమస్కారంబులు చూలాలగునీసిగ్గరికత్తె తానై మిమ్మడుగ లజ్జించుచున్నది. సత్యదర్శనులారా! పుత్రకామ

*చూ. నూతలీల ద్వితీయచులుకము - 472 పేజీ. దీనివలన భారతయుద్ధానంతరమే మునులు యాదవుల శపించిరని తెలియనగు.

నైన యీ కామిని కడుపున నేమి జనియించెడినో యెఱింగింపుఁ డనినఁ దమ్ము వంచింపఁబూనిన యా క్రించులఁగని కోపించి మునులారా! కులనాశనంబు గావించు ముసలంబు జనించునని శపించిరి. ఆ వాక్యంబులు విని వారెల్లరు భయభ్రాంతులై చని సాంబు నుదరంబు పరికింప నందుండి యినుపరోఁకలి యొండు వెలువడియె. అది గని బ్రాహ్మణశాపంబు సరిదాఁకె. కులక్షయంబును దప్పదు. ఇదివిన్న లోకు లేమందురు? చెట్టు గొట్టి మీఁదఁ ద్రోసికొన్నట్లయ్యె కుడిచి కూర్చుండఁజాలక బ్రాహ్మణుల నవమానించితిమని బ్రహ్మణ్య దేవుండైన శ్రీకృష్ణుం డేమనునో, మన గర్వంబు మనల నింతసేసె. వినాశపురోగామి గదా గర్వంబు. పాప మొక్కఁడుచేసిన ఫలము పెక్కు రనుభవింతురనుట సత్యంబయ్యె. మన కారణంబున యాదవ వంశమే నిర్మూలము కానున్నది. ఏమిచేయుదము? ఎవరితోఁ జెప్పుదము? ఏమని చెప్పుదము? దీనిని జెప్పక దాఁచుటెట్లు? అని మొగములు వెలవెలఁబోవ నా యినుపరోఁకలినిగొని సభకరిగి సకల యాదవ సన్నిధిని రాజగు నుగ్రసేనునకు సర్వము నెఱింగించిరి. అమోఘంబైన విప్రశాపంబు విని ముసలంబుఁగని పురజనులెల్ల విస్మితులు భీతులునై తల్లడిల్లిరి. ఆహుకుండును దానిని జూర్ణంబుచేసి సముద్రంబున వైవుండని యాజ్ఞాపించె. వారును నట్లగావించిరి. ఆ చూర్ణంబెల్ల ముయ్యంచు తుంగయయి సముద్రతీరంబున మొలచి యుండె. బ్రాహ్మణవాక్య మహిమం బట్టిది. అందొక యినుపతునక నొక మత్స్యంబు మ్రింగె. జలధి వలబువైచిన జాలరుల కామత్స్యంబు చిక్కె. వారిలో నొక లుబ్ధకుండు దానిని దన బాణంబునకు ములికీఁగా నమర్చుకొనియుండె. భగవంతుఁ డీశ్వరుండు కృష్ణుం డిది యంతయు నెఱిఁగియుఁ గాలరూపియగుట బ్రాహ్మణ శాపంబు మరలింప శక్తుఁడయ్యు నట్లు గావింప నొల్లఁడయ్యె.

---

# యోగాచార్య లీల.

## బ్రహ్మాదులు శ్రీకృష్ణుని వైకుంఠమునకు విచ్చేయఁ బ్రార్థించుట

అంత నొక్కనాఁడు సనకాది పరివృతుండై బ్రహ్మయు, భూతగణ సమేతుండై శివుండును, బృందారక బృంద సంయుతుండై యింద్రుండును ద్వారకకు నరుదెంచి యేకాంతంబుననున్న శ్రీకృష్ణుం దర్శించి నానావిధముల నాయనను స్తుతించి రందు నంతరిక్షగతుండైన వళక్ష పక్షివాహనుం డిట్లనియె.

లోకాధ్యక్షా! పూర్వము భూభారావతీర్ణార్థము భూమిపై నవతరింపుమని మేము ప్రార్థింప మా వేఁడికోలాదరించి యట్లు మా విజ్ఞాపితంబు సాధించితివి. సత్యసంధులైన సజ్జనులందు ధర్మంబు నీచే స్థాపితంబయ్యె. సర్వలోక పాపాపహంబైన నీ యశము దశదిశల వ్యాపించె. అనుత్తమంబైన రూపంబు ధరించి యదువంశంబున నవతరించి లోకశ్రేయస్సునకై సేవొనర్చిన మహాకార్యము లిఁకఁ గలియుగంబున సాధుజనులు వినియుఁ గీర్తించియు సంసారమునుండి తరింతురు. యదువంశంబున నీ వవతరించి నూట యిరువదియైదు సంవత్సరములు గడచె. ఇఁక నీ విందుండి నిర్వహింపఁదగు దేవకార్యము లేదు. యదుకులంబు విప్రశాపంబున నష్టప్రాయంబయ్యె. ఇఁక నీ చిత్తము వచ్చునేని నీ పరమధామంబు నాశ్రయించి వైకుంఠ కింకరులమైన మమ్మును లోకంబులను బాలింపుము. అని యిట్లు బ్రహ్మాదులు విన్నవింప మాయామనుజుండైన రామానుజుం డిట్లనియె.

పరమేష్ఠీ! మీరు విన్నవించినవిషయ మింతకు మున్న నే నాలోచించితి. నే నవతరించిన భూభారహరణ కార్యంబు చక్కనయ్యె. ఈ యాదవకులంబు వీర్యశౌర్య శ్రీసముద్ధతంబు. దీని నిట్లు విడిచితి నేని నవలీల వేలఁబోఁగొనిన యకూపారంబు భూవలయంబుం బోలె నిది లోకం బాకులంబుగ మ్రింగఁగడంగును. శాపాయుధ * శాపంబు

* శాపాయుధులు = బ్రాహ్మణులు.

మూలంబున దీని సంహరింప నుపక్రమించితి. అది సాంతం బగుడు మీా లోకంబున కరుదెంచెద. అని వెన్నుం డానతిచ్చుటయుఁ జతురాననాదులు నమస్కరించి తమ లోకంబులకుఁ జనిరి.

అంత జగన్నాటక సూత్రధారియగు హాటకాంబరుండు ద్వారవతియందు మహోత్పాతంబులుపుట్ట నుపక్రమించుట తిలకించి ప్రబుద్ధులయిన యాదవవృద్ధుల నెల్లఁ జీరి కాలగతి యోజించి మీా రెల్లరుఁ బ్రభాస తీర్థంబున కరుగుట లెస్స అందుఁ గ్రుంకి కదా మృగాంకుండు దక్షశాపపంకంబువలన విముక్తుండై కలాసంకలితుం డయ్యె. మనమందఱ మందుఁ దోఁగి దేవపితృ తర్పణంబులు గావించి షడ్రసోపేతంబైన భోజనంబుల సభాజనంబుల భూసుర జనంబుల మనంబుల నలరింపఁ జేయుదము. పుణ్యలోకనిదానంబు లయిన దానంబులఁ గావించి కిల్బిష నిర్ముక్తుల మగుదము. అని యాదేశించిన నందఱుఁ దత్ప్రయత్నంబుల నుండిరి.

## ఉద్ధవుండు తన్ను వైకుంఠమునకుఁ గొనిపొమ్మని శ్రీకృష్ణుఁ బ్రార్థించుట.

భగవద్వాక్యంబులు విని విపరీత చిహ్నంబులఁ గని కృష్ణానువ్రతుండు భక్తి నిరతుండును నగు నుద్ధవుండు వివిక్త ప్రదేశంబున వాసుదేవుం జూసి చరణసరసిజంబుల వ్రాలి నమస్కరించి యిట్లనియె.

దేవా! నీ విధంబుఁజూడ నీ యాదవ కులంబును వ్యాపాదించి యీ లోకంబు నిరాలోకంబుఁ ద్యజించురీతిఁ దోఁచుచున్నది. సమర్థుండవయ్యు భూసుర శాపంబును మరలింపకున్న వాఁడవు. నాథా! క్షణార్ధమైన నానాకృష్ణ లోకంబున * నుండఁజాల. మన్ననమోయ నన్ను నీతోడఁ గొనిపొమ్ము. శ్రవణామృతంబును బరమ మంగళంబు నగు నీ భూలోక లీలల నాలకించి నరులు విషయాసక్తి విడిచి నిన్నాశ్రయింతురు. శయ్యాసనాటనస్థానస్నానక్రియా భోజనాదులందు నాత్మ

* నానాకృష్ణలోకము = కృష్ణుండు లేనిలోకము.

ప్రియుండవైన నిన్ను భక్తులమైన మేమెట్లు విడిచియుండఁగలవారము? నీవు భోగించి విడిచిన మాల్యాలంకార భోజనాదుల దాసులమైన మే మనుభవించి నీ మాయను నిజంబుగఁ దరింతుము. దానికై ప్రత్యేక ప్రయత్నం బనావశ్యకంబు. దిగంబరులుఁ, గౌపీన మాత్ర ధారులు, నుపవాసవ్రత కర్శితులు, నూర్ధ్వరేతస్కులు, రాగద్వేష వియుక్తులు, పాపరహితులు, సన్న్యాసులు బ్రహ్మలోకంబునకుఁ జను దురుగాక. మేమో కర్మమార్గప్రమత్తులమై నరలోక విడంబనార్థంబు నీవు గావించిన కార్యములు, పలికిన పలుకులు, నడకలు, నవ్వులు, చూపులు స్మరించుచు స్మరింపఁజేయుచు ననాయాసంబుగఁ దమం బతిక్రమింతుము. అని విజ్ఞాపించిన నేకాంతుఁడును బ్రియుఁడును భృత్యుఁడును నగు నుద్ధవుఁగని దేవకీనందనుం డిట్లనియె.

## —♦ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు జ్ఞానోపదేశంబు సేయుట ♦—

మహాభాగా! నీవు చెప్పినట్లు నేను జేయఁదలంచి యున్నాఁడను. బ్రహ్మరుద్రాదు లందఱు నన్ను వైకుంఠమునకుఁ బిలువవచ్చిరి. బ్రహ్మప్రార్థితుండనై స్వాంశమున నేల యవతరించితి నట్టి దేవకార్యము లెల్లఁ దీరె. శాపనిర్దగ్ధంబైన యాదవకులంబు పరస్పర కలహంబుచే రూపుమాయఁగలదు. ఏడవ దినంబున సముద్రం బీ నగరంబును ముంచు. ఈ లోకమును నేను విడిచిన వెంటనే నష్టమంగళమయి కలిచే నిరాకృత మగు. నేను భూలోకమును విడిచిన పిమ్మట నీ విందుండఁ దగదు, కలియుగంబున జను లధర్మ రుచు లగుదురు. కావున నీవును సర్వవిషయ రాగత్యాగంబు గావించి స్వజనులని బంధువులని స్నేహంబు మాని నాయందుఁ జక్కఁగ మనస్సు నిలిపి సమదర్శనుండవై భూసంచారంబుఁ గావింపుము. మనస్సు వాక్కు నేత్రములు శ్రవణములు వీనిచే గ్రహింపఁబడునది యంతయు మనోమయంబనియు నశ్వరంబనియు గ్రహింపుము. సర్వాంతరాత్మయు సర్వశరీరకుండు నగు నాయందు మనస్సునిలుపని పురుషునకు నానార్థభ్రమంబు సుఖదుఃఖ పుణ్యాపుణ్య కారణంబగు. అట్టి

వానికి నిది యవశ్యకర్తవ్యంబగు కర్మమనియు నిది నిషిద్ధకర్మమనియు నిట్టికర్మ మొనర్చినఁ నిట్టిఫలము కలుగుననియు భేదబుద్ధి జనించు. వివేకియగు బ్రహ్మవిదుఁడు సర్వంబు బ్రహ్మమయంబని పరికించు. అట్టి వానికి శాస్త్రాతిలంఘన దోషంబులేదు కావున వశ్యేంద్రియ సమూహుండనై నాయందు మన స్సావేశింపఁజేసి యచిత్పరిణామాత్మకమైన దేవ మనుష శరీరజాతం బంతయు జీవునిచే ధార్యంబనియు నధీశ్వరుండనైన నేను జీవున కాధారంబనియు గ్రహింపుము. ఇట్లు సర్వదా భావించుచుండితివేని భ్రమయుఁ దన్మూలంబైన సంసారంబు నశించు. పృథివిమొద లాత్మపర్యంతంబైన తత్త్వంబుల సాధర్మ్య వైధర్మ్యంబులను దెలిసిన దేహి తనయందువలె సర్వభూతంబులందును సుహృద్భావము గలవాఁడై యుండు. ఆత్మానుభవ సంతుష్టుఁ డగు వానికి విఘ్నభయము లేదు. గుణదోషాతీతుఁ డర్భకునివలె దోషబుద్ధిచే నిషేధంబులనుండి నివర్తింపఁడు. గుణబుద్ధిచే విహితకర్మ మాచరింపఁడు. ఇట్లు సర్వభూత సుహృదుఁడును శాంతుఁడును జ్ఞాన విజ్ఞాన నిశ్చయుండునునై ప్రపంచమంతయు మదాత్మకంబని చూచువాఁడు మరల సంసారదుఃఖముం గానఁడు. అని భగవంతుఁ డాదేశించినఁ దత్త్వజిజ్ఞాసువై యుద్ధవుండు నమస్కరించి యిట్లనియె.

యోగేశ్వరా! యోగవిన్యాసా! యోగాత్మా! యోగసంభవా! మోక్షప్రాప్తికై నీవు సర్వము త్యజింపుమని యుపదేశించితివిగాని విషయాసక్తులయి కామముపాలఁ బడినవారి కట్టిత్యాగము దుష్కరము. అందు భక్తిలేనివారికిఁ గేవలము దుస్సాధమని నా యభిప్రాయము. దేవా! నీచేఁ ద్యాగ ముపదేశింపఁబడిన నేను నీ మాయచే విరచితంబైన పుత్రకళత్ర సహితంబైన దేహంబునందు మూఢుఁడనై నేను నాది యను తలంపుంచినవాఁడను. ఇట్టి నీభృత్యునకు నీ యుపదేశము ప్రకారము నడచుకొన నెట్లు సుఖముగ సాధ్యపడునోయది నీవే బోధింపుము. సత్యుండవును స్వదృక్కునైన నీవు తప్ప నాకీవిషయంబు బోధింపఁగలవాఁడు దేవతలయందైనఁ గానరాఁడు. బ్రహ్మాదులు నీ మాయచే మోహితులై శరీరధారులై

యనాత్మఁ బ్రతిపత్తిగలవారై యున్నవారు. భవదీయ పదాంబుజ గుణానుభవ రసికులగు భాగవతులతోడి సాంగత్యము లేనివారికి నుపదేశము వేళఁ గేవల యుక్తులచే నెంత విమర్శించినను మాయ నివర్తింపదు. కావున దంపతులై గృహములయందు వర్తించు గృహస్థులకుఁ దాపత్రయతప్తులకు హతవిషయవేగులకు సత్సాంగత్యము లభించునుగాని విషయలాలసులకు లభింపదు. కావున ననవద్యుండవు ననంతపారుండవు సర్వజ్ఞుండవు నీశ్వరుండవు నకుంఠవైకుంఠవాసుండవు నారాయణుండవు నరసఖుండవు నగు నిన్ను సంసారదుఃఖతప్తుండనై నిర్విణ్ణబుద్ధి నగు నేను శరణు చొచ్చితిని. అనిన భగవంతుఁ డిట్లనియె.

ఉద్ధవా! త్యాగంబు నుపకారంబంటివి. లోకమునందలి యాయా వస్తువుల నియతగుణముల విమర్శింపఁజాలిన నేర్పరులగు మనుష్యులు విషయవాసనములనుండి తమ్ముఁ దామే తరింపఁ జేసికొందురు. పురుషునకుఁ జక్కఁగా శిక్షింపఁబడిన యతని యాత్మయే ముఖ్యగురువు. మనుష్యజన్మమందుఁ బ్రత్యక్షానుమానము లను ప్రమాణముల చేతను * శ్రుతిస్మృతులచేతను మోక్షంబు సాధింపనగు. మనుష్య జన్మమందే చిదచిదీశ్వర వివేకముగలిగి పరమాత్మోపాసనాత్మక యోగంబు సాధించు నిపుణులు జితేంద్రియులై సర్వజ్ఞత్వ సత్యసంకల్పత్వాది సర్వశక్తి పుష్కలితుండనైన నన్ను మిక్కిలి స్పష్టముగఁ దెలిసికొందురు. ఈ కారణముచే లోకమున నొకటి రెండు మూఁడు పాదములు, ననేక పాదములు, పాదహీనములు లోనగునవి పెక్కులున్నను నందు మనుష్యశరీరమే నాకుఁ బ్రియమైనది. అప్రమత్తులగు వారహంకారాదులఁ దెలియరాని నన్ను బుద్ధిచే హేతువులచే నూహించి యీ పురుష దేహమునందుఁ బ్రత్యక్షదర్శనమునకై వెదకుదురు. ఈ విషయమున యదువునకు నవధూతకు జరిగిన సంవాదమను పురాణేతిహాసము గలదు. వినిపెద వినుము.

---

*ప్రత్యక్షము=ఇంద్రియములకు గోచరించునది. అనుమానము = ఊహించి తెలిసికొనునది. పొగయున్న చోట నిప్పుండునుగదా యని యూహించినట్లు.

## శ్రీ కృష్ణుఁ డుద్ధవునకు
## నవధూత యదుసంవాదముఁ జెప్పుట.

భయరహితుండై విద్వాంసుఁడై తరుణుఁడైన యొక యవధూతం గాంచి ధర్మవిదుండైన యదు విట్లనియె. బ్రాహ్మణోత్తమా! నీ వొక కార్యమైనఁ జేయవు. పండితుఁడవయ్యు బాలునివలెఁ దిరుగుచుందువు. ఇట్టి యతినిపుణమైన బుద్ధి నీ కెట్లు జనించెను? లోకమునఁ బ్రాయికముగ మనుష్యు లాయుస్సంపదలకొఱకు యశస్సుకొఱకునై ధర్మార్థకామముల సాధింపఁ దత్తత్సాధనములఁ దెలియఁగోరి చరించుచుందురు. నీవో యేదియుఁ జేయవు. చేయఁగోరను గోరవు. జడునివలెఁ బిచ్చివానివలెఁ బిశాచము సోఁకినవానివలెఁ దిరుగుచుందువు. తెలియక శక్తిచాలక యిట్లుందువా యనినఁ బండితుఁడవు, సమర్థుఁడవు, మితభాషణుఁడవు, సుభగుఁడవు. జనులు కామలోభములను కాఱుచిచ్చుచే దహింపఁబడుచుండ గంగా జలమందలి యేనుఁగువలె నీ వాయగ్నికిఁ జొల్పడక యున్నాఁడవు. బ్రాహ్మణోత్తమా! లోకమున నానందకారణములైన విషయభోగంబులు నీ కేవియు లేవు. అట్లుండియు నీ వానందపూర్ణుండవై యుండు కారణం బెయ్యది! అనుగ్రహించి ప్రత్యుత్తరమిమ్మని సవినయముగ గౌరవించి యడుగు బ్రహ్మణ్యుఁడు మేధావియగు నయ్యదువునకు నవధూత యిట్లనియె.

రాజా! నే నేబుద్ధి నాశ్రయించి ముక్తుఁడనై చరించుచున్నాఁడనో యట్టిబుద్ధి నాకుఁ గలిగించిన గురువులు పెక్కురుగలరు. భూమి, వాయు వాకాశము, జల మగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు, కపోత మజగరము, సముద్రము, పతంగము, దేనెటీఁగ, గజము, వ్యాధుఁడు, హరిణము, మీనము, పింగళ, కురరమనుపక్షి, యర్భకుఁడు, కుమారి, శరకారుఁడు, సర్పము, సాలెపురుగు, పేశకారియగు భ్రమరమను నీ యిరువదినలువురు నా గురువులు. వీరిచే శిక్షింపఁబడితిని. ఈ యిరువదినలువురివలన నేను నేర్చిన విషయములు చెప్పెద.

భూమి పర్వతవృక్షరూపయనియు సమరూపయనియు రెండు విధములు. అందు సమరూపయగు పృథివి దైవవశంబునఁ జనులు తన్నాక్రమించి త్రవ్వుట మన్నుటలోనగు కార్యము లాచరించి దుఃఖపెట్టినను జలింపకుండుట చూచి నేనును దైవవశంబున జీవులకు దుఃఖములు కలుగుచుండును గావునఁ జలింపరాదని క్షమనేర్చితి. పర్వత వృక్షరూప యగు భూమియందలి వృక్షములు, వాని పట్టలు, గడ్డి, సెలయేళ్లులోనైనవి పరోపకారార్థము సర్వదా వినియోగపడుటయు వృక్షాదులను బరులు నఱికిన నవి వలదనుటగాని సమ్మతించుటగాని లేకుండుటయుఁగని నేనును జీవి నరులకొఱకై జీవింపవలయునని నేర్చితి.

వాయువు ప్రాణవాయువని బాహ్యవాయువని ద్వివిధము. అందుఁ బ్రాణవాయు వాహారాదులమాత్రము గోరునుగాని శబ్దాది విషయముల నపేక్షింపదు. అట్లే మునియుఁ బ్రాణధారణమునకు మాత్రము వలయు నాహారమును సంపాదించు వృత్తిచే సంతుష్టుఁడై యుండవలయునుగాని యింద్రియప్రయత్నంబు లైన శబ్దాదివిషయంబులఁ గోరరాదని యెఱింగితి. ప్రాణరక్షణవృత్తి మాత్రమేల యందువేని యాహారము గొనకున్న మనస్సు దుర్బలమగు. దానివలన జ్ఞాననాశమగు. కావున జ్ఞానము మనస్సు నశింపకుండ నాహారముఁగొని ప్రాణరక్షణము గావింపవలయును. ఇఁక బాహ్యవాయువు సంచరించు చోట నొక్కొక్కయెడఁ జలివేఁడిములను బొందుచుండునుగాని దానియందది సక్తముగాదు అట్లే యోగియు దేహయాత్ర సలుపు చోట నప్రియము ప్రియము ప్రియాప్రియము లోనగు నానాధర్మంబులఁ బ్రవేశింపవలసియుండును. కావున విషయంబులఁ బ్రవేశించియు వానియందు మనస్సు సంగమింపఁ జేయరాదని నేర్చితి. మఱియు దేవత్వము మనుష్యత్వము స్థూలత్వము కృశత్వము లోనగు గుణములుగలిగి పృథివ్యాది పరిణామరూపంబులైన దేహంబులందు వర్తించియు నా యాగుణముల సంబంధములేకయు సువాసన దుర్వాసనలు గల ప్రదేశంబులందుఁ జొచ్చియు నవి తనగుణములని తోఁచనీకుండునట్లు లాత్మదర్శనము గావించు యోగియు వర్తింపవలయునని నేర్చితి.

ఆకాశము సర్వకాలములందు సమస్తమునందు లోపల వెలుపలఁ జరములందు నచరములందు నిండి వ్యాపించి యుండియు విభజింపఁబడకుండునట్లు మునియుఁ బరమాత్మయుఁ జరాచరాది భూతంబులం దన్నిట లోపల వెలుపలనిండి యవిభక్తుఁడై యున్నాఁడనియు సంగరహితుండనియు నెఱింగితి. మఱియు వాయువశంబున మేఘంబులు మింటఁగూడినను నాకాశంబు వానిని నంటకుండునట్లు పరమపురుషుండు కాలసృష్టంబులై గుణపరిణామాత్మకంబులై తేజోజలానిలాకాశ పృథివీ వికారంబులైన స్థావరజంగమపదార్థంబుల వ్యాపించియు నంటఁడని యెఱింగితి.

స్వచ్ఛములు సహజస్నిగ్ధములు మధురములు తీర్థభూతములైన సజలములు తమ్ముఁ ద్రావిన పానము చేసినవారిని బవిత్రులఁ జేయునట్లు మునియు నిర్మలుఁడు సహజానురాగము గలవాఁడు మధురాలాపియై వీక్షణ పాదస్పర్శనాదుల లోకులఁ బవిత్రులఁ జేయవలయునని నేర్చితి.

తేజస్వియు, దీప్తుఁడును, దుర్ధర్షుఁడును, నైన యగ్ని సర్వభక్షకుఁడయ్యుఁ దద్దోషమునకుఁ బాత్రుఁడు గానట్లు యోగయుక్తుఁడును జ్ఞానాతిశయ వంతుఁడును దపోదీప్తుఁడును నక్షోభ్యుఁడును, నుదరమే భోజనపాత్రముగాఁ గలవాఁడునై యిది మృష్టాన్న మిది పాసినకూడని భేదములేక సర్వభక్షుండయ్యు నిర్మలుండే యగుచున్నాఁడు. మఱియు నివురుగప్పిన నిప్పువలెఁ గొన్ని వేళలఁ దెలియరాకయు, నాజ్యాహుతులఁ బ్రవేశించు నగ్నివలె నొకవేళ యోగాభ్యాసంబునఁ బ్రకాశించుచు నైహికాముష్మిక ఫలములఁగోరు దాతల పూర్వోత్తరాఘముల దహించుటకై పరేచ్ఛవలన హవిస్సును గ్రహించు నగ్నివలెనే యోగియుఁ బరులు బలవంతముగ నిచ్చిన దానిని భుజించుచున్నాఁడు. తన మాయచే సృష్టింపఁబడి సదసల్లక్షణంబైన యీ ప్రపంచమునందుఁ బ్రవేశించి యాత్మ దేవ మనుష్యాది రూపప్రతీతిఁగాంచియు దారువునందలి వహ్నివలెనుండును. కట్టెవంకరైన నందలి యగ్ని వంకర కాదు కదా. కొంత

వడి ప్రకాశించి యణఁగిపోవు నగ్నిజ్వాలలవలెఁ బ్రవాహమువంటి కాలము వేగముచే భూతములు పుట్టుచు గిట్టుచు నిత్యములై యుండు ననియు నాత్మ కట్టివి కలుగవనియు నగ్నివలన నేర్చితి.

హానివృద్ధులు చంద్రునికళలకే కాని చంద్రునకు లేనట్లు లాస్మశానాంతములైన జన్మనాశనములు దేహమునకే గాని యాత్మకుఁ గాదని చంద్రునివలన నేర్చితి.

సూర్యుఁడా యాకాలముల జలములను గిరణములచే గ్రహించి మరల వానిని బర్జన్యుండై లోకోపకారముగ వర్షరూపమున విడుచు నట్లు యోగియు నింద్రియములచే విషయములను గ్రహించినను వానియందు సక్తుఁడుగాక తా నార్జించినవి పరోపకారముగ వినియో గించునని సూర్యునివలన నేర్చితి.

మఱియు నద్దము జలము లోనగు వానియందుఁ బ్రతిఫలించిన సూర్యుఁ డద్దము జలములోనగు వానికంటె భిన్నుఁడై వానిగుణము లచే సక్తుఁడుగానట్లు ప్రత్యగాత్మయు దేవమనుష్యాది దేహములందుఁ జొచ్చియు వానికంటె భిన్నుఁడుగానే యుండుననియు స్థూలబుద్ధులు దేహమే యాత్మయని భ్రాంతి వహింతురనియు సూర్యునివలన నేర్చితి.

ఎట్టి వారియందును నతిప్రీతియు నాసక్తియు వహింపరాదు. అట్లు వహించెనేని కపోతమువలె దుఃఖితుఁడగును. ఒకానొక యడవిలో నొక పోతుపావుర మొక పెంటిపావురముతో జతగూడి గూఁడు కట్టుకొని కొన్ని సంవత్సరములు కాఁపురము చేసెను. గృహస్థ ధర్మమందుఁ జరించు నా రెండుపక్షులు స్నేహబద్ధ హృదయ ములై యేకదృష్టి యేకాంగ మేకబుద్ధి గలవై యుండె. ఇట్లుండఁ బెంటిపావురమునకు గర్భమునిలిచె. అజితేంద్రియమైన పోతుపక్షి యది కోరినవెల్ల నెంత కష్టపడియైనఁ బ్రాణగొడ్డమైన సాధించి తెచ్చి యిచ్చుచు దాని కోర్కి తీర్చుచుండె. అది కూడబరుండి, కూడు గూర్చుండి, రెక్కలెత్తి నాడుచుఁ బాడుచుఁ దినుచుఁ దిరు గుచు వనములల విహరించుచుండె. ప్రసవకాలము డాసినఁ గపోతి

భర్త సన్నిధానమంద గూటియందు గ్రుడ్లుంచెను. భగవంతుఁడు వానియందుంచిన శక్తివలన నవిక్రమముగఁ బిల్లలయ్యెను. పుత్రప్రీతి గల యామిథునము బిడ్డలను మిగుల వాత్సల్యముతో సాఁకుచుండెను. ఆకిశోరకకూజితములు నవ్యక్త మధురాలాపములు వినుచు నవి యుంచించుక యెఁదిగిన సంతోషించుచు వాని మృదుదేహములు తాఁకుచుఁ దన ముక్కున నెరగొని వాని ముక్కులతో నెంచుచు సంతోషించుచుండెను. విష్ణు మాయచే మోహితములై స్నేహాను బద్ధ హృదయములై యవి బిడ్డలఁ బోషించుచు నొకనాఁడు పిల్లల కెర తేఁబోయి యా రెండుపక్షులు మిగుల జాగొనర్చెను. ఆ సమయమున నొక బోయవాఁడా ప్రాంతముల సంచరించుచుండి యా పిల్లలను గని వలపన్నిన నవి యందుఁ దగులుకొనియె. ఆఁడుపక్షి యచ్చటికి వచ్చి తనగూఁటి సమీపంబున వలపన్ని యుండుటయు నందుఁ దనపిల్లలు చిక్కువడియుండుటయుఁ గని దుఃఖ మాఁపలేక తానును బిల్లలతోడ నా జాలంబుఁగొని కుఱికెను. మగకపోతంబు వాగురాబద్ధంబులైనశిశువులను దన ప్రాణము కన్నమిన్నయగు భార్యనుజూచి దుఃఖాతిశయంబున విలపించుచు నిట్లనియె. నిర్భాగ్యుఁడను దుర్మతినైన నాకెట్టి శోకము ప్రాప్తించెను. ఇల్లు వాకిలి యని యేర్పఱుచుకొంటిని గాని వీనివలన నే నేమితృప్తిఁ గాంచితిని? ఏమి కృతార్థతఁ గంటిని? దారపుత్రాదుల వియోగంబు కతన ధర్మార్థ కామరూప త్రివర్గసాధన భూతమైన గృహస్థాశ్రమము నాశమయ్యె. అనురూపయు ననుకూలయుఁ బతిదేవతయునగు నా భార్య యీ పాడింటిలో నన్నొంటిగ విడిచి తాను బిడ్డలతోడ స్వర్గమునకుఁ బోవుచున్నది. ఇఁక దీనుఁడనై యాలిని దనయాలిని గోలుపోయినవాఁడనై దుఃఖజీవితుఁడనై విధురుఁడనై యేమని యెవరి నిమిత్తమై యీపాడు దేహ మనుపచ్చికష్టైను భరింతును? అని వలలోఁ దగుల్కొని చేష్టలుడిగి ప్రాణము పోవు స్థితియందుండు బిడ్డలఁ గని యా మతిమాలినపావురము తానును వలలోని కుఱికెను. క్రూరుండైన యా బోయయుఁ బోతుపెంటిపావురములను బిడ్డలను

గ్రహించుకొని సిద్ధార్థుఁడై యింటికేగెను. ఈ విధముగఁ గుటుంబి యజితేంద్రియుండై ద్వంద్వపాశములకుం జిక్కి కుటుంబపోషణ రతుండై కపోతంబు మాడ్కిఁ గళత్రఁ పుత్ర సంగతిఁ గష్టదశం జెందును. తెఱచిన తలుపులుగల ముక్తిద్వారమగు మనుష్యదేహము ధరించియుఁ బక్షివలె గృహాశక్తిగలవాఁడు నిచ్చెన పైమెట్టు వఱ కెక్కియు నచ్చటినుండి దొరలు భ్రష్టుఁడని పెద్దలు చెప్పుదురు.

దుఃఖమువలె నింద్రియసుఖము స్వర్గమందును నరకమందును దేహధారులకుఁ గలుగుచుండును. గావున దానిని దెలివిగలవాఁడు కోరరాదు. అల్పమో అధికమో సరసమో నీరసమో యగు నాహారమును దానై యత్నింపక దైవికముగ లభించిన దానిని గ్రహింపవలయు. ఆహారప్రాప్తికిఁ బ్రతిబంధకమైన ప్రారబ్ధమునలన దైవికముగ నాహారము లభింపదేని దానికై ప్రయత్నింపక యూరక పండుకొనవలయును. ఇంద్రియబలము దేహబలము గలవాఁడైనను, దేహధారి యేకార్యమొనర్పక శయనించి నిద్దురపోవక దేహసుఖముఁ గోరక యుండవలయు నను నివి యజగరమువలన నేర్చితి.

వెలుపలఁ బ్రసన్నుఁడు, లోపల గంభీరుఁడు, నింతటివాఁడని భావింపరానివాఁడు, దాటఁరానివాఁడు, పారము లేనివాఁడు, కదలని నీటివలె నక్షోభ్యుఁడు, నై యుండవలయునని సముద్రమువలన నేర్చితి. మఱియు నట్టులే నారాయణపరుఁడై విషయపరుఁడు గాక మునియు వానలయందు నెన్నియోనదులు జలము సమృద్ధిగఁ గొని తెచ్చినను నుబ్బక యెండలయందు శుష్కింపకయుండు సముద్రమువలెఁ గోరికలు నెఱవేఱినఁ బొంగక నెఱవేఱకున్నఁ గ్రుంకక యుండవలయునని నేర్చితి.

మాయా రచిత పదార్థంబులైన బంగారు సొమ్ములు వస్త్రంబులు ధరించు దేవమాయ యగుస్త్రీని జూచి మూఢుఁడజితేంద్రియుండై దానియందే మనస్సునిలిపి తదాసక్తుఁడై మండెడు మంటలోఁ దూఁకు మిడుతవలె నశించునని పతంగమును జూచి నేర్చితి.

ఆపుష్పమందుఁ గొంచె మీపుష్పమందుఁ గొంచెము తేనె యను బుష్పమునకు బాధలేకుండునట్లు గ్రహించుచు నే పుష్పమం దును దగులములేక తిరుగు తుమ్మెదను జూచి యతియు నే గృహస్థు నకును నొప్పి గలుగకుండునట్లు కొంచెము కొంచె మాహారము మాధుకరవృత్తి గ్రహింపవలయునని నేర్చితి. మఱియు నిది చిన్నదని యిది పెద్దదని భేదమెంచక యన్ని పుష్పములనుండి మధుపంబు సారము గ్రహించునట్లు నేర్పరియగు మనుష్యుఁడు కొలఁదిఁ గొప్పలు పాటింపక యన్ని శాస్త్రములనుండి సారము గ్రహింపవలయు ననియు నేర్చితి. జుంటీఁగ తేనెఁగూర్చుటయు నా తేనియ గ్రహింప మనుష్యులు దానిం జంపుటయుఁగని యతియు మాపటికని రేపటికని యెత్తి యుంచరాదనియుఁ గడుపే యన్నపాత్రమనియుఁ జేతులే భోజన పాత్రమనియు నెంచవలయునని నేర్చితి.

వదిమీఁద నిలుపఁబడిన యాఁడేనుఁగుబొమ్మను జూచి దానిని సమీపించి గుంతలోఁ దిగఁబడి పట్టుపడు మగయేనుఁగును జూచి యతి కొయ్యయాఁడుబొమ్మనైనఁ గాలనైనఁ దాఁకరాదనియుఁ దాఁకిన నంగసాంగత్యమువలన నింద్రియములకు బద్ధుఁ డగుననియు నేర్చితి. మఱియుఁ బ్రాజ్ఞుఁ డగువాఁడు తనకు మృత్యుస్వరూపమగు స్త్రీని సమీపించి పోవరాదు. పోయెనేని బలవంతులు మర్దింతురని యాఁడేనుఁగునకై పోయి బద్ధమైన యేనుఁగును మగయేనుఁగులు మర్దించుటచూచి నేర్చితి.

తేనెటీఁగలు తేనెనుగూర్చి తాము త్రాగకయుఁ బరుల కీయ కయు నుండుటయు దాని నితరులు బలాత్కారంబున గ్రహించికొని పోవుటయుఁ జూచి దానము భోగములేక కష్టపడి సంపాదించిన లుబ్ధుని ధనము నిట్లే పరులపాలగుఁ గదాయని నేర్చితి. తేనెటీఁగలు గూర్చిన తేనెను వేఱొక మధుహారి గ్రహించినవిధమున గృహస్థు లార్జించిన పదార్థములను వారియింట యతి భుజింపవలయునుగాని తాను సంపాదించి యుంచుకొనరాదని తేనెటీఁగవలన నేర్చితి.

వేటగాని పాటకు మోహముగొని చిక్కిన లేళ్ళఁగని యతియు గ్రామ్య గీతములు విన రాదనియు భగవద్విషయకములైన పాటల విన నగుననియు నేర్చితి. గ్రామ్య స్త్రీల యాటలఁ బాటల వాద్యములఁ గనుట వినుటచేఁగదా ఋశ్యశృంగుఁడు స్త్రీలచేతి క్రీడనకం * బయ్యె.

అతి దుర్జయంబైన జిహ్వచే జనులు రసవిమోహితులై మృత్యువు వాతఁబడుచున్నారని బుద్ధిహీన మైన మీను గాలనువాతఁ బడుట కని యెఱింగితి. బుద్ధిమంతులు నిరాహారులై శీఘ్రకాలమున నింద్రియములఁ దక్కిన నన్నిటిని జయింతురుగాని నాలుకను మాత్రము జయింపలేరు. నిరాహారులకు జిహ్వాచాపల్యము మెండు. జిహ్వను జయింపక తక్కిన యింద్రియములనెల్ల జయించినంత మాత్రమున జితేంద్రియుఁడు కాఁడు. ఒక్క నాలుకను జయించెనా యన్ని యింద్రియములను జయించినవాఁడే యగును.

## ——♦ పింగళాగీతలు. ♦——

పూర్వకాలమున విదేహరాజ నగరంబునఁ బింగళ యను వేశ్య యొక్కర్తుండెను. దానివలన నేను నేర్చుకొన్నది చెప్పెద వినుము. ఆ † పురమండనం బొండొకనాఁడు దండిభూషణంబుల మేనుగై సేసికొని ధనమిచ్చినవానితోఁ గలయుదునని నియమమేర్పఱచుకొని గృహద్వారంబునఁ గన్నులు వాఁచిపోవ దీర్ఘకాలము కాచి కాచి యుండెను. దానితో రమింపఁగోరి కొందఱు విటులు ధనవంతులు వచ్చిరిగాని ధన కాముకయగు నమ్మగువ యంతకంటె నెక్కువ రొక్క మిచ్చు మక్కువకాఁడు దక్కకుండునాయని వచ్చినవారిని నూరక యంపుచుండెను. ధనముమీఁది పెక్కువ మక్కువకతంబున వచ్చినవారెల్ల వారిచ్చెదమనిన తన సంకేతధనమునకన్న హెచ్చు తెమ్మనుచు నూరక పంపుచు మఱియొకఁడు రాఁడా యని ద్వారము కఱచుకొని నిలుచుచు లోపలికి వెలుపలికి వచ్చుచుఁబోవుచునుండ

* క్రీడనకము = ఆడుకొనువస్తువు. † పురమండనము = వేశ్య.

సద్దము సేయుచుండెను. అప్పుడు ముఖము వాడుపాఱ దీనచిత్తయైన యా పింగళకుఁ బరమసుఖావహంబైన పరితాప ముదయించె. ఆ నిర్వేద దశయం దది వాకొనిన కొన్నివాక్యములు గలవు. ఆ పింగళాగీత ములు చెప్పెద నాకొనుము. ఆ మోడుపుమాటల నేమి వినవలయు ననకుము. పురుషుని యాశాపాశములకు నిర్వేదము ఖడ్గమని తలం పుము. నిర్వేద ముదయింపనివాఁడు దేహ తత్సంబంధ బంధముగు నాశయెట్లు విడువఁగలఁడు? విరక్తమతియగు నా సతి యిట్లు పలికెను. అయ్యో మనస్సు జయింపని నా మోహాతిశయము నేమనుకొం దును. మోహాతిరేకంబునఁ గదా వివేకశూన్యనై తుచ్ఛుఁడగు ప్రియునివలనఁ గోరిక నెఱవేర్చుకొనఁ గోరితి. సర్వదా మిక్కిలి చేరువయగు హృదయనికేతనమం దుండువాఁడును, మనోహరుండును, రతిప్రదుండును, ధనప్రదుండును, శాశ్వతుండును నగు భగవంతుని విడనాడి యకామదుండును, దుఃఖ భయ శోక మోహ దాతయుఁ దుచ్ఛుఁడు నగు మనుష్యుని నజ్ఞురాలనై సేవింపఁగోరితి. కష్టా! నీచాతినీచమైన సంకేతవృత్తి మరగి వ్యర్థముగ నాత్మను మిగులఁ బరి తాప పఱిచితిఁగదా. స్త్రీలంపటులై ధనాశాపిశాచీ గ్రస్తులగుటచే శోచనీయులైన నరులవలన ధనము రతిఁ గోరిన నాకంటె మతిహీన యెవ్వతె? ఎముకలచే నిర్మితములైన స్తంభములు దూలములు వాస ములు గలదై చర్మరోమ నఖము లనుకప్పుచేఁ గప్పఁబడి మలమూత్ర పూరితమై క్షయించు నీ తొమ్మిదితొట్ల కొంపను నేనుగాక మఱి యె వతె యాశ్రయించును? ఆత్మదాతయగు నచ్యుతుని విడిచి మఱియొక కాంతునిఁ గోరుటచే నీ మిథిలాపురంబున నేనొకతనే సత్యముగ దుష్టబుద్ధియగు స్త్రీని. హితకరుండును ప్రియతముండును నాథుండును శరీరులకెల్ల నాత్మయు నగు నారాయణునకు నా యాత్మను విక్రయిం చుటచే నాయనను వశపఱచికొని లక్ష్మీదేవివలె నేనాయనతోనే రమిం చెదను. కామము లాద్యంతవంతములు. నరులా కామదులు. దేవతలా కాలముచే నుపద్రవపడువారు. ఇట్టి వీరు తమరు కట్టుకొన్న పెండ్లాల క్షేమసుఖము గలిగించిరని నేను వీరి నాశ్రయింతును? నేను బూర్వ

జన్మమునఁ దెలిసియో తెలియకయో చేసిన యేదో యొక కర్మముచే విష్ణువు నాయెడఁ బ్రీతుఁడయ్యెఁ గనుకనే సుఖావహమైన యీ విచార మత్యంత దురాశాపీడితురాలనగు నా కుదయించెను. భగవంతునకు నాయందుఁ బ్రీతియె లేకుండిన దేహగేహాదులందు నేను నాది యను నభిమానరూపమైన మోహపాశమును బరిహరించి మన శ్శాంతినిబొందు నీ నిర్వేదంబు నాకెట్లు పొడము? కావున భగవం తుఁడు నాకొనరించిన యీ యుపకారమును శిరసావహించి యిఁక దురాశలను వదలి యాయననే యాశ్రయించెదను. ఇఁకశ్రద్ధావతినై దైవవశమున లభించినదానితో జీవించుచు లభింపనిచో దుఃఖింపక నిరతిశయ ప్రియుండైన భగవంతునితోఁ గ్రీడించుచుండెదను. అన్య చింతమాని తుచ్ఛనరులపై నేకాగ్రముగ నొనరించి నంతకాల మీామనస్సును భగవంతునిపై మరలించి యుంటినేని నేనేల ముక్తను గాకుందును. సంసారకూపమునఁ బడి కన్నులుగానక కాలసర్పముచేఁ బ్రింగబడుచుండు నన్ను భగవంతుండగు విష్ణువు తప్ప మఱియెవ్వరు రక్షింప సమర్థులు? ఈ ప్రపంచమును సర్వమును గాలసర్పము బ్రింగుచున్నదని విచారించి హెచ్చరికకలిగి యన్నిటియందు విరక్తి వహించువానికి రక్షకుఁడు భగవంతుఁ డొక్కఁడే. అని నిశ్చితమతియై దురాశ వదలి చిత్తశాంతి వహించి శయ్యపైఁ గూర్చుండి యాపింగళ యాశను మాని సుఖముగ నిద్రించెను. కావున నాశయే పరమదుఃఖ మని నైరాశ్యమే పరమ సుఖమని యెఱింగితి.

ప్రియతమంబైన పదార్థంబు మిక్కిలి కష్టింపక లభింపదు గావునఁ బరిగ్రహంబు మానిన నత్యంతసుఖము గలదు. ముక్కున మాంసము గఱచుకొనిపోవు లకుముకిపిట్టను బలవంతము లైన గ్రద్దలు డేగలు గొట్టును గావున మాంసమును వదలి యది సుఖించె. నాకు మానావమానములు లేవు. ఇల్లు బిడ్డలను చింత లును లేవు. ఆత్మక్రీడం దవిలి యాత్మరతినై బాలునివలెఁ జరించుచుం దును. చింతలుమాని పరమానందమున మునిఁగియుండు వారిరు వురే. అందొకఁడు ముగ్ధుఁడై జడుఁడునైన బాలుఁడు. రెండవవాఁడు

త్రిగుణాతీతుఁడు. వివాహార్థమై యొక పిన్నదాని యింటికిఁ గొందఱు బంధువులు వచ్చిరి. అప్పుడా యింటి పెద్దవారెంతో పోయి యుండిరి. ఆ కన్యకయే వారికి భోజనము సిద్ధము చేయఁదలఁచి యొంటిగ బియ్యము దంచుచుండ ముంజేతి సంకుగాజులు బిగ్గర ధ్వనించుచుండెను. దాని కాచిన్నది లజ్జపడి బంధువులు విన్న నేమనుకొందురో యని రెండేసి గాజులుమాత్ర ముంచుకొని తక్కినవానిని బగులఁగొట్టెను. ఆవల నారెండును ధ్వనించుచుండుట గని యొక్కొక్క గాజుమాత్ర ముంచుకొని రెండవగాజును బగులఁగొట్టెను. ఒక్కొక్క చేత నొక్కొక్కగాజుమాత్ర ముండుటచే ధ్వనింపదయ్యె. అప్పుడామెనుజూచి లోకతత్త్వమెఱిఁగి యొంటరిగాఁ దిరుగుట నేర్చుకొంటిని. పెక్కు రొక్కచోఁ గూడినఁ గలహము. ఇరువు రొక్కచోఁ గూడిన ముచ్చటలు. కావున నాకన్య కంకణమువలె నొంటరిగా నుండుట మేలని నిశ్చయించితి. ఒక్కదానియంద మనస్సునిలుకడగ నిలుపవలయు. శ్వాసంబు జయించెనేని మనస్సు నిలుకడనొందు.* ఆసనంబును జయించినవాఁడు † శ్వాసంబును జయింపఁగలఁడు. అటులైనను మనస్సు చంచలముగదా యెట్లు నిలుకడ నొందుననెదవేని వైరాగ్యాభ్యాసబలముల నదిస్థిరపడునుగాన నట్టిదాని హెచ్చరికకలిగి యోగయుక్త మొనర్పవలయు. భగవంతుని నాశ్రయముగాఁ గొని మనస్సు స్థిరపడెనేని మెల్లమెల్లఁ గర్మవాసనలు వదలిపోయి యద్దాన రజస్తమస్సులు నాశిల్లి సత్త్వంబు ప్రవర్ధిల్లును. అప్పుడా మనస్సు విషయాంతరములకు నగోచరమగుట ధ్యేయాకారమునందుమాత్ర మాసక్తమైన మనస్సుగలవాఁ డగుచున్నాఁడు. ఇట్లు పరమాత్మయందు నియమితంబైన చిత్తముగలవాఁడు బాణపు ములికికొన నూఱునెడఁ

---

*శ్వాసము మనస్సునకు వాహనము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు నిలిపిన మనస్సు నిలుచును. గుఱ్ఱమును నిలిపిన దానిమీఁది రౌతు నిలుచునుగదా.

† ఆసనంబు జయించినవాఁడు = కదలక మెదలక కాలు తిమిరిలేక యొక యాసనమందే యధమపక్షము మూఁడు నాలుగు గంటలైనఁ జిరముగఁ గూర్చుండఁ గలవాఁడు.

బ్రక్కనపోవున రాజు నెఱుంగనటు లిది బాహ్య మిది యభ్యంతర మని తెలియఁగఁజాలఁడు. యోగికి జనసమ్మర్దమందుఁ గుమారి గురు వని చెప్పితిని గదా. జనసమ్మర్ద త్యాగమందు సర్పమును గురువుగాఁ గొని దానివలె నొంటిగఁ దిరుగుచు నియత నికేతనరహితుఁడై యప్ర మత్తుఁడై యేకాంతవాసియై తన యాచారములచే నితరుల కలక్ష్య మాణుండై మితభాషియై ముని యుండవలయు. అశాశ్వత శరీరము నకు గృహారంభము వ్యర్థంబు. దుఃఖదంబు నగు. చీమలు పెట్టిన పుట్టయందుఁ గదా పాము సుఖముగ వసించు. ఒక్కఁడైన నారా యణదేవుండు పూర్వము తనసంకల్పముచే స్వశరీరభూతంబైన ప్రకృతిచే సృజించిన యీ లోకమును గల్పాంతమందు స్వాపృథక్సిద్ధ విశేషణభూతమైన కాలముచే నుపసంహరించి యవిభక్త నామరూప చిదచిద్విశిష్టుఁ డగుటచేఁ గారణావస్థయందుండు పరబ్రహ్మ మొక్కం డేయై నిమిత్తకారణాంతరములు లేకుండుటచే నద్వితీయుఁడై తానే యంతకు నాధారమై యఖిల చిదచిత్తులకు సర్వజ్ఞత్వశక్తిత్వాది గుణ ముల కాశ్రయుఁడై స్వశక్తిభూతంబైన కాలంబుచే సత్త్వాది శక్తులు సమత్వమునొందిన పదపడి యాదిపురుషుండు ప్రధానపురుషులకు నియామకుండై కార్యకారణావస్థలయందుండు చిదచిద్ద్రవ్యముల కవధి భూతుండై కేవలసంజ్ఞ వహించి యుండును. అనవధిక జ్ఞానానంద స్వరూపుఁడై నిరుపాధికుఁడై కేవలాత్మ సంకల్పముచే శరీరభూతమై నిర తిశయ సూక్ష్మదశాపన్నమై త్రిగుణాత్మకమైన మాయను నిష్థూల దశాపత్తి మూలమునఁ బరిణామోన్ముఖంబు గావించి తొలుత మహ త్తత్త్వము గుణత్రయ కార్యమైన యహంకారాది పృథివ్యంత తత్త్వ పరంపరను సృజించును. అందే యీ ప్రపంచము గూర్పఁబడియు న్నది. అదియే జీవునకు సంసారకారణ మని పెద్దలు చెప్పుదురు. సాలెపురుగు తన హృదయమునుండి వెలువడు పోగులను నోటిచేఁ బ్రసరింపఁజేసి యందు విహరించి మరలఁ దానే వానినెల్ల మ్రింగు నట్లు భగవంతుఁడు తానే కార్యము కారణమునై ప్రపంచమును సృజించి మరలఁ దనలోనికిఁ దీసికొనుచున్నాఁడు.

భ్రమర మొక కీటకమును దెచ్చి గూఁట నునిచిన నక్కీటంబు భయముచే భ్రమరమునే ధ్యానించుచుండుటచేఁ దన దేహమును మాని యాభ్రమర దేహంబును బొందుట చూచి స్నేహముచేఁ గాని భయముచేఁ గాని విరోధముచేఁ గాని నిశ్చయాత్మకబుద్ధిచే నెవ్వఁడు దేనిని బలుమాఱు ధ్యానించుచుండునో వాఁ డా స్వరూపమునే పొందుచున్నాఁడని నేర్చితి. *

ఇఁక నా దేహమువలన నేమి నేర్చినది చెప్పెద వినుము. ఈ దేహము వివేకమునకు విరక్తికి హేతువగుటచే నుపకారికమయ్యు జననమరణములు గలదియు, నెప్పుడు దుఃఖమే యుత్తరోత్తర ఫలముగాఁ గలదియుఁ, దుదకుఁ గుక్కలకు నక్కలకు భోజ్యమగునదియు నగుట యాలోచించి నిశ్చయించి దీనియందు నభిమానము లేక సంచరింతును. ఈ దేహమువలనఁ గలుగు నుత్తరోత్తర దుఃఖఫలము చెప్పెద వినుము. దేహసుఖానుభవమునకై పెండ్లాము బిడ్డలు ధనము పశువులు భృత్యులు గృహమును నాప్తవర్గము లోనైనవి కల్పించి యార్జించియుఁ దుదకుఁ గాలముదీఱ నన్నిటిని విడిచి వృక్షము మఱికొన్ని వృక్షములకుఁ గారణభూతములైన విత్తనములను సృజించి నశించునట్లు దేహియుఁ బెక్కుజన్మములకుఁ గారణమైన కర్మములను సృజించి పోవుచున్నాఁడు. ఒకప్రక్క జిహ్వయు, నొకవంక శిశ్నము, మఱియొకవైపు త్వగుదరములు, శ్రవణము, నాసిక, దృష్టి, మఱియొందుతట్టు పురుషుని గృహస్థుని సవతులవలె నాకర్షించుచుండును. భగవంతుఁ డజయ యను పేరుగలిగిన యాత్మశక్తియగు ప్రకృతిచేఁ దొలుత వృక్షములను సరీసృప పశువులను దోమలను మత్స్యములను సృజించియుఁ దనివిఁజెందక కడపట బ్రహ్మోపసనామతిగల మనుష్య దేహమును సృజించి సంతోషించె.

అనేకజన్మము లెత్తినపిమ్మట మిక్కిలి దుర్లభమై యనిత్యమైనను సమీహిత పురుషార్థప్రాపకమైన యీ మనుష్యశరీరము లభింపఁగా మృత్యువు వెన్నంటియే తిరుగుచుండు నీశరీరము పతనము కాకముందే

* ఈ న్యాయమువలన గోపికలు ముక్తలగుటేమివింత.

సర్వవిధములఁ బురుషుఁడు తుల్యసుఖదుఃఖుఁడై మోక్షమునకై శీఘ్రముగ యత్నింపవలయునుగాని కామార్థము యత్నింపరాదు. విషయసుఖమునకై యేల జతనము సేయరాదందు వేని యది పంది కుక్క లోనగు సమస్తజన్మంబులందును సులభముగావున బ్రహ్మజ్ఞాన ప్రాప్తికిఁగానే యుద్దేశింపఁబడిన నరజన్మము నితరవిధముల దుర్విని యోగ పఱుపరాదు. అట్లు వ్యర్థపఱచినచో నీచజన్మములకు మనుష్య జన్మమునకు భేద మేదికలదు? అని యీ విధముగ నాలోచించి వైరాగ్య ముదయింపఁగా నాత్మావలోకన పరుండనై దేహమున నాత్మాభిమానము వదలి దేహానుబంధములందు సక్తుండనుగాక యీ భూమియం దిట్లు సంచరించుచుందును. ఒక గురువువలననే సుస్థిరమై పుష్కలమైన జ్ఞానము లభింపదు కావునఁ బెక్కురవలన శిక్షితుండు కావలయు. ఈ జ్ఞానమునకంటె నధికమైనదిగాని దీనితో సమానమై నదిగాని వేఱొండు లేదని ఋషు లనేకవిధములఁ గీర్తించుచుందురు. అని బోధించి యవధూత యదువుచే ననుజ్ఞాతుండై చనియెనని యవధూత యదుసంవాద మూలమునఁ దన బుద్ధిని తానే శిక్షింప వలయుననియు మతిమంతునకుఁ దన్ను మించిన గురువు తనకు లభింపఁ డనియు బోధించి కృష్ణుం డుద్ధవునకు వెండియు నిట్లనియె.

—♦కృష్ణుం డుద్ధవునకు నాత్మతత్త్వప్రాప్తి సాధనముఁ దెలుపుట.♦—

నేను జెప్పిన స్వధర్మములందు హెచ్చరిక కలిగి వాని ననుష్ఠించుచు నేనే సర్వాంతరాత్మయని నన్నాశ్రయించి ప్రతిఫలకాంక్ష లేక వర్ణాశ్రమ కులాచారంబులు దేహాంతమువఱకు నాచరించుచుండ వలయు. విశుద్ధమనస్కుఁడై స్వాత్మ పరమాత్మల యాథాత్మ్యమును జింతించుచు విషయాసక్తచిత్తులైన శరీరధారులు విషయాసక్తులై సుఖకాంక్షఁ జేయు సమస్తకార్యములకు ఫలము దుఃఖమగుటఁ జక్కఁగ నాలోచించినయెడఁ గామములయందు మనస్సుపోకుండును. నిదురించు పురుషుని కలలోఁ దోఁచు ప్రియాప్రియ విషయాభాస మెట్లు విఫలమో యట్లే నానాత్మక మగుటచే ధ్యానింపఁబడు కోరిక

యను విఫలము. అట్లే నానాత్మక మగుటచే నాత్మయందు దేవ మనుష్యాది భేదబుద్ధి వహించుటయు విఫలము. నన్నే పరమ పురుషార్థముగా నెంచువాఁడు ప్రవృత్తిమార్గమున * వర్తింపరాదు. నివృత్తిమార్గమునే సేవింపవలయు. బ్రహ్మవిచారమందు వర్తించువాఁడై కామ్యకర్మముల నాదరింపరాదు. మత్పరుఁడై యహింసాది యమములను మరల మరలఁ దప్పక సర్వకాలముల ననుష్ఠింపవలయును. తపము లోనగు నియమములను యథాశక్తి జరుపవలయు. బ్రహ్మనిష్ఠుఁడును మహాత్ముఁడును శాంతుఁడు నగు గురువు నుపాసింపవలయును. నిష్కపటుఁడు, మత్సరము లేనివాఁడు, సేవయం దుత్సాహముగలవాఁడు, తొందరపడనివాఁడు, చేయు పనియందు మనస్సును జక్కఁగా నిలుపువాఁడు, హేయములు ననుష్ఠేయములు నగు విషయముల నెఱుఁగఁ గోరువాఁడు, నితరుల దోషముల నెన్ననివాఁడు, వ్యర్థప్రలాపము లాడనివాఁడు, పెండ్లాము బిడ్డలు గృహములు భూములు పశువులు స్వజనులు ధనము లోనగువానియం దుదాసీనుఁడునై వానినెల్ల సాధారణదృష్టిఁ జూడవలయు. వారి వారి సొత్తు వారువారు ఋణబద్ధులై తినిపోవుచున్నారని యెంచవలయును గాని నాసొత్తు నావా రనుభవించుచున్నారని తలఁపరాదు. దారువు ప్రకాశింపఁబడునది, దహింపఁబడునది. అందలి యగ్ని ప్రకాశించునది దహించునది యనుటచే దారువుకంటె నగ్ని భిన్నమని యెఱుఁగునట్లు స్థూలసూక్ష్మ దేహమునకంటె జీవుఁడు విలక్షణుఁడని యెఱుఁగునది. దారువునందలి యగ్నికి దారువునకుఁ గలుగు నానాదశ లుత్పత్తి వినాశములు సూక్ష్మత్వబృహత్త్వములు నగ్నికిని గలుగునట్లు దేహమునకంటె భిన్నుఁడైన జీవుఁడును దేహమునం దనుప్రవేశ మొనర్చి యనాదియగు నజ్ఞానమువలనఁ గలిగిన దేహతాదాత్మ్యాభిమానచేఁ దత్సమాన దేహధర్మములు సూక్ష్మత్వబృహత్త్వ జన్మ నాశాదులు గలవాఁ డగుచున్నాఁడు. జీవునకు నీ దేవ మనుష్యాది రూపములు పృథివి మొదలగు ప్రకృతి పరిణామాత్మక గుణములచేఁగదా కలుగు

* ప్రవృత్తిమార్గము=సంసారమార్గము. నివృత్తిమార్గము=మోక్షమార్గము.

చున్నవి. జ్ఞానస్వరూపుడైన జీవునకీసంసారము దేహ ప్రయుక్తమే. కావున వేదాంతార్థ విచారముచేత నాత్మయందుంపు పరమాత్మను కేవలుని బరమపురుషుని దెలిసికొని దేహము తదను బంధములైన దారపుత్రాదు లుపాదేయములు గావని క్రమముగ సిరిసింపవలయు. ఆచార్యుండు క్రింది యరణిగా శిష్యుండు మీఁది యరణిగా నుపదేశము కవ్వముగా మథింప నగ్నివలె సుఖావహంబైన తెలివి జనించును. నిపుణతరమై విశుద్ధమైన యీ బుద్ధి త్రిగుణములవలన జనించిన యీ మాయసంసారమును నశింపఁ జేయుచున్నది. ఆ ప్రకారమా గుణ మూలకములైన పుణ్యాపుణ్య కర్మముల నెల్ల దహించి ధ్యానాత్మికమైన యీ బుద్ధి కట్టెలులేమిచేఁ జల్లారునగ్నివలెఁ దనంతటఁ దానే శమించుచున్నది. కావున ముక్తి పర్యంతము దినదిన మిది యావర్తనీయము.

ఇట్లయ్యు సమస్త దేహులకు దేహ సంబంధమువలనఁ గలా కాష్ఠా ముహూర్తాది కాలావయవములవలనఁ బలుమాఱు జన్మాదులు గలుగుచున్నవి. అందును గర్మములు గావించువారికి, సుఖ దుఃఖము లనుభవించువారికి, నస్వాతంత్ర్యమే కానవచ్చుచున్నది. కావున నెవఁడు వివశుఁడై శబ్దాది విషయముల భజించు? కర్మములు చక్కఁగాఁ దెలిసినవారికిఁగూడ సాధనముల ననుష్ఠించు దశయందుఁ గష్టము గలుగుటను, ఫలానుభవ దశయందుఁ బతనభయ శంకచేతను, సుఖము లేమి యటుండ దుఃఖము లేకుండఁబోదు. కావున మేము కర్మకుశలులము మాకుఁ గుశలమే కలుగునను మూఢులకు వృథాహంకారము. సుఖప్రాప్తికి దుఃఖ విఘాతమునకు నుపాయము తెలిసిన వారుకూడ మృత్యువునుండి తప్పించుకొను నుపాయ మెఱుంగరు. మృత్యువు దేహముతోడనే పుట్టి కూడ వెంటనంటి తిరుగుచుండఁగా నిట్టివారికి నేయర్థ మేకామము సుఖముగలిగించును? వధ్యుఁడై వధ్యస్థానమునకుఁ దీసికొని పోఁబడు నరుని దేహమును జందన భూషావస్త్రాదుల నలంకరించినను నవి వాని కేమి సంతోష సుఖములఁ గలిగింపఁజాలు? కర్మములవలనఁ గలిగెడు నీలోకసుఖము

లును స్పర్థాసూయానాశ వ్యయములచేతను ననేక విఘ్నములచేతను నాక్రాంత మగుటచేఁ గృషివలె నిష్ఫలంబు. ఒకవేళ నిర్విఘ్నముగఁ గర్మముల సాధించినను నట్టివారికిఁ గలుగు ఫలములను జెప్పెద వినుము. స్వర్గలోకమునకుఁబోయి యందు దేవతలవలెనే నిజార్జితంబులైన దేవభోగముల ననుభవించుచుందురు. స్వపుణ్యార్జితంబులైన శుభ్ర విమానంబులపై మనోహర వేషంబుల ధరించిన దేవసుందరుల నడుమఁ గూర్చుండి గంధర్వుల గానంబున కానందించుచుందురు గాని తమకుఁ బతనకాలము రానున్నదని యెఱుఁగరు. ఇందుఁ జేసిన పుణ్యము సమయువఱకు స్వర్గమున నిట్లు సుఖించుచుఁ బుణ్యము క్షయింపఁగాఁ గాలచాలితుఁడై యతని కిష్టము లేకున్ననుఁ దలక్రిందుగఁ గ్రిందఁబడుచున్నాఁడు. ఇక ననిష్టకారుల గతి వినుము

అధర్మరతులై యసజ్జన సాంగత్యముఁ జేసి యజితేంద్రియుండై కామసక్తుఁడై కృపణుఁడు లుబ్ధుఁడు స్త్రీలంపటుఁడునై భూతహింస గావించుచు నవిధిగ బశువుల వధించి ప్రేతభూతగణముల యజించి నిజకర్మ వివశుఁడై జీవుఁడు క్రమముగ నరకమునకుఁబోయి తమః ప్రచురమైన స్థావరజన్మములెత్తుచున్నాఁడు. దేహముచే దుఃఖోదర్కములైన కర్మముల నాచరించి యా దేహావసానంబున మరలి నిజకర్మఫలాను గుణమైన దేహమును మరల నెత్తుచున్నాఁడు. అయ్యో మరణశీలుర కెక్కడి సుఖము? కల్పాంతమువఱకు జీవించు లోకులకు, లోకపాలురకు, ద్విపరార్ధ పరమాయువగు బ్రహ్మకును నావలన భయముగలదు. వారికి నిర్దుఃఖ సుఖములేదు. ప్రకృతిగుణములు కర్మముల సృజించు గుణపరిణామాత్మక దేహ మింద్రియములఁగూడి గుణముల ననుసరించి కర్మముల సృజించు. అట్లు ప్రాకృతగుణయుక్తుఁడై తద్వశ్యుండైన జీవుఁ డహంకారముతోఁగూడి దేహము చేయు కార్యములు తాను జేయుచున్నట్లెంచుకొనుటచే దేహము చేసిన పుణ్యపాప కర్మముల సుఖదుఃఖఫలముల ననుభవించుచున్నాఁడు. ప్రకృతి గుణావైషమ్య మెంతవఱకుండు నంతవఱకు జీవాత్మునకు దేవ మను

స్వాది రూపుదేహ ప్రయుక్తమైన నానాత్వము తప్పదు. నానాత్వముండువఱకు గుణకర్మములకుఁ బరతంత్రుఁడగుటయు, నీపారతంత్ర్యముండువఱకు నావల భయముగలుగుఁ గావున దేహమునే యాత్మయని తలఁచి దాని సుఖముకొఱకుఁ బ్రయత్నములు చేయువారు శోకయుక్తులై మోహము పాలగుచున్నారు. ప్రతికూల దేశకాల స్వభావాదులవలన భయము కలదుగాని నీవలన నే భయము కలదందువేని నన్నే కాలమని యాత్మయని యాగమమని లోకమని స్వభావమని ధర్మమని పెక్కు తెఱఁగుల సృష్టి దశయందుఁ బిలుతురు. ఇవి యన్నియు నా స్వాధీనము లగుటచే నేనే భయాభయ కారకుఁడను. అనిన నుద్ధవుఁ డిట్లనియె.

దేహజములైన గుణములందు వర్తించువాఁడయ్యును జీవుఁడా గుణముల చే నెట్లు గూడకుండువాఁడగును? ఎట్లు బద్ధుఁడు గాకుండును? ఎందుకగలవాఁ డెట్లు విహరించు వర్తించు? ఎట్టి లక్షణములవాని నెఱుఁగనగు? ఏమి భుజించు? ఏమి విసర్జించు? ఎట్లు పరుండును? ఎట్లు కూర్చుండును? నిత్యముక్తుఁడగు నీశ్వరుఁడే నిత్యబద్ధుఁడని నా భ్రమ కావున నా ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మిమ్ము. అని యడిగిన నుద్ధవునకు భగవంతుఁ డిట్లనియె.

## —♦ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు బద్ధముక్తలక్షణములఁ దెలుపుట. ♦—

సాత్త్వికాది గుణకర్మములచే బద్ధుఁడు ముక్తుఁడు ననుపేర్లు నాకు వాస్తవములుగావు. గుణములకు మాయ మూలము. కావున నాకు బంధములేదు. మోక్షమును లేదు. ఎప్పుడును స్వప్నమునఁ గలుగు శరీర సంబంధ సుఖదుఃఖాదు లెట్టులు మిథ్యగాక సత్యములో సంసారములఁ గలుగు శోక మోహములు సుఖదుఃఖములు దేహ సంయోగ వియోగములు నట్టులే సత్యములుగాని మిథ్యలుగావు. ఉద్ధవా! నాకు శరీరమైన విద్య యవిద్య యనునవి రెండును శరీర ధారులకు బంధమును మోక్షమును గలిగించును. ఆ రెండును మదీయ సంకల్పాయత్తంబులు, అందొకటియైన యవిద్యవలన నా

యంశమైన జీవునకుఁ బ్రకృతి వశ్యత్వరూపమైన యనాదిబంధము గలుగును. విద్యవలన మోక్షము గలుగును. విద్యయనఁగా నన్ను నుపాసించుట. ఇఁక బద్ధునకు ముక్తునకుఁగల వైలక్షణ్యముఁ జెప్పెద వినుము. వారిరువు రొక శరీరమందుండినను విరుద్ధధర్మములు గలవారు. నాయనా! యొక చెట్టునందు నుంచిఱెక్కలు గలపక్షులు రెండు గలవు. రెండును సమానములే. రెండును మిత్రములే. యాదృచ్ఛికముగ నా చెట్టునందుగూఁడు పెట్టుకొన్నవి. అందొకటి పిప్పలాన్నము భుజించుచున్నది. రెండవది యన్నము తినకున్నను మిగుల బలము గలది. దేహమే వృక్షము. జీవేశ్వరులే రెండు పక్షులు. అందు జీవునకు ధర్మాధర్మములు ఱెక్కలు. ఈశ్వరునకు నిరస్త సమస్త దోషత్వము సమస్త కల్యాణ గుణాత్మకత్వము ఱెక్కలు. ఈ యిరువురు సమాన శోభన ప్రయత్నాది గుణములు కలవారే. ఈ యిరువురిలో నొకఁ డీశ్వరుఁ డుపకారము చేయువాఁడు. మఱియొకఁడు జీవుఁ డుపకారముఁ బొందువాఁడు గావున మిత్రులు. హృదయకమలమే గూఁడు, లోకమునకుఁ గన్నులఁ గానఁబడు కారణాంతరములు లేమిని యాదృచ్ఛికము. ఇరువురు గూఁటియందుండువారే. ఒకపక్షి పిప్పలాన్నమును భుజించుచున్నదనఁగా జీవుఁడు ప్రకృతియనెడి యాహారమును శబ్దాదివిషయముల ననుభవించుచున్నాఁడని యర్థము. ఈశ్వర పక్షి పుణ్యాపుణ్యఫల సుఖదుఃఖ భోగరహితమై సర్వజ్ఞత్వము సర్వశక్తిత్వము లోనగువానిచే స్వరూప స్వభావ సంకోచరహితముఁగా బ్రకాశించుచుండును. విషయభోగములను గర్మఫలములను ననుభవింపని యీశ్వర రూప పక్షియే తన్నును నితరమును దెలియునుగాని వాని ననుభవించుజీవరూప పక్షి తెలిసికోఁజాలదు. అవిద్యయనఁగా స్వ, పర యాథాత్మ్యజ్ఞానము లేకుండుట. ఇట్టి యవిద్యచేఁ గూడి యుండువాఁడు నిత్యబద్ధుఁడు. స్వాభావిక జ్ఞానమయుఁడు నిత్యముక్తుఁడు. నిద్రనుండి లేచినవాఁడు కలలోఁదోచిన తన శరీరమందు నాత్మాభిమానముంచనట్లు విద్యామయుఁడు దేహస్థుఁడయ్యు దేహాభిమానముంచమిచే నదేహస్థునివలె నుండును. కుమతి గర్భప్రలయాది దశ

లందు ననిష్పన్న దేహుఁడయ్యు దేహస్థునివలె బద్ధుఁడేయగు. వివేకి ప్రకృతి పరిణామాత్మకములయిన యింద్రియములచే ననుకూల ప్రతికూల శబ్దాదీంద్రియార్థంబుల గ్రహించునెడ హర్షవిషాదాది రహితుఁడై కర్తృత్వభోక్తృత్వములకుఁ దన్నుఁ గర్తగా నెంచఁడు. ఇఁకఁ గుమతియో ప్రాచీనకర్మము నిమిత్తముగ లభించిన దేహమందుండి యింద్రియ సంభావ్యకర్మముల వర్తించుచు దేహమునకంటె విలక్షణుండైన తన్నెఱుఁగక దేహమే తానని యెంచి దేహముచేయు కార్యములు తాను జేయునట్లు భావించి యా యభిమానముచే బద్ధుఁ డగుచున్నాఁడు. శయనము భోజనము విహారము స్నానము దర్శనము స్పర్శనము ఘ్రాణము శ్రవణము లోనగువానియందు విరక్తుఁడగు విద్యావంతుఁడు బద్ధుఁడుగాఁడు. కర్తృత్వ భోక్తృత్వము లింద్రియములందో యీశ్వరునందో యారోపించి దేహమునందుండియు దానియందభినివేశము లేక సుఖదుఃఖాదులందుపకారము లేక యాకాశ సూర్యవాయువులవలె వ్యాప్యగతదోషరహితుఁడై యుండు. దేహాదులందభినివేశము లేమి నిపుణమైన బుద్ధిచే దేహమునకంటె నేను విలక్షణుఁడ నగుదునో కానో నేను స్వతంత్రుఁడనా యీశ్వరునకుఁ బరతంత్రుఁడనా యని యీ మొదలయిన సందేహములనెల్ల ఛేదించి నిద్రనుండి లేచినవానివలె దేవత్వము మనుష్యత్వము లోనగు నానాత్వమునుండి నివర్తించుచున్నాఁడు. ఎవని ప్రాణేంద్రియ మనోబుద్ధివ్యాపారములు విగతసంకల్పములై యిది వినవలె నిది చూడవలె నిది సంపాదింపవలయు నిది పరిహరింపవలయునను కోరికలు లేక యుండునో వాఁడు దేహస్థుండయ్యుఁ దద్గుణములచే వినిర్ముక్తుఁడనియే యెఱుంగుము. తన్ను దుర్జనులు బాధించినను సజ్జనులు పూజించినను నెవనికి మనస్సున వికారము లేకయుండునో వాఁడు తెలిసిన పండితుఁడని యెఱుంగుము. మానావమానములయందు సమదృష్టియై పరులను స్తుతింపక నిందింపక మేలుగాని కీడుగాని చెప్పక చేయక గుణదోష వర్జితుఁడై కొంచెమైనను బలుకక తన మేలుగీళ్ళాలోచింపక నాత్మారాముఁడై జడునివలె ముని సంచరించుచుండును. వేద

శాస్త్ర పారగుఁడయ్యుఁ బరబ్రహ్మవిషయమున సమాధిపర్యంతమగు జ్ఞానమున నిష్ఠగలవాఁడు గాఁడయ్యెనేని వాని యధ్యయనాధ్యాప నాది శ్రమమునకు గొడ్డుటావును బెంచువాని శ్రమమునకువలె ఫలము శ్రమము మాత్రమే. పాఁడి యుడిగిన గోవును, దనయందుఁ బ్రీతిలేని చెడిపెయగుభార్యను, బరాధీనమైన దేహమును, దుర్మార్గులైన బిడ్డలను, నపాత్రుల కిచ్చిన దానమును, నన్నుఁ బ్రతిపాదింపని వాక్కును నెవ్వఁడు రక్షించునో వాఁడు దుఃఖములవెంట దుఃఖములనే పొందుచుండును. అయ్యా! ప్రపంచ సృష్టి స్థితి లయాత్మకంబై పావనకరమైన నా చరిత్రమును బ్రపంచ ప్రేమాస్పదంబులైన లీలావతారంబులను నెవఁడు వర్ణింపఁడో యట్టి మూఢునకు వాక్కుండియు నిష్ఫలంబు. ఈవిధముగ నాలోచించి దేవమనుష్యాది నానాత్వభ్రమ విసర్జించి దేహమునకంటె, నాత్మ భిన్నమని వివేకించి నాయందు రజోగుణ రహితమును సాత్వికాహారాదులచే సత్వైక ప్రవణము నగు మనస్సును నాయందర్పించి నా భక్తుఁడు లౌకికకర్మములయం దుపరతి నొందెడు. ఇట్లు నాయందు మనస్సు నిశ్చలముగ నిలుపఁజాలనేని వర్ణాశ్రమోచిత కర్మములనన్నిటి "నివిచేయువాఁడను నేనుగాను. సర్వాంతరాత్మమై ప్రయోజకకర్తమైన పరమాత్మచేఁ బ్రవర్తింపఁ బడినవై దేహేంద్రియములు చేయుచున్న" వని నిరపేక్షుండవై వానివలని ఫలంబుఁ గోరక చేయుము. శ్రద్ధావంతుఁడై లోకమంగళావహములు లోకపావనకరంబులైన నాకథలను వినుచుఁ గీర్తించుచు స్మరించుచు, నా యవతారకర్మముల నభినయించుచు, ధర్మకామార్థములు నాకై చేయుచు నీశ్వరుఁడే ప్రాప్యము ప్రాపకమునని నిశ్చయించి యుండువానికి నుద్ధవా! సర్వకారణుండనయిన నాయందు నిశ్చలభక్తి స్థిరపడుచున్నది. సాధుసాంగత్యముచే లభించిన నాయందలి భక్తిచే నెవ్వఁడు నన్ను సేవించునో వానికి నాస్థానము సుఖముగా లభించును.

అనిన నుద్ధవుం డిట్లనియె. సాధుసాంగత్యమున లభించిన భక్తియని చెప్పితివి. ఎట్టివారు సాధువులు? సాధువులచే నాదరింపఁ

బడిన యెట్టిభక్తి నీకు సమ్మతము? పురుషార్థ్యరూపా! జగదీశ్వరా! ప్రణతుఁడను బ్రపన్నుఁడను ననురక్తుఁడను నగు నాకు నెఱింగింపుము. నిర్మలస్వరూపా! చిదచిదాత్మక ప్రకృతికిఁ బరమైనవాఁడా! స్వేచ్ఛచే గ్రహింపఁబడిన నానాదేహములు గలవాఁడవై యవతరించితివి.

## —శ్రీకృష్ణుం డుద్ధవునకు సాధులక్షణ, భక్తిలక్షణములు దెలుపుట—

అనినఁ గృష్ణుం డిట్లనిరెను. కృపావంతుఁడు, ద్రోహముచేయనివాఁడు, ద్వంద్వముల సహించువాఁడు, సత్యస్థిరుఁడు, ద్వేషాసూయాది రహితుఁడు, స్వపర సమదృష్టియు, లోకోపకారకుఁడును గామక్షుభితముగాని బుద్ధిగలవాఁడు, నిగృహీతేంద్రియుఁడు, మృదుచిత్తుఁడు, బాహ్యాభ్యంతర శుచియు, ననన్యప్రయోజనుఁడు, లౌకిక వ్యాపార రహితుఁడు, మితభోజి, నిగృహీతాంతఃకరణుఁడు, స్థిరచిత్తుఁడు, నాశరణముఁజొచ్చినవాఁడు, మునియు, నప్రమత్తుఁడు, లోఁతు మనస్సుగలవాఁడు, నాపదలందు ధైర్యముగలవాఁడు, నాఁకలి దప్పి శోకము మోహము జరా మృత్యువులను నాఱింటిని జయించినవాఁడు, స్వదేహసత్కారమం దభిలాష లేనివాఁడు, నితరుల సత్కరించువాఁడు, హితోపదేశదక్షుఁడు, వంచనలేనివాఁడు, కరుణ గలవాఁడు, యథార్థజ్ఞానము గలవాఁడు, వేదముఖమునఁ జెప్పఁబడిన గుణదోషముల నెఱిఁగి సర్వవర్ణాశ్రమోచితధర్మముల వదలి నన్ను భజించుచున్నాఁడో యట్టివాఁడు సాధువులందు శ్రేష్ఠుఁడు. నా స్వరూప మెట్టిదో నా స్వభావ మెట్టిదో నే నెంతటివాఁడనో పలుమాఱు స్మరించి స్మరించి తెలిసికొని ప్రయోజనాంతర ముపాయాంతరము దేవతాంతరము లోనైనవి విడిచి నన్నొకనినే ప్రాపించుకొఱకే భజించువాఁడు భక్తతముఁడు. ఇవి సాధులక్షణములు.

ఇఁక భక్తియోగానుగ్రాహకలక్షణముల వినుము. నా విగ్రహములను నాభక్తజనులను దర్శించుట, స్పృశించుట, యర్చించుట, [illegible], పరిచర్యసేయుట, నమస్కరించుట, వారి గుణకర్మములఁ

గీర్తించుటయు, నా చరిత్రములను వినుటయందు శ్రద్ధ, మద్విషయ కానుధ్యానంబును, లభించినదంతయు నాకు సమర్పించుటయు, దాసభావంబున నాత్మార్పణము గావించుటయు, నాజన్మకర్మ కథలు చెప్పుటయు, జయంతులు లోనగు పండుగులందు గీతతాండవ వాదిత్ర గోష్ఠులచే గృహోత్సవములు గావించుటయు, నాకొఱకై యాత్ర చేయుటయుఁ జాతుర్మాస్యైకాదశ్యాదులందు విశేషపూజ సలుపుటయు, మచ్ఛాస్త్రోక్త దీక్షయు, మదీయ వ్రతముల నేకాద శ్యుపవాసముల నాచరించుటయు, నాపూజామూర్తిని స్థాపించుటయందు నాదరము వహించుటయు, శక్తిగలవాఁడలఁ దానేకాని యితరులతోఁ గలసికాని యింటిలోపలనో వెలుపలనో తులసియుఁ బూలునుండు తోటలఁ వేయుటయు, ఫలవృక్షముల తోఁపులు వేయుటయు, క్రీడాస్థానములను మందిరములను నిర్మించుటయు, మదీయ గృహంబులం దూడ్చుట, గోమయవారి చల్లుట, యలుకుట, ముగ్గులు పెట్టుట, దాసునివలె గృహాలంకారము గావించుట, మఱియు దురహంకారము వంచన తానుజేసినధర్మము చెప్పుకొనుట లోనైన దుర్గుణములు లేకుండుట, తానుగాని యితరులుగాని యుంచిన దేవుని దీపముతో స్వకార్యములు చేయకుండుటయు, లోకములోని రమ్య వస్తువులను దనకు మిక్కిలి ప్రీతికరమైన వస్తువులను నాకు సమర్పించుటయు నను నివి భక్తియోగమును ననుగ్రహించు కార్యములు. వీనివలన నక్షయ్యఫలము గలుగును. సూర్యుఁ డగ్ని బ్రాహ్మణుడు గోవు వైష్ణవుఁడు గగనము గాలి జలము భూమి యాత్మ సర్వభూతములు మత్పూజాస్థానములు, ఇన్నిటియందు నన్నుఁ బూజింపవలయు. ఆసత్యేనేత్యాది త్రయీవిద్యచే సూర్యునందును, హవిశ్చరుపురోడాశాజ్యరూపముల నగ్నియందును, బ్రాహ్మణోత్తముని యందు నాతిథ్యమునను, గోవులయందుఁ గసవు పిండి మొదలగు వానిచేతను, వైష్ణవునియందు బంధుసత్కారముచేతను, హృదయాకాశమందు ధ్యాననిష్ఠచేతను, వాయువునందు ముఖ్యప్రాణబుద్ధిచేతను, జలమునందుజలయుక్త గంధపుష్ప దూర్వాక్షతాదుల చేతను,

జక్రపద్మాది మండలములచే సంస్కరింపఁబడిన భూమియందు రహస్యమంత్రన్యాసములచేతను, నాత్మయందు నన్ను ధర్మావిరుద్ధ కామభోగంబులచేతను, దేవమనుష్యాది సర్వదేహములందు క్షేత్రజ్ఞుఁడగు నన్ను సమబుద్ధిచేతను, సీ సూర్యాదులం దన్నిట శంఖచక్ర గదా పద్మయుక్తములైన చతుర్బాహువులతోఁగూడి శాంతుడైయుండు నారూపము నే యనహితచిత్తుఁడై ధ్యానించి పూజింపవలయు. సమాహితుఁడై వైదికస్మార్త కర్మముల నన్నెవ్వఁడు పూజించునో వానికి సాధుసేవచే నాయందు భక్తి యుదయించు. సత్సంగముచే లభించిన భక్తి యోగమునఁదప్ప సంసారముఁ దరింపఁ బ్రాయికంబగ వేఱొక యుపాయంబు గానంబడదు. ఇఁకఁ బరమరహస్యమొకటి చెప్పెద వినుము. అది మిక్కిలి గోప్యమైనను నీవు భృత్యుఁడవు సుహృదుఁడవు సఖుఁడవు నని నీకుఁ జెప్పుచున్నాఁడను.

### శ్రీకృష్ణుం డుద్ధవునకు సత్సంగ మహిమంబును గర్మానుష్ఠానత్యాగవ్యవస్థను నిరూపించుట.

యోగము సాంఖ్యము ధర్మముస్వాధ్యాయము తపముత్యాగము నిష్టాపూర్తములు దక్షిణలు వ్రతములు యజ్ఞములు మంత్రములు తీర్థములు యమనియమములు నను నివి నన్ను సత్సాంగత్యమువలె వశపఱుచుకోనఁజాలవు. సత్సంగ మొక్కటే మ ద్వ్యతిరిక్త సర్వసంగములఁ దొలఁగించి నాసంగతిమాత్రమే కలిగించును. యోగాదులట్టివి కావు. యోగసాంఖ్యాదులు చిత్తమును నిర్మలము చేయుటచే నేకాగ్రత కలిగించును గావున వాని మూలమున భక్తి కుదురును. అట్లే సత్సంగతి గురూపదేశ సత్త్వాపాదనాది పరిణాళికవలనఁగదా భగవంతుని వశపఱుచుకొనును. సాక్షాత్తుగఁ గాదుకదా. ఇఁక యోగమునకంటె సత్సాంగత్యమున నేమివిశేష మందువేని వినుము.

సత్సాంగత్యముచేతనే దైత్యులు రాక్షసులు ఖగమృగములు గంధర్వులు నప్సరసలు నాగులు సిద్ధచారణ గుహ్యకులు విద్యాధరులు మనుష్యులందు వైశ్య స్త్రీ శూద్ర [illegible] ప్రకృతులు

నాయీయుగంబుల ననేకులు నాదు పదంబుఁ బ్రాపించిరి. వృత్రుండు ప్రహ్లాదుఁడు వృషపర్వుఁడు బలి బాణుఁడు మయుఁడు విభీషణుఁడు లోనగు దైతేయాదులును, సుగ్రీవ హనుమ జ్జాంబవ ద్గజాది మృగములును, పశువగు గజేంద్రుఁడు, పక్షియగు జటాయువు, వైశ్యులందుఁ దులాధారుఁడు మఱియు ధర్మవ్యాధుఁడు కుబ్జయు, మందయందు గోపికలు బ్రాహ్మణస్త్రీలు లోనగువారు వేదములఁ బఠింపకయుఁ మహాత్ముల సేవింపకయు, వ్రతులుగాకయుఁ దపములు సలుపకయు నున్నను సత్సాంగత్యముచేతనే నన్నుఁ బొందిరి. కేవల కామభయద్వేషాది భావముచేతనే యగు దర్శన స్పర్శనాదులచే నన్నుఁ బొందుదురు. ఎట్లన గోపికలు తీవ్ర కామాత్మకమైన భావముచేతను, నగమృగము లాదరముతోఁ నన్నుఁ జూచుట స్పృశించుట లోనగువానిచేతను, మఱియు మూఢబుద్ధులగు యమళార్జున కాళీయాదులు మదీక్షణ స్పర్శనాదులను నిరస్త సమస్త ప్రతిబంధకులై యనాయాసంబుగ యోగ సాంఖ్య దాన, వ్రత తపో యజ్ఞ శాస్త్రాధ్యాపన సన్న్యాసంబుల నెంత యత్నించియుఁ బొందరాని నన్నుఁ బొందిరి. అక్రూరుండు నన్ను రాముని బృందావనంబునుండి మథురకుఁ బిలుచుకొనిపోవ నాయందనురక్తచిత్తలగు గోపికలు తీవ్రవియోగ వేదనచే నెట్టి యితరసుఖమును గోరరైరి. బృందావనమందుఁ బ్రియతముఁడనైన నాతోఁడఁగూడి క్షణార్థములవలె రాత్రులను గడపిన యా గోపికలే మద్వియోగమందా రాత్రులనే కల్పసమముగఁ గడపిరి. నాయందలి యాసక్తిచే బద్ధలగు గోపికలు సముద్రమునఁ బ్రవేశించిన నదులవలె, సమాధియందుండు మునులవలెఁ, దమ దేహములను నామరూపములను దప్పుదాపులను దెలియక యుండిరి. మత్స్వరూపము దెలియని యబలలయ్యు నాకు జారుఁడనియే యెంచి నాయందుఁ బ్రీతియుంచి నా సాంగత్యముచేతనే వేలకొలఁదిఁ బరబ్రహ్మమగు నన్నుఁ బొందిరి. కావున నుద్ధవా! విధినిషేధములఁ బాటింపక ప్రవృత్తి నివృత్తుల వదలి శ్రుతశ్రోతవ్యములకై శ్రమింపక సర్వదేహుల కాత్మయైన నన్నేక

నినే సర్వాత్మభావమున శరణుపొందితివేని యకృత్యకరణ కృత్యాకర ణాది ప్రతిబంధక భయరహితుఁడవై ముక్త్యోపభోగ్యుఁడనగు నన్నుఁ బొందుదువు. భయపడకుము. అనిన నుద్ధవుం డిట్లనియె.

యోగేశ్వరేశ్వర! భవదీయ వాక్యశ్రవణంబున మోక్షో పాయ విషయమైన సందేహంబు నివర్తించెనుగాని నా మనంబు భ్రమింపఁజేయు నాత్మస్థ సంశయంబు దొలఁగకున్నది. సర్వేంద్రియ ప్రాణ నియమనాదులకుఁ గర్త నీవా జీవుఁడా? దేవమనుష్యాది భావాత్మక సంసారమెవనికి? ఇంద్రియాదుల కాధారము జీవుండా శరీ రమా? నీవా? సుఖదుఃఖ హేతువులగు పుణ్యాపుణ్య కర్మముల కారం భకుఁ డెవఁడు? సుఖదుఃఖభోక్తయెవఁడు? సంసార నివృత్త్యుపాయం బెద్ది? ఇట్టి సంశయంబులు నన్నుఁ బీడించుచున్నవనిన శ్రీకృష్ణుండు సర్వేంద్రియ వ్యాపారంబు లాత్మాయత్తమని చెప్పఁదలంచి తొలుత వాగింద్రియ వ్యాపారోత్పత్తిక్రమము నది యాత్మాయత్తమగుట నిట్లు చెప్పఁదొడంగె.

హృదయగుహాయందుఁ బ్రకాశించు జీవుఁడు శరీరస్థితి కాలం బునఁ బ్రాణముచేతను దర్ఘోషముచేతను గూడినవాఁడై మనోగ్రా హ్యమై సూక్ష్మమైన రూపము గలవాఁడగుచు నుచ్చారణవేళ హ్రం స్వాది మాత్రలుగను గకారాదివర్ణములుగను, నుదాత్తాది స్వరములు గను, స్థూలతముఁడగుచున్నాఁడు. ఎట్టులనఁ గాష్ఠోదరమందలి యగ్ని తొలుత సూక్ష్ముఁడయ్యు బలముగ మథించినపుడు నాకాశంబున ననిలసహాయుఁడై మిణుఁగురులవలెనై క్రమముగ వృద్ధిపొంది హవి స్సుచేఁ బ్రజ్వలించునుగదా. అట్టులే వాగింద్రియ వ్యాపారరూప యగు వాణియు నా యధీనంబై యున్నయది. జీవప్రాణంబులు పర స్పరాయత్తంబులనియు శరీరావస్థితిదశయందు జీవుండు సంకుచిత ప్రకాశుండు కావున నజ్ఞుండగుట వాగింద్రియ వ్యాపారానుగుణ మైన తచ్చోదనమందు నసమర్థుఁడనియు నెఱింగితివి కదా. అట్టులే పాదపాణీంద్రియములయు, నుపస్థమునయు, మూత్రపురీషోత్సర్గము ల[illegible] ఘ్రాణరసనాచక్షుస్త్వక్ఛ్రోత్రేంద్రియములయు. [illegible]భిమాన

మహత్తత్త్వములయు, రజస్సత్త్వతమోగుణ వికారములయు వ్యాపారములన్నియు నా వ్యక్తియని తెలిసికొనుము. ఏకజాతిబీజంబులుత్పత్తియోగ్యంబైన క్షేత్రంబునుబొంది క్షేత్రానుగుణముగ వృద్ధిహ్రాసాదిరూపముల ననేకములుగ నగుచున్నవిగదా. అట్టులే జీవుండు త్రిగుణపారవశ్యంబున బ్రహ్మాండంబున నుత్పత్తి నిధనములుగలవాఁడై వృద్ధి పరిణామాది రహితుఁడై యేకరూపమున నుండియు నిత్యుఁడయ్యుఁ గాలక్రమమున దేహ తదనుబంధములందు నహంకార మమకార రూపమునఁ బ్రకీర్ణ చైతన్యశక్తి గలవాఁడై దేవమనుష్యాది నానారూపంబుల నొప్పుచుండు. వస్త్రమునందుఁ బేకపడుగునూలు పోగులవలె దేనియందీయింద్రియప్రాణజాలముండునో యదియే సంసారవృక్షము. సంసారమన దేహంబు. ఈ వృక్షమనాదియుఁ గర్మాత్మకమునై కర్మములను పువ్వులను సుఖదుఃఖములను ఫలములను బుట్టించుచున్నది. ఈసంసార తరువునకుఁ బుణ్యపాపములను రెండు బీజములు, రాగద్వేష భయాదులు వేళ్లు, మూఁడుగుణములు ప్రకాండంబులు. పంచభూతంబులు స్కంధంబులు శబ్దాది విషయంబులైదు రసంబులు, పదునొకొండింద్రియంబులు శాఖలు. జీవాత్మపరమాత్మలను రెండు పక్షులతోఁగూడిన హృత్పద్మము గూఁడు. వాతపిత్తశ్లేష్మంబను మూఁడును వల్కలంబులు. భోగమోక్షంబులు రెండు ఫలంబులు. ఆధ్యాత్మికాది తాపత్రయాలవాలమందుఁ బ్రతిష్ఠితము. భోగమోక్షములను రెండు ఫలములందు విషయాభిలాషగల జీవులనెడి గ్రద్దలు భోగఫలము భుజించును. అరణ్యవాసి హంసలు మోక్షఫలము ననుభవించు. ఏపురుషుండు ప్రకృతి పరిణామాత్మకమగుట మాయామయమై దేవత్వమనుష్యత్వాది బహు రూపములు గల సంసారతరువును గురువులచేఁ దెలిసికొనుచున్నాఁడో వాఁడే వేదవిదుఁడు. ఈ విధముగ గురూపాసనచే లభించిన యేకభక్తిచే విద్యయనెడి వాఁడిగల గండ్రగొడ్డలిచే ధీరుఁ డప్రమత్తుఁడై జీవాశయవృక్షమును నిశ్శేషముగ ఛేదించి నన్నుఁ బొంది యావల నాశస్త్రమ్మును వదలవలయును.

. . సత్త్వము రజస్సు తమస్సు ననుమూడును ప్రకృతి పరిణామాత్మక మనోగుణములుగాని జీవుని గుణములుగావు. ప్రవృద్ధసత్త్వముచే రజస్తమస్సుల జయింపవలెను. ఆవలసత్త్వముచేతనేసత్త్వమును జయింపవలెను. వృద్ధియగు సత్త్వమువలన మద్భక్తిలక్షణంబగుధర్మంబొదవు. జాత్యాశ్రయనిమిత్తములచే దుష్టములుగాని సాత్త్వికాహారముల సేవచే సత్త్వము వృద్ధియగు. దానివలన భక్తి యతిశయించు. సత్త్వ వృద్ధివలనఁ గలిగిన భక్తి రజస్తమస్సులను నశింపఁజేయును. కావున మోక్షమునకు సత్త్వమునకంటె నుత్తమమైన యుపాయము లేదు. రజస్తమస్సులు హతముకాఁగా నారెంటివలననైన మోక్షప్రతిబంధక పుణ్యపాపములు రెండును శీఘ్రమునంద నశించు. సాత్త్వికాహారము మాత్రమే సత్త్వ వృద్ధికిఁ గారణము గాదు. ఆగమము, పుణ్యజలము, సాధుజనము, వివిక్తదేశము, బ్రహ్మముహూర్తాది రూపకాలము, ఫలాభిసంధిరహితకర్మము, జన్మము, ధ్యానము, మంత్రము, సంస్కారములను నీ పదియును సత్త్వవృద్ధికి హేతువులేయగు. భగవద్భక్తులగువా రాహారాగమాదులలో దేనిని బ్రకృష్టముగాఁ జెప్పుదురో యది సాత్త్వికము. వారు దేనిని నిందింతురో యది తామసము. స్తుతినిందలు రెండునులేక యుపేక్షింతురో యది రాజసము. సత్త్వవివృద్ధికొఱకు సాత్త్వికాహారాదులనే పురుషుఁడు సేవింపవలయు, దానివలన మద్భక్తిలక్షణం బొదవు. దానివలన మత్స్వరూప స్వభావ యాథాత్మ్య గోచరంబైన జ్ఞానంబు తద్విషయకస్మృతి సంతతియు శబ్దాది విషయాదులందు మఱపుకలుగును. గుణత్రయపరిణామాత్మక దేహసాధ్యమైన సాత్త్వికాహారాది సేవల మూలముననై సత్త్వశుద్ధినిమిత్తముగాఁ గలిగిన భక్తి యోగాత్మక విద్యచే రజస్తమస్సులు పూర్ణముగా నశింపఁగా దేహసంబంధ నిమిత్త పుణ్యపాపాత్మకాధర్మములు నశించునని చెప్పితి వయినను గుణత్రయోత్పాద్యము దేహముగదా. అది యెట్లు స్వోత్పాద్యమైన సత్త్వవృద్ధ్యుపచితభక్తి మూలమునఁ దనకు మూలభూతమైన గుణత్రయముల నివర్తింపించి తాను నివర్తించు నంటివేని వినుము. అడవియందు వెదుళ్లు

రాపిడిచేఁ బుట్టిన యగ్నితన జ్వాలచే వనమెల్ల దహించి తానును శాంతిపొందునుగదా. అట్టులే గుణవైషమ్యమున జనించిన దేహమాత్రోత్పాదక క్రియలను నివర్తింపించును. అనిన నుద్ధవుం డిట్లనియె.

దేవా! యసాత్త్వికాహారాది సేవచే రజస్తమోవృద్ధి, వాని వలనఁ బుణ్యాపాపాత్మకాధర్మము, దేహాత్మాభిమానా ద్యజ్ఞానము, శబ్దాదివిషయ స్మృతిసంతతి గలుగుచునంటివి. ఇట్లుండఁగాఁ గొందఱు దుఃఖస్థాన మిదియని యెఱిఁగి యెఱిఁగి యాపదలకు మూలమైన విషయ సేవయే చేయుచుందురుగాని వదలరు. ఆఁడు కుక్కలు నాఁడు గాడిదలుఁ దమ్ము భర్త్సించుచున్నను గాళ్ళచేఁ దన్నుచున్నను మగ కుక్కలు మగగాడిదలు వానివెంటఁ బోవునట్లును, గటికవాఁడు దన్నుఁ జంపఁ దెచ్చియున్నను నాఁడు మేఁకను గలయఁగోరు నజము వలెను బురుషులును దమకు హానికరములైన విషయముల నేల సేవించెదరు? అనిన భగవంతుఁ డిట్లనియె.

దేహమునకంటె నాత్మ భిన్నమను విషయంబునఁ బ్రమత్తుఁడై వేఁడి నీళ్ళన్నట్లు *దేహాత్మల సంసర్గములచే దేహమేయాత్మగా నెంచు వానికి నేను స్థూలుఁడను, నేను గృశుఁడను, నను నిటువంటి యహంకారము కలుగుచున్నది. ఇట్టి యన్యథాబుద్ధిచే రాజసాహంకార సాత్త్వికాహంకారములె మనంబున జనించు. రజోగుణయుక్తమైన మనస్సున వికల్పసహితంబైన సంకల్పంబు గలుగు. దానివలన భోగేచ్ఛయగు కామంబు జనించు. ఇది దేహాభిమానముగల జీవునకు భోగ్యపదార్థ గుణధ్యానంబున వానిని బొందకుండినఁ దాళుటే యసాధ్యమై యుండు. దుస్సహ కామమునకు వశుఁడైనఁ వాడవిజితేంద్రియుఁడై రజోవేగ మోహితుఁడై యీ కర్మములఫలము దుఃఖమని తెలిసి తెలిసి యా కర్మములనే చేయుచుండును. ఇట్లు రజస్తమస్సులచే విక్షిప్తబుద్ధియు మూఢబుద్ధియు నయ్యు వివేకి మనస్సును

*వేఁడినీళ్ళు=వేడిమి యగ్ని గుణముకాని నీటి గుణముగాదు. అట్లున్నను నీళ్ళు వేఁడియని లోకులందురు. అట్టులే దేహిదేహముల విషయమై.

నిరోధించి హెచ్చరిక కలవాఁడై వానిని దోషదృష్టిఁ జూచుచు వాని యందు సక్తుఁడుగాఁడు. దోషగుణ ధ్యానంబునఁ గామంబు నివర్తించు. పాలెంతమధురము లయ్యు నందు విషము కలసినదని యెఱిఁగిన వాఁడు వానిని ద్రావఁడుకదా. ఇట్లు దోషదృష్టిచే విషయ భోగము లందు నాసక్తుఁడుగాని వాఁడు హెచ్చరికగలిగి సరియైన కాలంబున జితాసనుఁడు జితశ్వాసుఁడై సోమరిగాక విఘ్నములకు భయపడక మెల్ల మెల్లన శుభాశ్రయ భూతుఁడైన నాయందు మనస్సు నిలుప వలయు. అన్నిటినుండి మనస్సు నాకర్షించి నాయందు నిలువవలయు నను నీ యోగంబును నా శిష్యులగు సనకాదుల కుపదేశించితి ననిన నుద్ధవుండు కేశవా! యెప్పు డేరూపంబున సనకాదులను నీ వీ యోగం బుపదేశించితి వనిన భగవంతుఁ డిట్లనియె.

## విష్ణువు హంస స్వరూపమున సనకాదులకుఁ తత్త్వ ముపదేశించుట.

బ్రహ్మదేవుని మానసపుత్రులగు సనకాదులు తండ్రిం గని దుర్జ్ఞేయము నసాధారణమునగు యోగవిధంబు నిట్లు ప్రశ్నించిరి. తండ్రీ! శబ్దాది విషయంబులందు మనస్సు ప్రవేశించుచున్నది. మనస్సును విడిచి విషయంబులు వర్తింపవు. ఇట్టులుండఁ బ్రకృతిసంబంధం బనర్థక హేతువని విషయముల నతిక్రమింపఁగోరు ముముక్షువునకు మనస్సు గుణముల విడుచుటగాని గుణములు మనస్సును విడుచుటగాని యెట్లు లభించు? అని యడిగిన కొడుకులకుఁ గర్మసంకుచిత జ్ఞానముగల బ్రహ్మ తడవాలోచించియుఁ బ్రత్యుత్తరం బీయనేరక నన్ను స్మరించె. అప్పుడు నేను హంసరూపంబున వారల డాసితి. అప్పుడా సనకాదులు బ్రహ్మను ముందిడుకొని నాకు నమస్కారాదులు గావించి తమ సందేహమును ప్రశ్నింపక నీ వెవ్వఁడవని యడిగిరి; నా ప్రత్యుత్తరంబు వినుము.

మీరు జ్ఞానులైననునజ్ఞానులైనను నిట్లడిగియుండరు. ఏలంటిరా? మీ ప్రశ్నం బాత్మవిషయంబా? దేహవిషయంబా? ఆత్మవిషయ

మంటిరా సర్వమేకాత్మకమగుట నీ వెవ్వరనిన మిమ్ము మీరును నన్ను నేనును నడిగినట్లే కదా యగు. దేహబుద్ధిచే నడిగితిమంటిరా హంస స్వరూపము ప్రత్యక్షముగా గోచరించుచుండ నీ వెవ్వఁడవని యడుగుట యుపపన్నముగాదు. అదియునుగాక దేహములన్నియుఁ బంచభూతాత్మకములగుటచే సమానములు కావునఁ గారణ మడుగఁదగినది గాదు. కావున దానికి బ్రత్యుత్తరమే పనిలేదు. యోగపరిశుద్ధమైన మనస్సుచే గ్రాహ్యమగు నాత్మస్వరూపమును. నపరిశుద్ధ వాగ్దృష్టులు లోనగు నింద్రియములచే గ్రాహ్యమగు నితరమగు నచేతనమును సర్వము నేనని నాకంటె వేఱింకులేదని యెఱుంగుఁడు. పుత్రులారా! నేనాత్మగాఁగల జీవునకు దేహసంబంధము కలుగుచుండఁగా మనస్సునందు గుణములు గుణములందు మన స్సావేశించును. పరస్పరము విడిచియుండవు. మరల మరల గుణములను ధ్యానించుటవలన మనస్సు గుణములం దావేశించును. గుణములో చిత్తప్రభవములు. నా స్వరూపము ధ్యానించునెడల గుణచిత్తములు రెండును బరస్పరమువిడిచిపోవును. శబ్దాదిగుణపరిత్యాగోపాయ మాత్మరూపధ్యాన మొక్కటేకాదు జీవుఁడు దేహమునకంటె విలక్షణుఁడను ననుసంధానముకూడ నట్టి ఫలములనే గలిగించును. జాగర స్వప్న సుషుప్తులు సత్త్వాదిగుణహేతువులవలన బుద్ధివృత్తులగు జీవుఁడు వీనికంటె విలక్షణుఁడయి సాక్షియైయుండు. దేహసంబంధ రూపమగు సంసారబంధము జీవునకు గుణవృత్తుల నొసఁగును. మనస్సునకు శబ్దాదులందు భోగ్యతాది బుద్ధి నొసఁగును. కావున నవస్థాత్రయాతీత జీవశరీరకుఁడై తుర్యావస్థయందుండు నాయందు నిలిచిన మనస్సు గుణవృత్తులను ద్యజించు. ప్రకృతి విలక్షణుండై మదాత్మకుండైన జీవుని స్వరూప యాథాత్మ్యము ననుసంధించుటచేఁ జేతోవృత్తిత్యాగము ఘటిల్లు. దాన గుణచేతస్సులకుఁ ద్యాగము, దానివలన దేహసంబంధత్యాగము గలుగు. దానివలన నిశ్శేషముగ విషయ సంబంధములగు సుఖదుఃఖములకు నివృత్తియగు. దాన నిరతిశయానంద ప్రాప్తియునగు. అవస్థాత్రయ రహిత జీవస్వరూపము నను

సంధించునపుడును, బరమాత్మను విశేషముగ ననుసంధింపవలయును. జీవుఁడు తాను స్వతంత్రుఁడని దేవమనుష్యాది శరీరములు గలవాఁడని యభిమాన యుక్తుఁడగుటే యహంకారము. అది యనాది. దాని వలన గలుగుబంధమే పరమపురుషార్థమునకు విఘాతము గలిగించు నని బుద్ధిమంతుఁడెఱిఁగి మీఁదజెప్పిన తుర్యావస్థయందు నిలిచి సంసారచింతను వదలవలయును.

దేవ మనుష్యత్వా వ్యభిమానబుద్ధి దేహాత్మభేద ప్రతిపాదక యుక్తులచే నెంతవఱకు నివర్తింపకుండు నంతవఱకు నా పురుషుం డెంత నిపుణుండయ్యుఁ గన్నులు తెఱచి మేలుకొనియుండువాఁడయ్యు నీ విషయంబున నిద్రించు మూఢుఁడే. స్వప్నమును స్వప్నమని తలఁపక జాగ్రద్దశనుగూడ నిద్రయనితలచువానివలె నజ్ఞానంబున దేహంబును నాత్మయని చూచుచుండుఁగాని యది భ్రమయని యెఱుఁగఁడు. జ్ఞానైకరూపియగు నాత్మకు దేవ మనుష్యా ద్యాకారములు తచ్ఛరీర కృత బాలత్వ యువత్వ బ్రాహ్మణత్వాది భేదములు తద్బంధులు తత్కారణములు నితర దోషములు స్వప్నదృష్ట పదార్థములవలె మృషలు. ఎవఁడు జాగ్రద్దశయందు సమస్తేంద్రియములచేఁ బ్రతిక్షణ పరిణామాత్మక స్వభావముగల శబ్దాది విషయములను ననుభవించునో యెవఁడు తత్సమానములైనవానినే హృదయమున స్వప్నావస్థయందు ననుభవించునో యెవఁడు సుషుప్తియందు విషయభోగముల నుపసంహరించునో యతఁ డొక్కఁడేగాని పెక్కురుగారు. అతనికిఁ బ్రత్యవస్థయందు భిన్నత్వమును లేదు. ఎట్లందువేని యింతసేపు నిద్రించి యిప్పుడే మేలుకొంటి ననుటచే నిరువు రొక్కఁడేకదా యగు. నిద్రపోవుటకు ముందుచేసిన పాపములను నిద్రలేచిన తరువాత నతఁడేకదా యనుభవించు. సర్వముకూడ నిద్రించినవాఁడును మేలుకొనిన వాఁడును నొక్కఁడేయని తెలుపును. కర్మనిమిత్త ప్రాకృతేంద్రియ ప్రవర్తనవంతుఁడగుట నతఁడే జాగరాద్యవస్థల మూఁటను సాక్షియై యుండును. మనస్సు నవస్థలు మూఁడును వారివారి కర్మానుగుణముగ వృద్ధిక్షయ సంకల్పానుగుణము అనుజ్ఞానముచేతను సత్త్వాది

మనోనిష్ఠ గుణములచేతను నాయందుఁ గృతములని యిట్లు లాలోచించి హృద్గతములైన సకల సంశయాదులను ననుమానప్రమాణ సదుక్తులను తీక్ష్ణజ్ఞానముచే ఛేదించి నన్ను భజింపుఁడు. ఆత్మత్వ భోగ్యత్వాది విశేషభ్రమము సంకల్పవికల్ప విషయమైన మానస విలాసముగల విషయాదికము సర్వము దృష్టము నష్టము కొఱవి చక్రమువలె నవి విలోమమని యూహింపఁదగు. జ్ఞానైకస్వరూప స్వభావమగు జీవుఁడొక్కఁడే మనుష్యాదిరూపముల బహువిధములఁ బ్రకాశించునుగాని యతనికి స్వరూపమున దేవత్వ మనుష్యత్వాదులు లేవు. ఆ దేవమనుష్యాది భేదములు సత్త్వాదిగుణ పరిణామములు మాయాస్వప్నములు కావున శబ్దాదులందుండి దృష్టిమరల్చి తృష్ణ చాలించి నిర్వ్యాపారుండై యాత్మావలోకన సుఖానుభవము కలిగి దేహానుచింతనము మాని యుండవలయు. ఇట్టి పురుషునకుఁ బూర్వ మనాత్మబుద్ధిచేఁ ద్యక్తములైనసమాధివ్యతిరిక్త శయనాసన భోజనాదు లను మరలఁ గావించుచుండినను దానివలన మరల భ్రమ జనింపదు. కావున సమాధి చలనభీతిలేదు. దేహాంతర సంబంధమునకు నిమిత్త మైన దేహాత్మాభిమానము మరలఁ గలుగదు. భగవద్ధ్యానము శరీర పాతమువఱకుఁ గావించుచుండవలయు. లేకుండిన మనఃకాలుష్య ముచే సమాధియే గళితమగును. ఏలన నిష్కృష్టాత్మస్వరూపమునే సాక్షాత్కరించుకొని దేహము హేయమను తలంపున దానియందు మనస్సు కొంచెమైనను నిలుపఁడు. మదిరాపానముచే మత్తెక్కి యొడలుమఱచి యుండువానికి దైవవశమునఁ గట్టుకొన్న వస్త్రము దేహమునందుండుట వీడిపోవుట తెలియదుగదా. సమాధి సిద్ధింపఁ గనే యోగికి దేహము నశింపదు. అది యంతరాత్మయైన నాకు వశ పడి యుండును. దేహారంభకమైన ప్రారబ్ధకర్మము నశించువఱకు సప్రాణుఁడై యుండును. అట్లైన జ్ఞానికి నజ్ఞానికి భేదమేమనిన యో గికి సాక్షాత్కృతాత్మ వస్తువగుట మరల వానికి స్వప్నమందుఁ గనిన పదార్థమువలె దేహాంతరము కలుగదు. అజ్ఞానికి దేహాంతర ప్రాప్తి కలదు. విప్రులారా! మీకు రహస్యమైనను బ్రహ్మాత్మక స్వాత్మోపా

సనము భగవదుపాసనము నుపదేశించితిని. మీరు కోరినధర్మము చెప్పుటకు హంసస్వరూపముతో వచ్చిన విష్ణువుగా నన్నెఱుంగుఁడు. బ్రాహ్మణోత్తములారా! సాంఖ్యయోగములకు భూతహితాచరణ మను సత్యమునకుఁ, బుణ్యకర్మమను ఋతమునకుఁ, దేజమునకుఁ, వైరాగ్యాది సంపత్తికిఁ, గీర్తికి, శమమునకు, నేనే యాశ్రయుఁడను. నిర్గుణుఁడును నిరపేక్షకుఁడును సుహృదుఁడును నాత్మప్రియుఁడును నైషమ్యరహితుఁడును నగు నన్నే యానందాది సముస్తగుణములాశ్రయించి యుండును. అని చెప్పి నావలన భిన్నసందేహులై సనకాదులు నన్ను భక్తిచే సంస్తవముల నారాధించి సంతోషపెట్టిరి. ఇట్లు వారిచేఁ బూజింపఁబడి బ్రహ్మ చూచుచుండ స్వస్థానముఁ జేరితిని.

## శ్రీకృష్ణుఁ డుద్ధవునకు భక్తియోగము ముఖ్యమని బోధించుట.

అనిన నుద్ధవుం డిట్లనియె. కృష్ణా! బ్రహ్మవాదులు ధర్మాది శ్రేయస్సాధనములు పెక్కులు వచింతురు. అందొక్కటి మాత్రమే ముఖ్యమా? లేక వికల్పమున నన్నియు ముఖ్యములా? సర్వసంగములు మాని మనస్సు నీయందు నిలిపి యపేక్ష లేక కావింపఁబడు భక్తియోగము శ్రేయస్సాధనంబని నీవు చెప్పితివి. ఇది యితరశ్రేయస్సాధనములందంతర్భూతమా? తద్వ్యతిరిక్తమా? వ్యతిరిక్త మనునెడల రెంటికి సామ్యము గలదా లేదా? తారతమ్యము గలదేని యంగాంగీభావము గలదా లేదా? యని నా సంశయము. అనిన భగవంతుఁ డిట్లనియె.

ప్రాకృత ప్రళయకాలమున వేదసంజ్ఞితమైన నా వాక్కు ధ్యాతలు నధ్యాపయితలు లేక నష్టమయ్యెను. ఆవల నేను మదాత్మకమైన ధర్మమును గల్పాదియందు బ్రహ్మ కుపదేశించితి. ఆయన తన జ్యేష్ఠపుత్రుఁడగు మనువున కుపదేశించెను. ఆవల దానినే భృగు మరీచ్యత్ర్యంగిరః పులస్త్యపులహక్రతువులను సప్తర్షులు బ్రహ్మ వలన నేర్చిరి. ఆవల వారి పుత్రులు దేవదానవ గుహ్యకులు మను

ష్యులు సిద్ధ గంధర్వులు విద్యాధర చారణులు కిందేవులు కిన్నర కింపురుషాదులు నేర్చిరి. వారి ప్రకృతులు రజస్సత్త్వ తమస్సులచే భిన్నము లయ్యెను. కావున వారువారు భిన్నమతము లవలంబించి వారివారి ప్రకృతి కనుగుణముగా వేదములకుఁ జిత్రవిచిత్రార్థములు చెప్పఁగడఁగిరి. ఈ విధముగఁ బ్రకృతివైచిత్రిచే మానవులమతములు భేదించు. పారంపర్యమున నితర పాషండమతము లుద్భవించు. మదీయ మాయామోహిత బుద్ధులగు పురుషులు వారివారి కర్మములను వారివారి రుచులకుఁ దగినట్లు శ్రేయోమార్గము లని యనేక విధములఁ బలుకుచుందురు. ఒకఁడు ధర్మమును, వేఱొకఁడు యశస్సును, గామము నొకఁడు, సత్యమును శమదమములు వేఱొకఁడు, శ్రేయస్కరమని పలుకును. ఒకఁడైశ్వర్యమే పురుషార్థ మనును. కొందఱు నాస్తికులు సంపదయుఁ గడుపారఁ దినుటయు శ్రేయస్కరమందురు. కొందఱు ధర్మకర్మములు నిష్టాపూర్తములు నేకాదశ్యాది వ్రతములు, కొందఱు యజ్ఞ దాన తపో యమ నియమములు శ్రేయస్కరమందురు. వీని యన్నిటివలనను వీరికిఁ బ్రాప్తించు కర్మనిర్మిత లోకము లాద్యంతములు గలవి. ముందు దుఃఖమును గలిగించునవి మోహావసానములు. క్షుద్రానందములు. దుఃఖగర్భితములు. నాయందు మనస్సు నిలిపి యన్నిట నిరపేక్షులయిన వారికి నావలనఁ గలుగు సుఖము విషయాత్ముల కెట్లు గలుగు. నాయందు మనస్సు నిలిపి సంతుష్టుఁడై సమచిత్తుఁడై యేహేతువున నభిలషింపఁదగిన యితరపదార్థము లేనివాఁడై దాంతుఁడై శాంతుఁడై యుండువానికి సర్వకాల సర్వావస్థలు సర్వదిక్కులు సుఖమయములే. నాయందర్పితమైన చిత్తము గలవాఁడు నన్నుఁదప్ప నితరమైన బ్రహ్మపదము మహేంద్రపదము సార్వభౌమత్వము పాతాళైశ్వర్యము యోగసిద్ధులు నింతయేల మోక్షమైనను గోరఁడు. మీవలె బ్రహ్మయు శంకరుఁడు సంకర్షణుఁడు శ్రీదేవియుఁ దుదకు నా మూర్తియుఁ నాకుఁ బ్రియతమములు గావు. నిరపేక్షుఁడు శుచి శాంతుఁడు నిర్వైరుఁడు సమదర్శనుఁడు నగువాఁ డెందెందుఁబోవు నందందు నేనును దత్పాదరేణు

వులః పవిత్రుఁడను గాఁ గోరి . యతని ననుసరించి పోవుచుందును. నాకంటెఁ గోరఁదగిన వేఱువిషయము లేదని యుండువారును, నాయం దనురక్తి గలవారును, శాంతులు, మహాత్ములు, నిఖిలజీవవత్సలులు, నకామలబ్ధబుద్ధులు, మదనుభవ సంభూతసుఖము ననుభవింతురు. వారు మోక్షసుఖమునుగూడఁ గోరరు. మద్భక్తుఁడు ప్రారంభదశయందు నజితేంద్రియుఁడయ్యు దినదినము పెరుఁగు భక్తిచే విషయములచేఁ బరాభవము నొందఁడు. అగ్ని తొలుతఁ గొంచెముగ నుండినను గొంచెము కొంచెముగ సమిధలు చేర్చుచువచ్చిన రేఁగి సర్వము భస్మముచేయునట్లు మద్విషయభక్తియుఁ బాపముల నెల్లనిర్మూలించును. ధర్మముగాని సాంఖ్యయోగములుగాని స్వాధ్యాయ తపస్త్యాగములుగాని యూర్జితమైన నా భక్తివలె నన్ను సాధింపలేవు. సాధువులకుఁ బ్రియుఁడును నాత్మయు నగు నేను శుద్ధమైన యొక్క భక్తిచేతనే గ్రాహ్యుఁడనగుదును. మద్విషయభక్తి చండాలునైనను జాతిదోషము నుండి పవిత్రునిఁ జేయఁగలదు. ధర్మసత్య దయోపేతుఁడును, విద్యాతపోయుక్తుఁడును నైనను భక్తిరహితుఁడు పవిత్రుఁడు గానేరఁడు. గగ్గురుపాటు, కరఁగుచున్న మనస్సు, నానందబాష్పములు లేక శుద్ధభక్తి యెట్లగును? భక్తిలేకున్నఁ జిత్తశుద్ధి యెట్లగు? డగ్గుత్తికతోఁ గరఁగుచున్న మనస్సుతోఁ, నొకచోఁ నేడ్చుచు, నొకచోఁ నవ్వుచు, నొక్కచో సిగ్గువిడిచి పాడుచు, నాడుచు. నాభక్తితోఁగూడినవాఁడు లోకంబును బావనంబుజేయును. కొలిమియం దగ్నిలో నుంచఁబడి తిత్తులచే నూఁదఁబడిన బంగారు మలమునువిడిచి నిజస్వచ్ఛస్వరూపమును బొందినట్లు భక్తియోగమున భుక్తావశిష్ట కర్మమును బోనాడుకొని యావల నన్నుఁబొంది స్వస్వరూపమున వెలుఁగుచుండును. మదీయ పుణ్యకథాశ్రవణముచేఁ గర్మధ్వంసమై జీవుఁడు పరాబద్ధుఁడగుచుండెడి నంజన యోగమువలన నేత్రరోగము పోవునవాఁడు వస్తువులను యథాస్థితిఁ జూచునట్లు సూక్ష్మతత్త్వమును జూడఁగలుగును. విషయముల ధ్యానించు చిత్తము విషయములందే యాసక్తమగును. నన్ను స్మరించు చిత్తము నాయందే లీనమగును. కావున

శ్రవణధ్యానాదుల నా భక్తి యుదయించుకోలేది స్వప్నమనోరథ తుల్యమైన శబ్దాదివిషయధ్యానమును విడిచి మద్భావభావితంబైన చిత్తమును నాయందేనిలుపుము. స్త్రీలను దత్సంబంధులను దూరము నంద వదలి యాత్మవంతుఁడై నిర్భయుఁడై యేకాంతస్థలమునఁ గూర్చుండి యేమఱక నన్ను ధ్యానింపవలయు. స్త్రీసంగమమువలనను స్త్రీసంగుల సంగమమువలనను గలుగునట్టి క్లేశము మఱి యేసంగము చేతను గలుగదు. అనిన నుద్ధవుం డిట్లనియె.

## —♦శ్రీకృష్ణుఁ డుద్ధవునకు ధ్యానయోగ ప్రకారము చెప్పుట♦—

కృష్ణా ! జనరహిత స్థలమందు నన్ను ధ్యానింపుమని యంటివి. ఏ ప్రకారము నిన్నెట్టివానిఁగా ముముక్షువులగువారు ధ్యానింపవలయు నెఱింగింపుమనిన భగవంతుఁ డిట్లనియె.

మిట్ట పల్లమును లేక సమముగానుండు ప్రదేశమున దేహము మెడ శిరస్సు సమముగానుండునట్లు సుఖాసనమునఁ గూర్చుండి చేతులు తొడలపైనిడి నాసాగ్రమునఁ జూపునిలిపి పూరకకుంభక రేచకములచేఁగాని రేచకపూరక కుంభకములచేఁగాని మెల్ల మెల్లగఁ బ్రాణాయామంబు సలిపి నియతేంద్రియుఁడై మెల్లగ నభ్యసింపవలయు. హృదయస్థితంబైన యోంకారమును ఘంటానాదమువలె నవిచ్ఛిన్నముగఁ దామరతూఁడులోనుండి తంతువునుదీసినట్లు సూక్ష్మ నాదయుక్తముగఁ బ్రాణవాయువుచే లేపి దానిని ధ్యానించుచు మరల నోంకారమును హృదయమందు నిలుపవలయును. ఇట్లు ప్రణవము తోడఁ బ్రాణాయామమును మూఁడు సంధ్యలందును నొక్కొక్క సారి పదిపదిమార్లభ్యసించిన నెలలోపల నతఁడు వాయువును గెలుచు. ఇట్లు వాయువును గెలిచినపిమ్మట శరీరమునందు నూర్ధ్వ నాళ మధోముఖముగ నరఁటిపూవువలె ముకుళించియుండు హృదయ కమలమును నూర్ధ్వముఖమధోనాళముగ వికసించిన యష్టపత్రములు దుద్దుగలదానిగ ధ్యానింపవలయు. ఆవల దానియందలి కర్ణికయందు సూర్యచంద్రాగ్నిమండలము లొకదానిపై నొకటి వరుసగనున్నట్లు

ధ్యానింపవలయును. ఇది ధ్యేయమైన యాత్మస్వరూపము. ఈ వహ్ని మధ్యమున వక్ష్యమాణవిధముగ శుభాశ్రయమైన నా రూపమును ధ్యానింపవలయును. మేఘశ్యామంబును, ప్రశాంతంబును, ప్రసన్న ముఖమును, దీర్ఘములై సుందరములైన నాలుగు చేతులును, మిక్కిలి సుందరమైన గ్రీవము, శోభనములైన కపోలములు, శుభ్రమైన చిఱునవ్వును, సమానకర్ణంబులఁ బ్రకాశించు మకరకుండలములు, కనకాంబరము, శ్రీవత్సలక్ష్మి నికేతంబును, శంఖచక్రగదాపద్మ వనమాలా విభూషితంబును, నూపురములచే విలసిల్లు పాదంబులను, కౌస్తుభ ప్రభాంచితంబును, ప్రకాశించు కిరీటకటకకటి సూత్రాంగదములచే నొప్పిదంబును, సర్వాంగ సుందరంబును, హృద్యంబును. ప్రసాద సుముఖేక్షణంబును, సుకుమారంబునగు నా రూపమున సర్వాంగములందు మనస్సు నిలిపి ధ్యానింపవలయు. ఆవల సర్వాంగములందు వ్యాపించిన మనస్సు నాకర్షించి యొక్క సుస్మిత ముఖమునందే నిలిపి దానిని దప్ప నితరంబేదియునేని భావింపరాదు. ఇట్లు ముఖరూపము చక్కఁగ ననుభవమునకు వచ్చిన పదపడి మనస్సును దానియందుండి యాకర్షించి యపరిచ్ఛిన్నంబైన యాకాశంబున నిలుపవలయు. తరువాత దానిని వదలి మత్స్వరూప రూపాను సంధాన నిష్ఠుఁడై ధ్యాతృ ధ్యాన క్రియాదులనైనఁ గొంచెమేనిని జింతింపక యుండవలయు. ఇట్లు సమాధిదశయందుఁ బరిశుద్ధ జీవాత్మయందు నంతరాత్ముఁడుగా నుండు భగవంతుఁడు మాత్రమే ధ్యేయుఁడు. ఇట్లు సమాహిత మతి యగువాఁడు సర్వాత్మలయందుఁ బ్రవేశించి ధారకుండనై యుండు ప్రత్యగాత్మయందును బ్రత్యగాత్మను నాయందును దీపాలందు సూర్య ప్రభవలెఁ జూచును. ఇట్టివిఘ్నహతముగాని తీవ్ర ధ్యానముచేఁగూడిన మనస్సుగల యోగి శీఘ్రకాలమునఁ గర్మేంద్రియ జ్ఞానేంద్రియమువలన నగు దేహాత్మభ్రమ స్వాతంత్రాత్మభ్రమవదలినిర్వాణపదమునొందును.

## —♦ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు యోగసిద్ధులఁ దెలుపుట. ♦—

జితేంద్రియుఁడై స్థిరచిత్తుఁడై జితశ్వాసుఁడై నాయందు మనస్సు [illegible] యోగికి సిద్ధులును లభించునుగాని యవి మత్పదప్రాప్తికి

విఘ్నకారణము లగుట వానియందాసక్తి గలవాఁడవు గాకుమనిన నుద్ధవుం డిట్లనియె.

ఎట్టిధారణవలన నెట్టి సిద్ధిగలుగు? సిద్ధు లెన్ని? సిద్ధులకు నీవే కదా సిద్ధిప్రదుండవు? అనిన భగవంతుఁ డిట్లనియె. యోగపారగులు సిద్ధులు పదునెనిమిది యందురు. అందు మత్ప్రాప్తి ప్రయోజనము లెనిమిది. తక్కిన పది సంసారహేతువులు. దేహసిద్ధు లణిమ మహిమ లఘిమ ప్రాప్తి యనునవి. సర్వ ప్రాణేంద్రియములతోఁ దత్తధిష్ఠాతృ దేవతారూపమున సంబంధము. ప్రాకామ్యంబు దృష్టాదృష్ట పదార్థం బులందు భోగదర్శన సిద్ధి. శక్తి ప్రేరణంబగు నీశత్వము విషయ భోగాసంగంబు. వశిత్వంబు కోరిన సుఖము గలిగించుకొని యనుభ వించుట యనునది. ఇది యెనిమిదవ సిద్ధి. ఈయెనిమిది సమాధి యోగమువలన స్వభావముగఁ గలుగు సిద్ధులు. దేహము ముదియ కుండుట, యాఁకలి దప్పులు లేకుండుట; దూరదర్శనము, మనో జవము, దూరశ్రవణము, కామరూపము, పరకాయ ప్రవేశము, స్వచ్ఛందమృతి, దేవతాస్త్రీలతోఁ గ్రీడించుట, సంకల్పసిద్ధి, యాజ్ఞా ఽప్రతిహతత్వము, త్రికాలజ్ఞత్వము, ద్వంద్వజయము, పరచిత్తాభి జ్ఞత, జలవాయ్వగ్ని విషస్తంభనము, నపరాజయ మివి యన్నియు యోగసిద్ధులు.

ఏయే ధారణవలన నేయే సిద్ధులు గలుగునో చెప్పెదవినుము. మచ్ఛరీరభూత సూక్ష్మమాత్రోపాసకుం డణిమ యనుసిద్ధిని బడయు. మహత్తత్త్వ శరీరకుండనైన నాయందు విషయాంతర నివృత్తంబైన మనస్సును జక్కనిలుపునేని మహిమ సిద్ధించు. పరమాణు మయుఁడ నైన నాయందుఁ జిత్తంబు రంజింపఁజేసి సూక్ష్మకాలావస్థితత్వము ధ్యానించువాఁడు లఘిమ సిద్ధిఁ బొందును. వైకారికాహంకార శరీర కుండనైన నాయందు నేకాగ్రంబుగ మనస్సు నిలుపునతఁడు సర్వేం ద్రియముల కధిష్ఠాతయై ప్రాప్తియను సిద్ధి పొందును. పూసలలోని దారమువలె స్వకార్యముల కన్నిటికి నాధారభూతమై మహత్తత్త్వ శరీరంబు గల నాయందు మనస్సు నిలుపునతఁడు దృష్టాదృష్టార్థ

వ్యాపారోపయుక్త జ్ఞానాతిశయంబును బరమేష్ఠిభావంబును బొంది ప్రాకామ్యం బను సిద్ధిని బొందు. సర్వవ్యాపకుండును సృష్ట్యాది వ్యాపారక్రమ నిర్వాహకుండును గాలవిగ్రహుండును నగు నాయందు మనస్సునిలుపు నతఁడు క్షేత్రక్షేత్రజ్ఞులఁ బ్రేరించు శక్తిగలవాఁడై యీశత్వమును బొందును. జాగర స్వప్న సుషుప్తులను నవస్థాత్రయములు లేనివాఁడై తురీయశబ్ద వాచ్యుండై పరిశుద్ధ జీవాత్మస్వరూప శరీరకుండై జీవులకుఁ బ్రాప్యప్రాపకుండు నగుట నారాయణాఖ్యుండనై జ్ఞానశక్తి బలైశ్వర్య తేజోరూప షాడ్గుణ్యపూర్ణుండగుట భగవచ్ఛబ్దవాచ్యుండనగు నాయందు మనస్సు నిలుపువాఁడు నా ధర్మమందు నిలిచినవాఁడై నా స్వభావము గలవాఁడై గుణాసంగరూపంబైన వశిత్వముఁ బొందును. నిర్గుణుండనైన బ్రహ్మంబనైన నాయందు యోగపరిశుద్ధ మనస్సు నుంచువాఁడు పరమానందమును బొందును. సర్వకామములు నాయానందమున నవసాన మొందుచున్నవి. శ్వేతద్వీపపతియు సర్వాత్మకుండును ధర్మనిర్వాహకుండును నగు నాయందు మనస్సు నుంచునతఁ డశనాయాది షడూర్మి రహితుఁడై శ్వేతరూపమును బొందును. ఆకాశాత్ముండును ప్రాణశరీరకుండును నగు నాయందు మనస్సుచేఁ బ్రాణఘోషమును ధ్యానించి దూరశ్రవణ సిద్ధిని బొందును. సూర్యునిఁ గంటియందు, సూర్యునియందుఁ గన్ను యోజించి యాసంయోగమున నన్ను ధ్యానించునతఁడు సూక్ష్మదృష్టికలిగి దూరదర్శన సిద్ధిని బొందును. నాయందు మనస్సు నిలిపి ప్రాణవాయువుతోడ దేహమును సంయుక్తపఱచి ధ్యానించునతఁడు మద్విషయక ధారణాప్రభావంబున మనోవేగంబు గలవాఁడగు. ఏరూపమెత్తఁగోరునో యారూపమున మనస్సు నిలిపి ధారణచేయువాఁడు మద్యోగబలంబున నాయారూపంబు ధరింపఁ గలవాఁడగు. పరకాయంబు దాను బ్రవేశించి యందుండునట్టులు భావించువాఁడు తుమ్మెద యొకపువ్వును విడిచి వేఱొక పువ్వునకుఁ బోవునట్లు ప్రాణేంద్రియ యుక్తుఁడై యాదేహమున వాయువువలెఁ బ్రవేశించు. మడిమచే గుదమును బీడించి ప్రాణమును గ్రమముగ హృదయోరఃకంఠ

మూర్ధములందు నిలిపి బ్రహ్మరంధ్రమునఁ బ్రాణము విడుచునతఁడు బ్రహ్మలోకమును బొంది స్వచ్ఛంద మరణుండగు. దేవోద్యానాదికంబులఁ గ్రీడింపఁగోరునతఁడు నామూర్తిరూపంబైన శుద్ధసత్త్వంబును జింతించెనేని యట్టిసత్త్వమతిని సుర స్త్రీలు విమానములతోడసమీపింతురు. ఎప్పు డెవ్వఁడెయ్యది సంకల్పించునట్టివాఁడు సత్యసంకల్పుఁడ నగునన్ను మదాసక్తచిత్తుఁడై ధ్యానించెనేని స్వసంకల్పసిద్ధిం గాంచు. ఈశిత్వవశిత్వగుణయుక్తుఁడనగు నన్ను ధ్యానించునతని యాజ్ఞనాయాజ్ఞవలె నప్రతిహతంబగు. నాభక్తిచే శుద్ధమైన యంతఃకరణంబు గల యోగి నాభక్తి ప్రభావంబున జననమరణాది గోచరజ్ఞాన యుక్తమైన త్రికాలజ్ఞత్వంబును బొందు. యోగయుక్తుఁడై నామీఁద మనస్సు నిలిపిన మునిని జలజంతువులు నీటిని బాధింపలేనట్టు లగ్ని జలాదులతనిని బాధింపఁజాలవు. శ్రీవత్సలాంఛనుండు నస్త్రయుక్తుండును ధ్వజాతపత్రవ్యజన సమేతుండును నగు నాయవతారమూర్తుల ధ్యానించు నతఁ డపరాజితుండగు. ఉపాసీనుఁడై యోగధారణచే నన్ను ధ్యానించు నతని కీసిద్ధు లన్నియు లభించు. జితేంద్రియుఁడు దాంతుఁడు జితశ్వాసుఁడునై నాయందు ధారణ చేయు మునికి దుర్లభమగు సిద్ధి యేదియులేదు ఉత్తమయోగంబుతోఁగూడి నన్నుఁ బొందఁగోరువాని కివియన్నియుఁ గాలక్షేపణ హేతువులైన విఘ్నములగు జన్మౌషధ తపోమంత్రములచేఁ గలుగు సిద్ధులెల్ల యోగముననే లభించును గావున వీనికై శ్రమించుచు మత్సాలోక్యాది సిద్ధి నుపేక్షించి యోగంబున వీనికై వ్యర్థపఱుపరాదు. సర్వసిద్ధులకు సాంఖ్యయోగంబులకు ధర్మమునకు బ్రహ్మవాదులకు నేను హేతువను, బతిని, ప్రభువను. దేవమనుష్యాది భూతములందు నాకాశాది భూతములవలె నేను సర్వదేహుల లోపల వెలుపల నావరణ రహితుండనై యుందు ననిన నుద్ధవుం డిట్లనియె.

—♦ శ్రీకృష్ణుఁ డుద్ధవున కాత్మవిభూతులు చెప్పుట. ♦—

దేవా! నీవు సాక్షాత్పరమబ్రహ్మవు. ఆద్యంత రహితుఁడవు. ఆవరణరహితుండవు. సర్వప్రాణుల యుత్పత్తిస్థితిలయ కారణుండవు.

అజితాత్ములకు దుర్జ్ఞేయుండవు. ఐనను నిన్ను వేదాంతవిదులు నానా భూతముల యథావస్థితాకారములచేఁ బూజింతురు. పరమర్షులు ని న్నేయేభావంబులం దుపాసించి సిద్ధి నొందుదురు? అవి నాకు వచింపుము. భూతములందు నీవు గూఢుఁడవై చరింతువు. కావున భూతాత్మా! నీవాభూతములనెల్లఁ జూచుచున్నను మోహితములైన యవి నిన్నుఁ జూడఁ జాలవు. ఓ మహావిభూతీ! స్వర్గ మర్త్య పాతాళంబులందుఁ గానవచ్చు నీ విభూతులనెల్ల నాకు వివరింపుము. తీర్థస్థానంబైన నీ పాదపద్మములకు నమస్కరించెదను. అనిన భగవంతుఁ డిట్లనియె.

ఉద్ధవా! కురుక్షేత్ర సంగరకాలంబున స్వజనవధమునందు నిరుత్సాహియైన యర్జునుఁ బ్రబోధించుసమయంబున నతం డడిగిన నా విభూతుల వచించితి. ఇప్పుడు నీకును జెప్పెదవినుము. ఈభూతములకెల్ల నాత్మను నేనే. సుహృదుండను నేనే. ఈశ్వరుండను నేనే. సమస్తభూతముల జన్మస్థితిలయములకు హేతువు నేన. సర్వభూతములు నేన, ప్రశస్తగతిమంతుల గతి నేన. అనర్థప్రాపకతచే గణనీయములలో గాలంబు నేను. సత్త్వాదిగుణముల సామ్యము నేను. గుణవంతుల స్వభావగుణంబు నేను. గుణత్రయవంతులయందుఁ బ్రథమకార్యంబు నేను. మహత్తుల మహత్త్వంబు నేను. సూక్ష్మములలో జీవుఁడు నేను. దుర్జయములలో మనస్సు నేను. దేవతలలో హిరణ్యగర్భుఁడ నేను. మంత్రంబులందు నక్షరత్రయాత్మకంబైన ప్రణవంబు నేను. అక్షరములం దకారంబు నేను. వేదములలో గాయత్రి నేను. సర్వదేవతలలో నింద్రుండను నేను, వసువులయందుఁ బావకుఁడ నేను. ఆదిత్యులయందు విష్ణువ నేను. రుద్రులందు నీలలోహితుఁడ నేను. బ్రహ్మర్షులందు భృగువు నేను. రాజర్షులందు మనువు నేను. దేవర్షులందు నారదుఁడు నేను. ధేనువులందుఁ గామధేనువు నేను. సిద్ధేశ్వరులందుఁ గపిలుఁడు నేను. పక్షులందు సుపర్ణుఁడు నేను. ప్రజాపతులందు దక్షుఁడు నేను. పితరులలో నర్యముఁడు నేను. దైత్యులందుఁ బ్రహ్లాదుఁడు నేను. నక్షత్రౌషధులలో సోముఁడను నేను. యక్షరాక్షసులలో గుబేరుఁడు

నేను. ఏనుఁగులలో నైరావతము నేను. జలజంతువులందు వరుణుఁడు నేను. తపింపఁజేయువారిలో ద్యుతిమంతులలో సూర్యుఁడు నేను. మనుష్యులందు రాజు నేను. అశ్వములందు నుచ్చైశ్రవము నేను. ధాతువులందు బంగారు నేను. దండించు వారియందు యముఁడు నేను. సర్పములందు వాసుకి నేను. నాగములందు ననంతుఁడ నేను. కొమ్ములు కోఱలుగల మృగంబులందు సింహంబు నేను. ఆశ్రమములందు సన్న్యాసాశ్రమము నేను. వర్ణములందు మొదటిది నేను. ప్రవాహ రూపతీర్థములందు గంగ నేను. సరస్సులందు సముద్రము నేను. ఆయుధములందు ధనుస్సు నేను. ధనుష్మంతులందుఁ ద్రిపురాంతకుఁడు నేను. నివాసస్థానంబులలో హిమాలయము నేను. వనస్పతులందు నశ్వత్థము నేను. ఓషధులయందు యవలు నేను. పురోహితులందు బృహస్పతి నేను. బ్రహ్మిష్ఠులయందు వసిష్ఠుఁడు నేను. సేనానులయందు స్కందుఁడు నేను. సన్మార్గ ప్రవర్తకులయందు బ్రహ్మ నేను. యజ్ఞములందు బ్రహ్మయజ్ఞము నేను. వ్రతములం దహింస నేను. శుచి పదార్థములందు వాయ్వగ్ని జలరూపముగ నుండువాఁడను నేను. యోగములందు సమాధి నేను. జయశీలురయందు జయోపాయము నేను. కౌశలములయందు నాత్మానాత్మ వివేకవిద్య నేను. తార్కికులందు వికల్పము నేను. స్త్రీలయందు శతరూప నేను. పురుషులయందు స్వాయంభువ మనువు నేను. మునులయందు నారాయణుఁడు నేను. బ్రహ్మచారులందు సనత్కుమారుఁడు నేను అలౌకిక శ్రేయస్సాధనములందు సన్న్యాసము నేను. క్షేమమునయందుఁ బ్రత్యగాత్మ స్వరూప సంధానము నేను. రహస్యములందు సూనృతముమౌనము నేను. మిథునములందు నెవని దేహార్థములవలన మిథున ముద్భవించెనో యట్టి యజుఁడు నేను. అనిమిషములందు సంవత్సరము నేను. ఋతువులందు వసంతము నేను. మాసములందు మార్గశీర్షము నేను. నక్షత్రములందు త్తరాషాఢ చతుర్థపాదంబైన యభిజిత్తు నేను. ద్వంద్వసహులయందు దేవలాసితులు నేను. వేదవిభాగకర్తలయందు ద్వైపాయనుఁడు నేను. దీర్ఘదర్శులయందు సూక్ష్మబుద్ధిగల శుక్రాచార్యుఁడు నేను. భగవంతు

లందు వాసుదేవుఁడు నేను. భాగవతులయందు నీవు నేను. కింపురుషుల యందు హనుమంతుఁడు నేను. విద్యాధరులందు సుదర్శనుఁడు నేను. రత్నములందుఁ బద్మరాగము నేను, సుందరపదార్థములందు బద్మకోశము నేను. తృణజాతులందు దర్భ నేను. హవిస్సులందు నావునేయి నేను. వ్యవసాయంబులందు లక్ష్మి నేను. కితవులయందు నాగ్రహము* నేను. క్షమావంతులయందు క్షమ నేను. సాత్త్వికులందు సత్త్వము నేను. ఓజస్సులయందలి యింద్రియపటుత్వము నేను. సహస్సులయందలి ధారణ సామర్థ్యంబు నేను. బలవంతులయందలి శరీరబలంబు నేను. భాగవతుల భక్తియుక్తపూజాకర్మంబు నేను. మత్స్యాది నవమూర్తులలో సర్వకారణభూతమైన యాదిమూర్తి నేను. గంధర్వులయందు విశ్వావసు నేను. అప్సరసలయందుఁ బూర్వచిత్తి నేను. పర్వతంబులందలి స్థైర్యంబు నేను. భూమియందలి గంధంబు నేను. జలంబులందలి రసంబు నేను. తేజోవంతులలో విభావసుఁడ నేను. సూర్యేందు తారలలోఁ బ్రభ నేను. ఆకాశంబునందలి శబ్దంబు నేను. బ్రహ్మణ్యులందుఁ బలి నేను. వీరులయం దర్జునుఁడు నేను. భూతములందలి యుత్పత్తిస్థితిలయములు నేను. కర్మేంద్రియ జ్ఞానేంద్రియములందు వాని వ్యాపారంబు తదర్థగ్రహణశక్తి నేను. పృథివ్యప్తేజోవాయ్వాకాశములు నేను. అహంకార మహత్తత్త్వములు నేను. ఏకాదశేంద్రియములు పురుషుఁ డవ్యక్తము రజస్సత్త్వ తమస్సులు ముక్తాత్మస్వరూపము నేను. వీని గణనంబును లక్షణయుక్తజ్ఞానంబును నే నీశ్వరుఁడుగాఁ గల జీవుఁడు సత్త్వాదిగుణములు తదాశ్రయభూతములైన యచిద్ద్రవ్యములు సర్వము నేను. నేనుగానిది యేదియు లేదు. కాలమున భూరేణువులనైన లెక్కింతుఁ గాని నేను సృజించిన కోటానకోట్లండములను లెక్కింపనేరనన నందలి వస్తువులమాట చెప్పనేల ? తేజస్సు శ్రీధృతి యైశ్వర్యము హ్రీత్యాగము సౌభాగ్యము యశస్సు వీర్యము తితిక్ష విజ్ఞానము మనశ్రమ మివి యెందుఁ గానవచ్చునో యవియెల్ల నా యంశములు. నా విభూతులను సంక్షేపముగఁ జెప్పితిని. వేదములు చెప్పిన ట్లవియెల్ల నా

* అనుగ్రహము = పట్టుదల [illegible]

సంకల్పప్రభవంబులు. వాక్కును నియమింపుము. ప్రాణేంద్రియముల నియమింపుము. ఆత్మను నాత్మచే నియమింపుము. ఇట్లు చేసితివేని మరల సంసారమార్గంబునఁ బడవు. ఎవ్వఁడిట్లు వాఙ్మనసముల నియమింపఁడో వాని వ్రతతపోదానములు పచ్చికుండలలోని నీళ్ళవంటి వగును. కావున మనోవాక్ప్రాణేంద్రియముల మత్పరాయణుఁడై నాయందలి భక్తిచే నియమించెనేని మోక్షోపాయంబు సంపూర్ణమగు.

## —♦ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు భక్తిలక్షణధర్మము చెప్పుట. ♦—

అనిన నుద్ధవుం డిట్లనియె. దేవా! తొల్లి, నీవు వర్ణాశ్రమాచారవంతులకుఁ తదితరులైన యెల్ల నరులకు ననుష్ఠేయంబైన భక్తిలక్షణధర్మం బుపన్యసించితివి. ఎట్టులు స్వస్వవర్ణాశ్రమానుగుణమైన ధర్మముచే ననుష్ఠించిన నీయందు భక్తికలుగు నట్టి యనుష్ఠాన ప్రకారంబు వచింపుము. పరమసుఖరూపంబైన ధర్మంబును దొల్లి బ్రహ్మాదులకు హంసరూపంబున నుపదేశించితివి. విశేషకాలము గడచుటచే నది యిప్పుడీలోకమున విస్మృతంబై నష్టంబయ్యె. బ్రహ్మసభయందు విద్యలు మూర్తులు ధరించియుండు. అట్లుండినను నాలోకంబునను ధర్మంబును జెప్పువాఁడు చేయువాఁడు రక్షించువాఁడు నీవుతప్ప వేఱొకఁడు లేఁడన భూలోకముమాట చెప్పనేల? ఇందును గర్తయు వక్తయు రక్షకుండును నీవ. నీవీలోకము వదలిపోయిన మరల వక్త యెవ్వఁడుండు? సర్వధర్మజ్ఞా! యిట్టి నీవు త్వద్భక్తిలక్షణంబైనధర్మంబు నేయే యాశ్రమములవా రెట్లెట్లు వర్తింపవలయు నాకు దేవా వర్ణింపుము. అనిన మానవక్షేమంబు కోఱకు భగవంతుండు సనాతన ధర్మముల నిట్లనియె.

నీప్రశ్నంబు ధర్మయుక్తంబు నరులకు ముక్తిసాధనంబు. కావున వర్ణాశ్రమానుగుణమైన ధర్మము వచింతు వినుము. తొలుతఁ గృతయుగమ్మున నరులందఱు హంసంబను పేరుగల బ్రాహ్మణవర్ణము గలవారు. వారు పుట్టువుచేతనే కృతకృత్యులు. కావున నాయుగము కృతయుగ మనఁబడియె. అప్పుడు ప్రణవం బొక్కండె వేదంబు.

నేను వృషభరూపంబున ధర్మంబనై నాలుగుపాదంబులఁ జరించితి. అప్పుడా హంసవర్ణులు తపోనిష్ఠలచేఁ ద్వ్యక్తపాపులై హంసంబైన నన్ను నుపాసించిరి. త్రేతాముఖంబున నా హృదయంబునుండి వేదవిద్య యుద్భవించె. అప్పుడు నేను హోత యధ్వర్యుఁడు నుద్గాత యను మూఁడు రూపంబులుగల యజ్ఞంబనైతి. అప్పుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నై రాజపురుషుని ముఖబాహూరు పాదంబులు నాత్మాచార లక్షణంబులతోఁ బుట్టిరి. అంత నా జఘనంబు నుండి గృహస్థాశ్రమము, హృదయంబునుండి బ్రహ్మచర్యము, వక్షస్స్థలమునుండి వానప్రస్థము, శిరంబునుండి సన్న్యాసము జనించె. వర్ణము లాశ్రమములు వానివాని జన్మభూమి ననుసరించి యుత్తమములవలన నుత్తమములు, నీచములవలన నీచములు నయ్యె. శమ దమ తప శ్శౌచములు సంతోష శాంత్యార్జవములు మద్భక్తి దయాసత్యములు బ్రాహ్మణ స్వభావగుణములు. తేజోబలధృతి శౌర్యతితిక్షౌదార్యోద్యమములు స్థైర్యము బ్రహ్మకులహితకరత్వ మైశ్వర్యము ననునవి క్షత్రియస్వభావగుణములు. ఆస్తిక్యము దాననిష్ఠ యదంభము విప్రసేవ యర్థార్జనమునం దసంతుష్టి యివి వైశ్యస్వభావగుణములు. దేవ ద్విజ గోవులకు నిర్వంచనముగ శుశ్రూషసేయుట దానివలన లభించినదానితో సంతోషపడుట యివి శూద్ర స్వభావములు. అశౌచమనృతము చౌర్యము నాస్తిక్యము శుష్కకలహము కామము క్రోధ మర్థకామతృష్ణ లివి యాశ్రమరహితులైన చండాలాదుల స్వభావగుణములు. అహింస సత్య మస్తేయము కామక్రోధలోభత్వములు భూతప్రియహితాభిలాష యివి సర్వవర్ణధర్మములు. స్వభావమనిన బ్రాహ్మణాదిజన్మములకు హేతుభూతమైన ప్రాచీనకర్మవిశేషము తదనుసారి బుద్ధివిశేషములనియు నెఱుంగుము. బ్రాహ్మణునందు రజస్తమస్సుల నతిక్రమించి సత్త్వం బెక్కుడై యుండు. క్షత్రియునందు సత్త్వతమస్సుల నణఁచి రజోగుణంబు హెచ్చియుండు. వైశ్యులందు సత్త్వరజస్సుల నణఁచి యల్పంబుగఁ దమం బతిశయించు. శూద్రులందు రజస్సత్త్వములకన్నఁ దమం బతిశయించు. తొలి మూఁడు

## —♦ శ్రీకృష్ణుం డుద్ధవునకు వర్ణాశ్రమధర్మంబుల వివరించుట ♦—

వర్ణములవా రానుపూర్వ్యంబుగ జన్మం బుపనయనంబునొంది బ్రహ్మచారులై గురుకులవాసంబుఁ గావించి దాంతులై మౌంజి కృష్ణాజినము బ్రహ్మసూత్రము కమండలువు ధరించి యభ్యంగనము వర్జించి జడలుదాల్చి యుండవలయు. చలువవస్త్రములు ధరింపరాదు. దంతధావనంబు గావింపరాదు. రక్తపీతవస్త్రములఁ గట్టరాదు. దర్భలు ధరింపవలయు. స్నాన భోజన హోమ జప మూత్రపురీష విసర్జన సమయంబులందు మౌనంబు ధరింపవలయు. గోళ్లు తీయరాదు. కక్షోపస్థ రోమంబులనైన ఛేదింపరాదు. ఒకప్పుడైన రేతస్సును బుద్ధిపూర్వకంబుగ విడువరాదు. బ్రహ్మచర్యవ్రతధరుండై జలంబుల మునిఁగి ప్రాణాయామ మాచరించి త్రిపదిసావిత్రి వేయియునెనిమిది మార్లు జపించి శుద్ధుండు గావలయు. ఉభయసంధ్యలయందు నగ్నిసూర్యుల నాచార్య గోవిప్ర గురువృద్ధ దేవతలను నియమితవాక్కై యుపాసింపవలయు. ఆచార్యుని నన్నుఁగా భావింపవలయు. ఆయన నెప్పుడైనను నవమానింపరాదు. గురువు సర్వదేవమయుఁడు గాన నాయనయందు మనుష్యబుద్ధియుంచి దోషము లెంచరాదు. సాయంప్రాతఃకాలంబుల భిక్షించి తెచ్చిన యన్నము నాయనకు నివేదింపవలయును. అందు స్వోపభోగ్యమై యనిషిద్ధమగు దానిని నాయన యనుమతిఁగొని మౌనియై భుజింపవలయు, గురుశుశ్రూష గావించి యాయన పండుకొనినప్పుడు కూర్చుండినపుడు పయనించునపుడు భృత్యునివలెఁ గృతాంజలియై కొంచెము దవ్వున నిలువవలయు. ఈవిధముగ భోగములు వర్జించి విద్యాభ్యాసము ముగియువఱకు నఖండవ్రతము సలుపుచు గురుకులవాసంబుఁ గావింపవలయు. ఇట్టి బ్రహ్మచారి వేదాధ్యయన కర్మఫల హేతుభూతంబైన బ్రహ్మలోకంబును బ్రాపింపఁగోరెనేని యావజ్జీవము దేహము గురువునకు స్వాధీనపఱచి బ్రహ్మచారియే యై యుండవలయు. ఇట్టివాఁడు నైష్ఠికుఁ డనఁబడు. గృహస్థాశ్రమంబు నవలంబింపఁ గోరువాఁ

డుపకుర్వాణుం డనంబడు. నైష్ఠికుండు గురువునందును నగ్ని యందును నాత్మయందును సర్వభూతంబులందును వేఱుబుద్ధిలేక పరముండనైన నన్ను బ్రహ్మచర్యవ్రతచర్యాహిత తేజస్సంపన్నుండై యకల్మషుండై యుపాసింపవలయు, స్త్రీదర్శన స్పర్శన సల్లాప పరిహాసములను మిథునకర్మంబున వర్తించు పశుపక్ష్యాదులం జూచుటయైనను నితం డగృహస్థుండగుట వర్జింపవలయు.

శౌచ మాచమనము స్నానము సంధ్యోపాసన మార్జనము తీర్థసేవ జపము సర్వాశ్రమస్థులకుం గర్తవ్యంబు. ఎల్లరు నస్పృశ్యంబుల స్పృశింపరాదు. అభక్ష్యంబుల భక్షింపరాదు. అసంభాష్యంబుల భాషింపరాదు. ఇవి నియమంబులు. అసద్విషయంబుల ధ్యానింపకుండుట మనోనియమంబగు. అనృతాలాప మహితాలాపము వృథాలాపము వీనిని వర్జించుట వాక్సంయమంబగు. నిషిద్ధభోగరాహిత్యంబు కాయసంయమంబగు. ఇట్లు మనోవాక్కాయంబుల నియమించి సర్వభూతంబు లందు మద్భావముంచుట యెల్లవారికి నియతము. ఇట్లు నైష్ఠికవ్రతధరుండగు బ్రాహ్మణుం డగ్నివలె వెలుంగుచు మద్భక్తుండై తీవ్రతపంబున దగ్ధకర్మాశయుండై ముక్తుండగు.

నైష్ఠికాశ్రమమున కశక్తుఁడై సమాప్తవిద్యుండగువానికిం గర్తవ్యంబులు వాక్రోనియెద వినుము. విదితవేదుండగువాఁడు విద్యాసమాప్తి యనంతరము గురువునకు దక్షిణనొసంగి గుర్వనుజ్ఞ గొని యభిసమావర్తనాఖ్యంబైన స్నానంబుగావించి తక్కిన మూఁడాశ్రమంబులం దేదేని యొకటి ప్రవేశింప నిచ్ఛగొని గృహస్థుఁడో వానప్రస్థుఁడో కావలయు. బ్రాహ్మణుండగునేని సన్న్యాసంబునైన స్వీకరింపనగు. ద్విజుం డొకయాశ్రమమునుండి వేఱొకయాశ్రమమునం బ్రవేశింపవలయుంగాని యాశ్రమరహితుండై యుండఁదగదు. గృహస్థాశ్రమం బాకాంక్షించునతం డనిందితయు నదుష్టయు వయస్సునం జిన్నదియు సమవర్ణయు నగు భార్యను సొరిది వివాహమాడవలయు. [illegible]ధ్యయన దానంబులకు ద్విజన్ములందఱు నర్హులు. అందుఁ బ్రతి

గ్రహాధ్యాపన యాజనంబులను బ్రాహ్మణుం డొక్కఁడే యర్హుండు. ప్రతిగ్రహంబు * తపస్తేజో యశోనాశకంబు లని యెంచువాఁడు తక్కిన రెంట జీవింపనగు. ఆ రెంటియందును దోషదృష్టి గల వాఁడు శిలవృత్తిగొని కళ్ళంబులఁ బడిన గింజ లేఱి తిని జీవింపనగు. బ్రాహ్మణున కీ దేహంబు క్షుద్ర కామోపభోగంబుల కుద్దేశింపఁ బడ లేదు. జీవద్దశయందుఁ గష్టించి తపంబు చేయువాఁడు పరలోకంబున ననంతసుఖంబు లనుభవించు. శిలోంఛవృత్తులఁ బరితుష్ట చిత్తుండగువాఁడు నైర్మల్యావహంబైన నిజవర్ణాశ్రమోచిత ధర్మంబు ననుష్ఠించుచు మనస్సు నాయందు నిలిపి గృహంబుననుండియు మిగుల భోగాసక్తుఁడు గానివాఁడు ముక్తినొందును. మద్భక్తుండై శిలాదివృత్తులచే నుదరపోషణంబు జరగక కష్టించు నతనికి జీవనంబు గల్పించు నతనిని విపత్సముద్రమున నావపోలె నేను సకలాపదల నుండి తరింపఁజేయుదును.

రాజగువాఁడు ప్రజలనుదండ్రివలె సకల వ్యసనంబుల రక్షింప వలయు. ఉబ్బలిఁ జిక్కిన గజమును గజపతి లేవఁదీయునట్లు ధీరుఁ డగు రాజు తన్నుఁ దానే యుద్ధరించుకొనవలయు. ఇట్టి ప్రభువు సూర్య సన్నిభంబయిన విమానంబున సర్వపాపవిముక్తుండై యింద్రు తోడ స్వర్గంబున మోదించు. అట్లు రాజు రక్షింపఁడేని కష్టదశయం దుండు బ్రాహ్మణుఁడు వాణిజ్యంబున నందు నిషిద్ధలవణ మాంసాది విక్రయంబునఁగాక స్వవ్యవహారార్హంబులైన తృణాకాష్ఠాదుల విక్ర యించియొండె, క్షత్రియవృత్తి నవధరించి శస్త్రజీవిక నొండె జీవింప నగుఁగాని నీచవర్ణ సేవ నెప్పుడైన నాపదలందును జేయ నర్హంబుగాదు. క్షత్రియుం డాపదలందు వైశ్యవృత్తి నొండె వేఁట నొండెఁ గాదేని విప్రరూపంబున నొండె జీవింపనగుఁ గాని శ్వవృత్తి నెన్నఁడు నవలం బింపరాదు. ఆపదలందు వైశ్యుండు శూద్రవృత్తి జీవింపనగు. శూద్రుండు సాలెవృత్తి చాఁపలు నేఁతలోనగు వానిచే జీవింపనగు. ఆపద దొలఁగినంత వారు వారు మరలఁ దమ తమ కులవృత్తుల

*ప్రతిగ్రహంబు = దానము పట్టుట.

నవలంబింప వలయుఁగాని గర్హ్యవృత్తుల నుంకరాదు. వేదాధ్యయన బ్రహ్మయజ్ఞాదుల ఋషుల, నష్టకాది శ్రాద్ధంబులఁ బితృదేవతల, బల్యన్నాదుల భూతంబుల, మద్రూపంబులుగ నెంచి ప్రతిదినము యజింపవలయు. దైవలబ్ధంబై శుద్ధమార్గంబున నార్జించిన ధనంబున భృత్యులఁ బోషించి పీడింపక నన్నుఁ బూజించుచు యజ్ఞంబు లాచరింపవలయు. భార్యాఽపత్యములందు మమకారము విడిచి కుటుంబి యయ్యు దేహంబున నహంభావంబుమాని జ్ఞానవంతుఁడై కానవచ్చు పదార్థములవలెఁ గానరాని స్వర్గాదికంబులు నశ్వరంబులని యెంచవలయు. దారపుత్రాప్త బంధుసంగమంబు చలిపందిలియందలి పాంథసంగమంబట్టిది. నిద్రతోడ రాకపోకలుగల కలలవలె వీరు ప్రతిదేహముతోడ వచ్చుచుఁ బోవుచుందురు. ఇట్టు లాలోచించి సమాహితచిత్తుండై యింటియందు నతిథివలె వసించుచు దానియందాసక్తిమాని నిర్మముఁడు నిరహంకారుఁడు గావలయు. గృహమేధి కర్మంబుల నన్నే భజించుచు నుండవచ్చు. పుత్రవంతుఁడగునేని వనంబుననైన వసింపనగు. కాదేని సన్న్యసింపవచ్చు. అట్లుగాక పుత్రవిత్తదారైషణాదుల నాతురుఁడై స్త్రీలకు వశుఁడై కృపణబుద్ధియై యుండు మూఢుఁడు మమకారాహంకారముల బద్ధుఁడగు. అయ్యో నాతల్లిదండ్రులా వృద్ధులే. నా పెండ్లామా చిన్నబిడ్డలఁ గలదే. బిడ్డలా లేఁత కూనలే. నేను లేకున్న వీరిగతి యెట్లో యెంతదుఃఖింతురో యెట్లు జీవింతురో యని గృహాదులయందుఁ దలంపుంచు తెలివిమాలినవాఁడతృప్తుఁడై యిట్టి విచారముతోనే మృతుఁడై యని తామస యోనులఁ బ్రాపించుచుండును.

వానప్రస్థాశ్రమంబు స్వీకరింపఁ గోరువాఁడు భార్యారక్షణభారంబు పుత్రులందుంచి గాని భార్యతోఁ గూడి గాని వనమందే శాంతుఁడై డెబ్బదియేను వర్షంబుల ప్రాయంబువఱకు నుండవలయు. మరల నింటికి రాఁగాదు. అప్పుడు కొంచెము వైరాగ్యము కలిగినను సన్న్యాసమున కధికారియగు. వనమునందుఁ బుట్టి పవిత్రంబులైన కందమూల ఫలంబులచే జీవించుచు [illegible]ండెఁ దృణపర్ణా

జినంబులొండెఁ గట్టి వసింపవలయు. కేశరోమ నఖశ్మశ్రురూపమలంబుల ఛేదింపరాదు, దంతధావనంబు దగదు. ముమ్మాఱు స్నానము గావింపవలయు. ఆకులలములు పఱచిన నేలపైఁ బవళింపవలయు. వేసంగియందు మీఁద నెండయు నలుప్రక్కల మంటలు మండుచుండ నడుమనుండి తపంబు గావింపవలయు. వానకాలమందు వర్షధారలలోఁ, జలికాలమందు గుత్తుకబంటి నీళ్లలో, నిలిచి స్వవర్ణాశ్రమోచిత తపస్సు గావింపవలయు. అగ్ని పక్వంబులైన కందమూలంబులను గాలపక్వంబులైన ఫలములను రోటియందుఁగాని రాతిమీఁదఁగాని దంచిన నీవారాదులను భుజింపవలయు. కాదేని దంతములనే ఱోలుగాఁజేసి నమలి తినవలయు. జీవికకు వలయు కందమూలాదులు సర్వము తానే యెప్పటి కప్పుడు సంపాదించి తెచ్చుకొనవలయుఁగాని యితరులు తెచ్చినవిగాని ముందుఁగా దెచ్చి సేకరించి యుంచినవిగాని భుజింపరాదు. చరుపురోడాశంబులు వనభవంబుల చేతనే తీర్పవలయునుగాని వనాశ్రమ పశుహింసచే యజింపరాదు. అగ్నిహోత్రదర్శ పౌర్ణమాసములు చాతుర్మాస్యములు మునుపవలె వైదిక వాక్యముల నన్ను యజింపవలయు. ఇట్లు తపస్సుచే నరములు బయటఁబడి శుష్కించువఱకు నన్నుఁ దపోమయు నారాధించి ఋషిలోకంబైన మహర్లోకంబున కరిగి యచ్చుండి యోని దేహాంతరమందయేని నన్నుఁ బొందును. ఇట్లతికష్టపడి సంపాదించిన మోక్షసాధనమును గామము నిమిత్తమై యుపయోగించు వానికంటె మూఢుఁడెవ్వఁడు? ముదుసలియై దేహమున వణఁకు జనింప నిట్లు నియమములు జరప నశక్తుఁడగువాఁ డాత్మయందు నగ్నుల నారోపించి నాయందుఁ జిత్తంబు నిలిపి యగ్నిని బ్రవేశింపవచ్చు.

## —♦ సన్న్యాసి ధర్మములు * ♦—

కర్మఫల ప్రాప్తంబులైన స్వర్గాద్యూర్ధ్వలోకంబులు నరకసమంబులని విరాగము జనించి నతఁడావల సన్న్యసింపవలయు.

* వానప్రస్థ సన్న్యాసము లీకాలంబున నిషిద్ధములు.

యథావిధి శ్రాద్ధాష్టకాపూర్వకంబుగఁ బ్రాజాపత్యేష్టిచే సన్నద్ధించి సర్వస్వము ఋత్విజున కొసంగి యాత్మయం దగ్నుల నారోపించి నిరపేక్షుండై సన్న్యసింపవలయు. మనల నుల్లంఘించి యితఁడు పరమపదంబుఁ బ్రాపించునుగదా యను నసూయచే దేవతలు సన్న్యసింపఁగోరు నతనికి దారపుత్ర బంధ్వాదిరూపంబులఁ బెక్కులు, విఘ్నంబులు కల్పింతురు. యతి చెడిన గతి లేదనుట యెఱింగి సన్న్యాసి సర్వదా యప్రమత్తుఁడై చరింపవలయు. వలయునేని సన్న్యాసి కౌపీనము మాత్రము ధరింపవచ్చును. దండ కమండలవులు దక్కఁ దక్కిన వన్నియు ననాపత్కాలంబునఁ ద్యాజ్యంబులు. పరిశుద్ధ స్థలముగఁ జూచి యడుగిడవలయు. గుడ్డచే వడియఁగట్టిన నిర్మల జలంబులనే త్రావవలయును. సత్యముచేఁ బవిత్రమైన వాక్యమునే పలుకవలయు. కార్యాకార్యములు చక్కఁగా మనస్సున నాలోచించి కార్యమును మాత్రమే చేయవలయు. వాగ్దండమగు మౌనము, దేహ దండమగు కామ్యకర్మత్యాగము, మనోదండమగు ప్రాణాయామము నను నీ మూఁడు దండములు లేనివాఁడు వేణుదండములు ధరించినంత మాత్రమున యతి గాఁజాలఁడు. అభిశస్త పతితాదుల గృహంబుల విడిచి నాలుగు వర్ణంబుల నైనఁ బూర్వ ముద్దేశింపఁబడని యేడిండ్లలో భిక్ష గ్రహించి లభించినదానితో సంతుష్టుఁడై యుండవలయు. ప్రాణాత్యయ దశయందు మాత్రము వర్ణాంతర భిక్ష గ్రాహ్యంబు. ఇట్లు భిక్షించి తెచ్చిన యన్నంబును నూరి వెలుపలి జలాశయమునకుం గొనిపోయి యచ్చట యాచమించి మౌనియై యెవరైన నన్నంబు యాచించిరేని వారికిఁ గొంతఁ పంచియిచ్చి తక్కిన యన్నమంతయు భుజింపవలయుఁ గాని కొంచమైనఁ బరిహరింపరాదు. ఒంటరియై నిస్సంగుఁడై బాహ్యాంత రింద్రియముల నియమించి యాత్మరతుఁడు నాత్మక్రీడుఁడునై ధీరుండై సర్వము బ్రహ్మాత్మకంబను దృష్టి గలిగి భూసంచారము సేయవలయు. నిర్జనమై నిర్భయమైన ప్రదేశంబున నిలిచి నాయందలి భక్తిచే నిర్మలాశయుఁడై నాతో నభేదంబై [illegible] మాపంబైన యాత్మను జింతించుచుండ వలయు. ఆత్మకు బంధ మేల

కలిగెను ? మోక్ష మెట్లు కలుగు నని జ్ఞాననిష్ఠచే నాలోచింపవలయు. ఇంద్రియ విక్షేపమే బంధహేతువు. దాని నివృత్తియే మోక్షము. కావున మనస్సుతోఁ గూడిన జ్ఞానేంద్రియముల నాఱిటిని నియమించి నాయందు భక్తియుంచి క్షుద్రకామంబుల విరక్తుఁడై యపారాత్మ సుఖము ననుభవించుచుఁ జరింపవలయు. పుణ్యదేశ నదీశైల వనాశ్రమ వతియగు భూస్థలియందును బురగ్రామ వ్రజంబులందును భిక్షార్థంబు ప్రవేశింపవచ్చును. వానప్రస్థాశ్రమంబులందు మరల మరలఁ బ్రవేశింపనగు. శిలావృత్తి ప్రాప్తంబైనవారి యన్నంబుచే మోహనివృత్తియు శుద్ధసత్వము ప్రాప్తించు.

కామంబులందు విరక్తి యెట్లుగలుగునందువేని వినుము. పరిదృశ్యమానంబగు శబ్దాదివిషయజాలములనెల్ల వాస్తవబుద్ధి గ్రహింపరాదు. అవి వినశ్వరంబని యెఱుంగవలయు. అట్లులే పరలోకవిషయములందును నాసక్తుఁడు కారాదు. కావున నిహపరలోక కామసాధకములైన కార్యములెల్ల బొత్తుగ మానవలయు. ఇట్లు విరక్తుఁడగును. బుద్ధీంద్రియ మనఃప్రాణభూత సంఘాత్మకంబైన యీజగంబు జంగమంబైన శరీరంబు ప్రకృతి పరిణామాత్మకంబగుట మాయయని తర్కించి బ్రహ్మాత్మక స్వాత్మరూప సంశీలనపరుండై పూర్వోక్తపద్ధతి దేహంబునం దాత్మాభిమానంబుమాని మరల దేహం బాత్మయని తలంపకయుండవలయు. విరక్తుఁడైన జ్ఞాననిష్ఠుఁడై యుండె నన పేక్షుండైన మద్భక్తుఁడై యుండె మేఖలాజిన దండవేదాదుల నఖలోమ త్రిదండాద్యాశ్రమ చిహ్నంబులనెల్ల వదలి విధినిషేధాదులఁ బాటింపక యథాశక్తి వర్ణాశ్రమధర్మములను భగవత్కైంకర్యబుద్ధి నాచరింపవలయు. బుధుఁడయ్యు మానావమానము లెఱుఁగని బాలునివలెఁ గ్రీడించును. కుశలుఁడయ్యు జడునివలె విద్యావంతుఁడయ్యు నున్మత్తునివలె వేదార్థనిష్ఠుఁడయ్యు నజ్ఞునివలెను జరించును.

దేహవాదరతియుఁ బాషండ చర్యయుఁ గేవల తర్కనిష్ఠయుఁ గారాదు. శుష్కవాదము వివాదములం దేకపక్షావలంబముగూడదు. ఒకరిని భయపెట్టరాదు. తానొకనికి భయపడరాదు. అన్యుల దరు

_క్యంబుల సహింపవలయు. ఎవ్వనినేని నవమానింపరాదు. భూత ములయందుఁ దనయందునుండు నాత్మభిన్న జలపాత్రముల బ్రతిబింబించు చంద్రునివలె నొక్కటేయనియు సర్వభూతములు భగవచ్ఛరీర మగుట నేజంతువులతోనైన విరోధించుట భగవంతునితో విరోధించుటయని యెఱిఁగి దేహార్థమై పశువువలె నెట్టివానితోను విరోధింపరాదు. ఆఁకలివేళ కన్నము లభింపకుండిన విషాదపడరాదు. లభించిన సంతోషపడరాదు. లాభాలాభములు రెండును దైవతంత్రములని ధృతి వహింపవలయు. తత్త్వవిమర్శనార్థము ప్రాణధారణంబు సేయవలయుఁ గావునఁ బ్రాణధారణ మాత్రమునకు వలయు నాహారము గోరవచ్చును. తత్త్వజ్ఞానము వలననే కదా ముక్తుఁడగును. ఇట్టి యాహారకాంక్ష కలయతఁడు యదృచ్ఛాలబ్ధంబైన యన్నంబు శ్రేష్ఠమైనను నీచమైనను భుజింపవలయు. అట్లులే ప్రాప్తంబైన శయ్యయు వస్త్రము నుపయోగించుకొనవలయు. శౌచ మాచమనము స్నానము విధియనియుఁ, జేయకుండినఁ బ్రత్యవాయమనియుఁ దలఁచి చేయరాదు. ఈశ్వరుఁడనగు నేనెట్లు లీలఁగా గార్యములు చేయుచున్నాఁడనో యట్లే జ్ఞానియుఁ దక్కిన నియమములను జేయవలయును. ఇట్టియాచారముగలవానికి భేదప్రతీతి సర్వము నాదాత్మకంబను బుద్ధిచే హతమగు. ఒకవేళ దేహాంతమునఱ కట్టిభ్రాంతి యుండినను దేహముతో నంతమొందు. మద్ధర్మజిజ్ఞాసువుగాక కామంబులెల్ల దుఃఖఫలదాయకంబులని వానియందు విరక్తిజనించి యాత్మవంతుఁడగువాఁడు సన్న్యసించెనేని మునియగు. గురువుంజేరి భక్తిశ్రద్ధలు గలిగి యనసూయకుఁడై బ్రహ్మజ్ఞానము గలుగువఱకు నన్నుఁబోలె గురువు నారాధించుచుఁ బరిచర్య సేయుచుండవలయు. షడింద్రియవర్గంబు జయింపక విషయములం దత్యాసక్తుఁడై యింద్రియ సారథియగు బుద్ధిగలవాఁడై జ్ఞానవైరాగ్య రహితుఁడగు వానికిఁ ద్రిదండము జీవనార్జనమాత్ర ప్రయోజనంబగు. ఇట్లు కడుపు కూటికై సన్న్యాసియగువాఁడు తన్నును దనలోనుండు నన్నును వంచించి ధర్మఘాతకుఁడగుఁ గావున నతఁ డవిపక్వకషాయుఁడై రెండు

లోకంబుల భ్రష్టుండగు. అహింసాశయములు సన్న్యాసి ధర్మంబులు. స్వాత్మ పరమాత్మ యాథాత్మ్యవిమర్శము వానప్రస్థ ధర్మంబు. భూతరక్షయుఁ బంచమహాయజ్ఞంబులు గృహస్థ ధర్మంబులు. ఆచార్యసేవ బ్రహ్మచారిధర్మంబు. బ్రహ్మచర్యము తపము శౌచముసంతోషముభూతదయ ఋతుకాలముల భార్యతో సంగమంబు గావించుట యివి గృహస్థుని ధర్మములు. నన్ను సేవించుట సర్వాశ్రమములవారికి ధర్మంబు. దేవతాంతర భక్తిరహితుండై యన్యప్రయోజనంబు గోరక స్వధర్మంబున నిత్యము భజించుచు సర్వభూతంబులు మదాత్మకంబులని తలఁచువానికి శీఘ్రకాలంబున మద్భక్తిలభించు. అట్టివాఁడ తెగని భక్తిచే సర్వలోక మహేశ్వరుండును సర్వోత్పత్తి స్థితిలయ కారణుండు బ్రహ్మంబునగు నన్ను బ్రాపించు. స్వవర్ణాశ్రమ ధర్మానుష్ఠానముచే నిర్మలచిత్తుఁడగువాఁడు మద్గతి నెఱింగినవాఁడై శాస్త్రజన్య జ్ఞానంబునను నుపాసనాత్మకంబైన విజ్ఞానంబునను విరక్తుఁడై నన్నుఁబొందఁగలుగు. ఇవి వర్ణాశ్రమాచార ధర్మలక్షణము. ఇది మద్భక్తితోఁ గూడి ముక్తిసాధనభూతంబగు. ఇంతకంటెఁ బరమోపాయంబు లేదు. సజ్జనవర్యా! నీవు నన్నడిగిన ప్రశ్నమునకు స్వధర్మయుక్తుఁడు భక్తుఁడునగువాఁడు నన్నుఁ బ్రాపించుమార్గంబు తెలిపితిని. ఇఁక భక్తియోగమున కశక్తుఁడైనవానికి మత్ప్రాప్తిసాధనభూతంబైన యుపాయాంతరముఁ దెలిపెద వినుము. శాస్త్రజన్య జ్ఞానముచేనైనను, శాస్త్రాధికారము లేని పక్షమున సదుపశ్రవణముచే లబ్ధమైన జ్ఞానముచేనైనను సంపన్నుండగువాఁడు సమాహితచిత్తుఁడై కృష్యాదిఫలములవలెనే యజ్ఞాదికర్మఫలము లనిత్యములని యూహించి శరీరము ప్రకృతిపరిణామమగుట తెలిసి జ్ఞానాత్మకమైన యాత్మస్వరూపంబును సత్యసంకల్పుఁడును నుపాయోపేయభూతుఁడును సర్వలోకశరణ్యుఁడును నగునాకు నధీనంబుగ ననుసంధించి యాత్మరక్షాభారంబు నాకప్పగింపవలయు. ఇట్లు భగవంతుఁడే పరమప్రాప్యంబని తలంచు జ్ఞానికి నేనే ప్రాప్యుఁడను, నిష్టుఁడను, బ్రాప్త్యుపాయమను, సమ్మతుఁడను, నన్ను విడిచి స్వర్గముగాని మోక్షముగాని మఱియేదిగాని ప్రియంబు గానేరదు,

శరీరము మాయామాత్రమను జ్ఞానమును, భగవంతుఁడే యుపాయముపేయము నను విజ్ఞానమును, గలవారు పరమశ్రేష్ఠుఁడనగు నన్నునెఱుఁగుదురు. జ్ఞాని నాకుఁ బ్రియతముఁడు కావున నిట్టి నాజ్ఞానము వలన నన్నతఁడు భరింపఁగలుగుచున్నాఁడు. తపము తీర్థము జపము దానము నితర పవిత్రపదార్థములు జ్ఞాన లేశము గలిగించు శుద్ధిని గలిగింపఁజాలవు. కావున జ్ఞానసమేతుండవై స్వాంతరాత్మ నగునన్ను నుద్ధవా ! యోగి జ్ఞానవిజ్ఞాన సంపన్నుఁడవై భక్తిభావితుఁడవై నన్ను నారాధింపుము. జ్ఞానవిజ్ఞాన యజ్ఞముచే నాత్మయందలి నన్ను సర్వయజ్ఞపతిని మును లర్చించి నన్నే పొందిరి. ఉద్ధవా ! ప్రకృతి పరిణామాత్మక శరీరము నిన్నాశ్రయించి యున్నది. దాని త్రివిధవికారములు నుత్పత్తి స్థితి ప్రళయములు శరీరసంబంధమునకు ముందుగాని వెనుకఁగాని లేవు. ఏల యందువేని యీ జన్మాది వికారములు దేహమునకేగాని యాత్మకు లేవు. అసచ్ఛరీరమునకు నెట్టు లాత్మస్వరూపమాద్యంతములు గలదో యట్టులే మధ్యమందును గలదు. కావున దానికి వృద్ధిక్షయములు లేవు. అనిన నుద్ధవుం డిట్లనియె.

ఓ విశ్వేశ్వర! విశ్వమూర్తీ! విశుద్ధజ్ఞానంబును విపులంబును వైరాగ్య విజ్ఞానయుతంబును బురాణంబును మహజ్జన విమృగ్యంబును నగు భక్తియోగ మింకను వివరింపుము. తాపత్రయాభిహతుఁడై ఘోరసంతాప సంయుక్తుఁడై సంసారమార్గంబున సంచరించువానికి నమృత వర్షంబైన భవదీయ చరణకమలాతపత్రంబు తప్ప వేఱొండు శరణంబు లేదు. సంసార బిలంబునఁ బడి కాలసర్ప దష్టుఁడయ్యు క్షుద్రతృష్ణా పీడితుఁడైన వానిని మహానుభావా ! భవద్వైరాగ్య వాక్యామృత ధారాభిషేకంబున దయచేసి సముద్ధరింపుము. అనినఁ గృష్ణుఁ డిట్లనియె.

భారతయుద్ధానంతరము బంధునిధన విహ్వలుండైన ధర్మజుండు బహుధర్మశ్రవణానంతరము మోక్షధర్మం బడుగ నాయనకు భీష్ముండు వచించినదానిని సంగ్రహముగఁ దెలిపెద వినుము. అది జ్ఞానవిజ్ఞాన వైరాగ్య శ్రద్ధాభక్త్యుపబృంహితంబు. శబ్ద స్పర్శ రూప రస గంధ

విసర్గ శిల్ప గత్యుక్తంబు లను తొమ్మిది భావంబులును, నేకాదశేంద్రియములు, పంచమహాభూతంబులు, గుణత్రయంబులు, భావంబులు, దేవమనుష్యాది శరీరంబులందు జ్ఞానైకాకారంబైన యాత్మవస్తువును మద్ధార్యంబులని యెఱుంగుట జ్ఞానంబు. అటుగాక త్రిగుణాత్మకములై స్థిత్యుత్పత్తి నాశంబులుగల దేహములకు నుపాయభూతంబైన మత్స్వరూపం బొండె ప్రాప్యంబని యెఱుంగుట విజ్ఞానంబు. శరీరంబునుండి శరీరమునకు నేది యాదిమధ్యాంతంబులం బోవుచుండు, దేహప్రలయంబున నేది శేషించు నయ్యది సత్తు అట్టి యవికారాత్మస్వరూప విమర్శనంబును జ్ఞానంబగు శ్రుతి ప్రత్యక్షైతిహ్యానుమానము లను ప్రమాణచతుష్టయమందును దత్తత్కర్మఫలంబులందును నేకరూపావస్థితిలేక పరిణామముగా నుండుటయుఁ దారతమ్య ముండుటయు వినాశములగుటయు నెఱింగి విరక్తుఁడు గావలయు. మనకుఁ గానవచ్చు వానివలెనే కానరానివి బ్రహ్మాది స్తంబపర్యంతముగల సమస్తము శ్రుత్యాది ప్రతిపన్నంబైన కర్మము నశ్వరమనియుఁ గావుననే యమంగళమనియు జ్ఞాని యెఱుంగు. భక్తియోగంబు మున్నే వివరించితిని. అయినను మరల భక్తికిఁ బరమకారణంబు వచింతు. మదీయామృతకథాశ్రవణాదరణము, మద్గుణకీర్తనంబు సదా చేయుట, మత్పూజయందు నిష్ఠ, స్తోత్రంబుల నన్ను స్తుతించుట, మన్మందిర సమ్మార్జనసంశోధనోపలేప క్రియారూపంబైన పరిచర్య, సర్వాంగంబుల వందనంబు * మద్భక్తపూజ, సర్వభూతంబులందు మదాత్మక బుద్ధి, మదారాధనోపకరణంబులైన తులసీపుష్పాదుల నార్జించు కార్యము, వాక్కున మద్గుణ వర్ణనము. మనస్సునాయంద ర్పించుట, కామవివర్జనము, నానిమిత్తముగ ధనవ్యయము,

---

* శ్లో. పాదాంగుళీభ్యాం జానుభ్యాం, శిరసా చావనీం స్పృశన్
బద్ధాంజలి ర్నమస్కుర్యా త్పంచాంగ స్స ఉదీర్యతే.
నిధాయ దండవ ద్దేహం ప్రసార్య చరణౌ కరౌ
బద్ధ్వా ముకుళవత్పాణీ ప్రణామో దండసంజ్ఞితః.
పాదౌ శిర స్తథాహస్తౌ నికుంచ్య ముకుళాకృతీ
మనోబుద్ధ్యభిమానైశ్చ, ప్రణామోఽష్టాంగసంజ్ఞితః.

చందనాది భోగత్యాగము, సుఖత్యాగము, నాదిగా వైదికకర్మంబులును, దానము, హోమము, సత్కథాశ్రవణము, నేకాదశ్యుపవాస వ్రతము, తపస్సు లోనగు వ్రతములన్నియు మదర్థముగ నాచరింపవలయు. ఆత్మనివేదనము లోనగు నిట్టిధర్మములచే నాయందు భక్తి యుదయించును. అట్టివానికి నేపురుషార్థము దుర్లభము కాఁగలదు? సత్త్వసహితంబును, శాంతంబును, నగు చిత్తము నాయందర్పించువానికి వైరాగ్యయుక్తంబగు ధర్మజ్ఞానములు నైశ్వర్యంబు లభించు. అటుగాక రజస్తమోయుక్తంబగు మనస్సును నింద్రియముల వెంటఁ బోనిచ్చిన విపరీతఫలంబు లొందవు. ధర్మంబు మద్భక్తి కారణంబు. సర్వాత్మలు పరమాత్మతత్త్వంబని తెలియుంగుట జ్ఞానంబు. శబ్దాది విషయంబుల నాసక్తిమానుట వైరాగ్యంబు. అణిమాదు లైశ్వర్యములు, అనిన నుద్ధవుం డిట్లనియె.

—♦ శ్రీకృష్ణుం డుద్ధవునకు యమనియమలక్షణముఁ దెలుపుట. ♦—

మధుసూదనా! యమనియమము లెన్నివిధములు? శమదమంబు లెట్టివి? తితిక్షాధృతు లెట్టివి? దానము తపము శౌచము సత్యము ఋతము నన నేమి? త్యాగ మెట్టిది? ఇష్టధనమెద్ది? యజ్ఞమెద్ది? దక్షిణయేది? పురుషులకు బలమెద్ది? దయాలాభము లెవ్వి? పండితుఁ డెవఁడు? మూర్ఖుఁ డెవ్వఁడు? మార్గమెద్ది? ఉత్పథం బెయ్యది? స్వర్గమెద్ది? నరక మెద్ది? బంధు వెవ్వఁడు? గృహమన నేది? ధనవంతు డెవ్వండు? దరిద్రుఁ డెవ్వఁడు? కృపణుఁ డెవ్వఁడు? ఈశ్వరుఁ డెవ్వఁడు? ఈ ప్రశ్నల కుత్తరమిమ్ము. వీనికి విరుద్ధము లెవ్వి చెప్పుము? అనిన భగవంతుఁ డిట్లనియె.

అహింస, సత్య, మస్తేయ, మసంగము, హ్రీ, యసంచయ, మాస్తిక్యము, బ్రహ్మచర్యము, మౌనము, స్థైర్యము, క్షమ, యభయము, నను నీ పండ్రెండు యమములు. శౌచము, జపము, తపము, హోమము, శ్రద్ధ, యాతిథ్యము, మదర్చనము, తీర్థాటనము,

పరోపకారము, తుష్టి, యాచార్యసేవ, యివి పండ్రెండును నియమములు. ఈ యమనియమము లాచరించువానికిఁ గామంబులు ఫలించు. నాయందలి నిష్ఠాబుద్ధి శమంబు. ఇంద్రియజయంబు దమంబు. దుఃఖసహనంబు తితీక్ష. జిహ్వోపస్థజయము ధృతి. భూతద్రోహత్యాగము శ్రేష్ఠదానము. కామత్యాగము తపస్సు. సహజంబులగు క్షుత్పిపాసల జయించుట శౌర్యంబు. తారతమ్య జ్ఞానరాహిత్యము సత్యము. సూనృతభాషణము ఋతము. కర్మములందుఁ గర్తృత్వాభిమానము మానుట శౌచము. ఫలత్యాగంబు త్యాగంబు. ఇష్టధనంబు మద్భక్తికారణ ధర్మంబు. భగవత్తముఁడనైన నేన యజ్ఞంబు. జ్ఞానోపదేశంబు దక్షిణ. ప్రాణాయామం బుత్తమ బలంబు. మదీయైశ్వర భావంబు భగంబు. మద్భక్తి యుత్తమ లాభంబు. ఆత్మభేదాభావ భావంబు విద్య. నిషిద్ధకర్మంబులందు హేయబుద్ధి హ్రీ. నైరపేక్ష్యాది గుణములే యలంకారము. సుఖదుఃఖములు మనస్సునకుఁ దగులనియకుండుట సుఖము. కామసుఖాపేక్ష దుఃఖము. బంధమోక్ష విదుఁడు పండితుఁడు. దేహాదులం దహంబుద్ధిగలవాఁడు మూర్ఖుఁడు. మద్విషయజ్ఞానంబు మార్గంబు. శబ్దాది విషయప్రావీణ్యంబు కుమార్గంబు. సత్త్వగుణాభివృద్ధియే స్వర్గము. తమోగుణాభివృద్ధి నరకము. నేనగు గురువు బంధువు. మానుష్యశరీరంబు గృహంబు. సద్గుణాధికుఁడు ధనికుఁడు. అసంతుష్టుఁడు దరిద్రుఁడు. అజితేంద్రియుఁడే కృపణుఁడు. గుణములం దసక్తుఁడగువాఁ డీశ్వరుఁడు. గుణసంగుఁ డనీశ్వరుఁడు. ఉద్ధవా! నీ ప్రశ్నల కన్నిటికి నిట్లు చక్కఁగఁ బ్రత్యుత్తర మిచ్చితి. గుణదోషవిషయమునఁ బెక్కులు మాటలేల ? గుణదోష దృష్టిదోషములను రెంటిని వదలుట గుణము, అనిననుద్ధవుం డిట్లనియె.

అరవిందాక్షా ! గుణదోష దృష్టిదోషములనియు, నారెంటిని వదలుట గుణమనియు యుపదేశించితివి. భవదీయశాసనరూపములైన వేదము లీకార్యము చేయవలయునని యీకార్యము చేయరాదని విధినిషేధములు పాటించుచున్నవి కదా ? అంతియకాక యనులోమ ప్రతిలోమ జాతులను గల వర్ణాశ్రమముల భేదములు ద్రవ్య దేశ

వయః కాలభేదములు స్వర్గనరకములు లోనగువానియందును గుణదోషములు కలవుకదా. ఇట్టి వీనియం దెల్ల గుణదోషదృష్టి లేకుండి నచో విధినిషేధలక్షణంబై భవదీయ వాక్యంబైన వేదంబులు జనులకు నెట్లు పురుషార్థ సాధకంబగు. లౌకికాలౌకికములందును, సాధ్యసాధనములందును, పితృదేవ మనుష్యులకు నిర్దోషములైన నేత్రములు నీవేకదా? గుణదోష భేదదృష్టి భగవదాజ్ఞారూపంబైన వేదమువలనఁ గలిగెఁగాని స్వతంత్రముగఁ గాదుకదా? అట్లుండ నీవిప్పుడు తద్విరుద్ధముగ గుణదోషదృష్టి మానుమనుట యెట్లో యని నా మనస్సు భ్రమచెందుచున్నది. అనిన భగవంతుఁ డిట్లనియె.

నరుల శ్రేయస్సు గూర్పఁగోరి నేన జ్ఞానకర్మ భక్తి యోగంబులను నుపాయంబుల వచించితి. ఇవి తప్ప వేఱొండుపాయంబు లేదు. కర్మఫలంబులు దుఃఖాత్మకంబులని వానియందు విరక్తి జనించి యాకర్మముల వదలినవారికి జ్ఞానయోగము. ఆ కర్మములం దుత్సాహము గలవారికిఁ గర్మయోగము. ఏదియో యదృష్టవశమున మత్కథాశ్రవణాదులందు శ్రద్ధగలవాఁడై విరక్తుఁడునుగాక యత్యాసక్తుఁడునుగాక యుండు వానికి భక్తియోగంబు మోక్షఫలదంబు. ఎంతదాఁక మిక్కిలి విరక్తి పుట్టకుండు, నెంతవఱకు మత్కథా శ్రవణాదులందు శ్రద్ధ పొడమకుండు నంతవఱకు వర్ణాశ్రమోచిత కర్మము లాచరించు చుండవలయు. మోక్షమువఱకు వాసనామాత్రాను వృత్తియుండుట వలన జన్మాంతమువఱకు ఫలాపేక్ష లేక కర్మము లాచరించుచునే యుండవలయు. కావున మోక్షప్రాప్తివఱకు స్వధర్మ నిష్ఠుఁడై పంచ మహాయజ్ఞంబు లాచరించుచుఁ గోరికలు వదలి నన్నుఁ బూజించుచు, ఫలకాంక్షతోడఁ గర్మము లాచరింపక యుండునేని యతనికి నరకము లేదు. స్వర్గమును లేదు. అట్టివాఁడు దేహవంతుఁడై యుండియు స్వధర్మస్థుఁడు పాపరహితుఁడు శుచియు నగుటచే నతనికి విశుద్ధ జ్ఞానం బొండె, వాని యదృష్టవశమున నాయందలి భక్తియొండె జనించు. స్వర్గ నరకములు జ్ఞాన భక్తి సాధనములు గావు. కావున స్వర్గవాసుల నరకవాసులును నీలోకంబున జనింపఁ గోరుదురు. జ్ఞాన భక్తు

లీలోకంబునందే సాధ్యంబులు. కావున బుద్ధిమంతులకు వారలు నరకము గాని స్వర్గము గాని కోరరాదు. దేహావేశంబున మోహంబు ప్రాప్తించును, గావున నీలోకంబును గోరరాదు. ఎఱుకగలవాఁడు మరణంబు ప్రాపించుటకు మున్న యర్థసిద్ధికరం బీదేహంబని యెఱింగి యప్రమత్తుఁడై మోక్షమునకై యత్నింపవలయు. తాము గూండ్లు కట్టుకొనిన వృక్షంబులు ఛేదింపఁ బడుటగని యా చెట్లను వదలి పక్షులాశమాని సుఖముగ నెగిరిపోవుటగని జీవుఁడును దానుండు శరీరమును యముఁడు ఛేదింప నిస్పృహుఁడై నశ్వర దేహసంబంధంబు వదలి సుఖముగఁ బోవు ప్రయత్నంబు గావింపవలయు. అహోరాత్రములచేత నాయుస్సు క్షీణమగుట యెఱిఁగి భయమున వణఁకుచు నిహపరలోక సంగరహితుఁడై వైషయిక సుఖ వ్యాపార రహితుఁడై పరమపురుషుండనైన నన్ను నెఱిఁగి ప్రకృతి సంబంధంబు వలన విముక్తుఁ డగును. సర్వ ఫలప్రాప్తికి మూలంబును మిగుల దుర్లభంబయ్యు సులభముగా లభించినదియు, సర్వ సాధనక్షమంబు, గురువను కర్ణధారుఁడు కలిగినదియు నగు నీ దేహమను నావను ననుకూల వాయువు నేనై నడపుచుండఁగా భవాబ్ధిఁ దరింపఁజేని వాఁ డాత్మహంత యగు. కామ్యకర్మంబులందు నిర్విణ్ణుఁడును, తత్ఫలముల యందువిరక్తుఁడును, నియమితేంద్రియుఁడునునై యోగి యభ్యాసముచే మనస్సును నిశ్చల పఱుపవలయును. పరిభ్రమించు మనస్సు శీఘ్రమున నిలుకడ నొందదేని యప్రమత్తుఁడై యది పోవు మార్గముననే తాను బోయి దానిని వశపఱుచు కొనవలయునుగాని దాని యిష్టము వచ్చినట్లే విడిచి వశపఱుచుకొనక యుండరాదు. జిత ప్రాణుండు జితేంద్రియుండునై సత్త్వ సంపన్నంబైన బుద్ధిచే మనస్సును మెల్ల మెల్లగ దనవశము చేసికొన వలయును. అశ్వధారకుఁడు దుష్టాశ్వమును దోలుత దాని యిష్టప్రకారము పోనిచ్చి మెల్లమెల్లగఁ ద్రోవకుఁ దెచ్చుకొనునట్లు పురుషుఁడును మనస్సు ననుసరించి పోయి క్రమ క్రమముగఁ దనకు వశపఱఁ చేసికొన వలయును. ఇది యే పరమయోగము. మహదాది పృథివ్యంతములైన సర్వభావములు

ప్రకృతిచేఁ గ్రమముగ నుత్పన్నములైనవనియు, మరలఁ బృథివి మొదలు క్రమక్రమముగఁ బూర్వమువానిలో లీనమై పోవుననియు నిట్లు సృష్టిలయములు పలుమాఱు మాటికి మాటికి చింతించుటచేత సంసారమున విరక్తి జనించిన యనురోధ మార్గవేదికిఁ గాని తత్త్వ వేదికిఁ గాని మనోవిషయ ప్రావణ్యంబు వదలిపోవును. యమాది యోగ మార్గమునఁ గాని తత్త్వ విమర్శనాత్మకమైన యన్వీక్షికీ విద్యచేఁ గాని మదీయార్చనా ధ్యానాదులచేఁ గాని* పరమాత్మనగు నన్ను స్మరించిన యెడ దౌరాత్మ్యంబు చెడునుగాని దానికిఁగా కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తముల శ్రమపడవలసినది లేదు. పురుషునకు స్వ స్వవర్ణాశ్రమానురూప ధర్మమే గుణము. తద్విరుద్ధవర్తనమే దోషము. కావున శూద్రునకు బ్రాహ్మణధర్మంబు, నవిరక్తునకు సన్న్యాసిధర్మంబు, దోష కారణంబు. విరక్తబ్రాహ్మణునందే సన్న్యాసంబు గుణంబగు. గుణ దోష నిశ్చయమిట్టిది. స్వభావముచే నశుద్ధములైన కామ్యకర్మములను నశుద్ధ్యావహంబులైన సంసర్గములను ద్యజింపఁ జేయుచు నిచ్ఛతో గుణదోష విధానముచే నియమము కల్పింపఁ బడియె. అట్లుగాక వేదములందు సర్వకర్మములు త్యాజ్యములని చెప్పిన యెడఁ బామరుల కది యసాధ్యంబగుఁ గదా. అనధికారులు కర్మములు వదలి భ్రష్టులగుదురు. గుణదోష దృష్టి దోషములనియు నుభయ వర్జనంబు గుణమనియుఁ జెప్పుట మోక్షాపేక్ష గలవారి విషయమయియే కాని భోగాపేక్ష కలవారి విషయమునఁ గాదు. మత్కథలయందు శ్రద్ధగలవాఁడు సర్వ కామ్యకర్మములందువిరక్తుఁడై కామ్యకర్మంబులు దుఃఖాత్మకంబులని యెఱింగియు వానిని విడువ సమర్థుఁడు గాకుండు నేని వానిని నిందించుచునైన నాచరించుచు నన్ను శ్రద్ధాళువు దృఢ నిశ్చయుఁడునై ప్రీతితో భజింపవలయు. ఇట్లు భక్తియోగంబుచేనన్ను నిత్యంబు సేవించు మునిహృదయంబున నే నుండుటచేత నతని హృదయస్థ విషయాభిలాషలన్నియు నశించుఁ అఖిలాంతరాత్ముఁడనై హృదయమందుండు నన్ను దర్శించువానికి హృదయగ్రంథి భిన్నంబగు

---

* అన్నిటికంటె నిదియే సులభోపాయము, [illegible]

సర్వసంశయంబులు నష్టంబగు. వాని కర్మములెల్ల క్షయించు. గావున మద్భక్తి యుక్తుండై నాయందు నిరతిశయ ప్రీతియుంచు యోగికిఁ బ్రకృతి వివిక్తాత్మోపాసనాత్మకంబైన జ్ఞానంబుగాని వైరాగ్యంబు గాని యింతకంటె శ్రేయస్కరంబు గాదన నిఁకఁ గర్మ యోగము మాట యేల? యజ్ఞాది కర్మములచేతను శాస్త్రీయ కాయక్లేశాది తపములచేతను జ్ఞానవైరాగ్యములచేతను యోగముల చేతను నితర పుణ్య కర్మములచేతను నేదేది లభించు నవి యన్నియును స్వర్గకైవల్యములును, నాధామంబును సర్వంబును మద్భక్తి యోగంబుననే నా భక్తునికి లభించు. సాధువులు ధీరులు మదేకాంత భక్తులు నగు వారు నేనై యిచ్చెదనన్నను కైవల్యము గాని మోక్షముగాని కోరరు. దేనియందును నపేక్ష లేకుండుటే గొప్ప శ్రేయస్సందురు, కావున నిరపేక్షుఁడు నాశారహితుఁడు నగు వానికి నా భక్తి లభించు, నాయందేకాంతభక్తి గలిగిన సాధువులకు సమచిత్తులకు గుణ దోషముల కతీతంబైన ధర్మంబుననుండు వారికి గుణదోషజ్ఞాన మాత్రోద్భవంబులైన రాగద్వేషగుణంబులు కలుగవు. ఈ విధముగ నేనుపదేశించిన మార్గంబుననుండు వానికి సుఖావహంబై మదీయంబైన పరబ్రహ్మస్థానంబు లభించు నని భగవంతుఁడు మఱియు నిట్లనియె.

—♦శ్రీకృష్ణుఁ డుద్ధవునకు ద్రవ్యాది గుణదోషములఁ జెప్పుట♦—

మత్ప్రాప్తికినుపాయంబై భక్తిజ్ఞాన కర్మాత్మకంబైన మదీయ ప్రాప్త్యుపాయంబు వదలి క్షుద్రంబులైన కామంబులఁ జలంబులైన యింద్రియంబులచే సేవించు చుండునట్టివాఁడు సంసారంబునఁ బడి యుండు. తమ తమ యధికారంబులందలి నిష్ఠయే గుణము. విపర్యయమే దోషము. గుణదోష వివేచనంబున నిది నిశ్చయము. దేశ కాల ద్రవ్య కర్తృ మంత్ర కర్మరూప పదార్థములు పంచభూతాద్యాత్మకంబు లగుటచే సమాకారంబులు వహించియుండువాని యందును, నిది యోగ్యమా యయోగ్యమా యను సందేహమూలమున స్వాభావిక ప్రవృత్తినిఁ బ్రతిబంధించుటకై యిది శుద్ధ మిది యశుద్ధమని గుణదోషంబులు విధింపఁబడియె.

ధర్మార్థము లోకవ్యవహారార్థము, శరీరసంరక్షణార్థము, స్వాధికారాత్మక ధర్మరూపభారమును వహించువారికై శుద్ధ్యశుద్ధి విభాగపూర్వకమైన యాచారము నాచేఁ జెప్పఁబడియె. బ్రహ్మ మొదలు స్థావరములవఱకుఁ గల సర్వప్రాణులు భూజలాగ్ని వాయ్వాకాశములను బంచధాతువులతోడను సంతరాత్మయగు నాతోడను గూడి యున్నవి. ఇట్లు బ్రహ్మాది స్థావరపర్యంతమగు భావములన్నియు సమానాధికారములై యున్నను దచ్ఛరీరారంభకంబులైన భూమ్యాదిభూతంబులందు వేఱువేఱు నామరూపములను దేవతలని మనుష్యులని యిట్లు స్వార్థసిద్ధి కుపయోగించు నధికారనిష్ఠకై విధాత కల్పించెను. దేశకాల ద్రవ్యకర్తృ మంత్రప్రభావములకు విపరీతాధికార వర్జముచే స్వాధికారముల ననుష్ఠించుటకై గుణదోషంబులు విధింపఁబడియె. జింకలులేని దేశములును, బ్రాహ్మణభక్తులులేని దేశములును నశుద్ధములు. జింకలుండినను సౌవీరకీకట మ్లేచ్ఛ భూయిష్ఠదేశములు మాషర దేశములు నశుద్ధములు. ద్రవ్య సంపత్తిచేఁ గాని స్వతస్సిద్ధిఁ గాని గుణవంతంబైన కాలము శుద్ధము. ద్రవ్యాలాభంబుచేఁగాని రాష్ట్ర విప్లవాదులఁ గాని యసమాప్తకర్మం బశుద్ధంబు. మృజ్జలాతపాగ్న్యాది ద్రవ్యంబులచేతను, శాస్త్రవచనంబులచేతను, బ్రాహ్మణవాక్యంబులచేతను, సంస్కారములచేతను, గాలముచేతను, గొప్పకొలఁదులచేతను, ద్రవ్యములకు శుద్ధ్యశుద్ధులు కలుగుచుఁ దొలఁగుచుండును. ఎట్లంటివేని వస్త్రాదులు మూత్రస్పర్శముచే నశుద్ధములగు. పుష్పాదులు జలప్రోక్షణమున శుద్ధములగుఁగాని చలిఁదియన్నము కానేరదు. మూచూచిన పుష్పము లశుద్ధములు. చండాలాదులు స్పృశించినను నదుల మహత్త్వమువలన నానీరు శుద్ధమే అల్పమగుటచే వీథీజల మశుద్ధము. అటులే శక్త్యశక్తులను బుద్ధిని సమృద్ధిని శుద్ధియు నశుద్ధియుఁ గలుగు. గ్రహణసమయంబుల శక్తిగలవాఁడు స్నానముచే శుద్ధుఁడగు. అశక్తుఁ డశక్తిచేతనే శుద్ధుఁడు. కనినమృట్టు వినినసంటన్నట్లు పుత్రజన్మాదులందుఁ బదిదినములకావల వినినను శుద్ధుఁడే. కాల మతిక్రమింపలేదని యెఱిఁగెనా యశుద్ధుఁడే. భగవం

తుని యుత్సవములందు స్పృశింపరానివారిని స్పృశించినను నశుద్ధుఁడు కాఁడు. ఇట్లశుద్ధాత్మక ద్రవ్యములు దేశకాల వయశ్శక్తి ద్రవ్య ద్రవ్యప్రయోజనావస్థలఁబట్టి శుద్ధములగుచుండు. మఱియు ధాన్యములు దారువులు నస్థులు తంతువులు క్షీరాది రసములు కంచు లోనగు తైజసములు చర్మములు కాలవాయ్వగ్ని మృజ్జలంబుల శుద్ధాశుద్ధంబు లగుచుండు. ఎట్లన: ధాన్యము లెండగాలులచే శుద్ధములగు. దారుపాత్రంబులు మృత్తోయంబుల శుద్ధములగు. గజదంతములు లోనైనవి యెండగాలుల నెండించిన శుద్ధములగు. నూలు ప్రోగులు జలములచే శుద్ధములు.* క్షీరాదులు కేశాదిసంస్పర్శముచే దుష్టములైనచోఁ గ్వాథంబుఁ గాఁచిన శుద్ధములగు. కంచు లోనగు వానికి నగ్నివలన శుద్ధి. చర్మములకుఁ దైలమువలన శుద్ధి. పృథివీసంబంధ వస్తువులు సంయోగాసంయోగంబుల శుద్ధములు. ఎట్లన: అన్నంబున వెంట్రుకలు తీసివైచి నేయివైచిన శుద్ధమగు. అమేధ్యలిప్తంబైన తామ్రవస్త్రాదికంబు లాగంధముపోవు యథాప్రకారమగు వఱకుఁ జింతపండునీళ్లు లోనగువానిచేఁ గడిగిన శుద్ధములగు. స్నాన దాన తపోవయో వీర్యసంస్కారకర్మములచేతను మదీయ స్మరణంబునను నాత్మశుద్ధియగు. ఇట్లు శుద్ధుఁడయియే ద్విజుఁడు కర్మమాచరింపవలయు. ప్రయోగజ్ఞాన మాచార్యునివలనఁ దెలిసికొనుటయే మంత్రమునకు శుద్ధి. నాకు సమర్పించుటే కర్మమునకు శుద్ధి. ఇట్లు దేశ కాల ద్రవ్యకర్తృ మంత్రకర్మములచే శుద్ధమైననే ధర్మము. అటుగాకుండిన నధర్మము. కొన్నిట విశేషవిధిబలమున గుణము దోషమగు. దోషము గుణమగు. విశేషశాస్త్రగుణదోషనియమము సామాన్యశాస్త్రప్రాప్తగుణదోషవిభాగమును బాధించు. స్నానముచేయక భుజించుట దోషమైనను రోగిపట్ల గుణమేయగు: హింస దోషమైనను యజ్ఞంబుల గుణమగు. పతితు లొకరితో నొకరు సంభాషిం

*ప్రత్తితో నైన వస్త్రములు తడిపి యారవేసిన సూర్యోదయమగువఱకే శుద్ధము. పట్టు వస్త్రములు పదిదినములవఱకు శుద్ధము. వెంట్రుకలతో నైన కంబళ్లు మొదలైనవి యెంసకువైచి జాడించిన శుద్ధము.

చుట పాతకంబుగాదు. అపతితులు పతితులతో సంభాషించుట దోషము. అశ్లేసురాపానము జాతిచేతను గర్మముచేతను బతితులైన వారలయెడ దోషావహముగాదు. శబ్దాది విషయసంగము సర్వప్రాణులకు జన్మసిద్ధమైనను నది నాశము చేయక మానదు. నరుని మనస్సు దేనిదేనినుండి నివర్తించు దానిదానినతం డంతటితో విడువవలయును గాని మరల స్మరింపరాదు. ఈ పరమధర్మము నరులకు శోకమోహ భయములణఁచి క్షేమంబొసఁగును. శబ్దాది విషయగుణముల ధ్యానించుటచేఁ బురుషులకు వానియందు సంగము కలుగును. సంగము వలనఁ గామము జనించు. కామమువలనఁ గలహము గలుగును. దానివలన దుస్సహ క్రోధము కలుగును. క్రోధమువలనఁ గార్యాకార్య వివేకాఽభావము కలుగును. దానివలనఁ జేతనాహీనుఁడగు. చేతనాహీనుఁడు మూర్ఛితునట్లు మృతునట్లులు శూన్యుఁడగు విషయసంగులు విషయాభినివేశముచే వృక్షములవలెఁదమ్ము నెదిరి నెఱుఁగక కొలిమితిత్తివలె శ్వాసముపుచ్చుచు స్వార్థభ్రంశులై వ్యర్థులగుదురు. కావున విషయసంగ మింతటి యనర్థకంబని తెలియుము. అయినచో వేదమేల విషయసంబంధ సుఖసాధనములగు యజ్ఞాదుల బోధించు నందువేని యజ్ఞమువలన స్వర్గము కలుగునని ఇత్యాది ఫలములు కలుగునని చెప్పునేకాని వేదము లాకర్మములే పరమ పురుషార్థములని చెప్పుటలేదు. మోక్షసాధనములందు రుచికల్పింప నవి చెప్పఁబడెను. ఈలోకమునఁ గానవచ్చు సుఖములకంటె స్వర్గసుఖము శ్రేష్ఠము. దానికంటె మోక్షసుఖ ముత్తమ మనుటఁ జక్కెరలోఁ బొదిగి మందుతినుపించునట్టులని యెఱుఁగుము. జన్మప్రభృతి స్వబంధహేతువులగు కామంబులందును నాయురింద్రియ బలాదులందును బుత్రమిత్ర కళత్రాదులందును నాసక్తమనస్కులై నగ్రములై స్వల్పశ్రేయంబున సజ్జులై పాపమార్గంబుల సంచరించుచుఁ దఘంబున మునిఁగియుండువారలను, వేదము మరల వానియందే ప్రవేశింపుఁడని బోధించునే? అటుచేసిన వేదంబెట్టు లాప్తంబగు? కావున వేదమ్ము లాపాతరమణీయంబై [illegible] ఫలశ్రుతిని బోధిం

పరు. కామాసక్తులు కృపణులు లుబ్ధులు నగువారు ఫలకాములై పుష్పములయందు మనస్సునిల్పి యగ్నిసాధ్య కర్మాభినివేశముచే లుప్తవివేకులై పొగలయందు గాసిపడుచుఁ బ్రత్యగాత్మ స్వరూపంబు నెఱుఁగరు. మంచులోఁ జిక్కినవాఁడు సమీపమందుండువానిని గాననట్లు కర్మవిధిప్రేరితులు నింద్రియతర్పణపరులు నగువారు నేను దమ హృదయమందుండినను నన్నుఁ దెలియలేరు. దురవగాహం బగు నామతం బెఱుంగక విషయాత్మకులు వృథా పశువులహింసించి పరలోకంబున మరల వానిచే హింసింపఁబడుచున్నారు. మాంసభక్షణమం దిచ్ఛగలవారిచే యజ్ఞములు విధింపఁబడెనని నాస్తికు లందురు. హింసావిహారులు మాంసభక్షణసుఖమునకై పశువుల హింసించి పితౄాదిదేవతలను భూతపతులను యజింతురు. ఇట్టి ఖలులు యాగములను నెపమున జీవహింస గావింతురు. ఆస్తికులును బ్రకృతి పరిణామాత్మకమగుటచేఁ గలవలె ననిత్యమై శ్రోత్రమాత్రప్రియంబైన యిహపరలోకంబులను, నితర కామంబులను గోరి కామసాధక కర్మంబుల ధనంబు వెచ్చింతురు. ఇట్టివారు ధనార్జనాసక్తి నున్నధన మింట వదలి సముద్రయాత్ర సలిపి యందు మరణించియో నష్టపడియో యుభయభ్రష్టులగు వర్తకుల యట్టివారు. రజస్సత్త్వతమోనిష్ఠులును రజస్సత్త్వతమ ఆహారాదుల సేవించువారును దక్షిణయుక్తులును నింద్రాదిదేవతల నుపాసింతురుగాని వారినైన యథావిధి భగవదాత్మకబుద్ధి సేవింపరు. నన్నును యథావిధి సేవింపరు. యజ్ఞములచే దేవతల నారాధించి స్వర్గమున సుఖించి యాపుణ్యావసానంబున మరల భూమియందు మహాగృహపతులుగను మహాకులులుగాను జన్మింతురు. ఇట్లు పుష్పితవాగ్వ్యాక్షిప్త మనస్కులు నగు నరులు దురభిమానులు నతిస్తబ్ధులునై యుండువారికి నావార్తయు రుచింపదు. వారు సంసారమందే మునుఁగుచుఁ దేలుచుందురు. కర్మకాండ దేవతాకాండ జ్ఞానకాండములని ముత్త్రివిధములుగాఁగల వేదములు పరబ్రహ్మమును బోధించునవి. వేదములవలె ఋషులు పరోక్షవాదులు కావున నస్ఫుటంబైన తదభిప్రాయం బందఱకు సులభంబుగ గ్రహింప

సాధ్యపడదు. ఇట్టి పరోక్ష భాషణమే నాకుఁ బ్రియము. శుద్ధాంతః కరణులుమాత్రమే వేదతాత్పర్యంబులు చక్కఁగ గ్రహింపఁగలుగు దురు. అనధికారులు తగరు. వృథా కర్మత్యాగమున ననధికారులు భ్రష్టులగుదురు. కావున ఋషుల వాక్యములు వారివారి యోగ్య తకుఁ దగినట్లు వారివారికి బోధపడుచుండును. ప్రాణేంద్రియ మనో మయంబైన శబ్దబ్రహ్మంబు మిగుల దుర్బోధంబు. అనంతంబు. అపా రంబు. సముద్రమువలె నగాధంబు. జ్ఞానవీర్యతేజః ప్రభృతులగు ననేకశక్తులఁగలిగి తామరతూడులయందలి తంతువువలెఁ జెవులు మూసికొనినచో లోన సూక్ష్మముగ వినవచ్చు నాదముస్వరూపమున భూతములందు గోచరించుచున్నది. సాలెపురుగు హృదయంబునుండి ముఖద్వారమునఁ జంతువులను వెలికిఁ బ్రసవింపఁజేయునట్లు నాభికి నురమునకు నడుమనుండు వివరద్వారమున స్పర్శరూపమగు మన స్సుతోఁగూడి వేదమయుఁడు నమృతమయుఁడనను దేహేంద్రి యాది ధారణ సమర్థుఁడగు భగవంతుఁడు వాగింద్రియమును బొంది బ్రహ్మాత్మిక వాక్కును సృజించుచున్నాఁడు. ఈవాక్కు బహుమార్గ ముల నోంకారమువలన నచ్చులు హల్లులుగనై విచిత్రభాషలరూప మున విస్తారమైన నొకదానికన్న వేఱొకటి నాలుగేసి యక్షరము లెక్కువకలదియునైన ఛందస్సులచే నపారమై స్వవ్యాపారోపరతివలన నుపశమించు గాయత్రి యుష్ణిక్కనుష్టుప్పుజగతి యత్యష్టియతిజగతి విరాటులోనైనవి ఛందస్సులు. ఇట్టి వేదము దేనిని విధించు. నేమి తత్త్వము బోధించు, దేనిని వికల్పముగ విధించు, దేనిని సామాన్య ముగ విధించు, నీతాత్పర్యము నేనుదప్ప వేఱొకఁ డెఱుఁగఁడు. ఈ వేదములు నన్నే మద్రూపారాధన రూపధర్మమునే విధించు. నన్నే యభిధావృత్తిచేఁ బ్రతిపాదించుచు వికల్పమున నన్నే ప్రతిపాదించు. సర్వవేదార్థము నన్నే బోధించు. వేదము నన్నాశ్రయించి దేవ మనుష్యభేదము ప్రకృతిమాత్రగతమని బోధించి దానిని జీవస్వరూప మందు బ్రతిషేధించి కడపట నాయందుఁ బ్రశమించుచున్నది.

## — శ్రీకృష్ణుఁ డుద్ధవునకుఁ దత్త్వసంఖ్య తెలుపుట. —

అనిన నుద్ధవుం డిట్లనియె. విశ్వేశ్వర! తత్త్వము లెన్ని? కొందఱు ఋషులు తొమ్మిదియని పదునొకండని యైదని యనిరి. నీవు మూఁడని చెప్పితివి. ఆయుష్మంతుఁడా! కొంద ఱిరువదియాఱందురు. కొంద ఱిరువదియేనందురు. కొంద ఱాఱని కొంద ఱేడని కొందఱు తొమ్మిదని కొందఱు నాలుగని కొందఱు పదునొకొండని చెప్పుదురు. మఱికొందఱు పదునేడని కొందఱు పదునాఱని కొందఱు పదుమూఁడని ఋషులు వేఱువేఱు తత్త్వములను బరిగణించిరి. ఇందేది సత్యమో నిశ్చయించి చెప్ప సర్వజ్ఞుఁడవైన నీవ యర్హుఁడవు. అనిన భగవంతుఁ డిట్లనియె.

బ్రాహ్మణులు వచించు నన్ని సంఖ్యలకు యుక్తులు గలవు. ఒక్కొక్కపక్షము గైకొనిన నొక్కొక్కలెక్క వచ్చుచున్నది గాని తత్త్వములందు హెచ్చుతగ్గులు లేవు. అవి నియతములు. కావున నీవు పరస్పర విరుద్ధమని చెప్పువానియందే విరుద్ధమును లేదు. వివిధవాదహేతువులు వచింతు వినుము. అనేక వాదములకు హేతువులు దురతిక్రమణీయంబులైన మదీయశక్తులగు ప్రకృతి పురుషమహదహంకారాదులు. ఏ శక్తుల వ్యతికరమువలన వాదుల వాద విషయమునఁ బక్షభేదము కలిగెనో యాశక్తుల యంతర్భావంబుల న్యూనాధిక తత్త్వముల గణించుటచే నది కలిగెనని యెంచుము. శమదమ సంపన్నుఁడు చిదచిదాత్మక జగంబు సర్వంబు మచ్ఛరీరంబని కనుటచే వికల్పవాదం బస్తమించు. తత్త్వము లొకదానియందు మఱియొకటి యనుప్రవేశము సేయుటచేతను ముందు వెనుకలుగఁ బ్రశంసించుటచేతను వాదుల యీయాలెక్క కలుగుచున్నది. కాష్ఠాదులందు నగ్నిజలాదులవలె నొక తత్త్వమందు నితర తత్త్వములు ప్రవేశించుట యుక్తమే యగు. ఎట్టు లనినఁ గారణంబైన మృత్తునందుఁ గార్యంబులైన ఘటాదులు సూక్ష్మరూపమునఁ బ్రవేశించుటయుఁ గార్యంబులైన ఘటాదులందుఁ గారణంబగు మృత్తనుగతంబై ప్రవేశించుటయుఁ గలదుగదా? ఈ తత్త్వముల పౌర్వాపర్యములను న్యూనాధిక సంఖ్యలను

బట్టి వక్త యుష్టానుసారముగఁ జెప్పుటకు యుక్తికలదుగదా? అట్లతఁడు చెప్పినపుడా యుక్తి గ్రహింపవలయు. అనాదిగ నజ్ఞానముచే దేహాత్మ భ్రమలోఁగూడిన జీవునకు స్వపరయాథాత్మ్యజ్ఞానము స్వతస్సిద్ధముగ లభింపఁజాలదు. జీవునకంటె నన్యుండు స్వతస్సర్వజ్ఞుఁడు జీవునకు జ్ఞానమొసఁగు పరమాత్ముఁడు వేఱొకం డుండవలయును గావున నిరువురు భిన్నులనులెక్కఁజూచిన దత్త్వములిరువదియాఱని యేర్పడుచున్నది.*

జీవాత్మ పరమాత్మ లిరువురు జ్ఞానస్వరూపులు జ్ఞానగుణకులు నగుట చేతను, ముక్త్యవస్థయందుఁ బరమ సామ్యముండుటచేతను, జీవుఁడు పరమాత్మాంశమగుటచే వేఱుగాఁ జెప్పరాకుండుటను జీవేశ్వరు లొక్కటే తత్త్వమని యెంచుటచేఁ దత్త్వము లిరువదిరైదై దగుచున్నవి. జీవాత్మ పరమాత్మలకు నజ్ఞత్వ సర్వజ్ఞత్వ కల్పనము రూపభేద కల్పనము నర్థశూన్యమగును. ఆ యిరువురకు స్వనిష్ఠాత్మ భేదములేదు, అజ్ఞానము ప్రకృతి గుణము. ఈ విధముగ జూచినఁ దత్త్వము లిరువదిరైదు. జగదుత్పత్తిస్థితి లయములకు హేతువులైన సత్త్వరజస్తమోగుణములు ప్రకృతిగుణములుగాని యాత్మగుణములు గావు. గుణసామ్యంబె ప్రకృతియగు. జ్ఞానము సత్త్వమయము. కర్మమయము రజస్సు. అజ్ఞానమయము తమస్సు. ఈ మూఁడును బ్రకృతిలో నంతర్భూతంబు లగు. గుణవ్యత్యయ జనకంబు కాలంబు. అదియే స్వభావమని సూత్రమనియుఁ జెప్పఁ బడును. ఇట్లు కాలము తోడఁ దత్త్వము లిరువదియే డగు. ఇట్లు కొన్ని తత్త్వంబులు కొన్నిటిలో నంతర్భూతంబులని యెంచి లెక్కించినఁదత్త్వసంఖ్య యందు హెచ్చుతగ్గులు కలుగుచున్నవి. పురుషుఁడు ప్రకృతి మహత్తత్త్వ మహంకారము నభము వాయువు జ్యోతి యాపస్సు భూమి యని మున్నె తత్త్వములఁ దొమ్మిదింటిని బేర్కొంటిని. శ్రోత్రము త్వక్కు దర్శనము ఘ్రాణము జిహ్వ యివి జ్ఞానశక్తులు. వాక్పాణి పాద పాయూపస్థములు కర్మశక్తులు. మన స్సుభయము, కావున నింద్రి

* జీవుఁ డిరువదియైదవవాఁడనువారు కాలము నిరువదియాఱవది [illegible] వానిగ ను గణింతురు.

యములు పదునోకండు. శబ్దస్పర్శ రూప రస గంధము లైదు. ఇవి జ్ఞానేంద్రియ విషయములైనట్లు గమనవచనోత్సర్గంబులు కర్మేంద్రియ కార్యంబులు. ఈ వ్యష్టి ప్రపంచ సృష్టికి ముం దాకాశము మొదలు మనః పర్యంతములైన కార్యములు పదునాలును బ్రకృతి వ్యక్తాహంకారము లను కారణములు సత్త్వాది గుణ యుక్తములై వ్యష్టి ప్రపంచమును గలిగించు చున్నవి. పరమ పురుషుం డవ్యక్తుండై చూచుచుండెడు. వ్యక్తంబులయిన తత్త్వంబులు తత్పురుషవీక్షణమున లబ్ధసృష్టి సామర్థ్యంబులై యొండొంటితోఁ గలసి ప్రకృతిబలంబున బ్రహ్మాండమును సృజించు. ఆకాశాది తత్త్వము లైదు. జ్ఞానస్వరూపి జీవుఁ డొకఁడు. ఈ రెంటికి నాధారభూతుఁ డైన పరమాత్మ యొకఁడు. ఇట్లు తత్త్వము లేడే యగు. ఈ యేడిటి నుండి దేహేంద్రియ ప్రాణములు ప్రభవించు. ఆకాశాదు లైదును బరమపురుషుఁ డొక్కఁడు కలసి తత్త్వము లాఱందురు. శరీరభూతుఁ డైన జీవుఁడును పరమాత్మయుం దంతర్భావమని వీరి మతము. ఆ పరమ పురుషుఁ డాత్మసంభూతంబులైన భూతంబులతోడఁ గూడి వ్యష్టిప్రపంచంబు సృజించి దాని స్థితినిమిత్తమై దానియందు సనుప్రవేశంబు గావించు. తేజోజలాన్నములనుఁ బరమాత్మునితోడఁ దత్త్వంబులు నాలు గందురు. ఈ భూతములవలన నవయవి ప్రపంచ ముదయించె. ఏకాదశ తత్త్వపక్షంబునఁ బంచభూతంబు లైదింద్రియములు పరమాత్ముఁ డొక్కఁడు గణింపఁబడు. పదునేడుగ లెక్కించువా రైదుభూతములు శబ్దాదులైదు జ్ఞానేంద్రియములైదు మనస్సుతోడఁ బదునాఱు గాఁగాఁ బరమాత్ముఁ డొక్కఁడు పదునేడవవాఁ డగుచున్నాఁడు. పదునాఱుగ లెక్కించునపు డాత్మయే మనస్సని యంతర్భావ కారణంబున నందురు. త్రయోదశ తత్త్వవాదులు భూతము లైదు జ్ఞానేంద్రియము లైదు ప్రాణము మనస్సు పరమాత్మ యని గణింతురు. ఇట్లు ఋషులు తత్త్వముల నానావిధములు లెక్కింతురు. యుక్తియుక్తము లగుటచే నన్నియు న్యాయ్యమ్ములే. అనిన నుద్ధవుం డిట్లనియె,

ప్రకృతియుఁ బురుషుండును పరస్పరవిలక్షణస్వరూపు లయ్యును నన్యోన్యోపాశ్రయమువలన నా యిరువురయందును భేదము కానరాకున్నది. ప్రకృతియం దాత్మయు నాత్మయందుఁ బ్రకృతియుఁ గానవచ్చును. ఈ మహాసంశయము నిపుణోక్తుల నీవే సంహరింప సమర్థుఁడవు. జీవులకు జ్ఞానము నీ శక్తివలననే కలుగుచున్నది. జ్ఞానసంకోచము నీ వలననే కలుగుచున్నది. నీ మాయాగతి నీవ యెఱుంగుదువు కాని యితరు లెవ్వ రెఱుంగరు. అనిన భగవంతుఁ డిట్లనియె.

## —♦ శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ బ్రకృతి పురుష వివేకము తెలుపుట. ♦—

ప్రకృతియుఁ బురుషుఁడు నను భేదంబు సత్యంబు. ఈ ప్రపంచము ప్రకృతి వికారాత్మకంబును గుణవ్యతికర కృతంబు నగు. గుణమయంబగు నా మాయ స్వగుణములచే నానావిధముల వికల్పబుద్ధులఁ గలిగించు. గుణాదులచేఁ గలుగు నీవికార మధ్యాత్మమని, యధిభూతమని, యధిదైవమని మూఁడు విధములు. కన్ను లధ్యాత్మము. రూప మధిభూతము. సూర్యసంబంధి శరీర మధిదైవము. ఈ మూఁడు నొకదానికొకటి యుపకార్యము నుపకారకములై కార్యకరము లగుచున్నవి. సూర్యరశ్మి నేత్రరంధ్రము మూలమున రూపమును గోచరింపఁ జేయుచున్నది. ఈ మూఁటిలో నేయొకటి లేకుండినను జ్ఞాన జనకత్వము సంభవింపదు. హృదయాకాశవర్తి యాత్మ స్వయముగఁ బ్రకాశించువాఁడు. కావున నత్యంత భిన్నుఁడు. అఖిల ప్రకాశ్య ప్రకాశకుఁడు. పరస్పరోపకార్యోపకారక భావము కంటియందువలెఁ ద్వక్కు శ్రవణము జిహ్వ నాస చిత్తములయందును నెఱుఁగనగు. త్వక్కున కధిభూతము స్పర్శము, అధిదైవము వాయువు. శ్రోత్రమున కధిభూతము శబ్దము. అధిదైవము దిశలు. జిహ్వ కధిభూతము రసము, ప్రచేతసుఁ డధిదైవము. నాస కధిభూతము గంధము, అధిదైవత మశ్వులు. మనస్సున కధ్యేయవిషయ మధిభూతము, చంద్రుఁ డధిదైవతము. దేహమే యాత్మయను భ్రమకును నేను దేవతను నేను మనుష్యుఁడ నను వికల్పబుద్ధికిని నహంకారమే కారణము.

ఇదియే మహత్తత్త్వమునఁ బుట్టి గుణక్షోభముఁ గావించు. ఈ యహంకారము వైకారికమని తామసమని రాజసమని మూఁడువిధములు. జ్ఞానమయుండగు నాత్మ కలఁడా లేఁడా యను వాదమున కజ్ఞానము కారణము. అది యాత్మ యాథాత్మ్య సాక్షాత్కారమున వర్తించు. అది వ్యర్థవాదమయ్యు నాకు విముఖులైన వారలకు సాక్షాత్కారము లభింపమి వారి యజ్ఞాన ముపశమిల్లదు. అనిన నుద్ధవుం డిట్లనియె.

నీకుఁ బరాఙ్ముఖమైన బుద్ధిగలవారు స్వకర్మములచే నుత్తమాధమంబులగు నానాజన్మంబుల నెత్తుచుందురు, విడుచుచుందురు. పూర్వదేహమువలె నింద్రియములను విడిచి దేహాంతరమువలె మరల నింద్రియములను వీరు గ్రహింతురా? కాక యాయింద్రియములఁగూడియే దేహాంతరము గ్రహింతురా? చెప్పుము. ఇది యల్పబుద్ధుల కెఱుఁగరాదు. దీని నెఱిఁగిన విద్వాంసు లీలోకమునం దఱచు లేరు. అందఱు భవన్మాయావంచితులే యనిన భగవంతుఁ డిట్లనియె.

మనుష్యులకు మనస్సు కర్మమయంబు. జ్ఞానేంద్రియపంచకయుక్తంబు. అన్యుఁడయ్యు నాత్మ యామనస్సున వర్తించు. దేహాంతరము పరిగ్రహించుచుండు. పూర్వదేహసంబంధ జ్ఞానేంద్రియములే దేహాంతరమందును లభించునేని పూర్వజన్మ విస్మృతికిఁ గారణ మేమందు వేని వినుము.

మనస్సు కర్మవాసనా వశము. అది చూచువానిని వినువానిని ధ్యానించుచుండును. అవి లభించెనా సంతోషించును. లభింపవాయెనా దుఃఖించును. ఇట్లు క్రొత్తక్రొత్తవి వచ్చుటచేఁ బాతవి శమించిపోవుచుండును. ఒక జన్మమందే యిట్టివి సంభవించుచుండ జన్మాంతర విషయముల నననేల? ఎవని మనస్సు విషయాభినివేశముచే నాత్మానుసంధానము గావింపదో యట్టివానికి నొకానొక కారణమున స్మృతియు మరణకాలమున నత్యంత జ్ఞానలోపము గలుగుచున్నవి. ఒకానొక కారణ మనునది జీవనావసానకర్మమే. సర్వవిధ మనోవృత్తులచేతను నాత్మచేతను దేహస్వీకారంబు గావించుటే జన్మ

మందురు. జన్మకాల ప్రభృతి దేహాభిమానము వదలదు. ఇది స్వప్నమనోరథమునట్టిది. స్వప్నమనోరథంబులందుఁ బ్రాక్తన మనోరథంబులను స్మరింపనట్లు జన్మాంతరంబునఁ బూర్వజన్మమునఁ దానిట్లుంటినని తలంపక యిప్పుడే నూతనముగ జన్మించినవానివలెఁ దలఁచుచుండును. ఆత్మస్వరూపమందు శరీరోత్పత్తిచే శరీరమని యింద్రియములని యంతఃకరణమనియు త్రైవిధ్యంబు గాననగు నది బహిరంతర్భేదముల కారణముల దేవత్వ మనుష్యత్వ బాలత్వ యువత్వ లోభభయాది రూపభేదముల నసత్సృష్టోత్పత్తివలె ననర్థహేతు వగు.
ఉద్ధవా! శరీరములు నిత్యముఁ బరిణామాంతరముఁ బొందుచుండును. ఇట్లు పూర్వావస్థను వదలుట యుత్తరావస్థను స్వీకరించుట యను రెండును నలక్ష్యవేగంబగు కాలము సూక్ష్మత్వమువలనఁ గానరావు. పూర్వక్షణమందున్న యగ్నిజ్వాల యుత్తరక్షణమున మాఱుటయుఁ బ్రవాహములందు ముందుమున్న నీరుపోయి క్రొత్తక్రొత్తనీరు వచ్చుటయు ఫలము ప్రతిక్షణము వృద్ధిచెందుటయుఁ గాలసూక్ష్మత్వముచే నెట్లు తెలియరాదో యట్లులే సర్వభూతముల వయోవస్థాదులు పరిణమించుచున్నవి. ఇంతకుముందున్న దీపజ్వాలయే యిది యనియుఁ, బ్రవాహమున నింతకుముందున్న నీరే యిదియనియు, నా పురుషుఁడే వీఁడనియుఁ దలఁచుట భ్రాంతిమూలకము గావున నట్టివాఁ డెఱుకలేనివాఁడు. దేహోత్పత్తినిమిత్తమైనకర్మమును బీజముచే జీవునకు దేహమునకు వలె సతత పరిణామస్వభావము లేదు. జీవుఁ డజుఁడు గావునఁ బుట్టువు లేదు. అమరుఁడు గావున మృతియు లేదు. ఉత్పత్తి మరణంబులు భ్రాంతిమూలకంబులు. మహాభూతంబుల మూఁడవదియగు నగ్నికిఁ గట్టెలతోడ నుత్పత్తివినాశములు చెప్పుట యెట్టిదో జీవునకు జననమరణంబులు చెప్పుటయు నట్టిద. నిషేక, గర్భ, జన్మములు నైదవయేఁడు వఱకుఁ గల బాల్యము, పదునాఱవ యేఁడువఱకుఁ గల కౌమారము, నిరువదినాల్గవ యేఁటివఱకు నగు యౌవనము, నలువది యేండ్లవఱకుఁ గల వయోమధ్యము, జర, మృతి యను దేహమునకు నవస్థలు తొమ్మిది. దేహాయు నాత్మ

యించియుండు నిట్టి యవస్థలను మఱియు శయనాసనాద్యవస్థలను బద్ధుఁడు తత్తత్సంబంధ నిమిత్తకర్మ పరిపాకదశయందు నొందుచుం డును. విడుచుచుండును. తండ్రి మరణమువలనఁ దన మరణము, నిజపుత్త్రోత్పత్తివలనఁ దన జననము వివేకి గ్రహింపవలయుఁ గాని యవి దేహగతంబులౌట సాక్షాత్కారంబులు గావు. నేను బుట్టితిని నేను జచ్చితి నని యాత్మ యూహింపఁజాలదు. వృక్ష ములకు బీజమువలన జన్మము కాలపరిణామమున సంయమము గాంచు వాఁడు తా నావృక్షమునకంటె భిన్నుఁడనని తలంచునట్లె యీ దేహమునకుఁ బంచభూత సంఘాత్మకమైన బీజమువలన నుత్పత్తియుఁ గాల పరిణామంబున నాశంబుఁ జూచుచు ద్రష్టయగు నాత్మ తాను దేహమునకంటె భిన్నుఁడనని యెఱుంగు. ఇట్లు దేహమునకంటెఁ దాను భిన్నుఁడనని వివరించి తెలిసికోలేనివాఁడు విషయానుభవమున మూఢుఁడై సంసారమునఁ బొరలుచుండును. ఇట్టివాఁడు సత్త్వగుణ సంగముచే ఋషులందును దేవతలందును రజోగుణ సంగముచే నా సురమనుష్యులందును దమోగుణ సంగముచేఁ బిశాచపశుపక్ష్యాదు లందును స్వకర్మములచేఁ బుట్టుచుఁ జచ్చుచు నుండును. ఆడెడు వారిని బాడెడివారిని జూచి తానును బుద్ధిచేనైన నాడెడు పాడెడు భంగి జీవుఁడు నిష్క్రియుండయ్యును బుద్ధి గుణములను జూచి యా యా చేష్టలు తనయందారోపించుకొని యనుకరించు వానివలెను, జలించు నీళ్ళయందుఁ దోఁచు తీరస్థవృక్షములు కదలు చున్నట్లును, గన్నులు తిరుగుచుండ భూమి తిరుగువిధంబుగఁ దోఁచునట్లును, దేహధర్మంబు లాత్మయందుఁ దోఁచుచుండు. స్వప్నదృష్టంబులైన విషయానుభవంబులు మృషలైనట్లు లుద్ధవా! యాత్మకు సంసారము మిథ్యయే. అధ్యాసహేతువు నివర్తించిన సంసారము నివర్తించు. స్వప్నమున దేశాంతరగమన శిరచ్ఛేదాద్యనర్థపరంపరలు దొలఁగ నట్లు శబ్దాదివిషయములు సన్నిహితములు గాకున్నను వానిని ధ్యా నించు జీవునకు సంసారనివృత్తి గలుగదు. విషయములు సమీపంబున లేకుండినను వానిని ధ్యానించుటచేతనే యధ్యాసము నివర్తింపక

యుండఁగా విషయసాంగత్యము గలవాని కెట్లు నివర్తించు! కావున నుద్ధవా! యసద్విషయ ప్రవణంబులైన యింద్రియములచే విషయముల ననుభవింపకుము. ఆత్మయందు జనన మరణాద్యవస్థలు కల్పించుటకుఁ గారణంబైన భ్రమంబునకు దేహవిలక్షణుండైన యాత్మ యాథాత్మ్యమును గ్రహింపమి కారణంబు. అసజ్జనులాక్షేపించినను నిందించినను, నపహసించినను నసూయపడినను, గొట్టినను, నడ్డగించినను, జీవనవిరోధంబు గలిగించినను, నుమిసినను, మీఁద మూత్రంబు విడిచినను, నిట్లు బహుభంగులఁ జలింపఁ జేసినను, శ్రేయస్కాముఁడగువాఁ డెన్ని కష్టములకైన నోర్చి యాత్మావలోకన తత్పరంబైన మనస్సుచేఁ దన్నుఁ దా నుద్ధరించుకొనవలయును. అనిన నుద్ధవుం డిట్లనియె.

భవదీయ చరణంబు లాశ్రయించి శాంతాంతఃకరణులైన వారికి దక్కఁ దక్కినవారికి దేవా! దుర్జన కృతంబులగు నవమానంబులు దుస్సహంబులు ప్రకృతి బలిష్టంబులును గదా కావున దీనిని నాకు విశదీకరింపు మనినఁ గృష్ణుం డిట్లనియె.

## —♦ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు భిక్షుగీతంబులు వివరించుట. ♦—

బృహస్పతిశిష్యా! చక్కఁగఁ బ్రశ్నించితివి. దుర్జన భాషితంబులైన దురుక్తుల భిన్నంబైన మనస్సును సమాధాన పఱచుకొనుటకు విద్వాంసుండైనను సమర్థుఁడు కాఁడు. పరుషభాషణంబులు మర్మంబులఁ జీల్చురీతి మర్మచ్ఛేదకంబులైన బాణంబును దాపంబును గలిగింపఁ జాలవు. ఈవిషయంబున నొక్క పుణ్యేతిహాసంబు గలదు వినుము.

ఒక భిక్షువు దుర్జనులచే నవమానింపఁబడి నిజధృతిచేఁ గర్మ విపాకంబును సహించి కొన్ని వాక్యంబులు పలికె. అదియే భిక్షుగీత లనఁబడు. అవంతి దేశంబున ధనికుండైన యొక బ్రాహ్మణుఁడు కలఁడు. అతఁడు వాణిజ్యాది రూపవృత్తి జీవించువాఁడు. ధనకాముఁడు. లుబ్ధుఁడు. అతికోపనుఁడు. స్వోదరమాత్ర పోషణరతుఁడు. బంధువుల నతిథుల మంచిమాటలచే నైన గౌరవించినవాఁడు కాఁడు. అట్టి పాడింట

నుండు నతండైనఁ దానైన నిష్టభోగంబు లనుభవించినవాఁడు కాఁడు. దుశ్శీలుఁడు. అతిలోభియునగు నతని పలుకులు పెండ్లాము కొడుకులు కూఁతులు చుట్టములు భృత్యులు నెవ్వరు లక్ష్యము చేయకుండిరి. ధన పిశాచమువలనై యిహపరలోక చ్యుతుఁడై ధర్మకామ విహీనుఁడైన యతనిఁగూర్చి పంచమహాయజ్ఞ దేవతలు కోపించిరి. ఆ కారణమున వాఁడు పుణ్యచ్యుతుఁడు కాఁగా మిగులఁ గష్టపడి యతఁడార్జించిన ధనమంతయు నశించె. కొంత జ్ఞాతులు హరించిరి. కొంత దొంగలు ముచ్చిలించిరి. దేవతా కోపంబున నిల్లుకాలి కొంతనశించె. రాజులు రాజసంబంధులు కొంత యపహరించిరి. ఈవిధముగఁ గాలక్రమంబునఁ గొంచెము గొంచెముగ నా బ్రహ్మబంధుని ధనమంతయు మూలముట్టగ నశించె. ఇట్లు ధనము నష్టముకాఁగా ధర్మకామ వివర్జితుఁడై స్వజను లుపేక్షింప మిగులఁ జింతాపరవశుఁడయ్యె. నష్టధనుండై దీర్ఘ చింతాపరాయణుఁడై ఖేదమునకు వశపడి బాష్పరుద్ధకంఠుఁడై తపించు నతనికి మహా నిర్వేదంబు జనింప నతఁ డిట్లు తలపోయఁదొడంగె.

ఆహా! నాకెట్టి కష్టము సంభవించెను. ఈ దేహము నెంతటి తాపమునకుఁ బాలుపఱిచిరి. ఆయాసపడి ధనము సంపాదించి ధర్మకామంబులకు వినియోగింపనైతి. నా యట్టి పెనులోభుల ధనంబు తలఁచు నా సుఖమునకుఁ గాని యితరుల సుఖమునకుఁ గాని వినియోగపడక యిందాత్మతాపంబునకు మరణించిన పదపడి నరకము నకుఁ గొని పోవుటకుమాత్రమే యుపయోగించు. అత్యంత సుందరమైన రూపమును శ్వేతకుష్ఠరోగపు మచ్చ కొంచెమైనను జెఱుచునట్లు లోభగుణము స్వల్పమైనను యశస్వుల శుభ్రకీర్తిని గుణవంతుల గుణమును నశింపఁ జేయుచున్నది. ధనార్జనమం దెంత మాయాసము! దాని రక్షించుటయం దెంతభయము! దానిని భోగింపవలయు వెచ్చపెట్ట వలయుననిన నెంత చింత! అది నశించెనా యయ్యో చచ్చితినని మృతియు భ్రమయుఁ గలుగు. ఆర్జనదశయందు దొంగతనము హింస, యసత్యము, మోసము, కామక్రోధములు, దర్పము ప్రాప్తించిన

గర్వము, మదము, భేదము, వైర, మవిశ్వాసము, సంస్పర్ధ, స్త్రీద్యూత మద్యవిషయ వ్యసనత్రయమును గలిగించు. ఈపదునైదనర్థకములు నరులకు నర్థమూలములు. కావున ననర్థావహంబైన యర్థంబును శ్రేయస్కాముఁడు దూరంబున విడువవలయు. అంతవఱకు నాపత్సంపగలయందు నొక్కటైయుండు తల్లిదండ్రులు నన్నదమ్ములు భార్య సుహృదులు వీరంద ఱురువదిగవ్వల వెలగల కాకణికా మాత్రమునకై భేదించి విరోధులగుదురు. అంతటి యల్పద్రవ్యము వ్యత్యాసమును సహింపక వీరందఱుఁ గ్రుద్ధులై యావజ్జీవము పగసాధించుచు స్నేహము విడిచి ప్రాణంబులనైనఁ దీయుదురు. దేవతలకును బ్రార్థనీయంబైన మానుష్యజన్మంబునందు బ్రాహ్మణజన్మంబునొంది దాని నలసి సాధింపనగు శ్రేయస్సు ననాదరపఱచికొనువాఁ డధమగతుల పాలగుచున్నాఁడు.

స్వర్గమోక్షంబులకు ద్వారంబైన మనుష్యదేహంబు సంపాదించి మర్త్యుఁ డెవ్వఁ డనర్థనిలయంబైన యర్థంబునం దాసక్తుఁడగు? దేవర్షి, పితృ, భూత, జ్ఞాతి, బాంధవులకుఁగాఁ దన విత్తము వినియోగింపని ధనపిశాచ మధోలోకంబుల కరుగు. వేనిచే ధర్మ కామ మోక్షంబులు సాధింపనగు నట్టి ధనవయోబలంబులు వ్యర్థముగ నర్థాశచేఁ బ్రమత్తుఁడనైన నాకుఁ గడచిపోయె. ఇప్పుడ ముదుకడనైతి. ఇంక నేనేమి సాధింపఁగలను? విద్వాంసుఁడును వ్యర్థమైన యర్థార్జన కాంక్షచే మఱిమఱి కష్టపడుచున్నాఁడు. దీని నాలోచింప నెవ్వనియోని మాయచేతనో లోకము సంవిమోహిత మగుచున్నది. మృత్యువువాతఁ బడ నుండువాఁడు ధనమార్జించియు నేమి ఫలము? కామములు గలిగిన లాభమేమి? ఒండెఁ గామదాతయయ్యు నేమి మేలు? అటుగాక జన్మంబులఁ గలిగించు కర్మంబులఁ గావించియు నేల? సత్యముసత్యము. సర్వదేవమయుండైన హరి భగవంతుండు నాయెడఁ బ్రసన్నుఁడయ్యె. కావుననేకదా సంసారసాగరోత్తరణంబునకుఁ దెప్పయగు నిర్వేదంబు గలుగు దశకు నన్నుఁ గొనివచ్చెను. అట్టి నేను దపస్సుచే జీవితశేషంబు దేహంబుఁ దపింపఁజేసెద,

అప్రమత్తుండనై యిట్లాత్మతుష్టుండనైతినేని దేవత లందఱు నాయెడ సంతుష్టు లగుదురు. అంత నేను ఖట్వాంగునివలె ముహూర్తమాత్రంబున భగవల్లోకంబు సాధింతు.

అనియి ట్లాబ్రాహ్మణుండు నిశ్చయించుకొని హృదయగ్రంథు లగు రాగద్వేషాదుల నున్మూలించి శాంతుండై సన్న్యాసియయ్యె. ఇట్లు ప్రాణేంద్రియ మనంబుల నియమించి వీఁ డితఁడని గుర్తింపరాని యట్లు నగర గ్రామంబులు భిక్షార్థంబు ద్రొమ్మచు దేనియందు నాసక్తి లేక భూమిఁ గ్రుమ్మరుచుండె. వృద్ధుఁడును, మలినగాత్రుఁడును, నగు సన్న్యాసిం జూచి దుర్జనులు గర్వులై బహువిధంబులఁ బరిభవించిరి. కొందఱు త్రిదండమును, కొందఱు కమండలువును, లాగికొనిరి. పీఠంబును నొకఁడు, జపమాల నొకఁడు, బొంత యొకఁడు, వస్త్రముల నొకఁడు లాగికొనిరి. ఏటియొద్దన భిక్షాన్నంబు భుజించు నతని తలపైఁ గొందఱు పాపిష్ఠు లుమిసిరి. కొందఱు మూత్రము విడిచిరి. మౌనంబు వహించిన యతనిఁ గొందఱు పలుకరించిరి. పలుకకున్నఁ గొందఱు కొట్టిరి. కొంద ఱితండు దొంగయని బెదరించిరి. కొంత ఱతనిఁ బట్టుఁడు కట్టుఁడు కొట్టుఁడు చంపుఁడని త్రాళ్ళచే బాధించిరి. కొంద ఱతఁడు వంచకుఁడు శఠుఁడు క్షీణధనుఁడై స్వజనులు నిగ్రహింప నిట్టివేషము వేసెనని నిందించిరి. ఛీకొట్టిరి. ఓహో వీఁడు రాతిగుండెవాఁడు, కొండవలెఁ జలించువాఁడు కాఁడు, కొంగవలె గూఢనిశ్చయుండై మౌనముచేతనే కార్యములు సాధించుచున్నాఁడు. అని కొందఱు నవ్వఁ గొంద ఱతనిపై నపానవాయువు విడిచిరి. కొంద ఱతనిఁ ద్రాళ్ళచేఁగట్టి క్రోఁతివలె నాడించిరి. ఇట్లు దుర్జన కృతంబులును, శీతోష్ణాది ప్రభవంబును జరాది నిమిత్తంబులునై పైపైఁ గలుగు దుఃఖంబులనెల్ల నిజకర్మ నిమిత్తంబులు భోక్తంబులని నిశ్చయించి మనంబున నేమియు వికారపడక యుండె. ఇట్లు నరాధములు తన్నవమానింప స్వధర్మస్థుండై సాత్త్వికంబైన ధృతి నవలంబించి కొన్ని వాక్యంబులు పలికె. వానిని వినుము,

ఉ. కారు మదీయదుఃఖసుఖకారణభూతులు దేవతానరుల్,
కారు గ్రహాత్మభూజనులు, కాలము కర్మము గాదు కాదు; సం
సార రథాంగ యంత్రమును మానక త్రిప్పు మనంబె యెంతయుం
గారణ; మింతయుం దెలియఁ గల్గునె దేహికి ఖేదమోదముల్?

బలిష్ఠంబైన మనంబు రాగద్వేషాదుల సృజించు. వానివలన సాత్త్విక రాజస తామసాత్మకంబులు పుణ్యాపాపకర్మంబులు కలుగు. సంకల్ప వికల్పంబులు గల మనస్సు తోడనుండియు నహం మమాభిమానానురూప చేష్టారహితుండై యంతఃప్రవిష్టుండై ధారకుండై హిరణ్యప్రకాశుండై జీవసఖుండైన పరమాత్ముండు సాక్షియై చూచుచుండు. జీవుఁడో సంసారకారణంబైన మనస్సుచే సెజ్జి చేతలనెల్లఁ దనవిగ గ్రహించి శబ్దాదివిషయ సాంగత్యంబునఁ గుణంబుల సేవించి బద్ధుఁడగుచున్నాఁడు. దానము స్వకులధర్మము యమనియమములు వేదకర్మములు, వ్రతములులోనైన యన్నిటికి మనోనిగ్రహమే ఫలము. మనోనిగ్రహమే యుత్తమంబైన యోగము. ఏవాని మనస్సు రాగాదులఁ గలుషితంబుగాక సమాహితంబై యుండు నతనికి దానాదుల వలన నేమికార్యము గాఁగలదు? మనోనిగ్రహంబు లేనివాఁడు దానాదులఁ గావించియు నేమి ప్రయోజనము? దేవతలును మనోవశులైరి. మనస్సెవ్వానికిని లోపడునది కాదు. అయినను దానాదులచే నారాధితుఁడై పరమపురుషుండు మనస్సును దనయందు సమాహితమగునట్లు చేయును. అట్లుగాన నప్పరమపురుషుండు మనఃప్రభృతి కరణములకు నధిష్ఠాతలైన చంద్రాది దేవతలకును దేవతకావున బలియురలోనెల్ల బలిష్ఠుఁడు. దానాదుల నారాధింపఁబడిన యాపరమపురుషు ప్రసాదంబునఁ దప్ప నితరోపాయంబుల జయింప నశక్యమై శత్రువువలె దుఃఖప్రదమై యసహ్యవేగంబై హృదయవ్యథాజనకంబైన మనస్సును జయింపక కొందఱు మనుష్యులతో నిష్ఫలవిరోధమును మైత్రిని నుదాసీనత్వమును వహింతురు. ఇట్టివారు మూఢులు. దేహంబు మనోమాత్ర కారణంబు. అట్టి యీదేహమ్ముపై నేను నాది యను భ్రాంతినుంచి మూఢులై మనుష్యు 'లిది నేను అది

యితరము" సను భ్రమచే నగాధమగు సంసారమునఁ దిరుగుచుందురు. సుఖదుఃఖ కారణము జన మందనూ యనిన నవి భౌతిక శరీరములకే కాక యాత్మకు వానివలన నేమి కాఁగలదు? తన నాలుక తాను గొఱికికొనువాఁ డెవ్వనిపైఁ గోపింపవలయు? అన్యగతంబులైన సుఖ దుఃఖ కర్తృత్వ కర్మత్వాదులచే నాత్మకు స్పర్శము కొంచెమైన లేదు. సుఖదుఃఖ హేతు వీశ్వరుఁ డందమా యనిన నట్టి హేతువు రాగద్వేష సుఖదుఃఖ శీలత్వాది వికారములుఁగల దానికిఁ జెప్ప వలయునుగాని నిర్వికారమైన యంతరాత్మ కెట్లు చెప్పఁదగు? ఒక యంతరాత్మ వేఱొక యంతరాత్మకు సుఖదుఃఖకారణము కాఁజాలదు గాని తానే తానుండు దేహమునకు సుఖదుఃఖములఁ గలిగించి సుఖించు దుఃఖించు నంటివేని యీశ్వరప్రవర్తితమై దేహమున నొక యవయవము వేఱొక యవయవమునకు బాధకలిగింపఁగా నావేద నకై యా యీశ్వరుఁ డెవనిపై నలుగవలయు? తనచేసిన పనికిఁ దనపైఁ గోపించువాఁ డున్మత్తుఁడు గదా? ఇంతకు నాత్మ నిత్యము నిర్వికారము కదా? నిర్వికారుఁడైన యీశ్వరుఁడు కాఁడుకాని దేహి సుఖదుఃఖ హేతువందువేని యన్యాత్మవలన సుఖదుఃఖములు గలిగె ననుట వ్యర్థాభిమానము. ఏలయందువేని వికారాశ్రయత్వము నిజ స్వభావముగదా? స్వభావప్రయుక్తమగు దానిపై నెవ్వ డలుగు? అట్లైన నాత్మకంటె నన్యంబు హేతువు కాదందువేని యాత్మహేతు త్వముక్తుండ మృషయే. ద్వాదశాష్టమ జన్మస్థానములందుండు సూర్యాది గ్రహములు సుఖదుఃఖకారణము లందువేని జన్మరహితుఁ డై నయాత్మకు జన్మాష్టమాది స్థానస్థితులచే సుఖదుఃఖములుప్రాప్తించు ననుట యుక్తంబుగాదు. ఉత్పత్త్యాశ్రయ దేహమునకు జన్మాది స్థాన స్థితిచే నేవి హేతువులందురో యా గ్రహములే పాదార్థాది భేద దృష్టిచే నితరగ్రహములను బీడించునని దైవజ్ఞు లందురు. కావున గ్రహములకంటెను దేహముకంటెను నన్యుఁడైన పురుషుఁ డెవ్వరిపై నలుగవలయు? గ్రహములకే పరస్పరపీడ యుండుటచే సుఖదుఃఖ ములకు నిజకర్మమే కారణమందువేని నిర్వికారుఁడు స్వయంప్రకా

శుఁడు నగు నాత్మకు సుఖదుఃఖమూలములయిన శుభాశుభకర్మములు గలుగవు. అట్లులే యచేతనమై ప్రవృత్తికి యోగ్యతలేని దేహము నకును గలుగవు. జడమైన దేహమునకే యాత్మత్వ మందువేని విరుద్ధస్వభావ స్వరూపములైన జడత్వాజడత్వముల కైక్యము చెప్పుట యుపపన్నముగాదు. దేహము జడము. జీవుఁడు పురుషుఁడు సువర్ణుఁడు ప్రకాశస్వరూపుడు కావున నతని నేమియు నంటవు. కావున గర్మము హేతువు కాఁజాలదు. కాన నెవరిపైఁ గోపింపవలయు? సుఖదుఃఖములకు వశీకృత సర్వప్రపంచమైన కాలము కారణమందు వేని దానివలన నాత్మన కేమగు? స్వరూపముచే సుఖదుఃఖాన్వయ రహితుఁడైన యాత్మ కాలవశ్యుఁ డగుటచే సుఖదుఃఖముల భజించు నందువేని యగ్నికిఁ దాపబాధయు హిమమునకు శీతబాధయుఁ గలుగునా? కావునఁ గాలము హేతువు కాదు. కావున మీఁదఁ జెప్పిన జననాదు లాత్మకంటె నన్యంబగు దానికి సుఖదుఃఖంబులు గలుగవు. అహంకారంబు సంసారరూపంబు. ఎట్లన: అహమభిమానంబున ననాత్మయం దాత్మాభిమానంబు గలుగు. దానివలన సుఖదుఃఖాది ద్వంద్వము లగు. అహంమమాద్యభిమానంబున ద్వేషాదు లగు. వానివలనఁ గర్మంబు లగు. వాన జన్మంబు లగు. వాన సుఖదుఃఖంబు లగు. పరంబునకంటెఁ బరంబగు నగు నయాత్మకు నెప్పుడేని నెవ్వనిచే నేని నెట్టులేని ద్వంద్వబాధ లేదు. కావున భూతంబులచే నుపద్రవంబు గలిగినను బండితుఁడు భయపడఁడు. పూర్వులైన పండితులచేఁ బరిగృహీతంబై సుఖదుఃఖనిదాన పరిత్యాగయుక్తంబయిన పరమాత్మనిష్ఠయందు మనస్సునిలిపి ముకుంద చరణారవింద సేవచేతనే దురంత పారంబయిన సంసారంబుఁ దరించెద. అని నష్టధనుఁ డయిన యా బ్రాహ్మణుఁడు నిర్వేదపడి విగతాగ్రహుఁడై సన్న్యసించి భూసంచారముఁ గావించుచు దుష్టులు నిరాకరించినను స్వధర్మము నుండి చలింపక యీగాథ వచించెను. కావున,

చ. ధరణిని నాత్మ విభ్రమము చక్కఁగ నేదియు సౌఖ్య దుఃఖముల్
పురుషునకున్ ఘటింపఁగను బూనఁగ లేవు భ్రమంబు; పొందఁదా

బర హిత మధ్యమాఖ్యల విభాగము సంసృతి దాన నే యగున్
బురుషవరేణ్యా ! యింత తలపోయుచు నిశ్చితబుద్ధి కమ్మొగిన్.

క. మనమును విషయాంతరములఁ
జనకుండఁగ నిగ్రహించి సతతము నాపైఁ
బనిగొని నిలుపుము దృఢముగ
జననుతగుణ ! యోగశాస్త్ర సంగ్రహ మిదియా.

ఈ భిక్షుగీతంబులును శ్రద్ధతో ధరించి విని పఠించు నతఁడు బ్రహ్మనిష్ఠుండు ద్వంద్వరహితుండు నగు.

## —♦ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు సాంఖ్యయోగముఁ జెప్పుట. ♦—

ఉద్ధవా ! యిఁక నీకు బూర్వమున వినిశ్చితంబైన సాంఖ్య యోగంబుఁ జెప్పెద వినుము. దాని నెఱుంగువాఁడు నేను వాఁడు నను భేదబుద్ధి కల్పకంబు దేహాత్మ భ్రమంబు. స్వతంత్రాత్మ భ్రమంబు వెంటనే విడువఁగలఁడు.

తొలుతఁ బ్రలయావస్థయందు నామరూప విభాగరహితంబై పరమాత్మ స్వరూపంబు జ్ఞానం బొకండే యుండు. జగదాదియందు ననుపమానమైన కృతయుగంబున వివేక నిపుణులు బ్రహ్మోపాసనమే కావించుచుండిరి. గుణవైషమ్య రహితంబును జాత్యాది వికల్ప రహితంబును వాఙ్మానసంబుల కపరిచ్ఛేద్యంబైన స్వరూప స్వభావము గలదియు నిర్వికారము వాఙ్మానసంబుల కగోచరంబును నగు బ్రహ్మంబు తన్మాయా ఫలరూపములచే ద్విప్రకారంబయ్యె. అం దొక్కటియైన మాయయనే ప్రకృతి. ఆ ప్రకృతి కార్యకారణాత్మికయై యుభయాత్మిక యయ్యె. రెండవది యగు ఫలరూపార్థంబు జీవస్వరూపంబు జ్ఞానం బయ్యె. దానినే ప్రత్యక్కని పురుషుఁడని యందురు. విచిత్రకార్య కరత్వ యోగంబునఁ బ్రకృతియందు మాయాశబ్దంబు వర్తించు. అను కూల జ్ఞానాత్మ కానందస్వరూపము నను నానందమే పురుషార్థమగు టను, ఫల శబ్దముచే జీవుఁడు పేర్కొనఁబడియె. ప్రకృతి యుభ యాత్మికయని చెప్పితిని గదా. తద్విధంబు వినుము. ప్రకృతి గుణంబు

లైన తమోరజస్సత్త్వంబులు సామ్యావస్థయందుండఁ గాలరూపి యగు నాచే సంక్షోభింపఁబడి*యవి విషయంబులై వ్యక్తంబులయ్యె. సంక్షోభింపఁ జేయ గారణ మేమందువేని జీవుల ననుగ్రహించు టయే యని యెఱుఁగుము. జీవులకు మదారాధనోప యుక్తకరణ కళేబరము లనుగ్రహించుటయే నా సంకల్పము. ఆ గుణంబులవలన సూత్రంబయ్యె. ఇదియే మహత్తత్త్వము. అనేక మణులను నొక దారం బెట్లుధరించియుండు నట్లు బహుకార్యధారకత్వముచే మహత్త త్త్వము సూత్రంబనంబడు. దానివలన నహంకారంబు జనించె. అది యే దేహాత్మ భ్రమాదిహేతువు. ఆ యహంకారంబు వైకారికమని తైజసమని తామసమని ముత్తెఱంగు. ఆ యహంకారమే శబ్దాదు లైన తన్మాత్రలకు నింద్రియములకు మనస్సునకుఁ గారణభూతంబై చిదచిన్మయంబయ్యె. తిలతైలన్యాయమున నచిత్తత్త్వంబులందు ద్రష్ట ర్భత్వము ప్రదర్శించుటకై యహంకారంబు చిదచిన్మయం బనం బడియె. తన్మాత్రలు కారణముగఁ దామసాహంకారమువలన నా నాకాశాది పంచమహాభూతంబు లుదయించె. తైజసంబను రాజసా హంకారంబున నింద్రియములును, వైకారికంబను సాత్త్వికాహంకా రంబున మనస్సు నేకాదశేంద్రియాధిష్ఠానదేవతలును జనించిరి. అంతరాత్మనై ప్రవేశించియుండు నాచేఁ బ్రేరితంబులై మహదాదులు కూడుకొని కార్యోత్పాదన యోగ్యంబులై యండంబు సృజించె. అదియే నా యుత్తమస్థానంబు. జలమం దుద్భవించిన యా యండం బున నేను లీలావిగ్రహంబున నారాయణుండనై తోఁచితి. నా నాభి నుండి జగదాఖ్యంబైన పద్మంబు పొడమె. ఆ పద్మంబునఁ జతుర్ముఖుం డొదవె. ఆ స్వయంభువు రజోగుణయుక్తుండై తపంబు బలంబున మదనుగ్రహంబున లోకంబుల లోకపాలుర సృజించె. భూలోకము, భువర్లోకము, స్వర్లోకములని లోకములు మూఁడు. అందు దేవతలకు స్వర్లోకంబు స్థానంబయ్యె. భువర్లోకం బనఁబడు నంతరిక్షము భూతం

---

*సంక్షోభింపఁబడి=కదలని నీటియందుఁ జలనము పుట్టించునట్లు చలనము కలుగఁజేయఁబడి.

బులకు స్థానంబయ్యె. మర్త్యులకు భూలోకమయ్యె. సిద్ధులకు భృగ్వాది మహర్షులకు లోకత్రయమునకుఁ బరంబులైన మహర్లోకజన లోకాదులు స్థానంబులు. అసురులకు నాగములకు నతలాది లోకంబులు. పదునాల్గు లోకంబులు లోకత్రయంబున నంతర్గతంబులు. త్రిగుణాత్మలైన క్షేత్రజ్ఞుల సాత్త్విక రాజస తామస కర్మములకు ఫలభూతంబులై ప్రాప్తించు లోకంబు లామూఁడే. బ్రహ్మాండాంతర్గతంబులైనవి యీ మూఁడు లోకంబులే. నిర్మలులైన యోగులకుఁ దపస్వులకు సన్న్యాసులకు మహర్జన తపస్సత్యలోకంబులు ప్రాప్తించు. భక్తియోగులకు మత్పదంబు పరమపదంబు ఫలంబగు. లోపలఁ బ్రవేశించి శాసించుటచే భర్తయు వెలుపలఁ గాలస్వరూపుఁడును నగు నాచే జగంబు కర్మయుక్తంబై గుణపరిణామాత్మకమైన ప్రకృతిమండలమందుఁ బుట్టుచు గిట్టుచు మునుఁగుచుఁ దేలుచు నున్నది. కొంచెమని గొప్పయని కృశమని స్థూలమని యేవేవిగలవో యవి యన్నియుఁ బ్రకృతి పురుషసంయోగముచేఁ గలుగును. దేని కేది తుదయు మొదలు నగునో దాని కదే మధ్యము. వికారంబు వ్యవహారార్థంబు. ఎట్లంనువేని తేజోయుక్తంబులైన కడియములు కిరీటములును. భూమి సంబంధములైన కుండలు చట్లు నాదియందు నంత్యమందు బంగారు మన్ను నెట్లగు నట్లే కడియములు కుండలని పేరువహించిన మధ్యదశయందును బంగారుమట్టియే కాని తద్భిన్నంబు కానేరదు. లోకవ్యవహారము జరుగుటకై కడియములని కుండలని చెప్పుదుము. కుండతో నీళ్లు తెమ్మందుము గాని మట్టితో నీళ్లు తెమ్మనము కదా. ఏ పదార్థ ముపాదాన కారణంబున * స్వావస్థం భజించు నయ్యది తత్పూర్వ పరావస్థలయందుఁ దదాత్మకమే. దేనియం దాద్యంతంబుల నేపదార్థంబు కాననగునయ్యదియే నిత్యంబు. మనుష్యాది వివిధదేహసంఘమున కుపాదాన కారణంబైన ప్రకృతి, ప్రకృతికంటెఁ బరుండై దాని కాధారంబుగ నుండు జీవుండు, స్వరూప స్వభావములచే నిత్యాం

* ఉపాదాన కారణము కుండలు చేయుటయం దుపాదాన కారణముమన్ను. నిమిత్తకారణము కుమ్మరి.

ష్ఠైన యాత్మ కభివ్యంజకంబైన కాలంబు, నను నీమూఁడును బ్రహ్మాండంబగు నేన. నేను సంకల్పించువఱకు నిత్యముగఁ బూర్వాపరముగ మహదాది ప్రపంచమున సృష్టి స్థితి సంహారములు జరగుచునే యుండును. కాలశరీరుండనైన నాచే జనసర్గప్రళయాదిక్లృప్తిగల బ్రహ్మాండము స్వాంతర్వృత్తియగు నాచే నాశము చేయఁబడుచున్నది. అన్నమందు శరీరము లీయమగుచున్నది. అన్నంబు ధాన్యంబులందు లయించు. ధాన్యములు భూమియందు, భూమి గంధమందు లయించు. నీటియందు గంధము లీనమగు. జలము రసమందు, రసము జ్యోతియందు, జ్యోతి రూపమందు, రూపము వాయువునందు, వాయువు స్పర్శమందు, స్పర్శము నంబరమున, నంబరము శబ్ద తన్మాత్రమందు, శబ్దము తామసాహంకారంబున లీనమగు. అహంకారంబు మహత్తత్త్వంబున లీనమగు. ఇంద్రియంబులు స్వకారణంబుల లయంబగు. ఇంద్రియాధిష్ఠాన దేవతలు మనస్సు, సాత్త్వికాహంకారంబున లయంబగు. మహత్తత్త్వంబు గుణంబుల లయించు. గుణంబు లవ్యక్తంబున నవ్యక్తం బవ్యయంబయిన కాలంబునఁ, గాలంబు ప్రకృతి సంస్రష్టుఁడయిన జీవునియందు, జీవుఁడు నజుఁడగు నాయందు లీనంబగు. సర్వాంతరాత్మభూతుండనగు నేను నాయందే యుండును. నాకు వికల్పాపాయములులేవు. ఈ విధముగ నాలోచించువారి మనస్సులో సూర్యోదయంబునఁ జీకటివలె నెట్లు నైకల్పిక భ్రమంబు నిలువఁ గలదు ? సమష్టి వ్యష్టితత్త్వముల యథార్థమెఱింగిన నేను సృష్టిసంహార క్రమవిధంబున దేహాత్మ, జీవేశ్వర, భేదాభేద సంశయమును బోఁగొట్టు సాంఖ్యయోగ విధంబు వివరించితి.

### శ్రీకృష్ణుఁ డుద్ధవునకు గుణవృత్తి భేదములు వివరించుట.

సత్త్వాది గుణములు ప్రత్యేకముగను నొండొంటితోఁ గలియుటచేతను, బురుషుఁ డెట్టిట్టివాఁడగుఁ దద్విధంబుఁ జెప్పెద వినుము. శమము, దమము, తితిక్ష, తపము, సత్యము, దయ, స్మృతి,

తుష్టి, త్యాగము, స్పృహ, శ్రద్ధ, హ్రీ, దానము, వినయార్జవములు, నాత్మానుభవసుఖము నివి సత్త్వగుణములు.

కామ, మోహ, మదము, తృష్ణ. గర్వము, ధనాది వాంఛ, నైషమ్యము, విషయభోగము, సాహసకర్మాభినివేశము, యశస్సునందుఁ బ్రీతి, యుపహాసము, వీర్యము, బలోద్యోగము నను నివి రజోగుణములు.

క్రోధము, లోభ, మనృతము, హింస, యాచన, వంచనము, శ్రమము, కలహము, శోకము, మోహము, విషాద, మార్తి, నిద్ర, యాశ, భయము, జాడ్యము, నను నివి తమోగుణములు.

ఇఁక మిశ్రగుణములు చెప్పెద వినుము. నేను నాది యను నభిప్రాయమునకు మనోదేహేంద్రియప్రాణములు కారణమైన వ్యవహారము గావున నది మిశ్రగుణము. ధర్మార్థకామంబులందలి నిష్ఠ శ్రద్ధారతి ధనావహంబు గావునమిశ్రగుణంబు. త్రివర్గికార్జనానుకూల వ్యాపారంబయిన ప్రవృత్తినిష్ఠగలవాఁడు సత్త్వయుక్తుఁడని, కామాదులుఁ గలవాఁడు రజోయుక్తుఁడని, క్రోధాదులుగలవాడు తమోయుక్తుఁడని గ్రహింపనగు. ఫలాపేక్షలేక స్వవర్ణాశ్రమోచిత కర్మములచే భక్తియుక్తస్త్రీయొండెఁ బురుషుఁడొండె నన్ను సేవించెనేని యది సత్త్వప్రకృతి గుణమని యెఱుంగుము. ఆశాయుక్తుఁడై స్వకర్మములచే నైహలౌకికకార్యముల నాచరించెనేని యది రజోగుణమని యెఱుంగుము. ఆశచే హింసాకార్యమొనర్చువాఁడు తమోగుణయుక్తుఁడని యెఱుఁగుము. సత్త్వము రజస్సు తమస్సు నను నివి జీవుని బంధించునుగాని నన్ను బంధింపవు. ఏలన భూతపరిణామాత్మక దేహము తదనుబంధవిషయములలో నేదే నొకదానియందుఁ దగులు గలిగి జీవుఁడు చిత్తసంభవములయిన సత్త్వాదులచేఁ గట్టువడు. ఇతర గుణంబుల జయించి సత్త్వం బతిశయించెనేని చిత్తంబు సూక్ష్మార్థముల గ్రహింపఁగలిగి నిర్మలమై తత్ప్రతిబంధక మలరహితంబయి, శాంతంబయి, రాగాదుల నకలుషితంబయి యొప్పు. అప్పుడు పురుషుండె తద్గుణంబులను సుఖంబుగఁ బొందుటయేగాక సాత్త్విక దైవతారాధ

నాత్మక ధర్మంబును దముపాసనాత్మక జ్ఞానంబును గలవాఁడగు. తమ స్సత్త్వంబుల గెలిచి రజస్సు భాసించెనేని విషయాసక్తియు శబ్దాది విషయభేదముచేఁ జలితత్వము లభించు. అప్పుడు పురుషుఁడు రాజస దైవతారాధన కర్మముచే యశశ్శ్రీలఁ గూడినవాఁడగు. రజస్సత్త్వం బుల జయించి తమ స్సతిశయించెనేని చిత్తంబు లయంబు మూఢంబు జడంబు నగు. అప్పు డా పురుషుండు శోక మోహ నిద్రా హింసా శలఁ జిక్కువడు. చిత్తంబు ప్రసన్నంబయ్యెనేని యింద్రియంబులం దభినివేశం బనుతాపంబులేక సుఖించు. మఱియు దేహంబు రోగా దులవలన భయములేకుండు. భయకారణంబులగు రోగాదులఁ గలిగించు వస్తువులందు మనస్సున కభిలాష గలుగదు. ఇట్టి గుణం బులు గల సత్త్వంబు మనుపలబ్ధిస్థానంబని యెఱుంగుము. ఎప్పు డిది సాధు విది యసాధు వను విచారములేక కార్యములొనర్చి తత్ఫలం బులగు హర్షశోకాది రూపవికారంబులకు లోనై చిత్తవిక్షేపము నకు జ్ఞానేంద్రియముల మనోవిషయాభినివేశరూప జ్వరంబునకుఁ బాణిపాదాది పీడలకు మనశ్చంచలత్వంబునకుఁ బాలుపడునప్పుడు రజోగుణం బతిశయించి యున్నట్టు లెఱుంగుము. ఎప్పుడు చిత్తంబు తిరోభూతంబయి జ్ఞానేంద్రియ విషయరూపాది గ్రహణంబున నస మర్థంబయి లయించు నప్పుడు సంకల్ప వికల్పాత్మక మనంబు లీనం బయి యజ్ఞాన విషాదంబులు గలుగు నప్పుడు తమ స్సుద్రేకించె నని యెఱుంగుము. సత్త్వం బతిశయించెనేని యూర్ధ్వవిక కార్యం బులఁ గావించు. తమస్సతిశయించెనేని రాక్షసకృత్యంబులు గావించు. సత్త్వంబున జాగరణంబును, రజంబున స్వప్నంబును దమంబున సుషుప్తియునగు. తురీయావస్థ యాత్మతత్త్వంబు. సత్త్వంబు క్రమ క్రమంబుగ నభివృద్ధియగుకొలఁది తారతమ్యగతులచే స్వర్లోకంబా దిగ బ్రహ్మలోకపర్యంతంబు వేగనిష్ఠులు పొందుదురు. రాజసులు మధ్యమలోకమున నుందురు. తామసులు తద్గుణ తారతమ్యంబును బట్టి యధోలోకంబుల కరుగుదురు. సత్త్వ మతిశయించియుండ మర ణించినవారు స్వర్లోకంబును, రజం బతిశయించియుండ మరణించిన

వారు నరలోకంబును, దమం బతిశయించియుండ నీల్గినవా రధోలోకంబును బొందుదురు.* నిర్గుణులు నన్నుఁ బొందుదురు. మ దారాధన రూపకకర్మంబు ఫలంబులఁగోరక చేయుకర్మంబు సాత్త్వికంబు. ఫలము సంకల్పించి చేయు కర్మము రాజసంబు. హింసామాత్సర్యాది కలితంబు తామసంబు. ఉన్నదున్నట్లు తోఁపఁజేయు జ్ఞానము సాత్త్వికము. ఆరోపితాకార విషయంబు రాజసంబు. ప్రాకృతజ్ఞానంబు తామసంబు. మన్నిష్ఠాత్మక జ్ఞానంబు నిర్గుణంబు. వనము సాత్త్విక వాసము. గ్రామంబు రాజవాసంబు. ద్యూతపానాది సదనావాసంబు తామసంబు. నే నుండు ప్రదేశంబు నిర్గుణంబు. కామార్థ సంగి కాని కర్తసాత్త్వికుఁడు. రాగాంధుఁడగుకర్త రాజసుఁడు. స్మృతి విభ్రష్టుఁడు తామసుఁడు. మ దుపాశ్రయుండు నిర్గుణుండు. అధ్యాత్మశాస్త్రవిషయశ్రద్ధ సాత్త్వికము. కర్మశ్రద్ధ రాజసము. అధర్మమందలి శ్రద్ధతామసము. మత్సేవాశ్రద్ధ నిర్గుణము. హితము, పూత, మనాయాసలబ్ధమగు నాహారము సాత్త్వికము. ఆయాసలబ్ధ, మింద్రియ సుఖావహమగు నాహారము రాజసము. అశుచియు శాస్త్రనిషిద్ధము దేహేంద్రియ పీడాకరమగునది తామసము. ఆత్మానుభవ సంతోషరూపంబగు సుఖము సాత్త్వికము. శబ్దాదులవలనను, సుఖస్పర్శమువలనను, గలుగు సుఖము రాజసము. మోహకవస్తువుల ననుభవించుటచేఁ గలుగు చిత్తపారవశ్యరూపంబును, పుత్రకళత్రాది ప్రభవంబును నగు సుఖము తామసము. మదీయ ధ్యానాది ప్రభవ సుఖము నిర్గుణము. ద్రవ్యము దేశకాలములు ఫలము కర్మము కారణము శ్రద్ధ యవస్థ యాకృతి నిష్ఠ యివి యన్నియుఁ ద్రిగుణకార్యభూతములు. ఎట్లన, ప్రాతఃకాలము మధ్యందినము సాయంతనము సాత్త్వికము. రాత్రులందుఁ బ్రహరంబుదాఁక రాజసము. అర్ధరాత్రము మొదలు తామసము. ఊర్ధ్వలోక సాధనములు బోధించు శాస్త్రము సాత్త్వికము. దేహసుఖముల గుఱించి బోధించునది రాజ

*నిర్గుణులు=నిర్గుణత్వమును గలిగించు నిరతిశయ సత్త్వోల్లాస దశయందు మరణించినవారు.

సము. అభిచారాదుల బోధించునది తామసము. భగవత్ప్రాప్తి సాధ
నమును బోధించునది నిర్గుణము. వైదికవేషము సాత్త్వికము. అర్థకా
మార్జనానుకూలము రాజసము. పాశుపతాద్యాగమోక్తము తామ
సము. భగవచ్ఛాస్త్రోక్తము నిర్గుణము. ఈపదార్థములన్నియు గుణవి
షయములు. అచిత్సంసృష్ట పురుషవిషయములు, కానవచ్చు నైహి
కాదులు, వినఁబడు పారలౌకికములు, బుద్ధిచే ధ్యానింపఁబడునవి
యగు సుఖములు గుణమయములు. ఈ ద్రవ్యాదులన్నియుఁ బ్రా
చీన పుణ్యపాపాత్మక కర్మములచేఁ బ్రేరింపఁబడి రుచించునవి, మఱియు
వానిని వర్ధిల్లఁజేయునవి. ఏ జీవుండు చిత్తసంభవంబులైన యీ సత్త్వాది
గుణములను భక్తియోగముచే మన్నిష్ఠుండై జయించు నతఁడు నా
సాధర్మ్యమును బొందును. కావున శాస్త్రయోగజన్య జ్ఞానోదయ
హేతువగు నీ మానుష్యదేహంబును బొంది శబ్దాది విషయ సంగం
బును వదలి బుద్ధిమంతులు నన్ను భజింతురు. నిస్సంగుండు నప్రమ
త్తుఁడు జితేంద్రియుఁడు నగు ముని నన్ను భజించి సత్త్వసంసేవచే
రజస్తమస్సుల జయించి నిరపేక్షుఁడు శాంతబుద్ధియు నగువాఁడు
సత్త్వమును జయించు. ఇట్లు గుణవిముక్తుఁడు జీవుఁడు దేహమును
వదలి నన్నుఁ బొందును. గుణదేహముక్తుఁడయిన జీవుఁడు బ్రహ్మం
బయిన నాచే వ్యాప్తుండై సంసారనిమిత్త కర్మములఁగాని మోక్ష
సాధకమైన జ్ఞానయోగముఁగాని యాచరింపఁడు.

## — శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ బురూరవోగీతలు చెప్పుట. —

మద్దర్శన సాధనభూతంబైన మనుష్యదేహంబుఁ బొంది మదా
రాధనాత్మకంబైన నివృత్తిమార్గమందే యుండువాఁ డానందమయుం
డును, జీవాత్మయం దుండువాఁడును, బరమాత్మయగు నన్నుఁ
బ్రాపించును. ఇట్టివాఁడు ప్రకృతికార్యంబులగు శబ్దాదు లనుభవించు
చున్నను గుణత్రయాత్మక మాయావాచ్యములైన దేవాది శరీరంబు
లందు నేను నాది యను నభిమానము లేనివాఁడై స్వాత్మపరమాత్మ
యాథాత్మ్యానుసంధానాత్మకమైన జ్ఞానయోగనిష్ఠచే దృశ్యమానంబు

త్తైన దేహానుబంధంబులఁ దనవిగా భావించుచున్నను దద్వస్తుగుణములచే బద్ధుఁడుగాఁడు. శిశ్నోదరపరాయణులైన యసజ్జనులతోఁ గలయరాదు. అట్టివానితోఁ గూడియుండువాఁడు గ్రుడ్డివాని వెంటఁ బోవు గ్రుడ్డివానివలె సంధతమసంబను నరకంబునఁ బడును. పురూరవుండను విపులకీర్తి చక్రవర్తి యూర్వశీవశవర్తియైయుండి యది తన్ను విడిచిపోవ విరహంబున వాపోవుచుఁ దద్వశీకృత చైతన్యుండై యత్యంత మోహంబున జడుండై దిసమొలతో విరిసిన తలతోఁ బిచ్చివానివలె దాని వెంట నోజాయా! యోసీ కఠినాత్మురాలా! నిలు నిలుమని యఱచుచుఁ బరువెత్తి విహ్వలుఁడై యతృప్తకాముఁడగు నాసార్వభౌముఁడు రేలుపగల్లు వచ్చుటపోవుటకూడ నెఱుఁగకయుండి యీనావలవిషయంబులవలనఁగలుగు ననర్థకంబులాలోచించి జాతనైరాశ్యుఁడై యిట్లు కొన్నిగాథలు పలికె. వినుతు వినుము.

అయ్యయ్యో! కామకశ్మలచేతసుండనైన నా మోహవిస్తారి మేమనుకొందును! ఉర్వశీగృహీతకంఠుండనై దివారాత్రముల యూపమున నాయువు క్షీణించుట స్మరింపనైతిని. అయ్యో! యూ వెలయూలిచే నపహృత వివేకుండనై యిప్పుడు నిర్ముక్తుండనైన నేను సూర్యోదయాస్తమానంబులఁగాని యేండ్లు పూండ్లు గడచుట గాని యెఱుఁగనైతి. కట్టా! నాయాత్మ సమ్మోహ మేమనుకొనుదును. నరదేవశిఖామణినైన చక్రవర్తినయ్యు నొక్క యాఁడుది క్రీడామృగంబువలె నాడింప నాడుచుంటిని. భోగ్య, భోగోపకరణ, భోగస్థానాది సహితుండను సార్వభౌముఁడనగు నన్ను గడ్డిపరకవలెఁ ద్రోచివైచి పోవు నాఁడుదాని వెంట దిసమొలతో వేదురెత్తినట్లు ఏడ్చుచుఁ బోయితిని. ఛీ ఛీ యేమిటిబ్రతుకు. ఆఁడుగాడిద గాళ్ళఁదన్నిన దాని వెంటఁబోవు మగగాడిదవలె నన్ను నిరాకరించిపోవు స్త్రీ వెంటఁ బోయిన నా యీశత్వము మాహాత్మ్యము తేజము గాల్పనా? స్త్రీచే నపహృతచిత్తుండైన మనస్సుగలవాని విద్యయేల తపమేల త్యాగమేల శ్రుతమేల యేకాంతవాసమ్మైన మౌనము వహించియునేల? స్వార్థమును నెఱుఁగుఁడ మూర్ఖుఁడఁ బండితమానినగు నాకేమి ప్రభుత్వము.

థూథూ! గోఖరంబులవలె స్త్రీచే జతుఁడనైతి. ఏంత్ల కొలఁదిగ నుర్వశి యధరాసవంబుఁ గ్రోలినను నాహుతాలచే వహ్నివలె నా కామము తృప్తిగొనినది కాదు. లంజియచే నపహరింపబడిన మన స్సును దాని సంగమునుండి వదలించుటకు నాత్మారామేశ్వరుఁడు భగవంతుఁడు నగు నధోక్షజుఁడు తప్పఁ దక్కువారు సమర్థులుకారు. ఆ వేలుపుసాని మంచి మాటలచే నెంతి బోధించినను నజితాత్ముఁడ నగుట మనోగతంబైన మహామోహంబు వదలినది కాదు. దాని ననరాదు. త్రాటినిజూచి పామని భ్రమించుట మనుష్యుని భ్రాంతిచేఁ గదా. అట్టివాని కాత్రా డేయపరాధము గావించెను. కాలఁద్రోచినఁ బోదా? అట్టులే దేహాత్మల యాథాత్మ్యంబెఱుంగని యజితేంద్రి యుఁడ నగు నేనే నింద్యుఁడ. దుర్గంధాదులచేఁ బూరితంబై యశుచి యగు నీ మలీమస దేహం బెక్కడ? సుగంధాది గుణము లెక్కడ? స్వరూపజ్ఞానంబు లేమిచేఁ జెడితిని. చెడితిని జెడితిని.

ఈ దేహంబెవరిది? కనిపెంచుటచేఁ దల్లిదండ్రులదా? భోగ్యం బగుట భార్యదా? తదధీనంబగుట స్వామిదా? కడపటఁ గాల్చునది కావున నగ్నిదా? భక్ష్యంబగుటఁ గుక్కలది గ్రద్దలదా? సుఖదుఃఖ భోగాయతనం బగుటఁ నాత్మదా? ఉపకార్యత్వమున సుహృన్నులదా? ఇట్లాలోచించిన నిది యెవరిదో పరులసొత్తగుటచే దీనియం దాసక్తి గలిగి దుఃఖింప నేల? స్వరూపజ్ఞానంబు లేనివాఁడు తుచ్ఛనిష్ఠుఁడై యమేధ్యంబయిన కళేబరంబుఁ గని యోహో యేమి ముక్కుచక్కన! యేమికనుబొమలసొగయలు!! బొందరహాసనదనము వదనము!!! ఆహా దీని కన్నులు చెన్నులు. ఓహో నిక్కు టెక్కు మేని వన్నెలు బలే బలే యేమి నడలు! ఏమి జడలు!! ఏమి తొడలు!!! అని మురుఁబు గొనుచున్నాఁడు గాని యవి చీమిడికిఁ బూసికి నెమ్ములకుఁ జీము నెత్తురులకు గ్రొవ్వులోనగు వానికి నిలయంబు లగుట యూ యంధుఁడు పరికింపఁడు. తోలు, మాంసము, నెత్తురు, క్రొవ్వు, మేదస్సు, మజ్జ, యెముకలు కలిగి మూత్రపురీష పూరితంబైన దేహంబువందు రమించునట్టి పురుషునకుఁ బురుగునకు భేదమేమి?

ఇట్టులగుట నాత్మహితంబుగోరువాఁడు స్త్రీలతోఁగాని స్త్రీవశ్యులతో గాని కలసి యుండరాదు. విషయేంద్రియ సంయోగంబు వలననె మనస్సు క్షోభ చెందుఁ గాని యితరవిధమునఁ గాదు. కనని వినని పదార్థములచే మనఃక్షోభంబు కలుగదు. అట్టి సంయోగంబు లేని యింద్రియంబులు నిశ్చలంబులై రాగాదులఁ గలుషితంబులు గాక యుండును. కావున స్త్రీలతోడను దత్సంబంధులతోడను నింద్రి యంబులతోడను, సంగంబు కర్తవ్యంబు గాదు. పండితులకైనను నింద్రియములు నమ్మరానివై యుండ నాయట్టివారి మాటనేమి చెప్పవలయు? అని యిట్లా నరదేవ దేవుండు గీతంబులు పలికి యుర్వశీలోకంబు విడిచి యాత్మయందుండు నన్ను నుపాసించి సాక్షాత్కారంబుఁ గావించుకొని జ్ఞానంబున దేహాత్మాభిమానరూప మోహంబునుబాసి ముక్తుఁడయ్యె. కావున బుద్ధిమంతుఁడు దుష్ట సాంగత్యము వదలి సజ్జన స్నేహంబుఁ గావింప వలయు. సాధువు లిట్టివారి మనోవ్యాసంగంబును దాని యందలి దోషంబుల నిరూపించు మాటలచే ఛేదింతురు.

## —♦ సాధువుల లక్షణము ♦—

సాధువు లెట్టివారందువేని వినుము. నాకంటె నితరములయిన విషయములం దభిలాష లేనివారు, నాయందేచిత్తంబు నిలిపినవారు రాగాదులఁ గలుషితంబు గాని మనస్సుగలవారు, చిదచిదాత్మకమైన సమస్త ప్రపంచము బ్రహ్మాత్మకంబని చూచువారు, దేహమందును దదనుబంధములందును నహంకార మమకారములు లేనివారు, నిర్ద్వం ద్వులు, నిష్పరిగ్రహులు నగువారు సాధువులు. మహాభాగా! యిమ్మహాభాగులు నా కథలు సర్వదా చెప్పుకొనుచుందురు. అవి నరులను పాపములనుండి పవిత్రులఁ జేయును. నాకథలను వినువారు, కీర్తించువారు, నామోదించువారు, నాదరించువారు, మదారాధనా సక్తులు, శ్రద్ధావంతులు, నాయందు భక్తి గలవారగుదురు. అనంత గుణుండను, బ్రహ్మంబును, నిరతిశయానంద జ్ఞానస్వరూపుండను నగు

నాయందు భక్తి లభించెనా సాధువుల కావలఁ గోరఁదగిన దేది? భగ వంతుఁడగు నగ్నిని నాశ్రయించిన వారికి శీతాంధకార భయంబు వలె సాధువుల సేవించు వారికి నజ్ఞాన సంసారభయంబులు నశించు. నీట మునింగిన వారికి దృఢమైన నావవలె సంసారసాగరంబున మునిఁగి తేలుచుండు వారికి బ్రహ్మవిదులు శాంతులు నగు సాధువులే దిక్కు. ప్రాణుల కన్నంబె ప్రాణంబు. ఆర్తులకు నేనే శరణము. మర ణించిన వారికి ధర్మమే రక్షకము. ఇహలోక వాసులకు ధనమే దిక్కు. సంసారభీరువులకు సాధువులే ప్రాపు. ఉదయించు సూర్యుండు బాహ్య చక్షువులకు దృష్టి పాటవముఁ గలిగించును. సాధువులో చిరచిరీశ్వర సాక్షాత్క జ్ఞానాత్మకమగు నేత్రము లొసఁగుదురు. కావున సాధువులే దేవతలు. బంధువులు వారే. వారే నా యాత్మ. వారే నేను. పురూరవుండును నుర్వశీలోక నిస్పృహుఁడై ముక్త సంగుఁడై యాత్మారాముఁడై భూసంచారముఁ గావించెఁగదా.

## —♦ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు భక్తియోగము వివరించుట ♦—

అనిన నుద్ధవుం డిట్లనియె. పురుషపుంగవా! సాత్వతులు నిన్ను నేవిధముగ నర్చింతురో యట్టి నీ యారాధనంబైన క్రియా యోగంబు నాకు బోధింపుము. భగవంతుఁడైన నారదుఁడు వ్యాసుఁడు నుద్గురువైన బృహస్పతియు లోనగు మునులు నరులకు మోక్షకరంబైన పరమోపాయ మిదియేయని చెప్పుచున్నారు. ఈ విధానము నీవలన నే విని బ్రహ్మ తన పుత్రులైన భృగు ముఖ్యులకును, శివుఁడు తన దేవి యగు పార్వతికిని, నుపదేశించిరి. ఇది సర్వవర్ణముల వారికి సర్వాశ్రమ ములవారికి స్త్రీలకు శూద్రులకును, సహమై నిశ్రేయసకరంబులం దుత్తమమని తలంచెద. కమలాక్షా! విశ్వేశ్వర! భక్తుఁడును ననురక్తుఁ డును నగు నాకొఱకుఁ గర్మబంధ విమోచనంబైన త్వదారాధన క్రమంబుఁ జెప్పుము. అనిన భగవంతుఁ డిట్లనియె.

మదారాధన కర్మకాండ మపార మనంతము గావున ననుపూర్వ ముగ సంక్షేపముగఁ జెప్పెదను, నా పూజావిధము తాంత్రికము

వైదికము మిశ్రమని మూఁడువిధములు. తాంత్రికము పంచరాత్ర తంత్రోక్తము. పాంచరాత్రము పరమ వైదికమైనను గోబలీవర్ద న్యాయమున వైదికమనునది వేదత్రయ సిద్ధ ధర్మమందు వర్తించు. గర్భాష్టమైకాదశ ద్వాదశ సంవత్సర కాలంబున నుపనీతుండై ద్విజుండగు పురుషుండు శ్రద్ధచే భక్తిచే నన్నారాధించు క్రమంబుఁ జెప్పెద వినుము. చక్రపద్మ మండలంబులందో ప్రతిమలయందో కాదేని యగ్నియందో, సూర్యునియందో, నీటియందో, హృదయమునందో, బ్రాహ్మణునియందో, భక్తియుక్తుండై గంధకుసుమాది పూజాద్రవ్యములచే ఫలకాంక్షలేక నిర్వంచనబుద్ధి స్వగురుండగు నన్ను నర్చింపవలయు. తొలుతఁ బలుదోమి దేహశుద్ధికై వైదిక తాంత్రికు లిరువురు మృద్గ్రహణాదుల మంత్రయుక్తముగ స్నానము గావింపవలయు. ఆవల సంధ్యోపాసనాదిగ మదీయ చోదితంబులైన వేద కర్మములు కావింపవలయు. ఇట్లు కావించునెడఁ గర్మపావనమగు పూజను సంకల్పింపవలయు. శిలామయము, దారు స్వర్ణ రజత తామ్రాద్యన్యతమమయము, మృచ్చందనాదిమయము. చిత్రపటమయము, సైకతమయము, మనోమయము, మణిమయము నని ప్రతిమ లష్టవిధములు. ప్రాణప్రతిష్ఠ చేయఁబడిన నా ప్రతిమ చలమనియు నచలమనియు రెండు విధంబులు. అచల ప్రతిమాపూజయం దావాహనో ద్వాసనములు గలుగవు. చలములం దా రెండు వికల్పములు. స్థండిలమందా రెండును గలవు. విలేప్య, లేఖ్య, సైకతములందుఁ దప్పఁ దక్కినవానియందు స్నానము కర్తవ్యము. లేప్యాదులందు మార్జనంబు మాత్రము ఫలకాంక్షచే నన్ను నారాధించువారు విధాయకశాస్త్ర ప్రసిద్ధంబులైన సర్వ ద్రవ్యములచే నన్నారాధింపవలయు. ఫలకాంక్ష లేని నాభక్తులు హృదయభావలబ్ధ ద్రవ్యములను మనస్సుచేత సమర్పింపవలయు. హృదయపూజయందు మానసోపచారముల చేతనే నన్నర్చింపవలయు. అర్చలయందు స్నానాలంకరణంబులు నాకుఁ బ్రియంబులు. స్థండిలమందు యథాస్థానములందు నంగప్రధాన దేవతా విన్యాసమును గాది మావసాన వర్ణబోధ్య పంచవింశతి తత్త్వంబులు దత్తద్వర్ణోచ్చారణముల విన్యాసము నాకుఁ బ్రియతమము.

సూర్యార్చనమం దుపస్థానమున నారాధింపవలయు. జలమునందు జలగంధ పుష్పాక్షతలఁ దర్పణాదుల నర్పింపవలయు. వహ్నియం దాజ్యహోమము హవిస్సు ప్రియతమములు. భక్తుఁడు శ్రద్ధాభక్తుల నర్పించు నీరైనను శ్రేష్ఠము. ఇఁక గంధధూపపుష్పదీపాన్నాదు లర్పించినఁ జెప్పనేల? అభక్తుఁ డెంతవిశేషించి యేది యిచ్చినను నాకు సంతోషము కలుగదు.

శుచియు సంపాదిత పూజాపదార్థుండునై దూర్వ కొనలుగ దర్భలు పఱచి యాసనముఁ గల్పించుకొని తూర్పుముఖమై కాని యుత్తరముఖమై కాని విగ్రహమునకు నెదురుగఁ గూర్చుండవలయు. అంగన్యాసము కరన్యాసముఁ గావించి మాతృకా ప్రణవ మూల మంత్రములచేఁ గృతన్యాసంబైన నా ప్రతిమను బాణిచే స్పృశింపవలయు. ప్రోక్షణీయకలశంబును నెడమపార్శ్వంబున నుంచుకొనవలయు. ఆ కలశోదకముచేఁ బూజాస్థలమును ద్రవ్యములను దన దేహమును మూఁడు పాత్రములను బ్రోక్షించి తులసీ దూర్వాంకుర విష్ణుక్రాంత కస్తూరాదుల నర్పింపవలయు. శుద్ధోదకమునకు, నర్ఘ్యోదకమునకు, స్నానీయోదకమునకు మూఁడు పాత్రములుంచుట ముఖ్యము. ఆరాధకుఁడు పాద్యాదులకై యుంచిన మూఁడు పాత్రములను హృదయమంత్రంబున శిఖామంత్రంబున, విష్ణుగాయత్రిచేతను మంత్రింపవలయు. శోషణ దాహన ప్లావనంబుల శోధిత శరీరుఁడై హృదయపద్మంబున నుండునదియు మహాత్మకమైనదియు దేహేంద్రియాది విలక్షణమైనదియు సదాస్వరూపమైనదియుఁ ప్రణవాంత మకారమంబుఁ బ్రతిపాదింపఁబడి యోగులచే ననుభావితంబయిన జీవస్వరూపాత్మకంబైన జ్ఞానస్వరూపమును ధ్యానింపవలయు. స్వస్వరూప భూతంబయిన యా జీవకళ యింటియందు దీపప్రభవలె ధర్మభూత జ్ఞానము * వ్యాపించినట్లు ధ్యానించి తన్మయుఁడై

* ధర్మభూతజ్ఞానము = జీవునకు రెండువిధములైన జ్ఞానములు గలవు. తన్నుఁ దాఁ దెలిసికొనునది యొకటి. ఇతర పదార్థములఁ దెలిసికొనునది యొకటి. రెండవది ధర్మభూతజ్ఞానము.

యిట్లు సంస్కృత శరీరహృదయ పద్మమునఁ దొలుత మానసోప చారంబుల నన్నర్చించి యావల నర్చావిగ్రహంబునకు నావాహనాది కంబులు గావించి హృదయాద్యంగ దేవతయగు నన్నుఁ బూజింప వలయు. అర్ఘ్యపాద్యాచమనాద్యుపచారంబులఁ గల్పింపవలయు. ధర్మాదులఁ దొమ్మిదింట నా కాసనంబుఁ గల్పింపవలయు. అష్టదళ పద్మంబును, గర్ణికాకేసరోజ్జ్వలంబుగ వేదతంత్రంబుల రెంట స్వర్గాప వర్గ సిద్ధికై నాకుఁ గల్పింపవలయు. సుదర్శన పాంచజన్య గదాపద్మ ధనుర్హ్వలంబులను ముసల కౌస్తుభ వనమాలా శ్రీవత్సంబులను, బూజింపవలయు. నంద సునంద గరుడ చండ ప్రచండ బల మహాబల కుముద కుముదేక్షణ దుర్గావినాయక వ్యాస విష్వక్సేన గురుసురు లను, వారివారి స్థానంబుల దేవుని కభిముఖులఁ గావించి ప్రోక్షణా దులఁ బూజింపవలయు. విభవంబు గలదేని ప్రతిదినము చందనోశీర కర్పూర కుంకు మాగురు వాసిత సలిలంబుల మంత్రయుక్తంబుగ స్నాతుఁ గావింపవలయు. సువర్ణం ఘర్మం పరివేద నేనేత్యాది స్వర్ణఘ ర్మానువాకంబులచేతను, "జితంతే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన నమస్తేస్తు హృషీకేశ మహాపురుషపూర్వజ" యను మహాపురుషవిద్య చేతను, బురుషసూక్తంబుచేతను సామసీరాజనాదులను స్నానంబుఁ జేయింపఁదగును. నా భక్తుండు వస్త్రోపవీతాభరణ తులసీపత్ర పుష్ప హార గంధలేపనంబుల నన్ను సప్రేమంబుగ యథోచితంబుగ నలంక రింపవలయు. పాద్యాచమనీయ గంధపుష్పాక్షతలు ధూపదీపోపహా రంబుల నర్చకుండు నాకు శ్రద్ధతో నొసంగవలయు. ఉన్నయెడల గుడపాయసఘృత శష్కుల్యాపూపమోదకంబులను, గోధుమపిండిచేఁ జేయఁబడిన భక్ష్యంబులను సూపంబును నాకు నైవేద్యంబుగఁ గల్పింపవలయు. అభ్యంగోన్మర్దనాదర్శ దంతధావన పంచామృత స్నానం బులు నన్నాదులు గీతనృత్యంబు లేకాదశ్యాదులందును విభవంబు గలదేని నిత్యమును గావింపవలయు.

ఇఁక నగ్నియందుఁ బూజించుప్రకారము చెప్పెద వినుము. తంత్రోక్త విధానంబున నిర్మింపఁబడిన కుండమందుఁ గాని స్థండిల

మందుఁ గాని నగ్నినుంచి ప్రజ్వలింపఁజేసి పాణిచే నొక్కొక్కటిఁ ద్రోయవలయు. దర్భలుపఱచి ప్రోక్షించి స్వగృహ్యోక్త విధిప్రకారము సర్వ మగ్నిముఖమున సంకల్పించి ప్రోక్షణపాత్రోదకముచే నాజ్యస్థాలీప్రభృతికరణంబులఁ బ్రోక్షించి యగ్నియందు నన్ను భావింపవలయు. తప్తకనక సమానుండును, శంఖచక్ర గదాపద్మ విలసిత చతుర్బాహుండును, కింజల్కవర్ణ వస్త్రుండును, స్ఫురత్కిరీట కటిసూత్ర వరాంగదుండును, శ్రీవత్సవక్షుండును, కౌస్తుభ విరాజితుండును, వనమాలియునగు నన్ను ధ్యానించి యర్చించి నేతిలో ముంచిన సమిధలచే దేవతలనుద్దేశించి యగ్నిలో నునిచి యావల శ్రీమదష్టాక్షర స్వాహాంతంబైన మూలమంత్రంబుతోఁ బురుషసూక్త షోడశఋగవదానంబుతో నాజ్యప్లుతహవిస్సు హోమంబుగావించి యథాన్యాయంబుగ ధర్మాదుల కాహుతులు వేల్చి స్విష్టకృతాహుతి సల్పి యావల వహ్నియందావాహితుండైన భగవంతు నర్చించి నందాది పార్షదులకు నెనిమిది దిక్కుల బలివైచి నారాయణాత్మకంబైనమూల మంత్రంబున నన్ను ధ్యానింపవలయు. ఆవల విష్వక్సేనున కాసనం బర్పించి యుచ్ఛేషంబు సమర్పించి కర్పూరాది యుక్తంబైన తాంబూలాదికంబుల ముఖవాసంబుల నొసఁగి మరలఁ బుష్పాంజలిఁ బూజింపవలయు. నా చరిత్రంబులఁ బాడుచు, నాడుచు, మత్కార్యంబు లభినయించుచు వినిపించుచు వినుచు ముహూర్తకాలంబు వ్యాపారరహితుండై యుండి శ్రౌతపురాణ ద్రవిడాంధ్రభాషాత్మక నానావిధస్తుతుల స్తుతించి దేవా! భగవంతుఁడా! న న్ననుగ్రహింపుమని దండమువలెఁ బడి నమస్కరింపవలయు. తన రెండుచేతుల నా పాదంబుల రెంటిని గ్రహించి యీశ్వరా! మృత్యుతుల్య సంసారమునకు భయపడు న న్నీసముద్రమునుండి తరింపఁజేసి రక్షింపుము. అని ప్రార్థించి మదుపభుక్తంబైన తులస్యాదుల సాదరంబుగ శిరంబున ధరించి యుద్వాస్యంబయిన మజ్జ్యోతిని మరల నంతరాత్మయందు నుద్వాసనము చేయవలయు. ప్రతిమాదులందు దేనిపై నెవనికి శ్రద్ధ కలుగునో దానియందు సర్వభూతములకాత్మనై ధారకుండుగ సర్వ

గొలిరకుండుగ నన్ను నర్చింపవలయును. ఇట్టి క్రియాయోగమార్గం బున వైదికులైనను దాంత్రికులయినను నర్చించిరేని యుభయలోకములయందుఁ గోరినదానిని నావలనఁ బొందఁగలరు. మదీయ ప్రతిమను స్థాపించి మందిరంబు దృఢంబుగఁ గట్టింపవలయు. పూజా యాత్రోత్సవంబుల కనుకూలపడునట్లు రమ్యంబులగు పుష్పోద్యానములఁ బ్రతిష్ఠింపవలయు, మహాపర్వంబులఁగాని ప్రతిదినముగాని పూజావిధానము తప్పక జరుగుటకు క్షేత్రంబు లర్పించియుఁ బుర గ్రామంబు లొసంగియు మత్సమానైశ్వర్యంబును బొందుదురు. విగ్రహ ప్రతిష్ఠచే సార్వభౌమమును మందిరనిర్మాణంబున ముల్లోకములను బూజచే బ్రహ్మలోకంబును నీ మూఁడింట నా సామ్యమును నరుఁ డొందును. అపేక్షా రహితుఁడై యీ విధముగ భక్తియోగముచే నాచరించువాఁడు భక్తియోగి యగును. ఆ భక్తియోగ బలంబున నన్నుఁ బ్రాపించును. స్వదత్తంబుఁగాని పరదత్తంబుఁగాని దేవాదాయ బ్రాహ్మణాదాయంబులఁగాని హరించువాఁ డయుతాయుత సంవత్సరంబుల మలభక్షకుఁడై జనించు. ఇట్లుచేయు కర్తయుఁ దత్సహకారియు ననుమోదితుండును బ్రేరకుండును నా ఫలంబున సమభాగంబులుగఁ బంచుకొని యనుభవింతురు.

సర్వము ప్రకృతిపురుషయుక్తమై మదంతర్యామికంబై దేహాత్మకంబని తలఁచి పరుల స్వభావకర్మంబుల నిందింపనురాదు ప్రశంసింపను రాదు. పరస్వభావ కర్మముల నిందించువాఁడును బ్రశంసించువాఁడను దేహాభిమానముచే శీఘ్రకాలంబున స్వార్థంబయిన జ్ఞానయోగంబునుండి భ్రష్టుఁడగును. అహంకార కార్యంబయిన దేహాత్మాభిమానముగల జీవుఁడు నిద్రాతుల్యమైన యవిద్యనొంది దేహస్థుఁడై నకలంబున సుప్తసంజ్ఞానుండై మృత్యుతుల్యంబై నూత్నరూపంబున ప్రకృతికేఁ దిరోహితుఁడగుచున్నాఁడు. అట్లానే నానావిధ దేహాభిమానియగు పురుషుఁడును మేలుకొనియుండియుఁ దత్త్వజ్ఞాన రహితుఁడై నిద్రపోవువానితో సముఁ డగుచున్నాఁడు. ఏకవిధస్వరూపమునఁనుండక నానావిధంబగు దేహమునకు మంగళమయిన నేమి?

అమంగళమన నేమి? దేవాది శరీరములు క్రిమ్యాది శరీరములు ప్రకృతిపరిణామ రూపములై తారతమ్యము లేనివగుటను నిషేక గర్భాది కాలకృతావస్థాముల నభేదం బగుటను మంగళామంగళ విచారమేల? అహ మభిమానాస్పదము శుక్లాదితంబు మనోధ్యాతంబు నగు దేవాది శరీరంబు సత్యంబుగాదు. దేహగత దేవత్వాదికం బాత్మయం దెట్లు సత్యంబగు? కావున దేహదృష్టిచే నిందగాని స్తుతిగాని యుక్తంబుగాదు. ఆత్మయందు దేహగతాకారం బసత్యంబయ్యె నేని యుట్టి యసత్యపదార్థంబునందలి యభినివేశ మనర్థక మెట్లగునందు వేని యసత్యంబయ్యు రాత్రిసత్యముచేఁ బ్రతీయమానంబగు ఛాయ భయముగలిగించుఁగదా? అట్టులే ప్రతిశబ్దము స్వప్నబాధకవర్గంబున సత్యంబయ్యు స్వయముగఁ గార్యమేదియుఁ జేయఁజాలకుండియు యథార్థము గ్రహింపఁజాలనివారియందు దేహకంపాది కార్యకరణ సమర్థకంబు లగుచున్నవి. ఇట్టులే దేహాదిభావము లసత్యంబు లయ్యుఁ బ్రాకృత ప్రలయపర్యంతంబు సంసారభయ కారణంబులగు. ఈ సర్వప్రపంచంబు పరమాత్మయే. ఆయనయే ప్రపంచముగ సృజింపఁబడును, సృజించును. రక్షింపఁబడును, రక్షించును. ఆ విశ్వాత్ముఁడే సమర్థుఁడై హరించును, హరింపఁబడును. ఇట్లు బ్రహ్మాత్మకంబు గానివస్తువే లేదు. కావున నిందయుఁ బ్రశంసయు నుపేక్షయు నను నీ మూఁడును బ్రమాణశూన్యంబు గావున భ్రమాత్మకంబులు. కానవచ్చుచున్న జగంబు సత్త్వాది ప్రకృతిగుణవికార రూపంబు కావునఁ బరిణామాదులైన వికారంబులు గుణగతంబులు, గుణమయమునకుఁ బరమాత్మ యెట్లుపాదానకారణ మందువేని సంకల్పరూపజ్ఞానముచే గుణములందుఁ బ్రవేశింపఁజేసి యని తలంపుము. ఆయన సర్వాత్మకుండుగదా. ప్రకృతిపురుషుల పరస్పర వైలక్షణ్య జ్ఞానమును నారెంటికంటెఁ బరమపురుషుఁడు విలక్షణుఁడను విజ్ఞానముగల విప్రులు దేనిని నిందింపరు, స్తుతింపరు. సూర్యునివలె గుణదోషాభినివేశ రహితులై సంచరింతురు. ప్రత్యక్షానుమాన వేద స్వానుభవములను

ప్రమాణములచేఁ బుద మొదలుఁగల దేదియైనను నసత్తని వాటింగి నిస్సంగుఁడై చరించు. అనిన నుద్ధవుఁ డిట్లనియె.

పరమాత్ముఁడు స్వయముగ నవ్యయుఁడు నగుణుఁడు శుద్ధుఁడు స్వప్రకాశకుఁడు నావరణరహితుఁడునై యగ్నివలె నుండువాఁడు. దేహమన్ననో దారువువలె జడంబు. ఇందు దేనికి సంసారం బనిన భగవంతుఁ డిట్లనియె.

—♦శ్రీకృష్ణుం డుద్ధవున కాత్మకు సంసారము లేదని చెప్పుట.♦—

ఆత్మకు స్వతస్సిద్ధసంసారము లేకుండినను నవివేకముచే దేహేంద్రియ ప్రాణసంబంధమునం జేసి సంసారంబున్నట్లు తోఁచు. ఇట్టు లహంకార మమకారత్వంబులైన పుణ్యాపాపంబుల కధీనమైన ప్రకృతి సంబంధంబునం జేసి యాత్మకు సంసారము గలుగు. స్వప్నం బనర్థాగమమయినట్టు లాత్మకు సంసారము లేకున్నను విషయంబుల ధ్యానించుచుండువఱకు సంసారంబు తొలఁగదు. దేహమెఱుంగక నిద్రించువానికి స్వప్నమువలన ననర్థకంబులు పెక్కులగును. అతఁడు మేలుకొనె నేని యతనిని స్వప్నము మోహింపఁజేయ జాలదు. శోకహర్ష భయ క్రోధ లోభ మోహ స్పృహాజన్మమరణాదు లహంకార యుక్తుఁడైన యాత్మునకుఁ గలుగునుగాని దానిని విడిచి యుండువానికిఁ గలుగవు. దేహేంద్రియ ప్రాణమనంబులం దభిమానంబుగల జీవునకు సంసారంబు కర్మానుష్ఠానంబునఁ గలుగు. గుణ కర్మములు తనకు విధేయంబులుగఁ గలుగు నంతరాత్మకు ఫల ప్రదత్వంబు సంసారహేతువగు. అహంకారంబు సూత్రభూతంబు. సంసారంబు కాలవశంబై ప్రవర్తించు. దేహాదిబహురూప రూపితంబై మనోవాక్ప్రాణ శరీరకృతకర్మము సంసారమూలంబు. బహురూప రూపితంబగు దీని సమూలంబుగ మదుపాసనంబను కరవాడి ఖడ్గముచే ఛేదించి ముని విగత తృష్ణుఁడై భూసంచారము గావించు. అట్టి జ్ఞానము, వివేకము, శాస్త్రాధ్యయనము, తపస్సు, ప్రత్యక్షాను భవము, నుపదేశము, ననుమానము వీనిచేఁగలుగు దేహమున

కార్యాంతరంబుల నెట్టిది కేవలంబైనయంశము పరమాత్మ స్వరూపమే సాధ్యమగును. ఇట్టి యాత్మకు దేహసంబంధమునకుఁ గారణమే సెంతున్న. పుటము వేయఁబడిన బంగారమే కడియములు కిరీటము లగుటకు ముందును వెనుకను నుండునట్లు సంధ్యమునందు నానా నామముల వ్యవహారయోగ్య మగుచున్నది. విశుద్ధమైన బంగారు కటకమకుటాదులుగాఁ జేయఁబడినపుడు వెండి లోనగు లోహములతోఁ గలిగియున్నది. అట్లు కలిసినను దానిచేనైన భూషణము బంగారు భూషణములనియే వ్యవహరింపఁ బడును. బంగారమును నేగు సొమ్ముగాఁ జేయుటకు ముందును దానిని వెలికి పుటము వేసిన తరువాతను దానికి జల్లుతో ధాతుకే నగా నున్నట్టుమును వెల్లునుగాని నడుమనుఁగలసిన వెండికిఁ జెల్లదు. అట్లనే దేహసంబంధమునకుఁ బూర్వమును నది తొలఁగినపిమ్మటను నాత్మయట్లు దేహమునకంటె భిన్నుఁడై యట్లే మధ్యకాలమందును విలక్షణుఁడే. దేహముతోఁ జేరినంతమాత్రమున 'నే'నను నది తన కన్వయింపదని దేహమునకన్వయించునని యనుకొనుట భ్రాంతిచేతనే. కారణంబైన యింద్రియవర్గంబు, కార్యంబైన శరీరంబు, కర్తయగు నహంకారతత్త్వము నని త్రిగుణపరిణామాత్మక మచేతనము నీ మూఁడును నన్వయ వ్యతిరేకముల నవస్థాత్రయరహితంబగుట తుర్యంబని చెప్పఁబడు నాత్మతత్త్వంబునందుఁ బ్రవర్తింపఁజాలవు. ఆ యాత్మతత్త్వంబు పరిణామరహితంబగుట సత్యంబు. ఇట్టి జ్ఞానంబె విజ్ఞానంబు. ఆత్మ దేహాంతరంబుననుండ నింద్రియాదులకుఁ బ్రవృత్తి చెప్పుట యన్వయంబు. అది తొలఁగినఁ బ్రవృత్తి లేదనుట వ్యతిరేకంబు. శరీర మది పుట్టుటకుముం దాత్మ కాదు. నాశానంతరము నాత్మ కాఁజాలదు కావున మధ్యంబునందును నాత్మ కాఁజాలదు. నేను లావు నేను బొడుగని చెప్పుట వ్యవహారమాత్రంబె. అట్టి వ్యవహారంబు భ్రాంతిమూలకంబు. దేహము పుట్టుటకుముందు నశించినపిమ్మట నేది ప్రమాణముచేఁ బ్రసిద్ధమో యట్టి యాత్మతత్త్వమే సదా యేకరూపంబై యుండు. ప్రకృతి వికారరూపంబైన రాజసంబే శరీరరూపంబుగ సృజింప

బడిన పదార్థం బాత్మయందు నవిద్యమానంబయ్యు స్వాభిమాన విష యత్వముచేఁ బ్రతీయమానంబగు బ్రహ్మంబు పరిశుద్ధంబు జీవాత్మ స్వరూపంబును స్వయంజ్యోతియుఁ గావునఁ బ్రకాశించు ప్రకృతియో యింద్రియ విషయరూపక వికారములచే జిత్రంబుగఁ బ్రకాశించు. ఇట్లు స్ఫుటంబుగ బ్రహ్మంబును బ్రకృతి పురుషులు వేఱువేఱను నిర్ణయమునకు హేతువులగు విచారాత్మక జ్ఞానములచేతను, దేహేం ద్రియ ప్రాణాదులయం దాత్మతత్త్వ మారోపింప కుండుటచేతను, నాత్మసమ్మోహంబును ఛేదించి స్వానందతుష్టుండై కర్మలసంగతిమాన వలయు. పృథివీసంబంధమైన దేహం బాత్మగాదు. దేహశబ్ద వాచ్యంబు లైన యింద్రియంబులును నాత్మగావు. ప్రాణము వాయువు జలమును నగ్నియు నాత్మగావు. అన్నమాత్రంబగు మనంబు బుద్ధియు నంతఃకరణ మహంకార మాకాశము భూమి యునాత్మగావు. ఇవి యెల్లఁ బ్రకృతి పరిణామాత్మకముచే దేహంబుతో సమంబగుట నాత్మ యెట్లగు? నా స్వరూపంబు చక్కఁ దెలిసినవానికి సత్త్వాదిగుణ పరిణామాత్మ కంబులైన యింద్రియంబులు సమాహితంబులైన నందేమి గుణము కలదు? అట్లుగాక విక్షేపంబులైనచో నేమి దోషము? సూర్యుని మేఘములు గ్రమ్మిన నాయన కేదోషంబు కలదు? క్రమ్మకుండిన గుణంబు కలదా? సూర్యునకు మేఘమునకు సంబంధములేదు గావున నీ దృష్టాంతము చెల్లదందువేని యాకాశ వాయ్వగ్ని జలభూగుణంబు లైన శోషణ దహన క్లేదన రజో ధూసరత్వాదులును, ఋతుగుణంబు లైన శీతోష్ణాదులును, నభంబునంటనిపగిది నక్షరంబై సదైకరూపంబై ప్రకృతి విలక్షణుండనైన నేను సంసృతి హేతువులైన సత్త్వాది కార్య ములతో సంబంధించువాఁడను గాను గావునఁ గాముకసంగంబు దోషావహంబు గాదు. అయినను నెంతవఱకు వస్త్రమునంటిన కషాయవర్ణము నలెఁ దొలఁగింపరాని కామక్రోధాదులు భక్తియోగ ముచే నిరసింపఁబడి యాభక్తి వృద్ధియగునో యంతవఱకుఁ బ్రకృతి వలనఁ గలిగిన శబ్దాదిగుణముల సంగంబు పరివర్జనీయంబు. చక్కఁగఁ జికిత్స చేయఁబడని రోగము మరలమరల మొలకయెత్తి దేహమును

బయిన సంసారంబును దొలఁగించును. ఈ పరిశుద్ధ జీవాత్ముఁడు స్వయంప్రకాశకుఁడు. జన్మాది వికారరహితుఁడు. ప్రత్యక్షాది ప్రమాణంబులఁ బరిమాణము చెప్పరానివాఁడు. అపరిచ్ఛిన్న ధర్మ జ్ఞానముగలవాఁడు, సర్వార్థ గోచర జ్ఞానవంతుఁడు. అనేక ద్రవ్యాత్మ కుఁడుగానివాఁడు ప్రాకృతదేహరహితుఁడు. కావుననే దేవ మను ష్యాది శబ్దములకు విషయముగాక తద్ద్వారతి హేతుభూతుఁ డగు చున్నాఁడు. ఆయనచే ప్రేరితంబులై వాక్ప్రాణంబులుచరించు కేవల జ్ఞానైక స్వరూపుడైన యాత్మయందు 'నేను దేవతను' 'నేను మను ష్యుండను' 'నేను కృశుఁడ' లోనగు భేదము లభిమాన భేదంబునఁ గలుగు. స్వాత్మను వదలినయెడల నట్టి భేదమున కేది యాధారము? దేవ మనుష్యాది రూపంబులచే గ్రాహ్యంబై పంచభూతారబ్ధమగుటఁ బంచవిధంబైన శరీరంబును నేను బలసినవాఁడను నేను జిక్కినవా డను ననెడి యీ రెండును నిత్యమని పండితమ్మన్యులు తలంతురు. యోగము పక్వముగాని యోగికి యోగంబు దేహసంబంధములైన రోగాద్యుపద్రవములచే నిహతంబయ్యెనేని దానికిఁ బ్రతివిధానం బిట్టు లాచరింపవలయు. సోమ సూర్యాగ్ని ధారణలచే సంతాపశైత్య ములను, నాసనములచే వాతాది రోగములను, దపో మంత్రౌషధం బులఁ బాపగ్రహసర్పాదులను, మద్ధ్యాననామకీర్తనంబులఁ గామాదు లను, యోగనిష్ఠ సదాచార్యవృత్తిచే దంభాదులను, నిట్లునమపాయం బుల నశుభంబులైన యుపద్రవంబులను నణఁచి యోగంబు సాధింప వలయు. కొందఱు కాయసిద్ధిచే యౌవనవంతులుగానే యుండఁగోరి యు మంత్రౌషధాది వివిధోపాయంబుల నద్వంద్వ పరకాయ ప్రవేశాది సిద్ధులకొఱకై యోగమును దేహవిషయమున నుపయోగింతురు. బుద్ధిమంతు లట్టిదాని నాదరింపరాదు. దేహస్థితి కరణాయాసంబు నిష్ఫలంబు. దేహ మెన్నఁటికైన నంతవంతమె. కావున దేహ దృష్టి కరణమందుఁ గాలక్షేపము సేయక యాకాలముఁగూడ యోగమం దేవినియోగింపవలయు. వనస్పతివలె నాత్మ నిత్యంబు. ఫలంబువలె దేహం బస్థిరంబు. సమాధి యంగంబగుటఁ బ్రాణాయామాదుల

చేయువారు జంగాంగములు బీడింపఁబడరుగదా యందు నేని సత్యంబు.
లొంబును సమాంధిని విడిచి వానియం దాసక్తి నపూంపరాదు. దేహ
పోషణమును సన్మరాదు. కాయసిద్ధికై చేయు ప్రాణాయామములు
నంద్యంబులగాను. దేహపుష్ట్యము జనకప్రభృతి కాచివేచి పొంచి
యుండు మృత్యువును వారింప జాలదు. విఘ్నభీతి నింత ప్రయాస
పడనేల? యోగి నన్ను శరణంబుచ్చి యణిమాది సిద్ధులఁ గోరక
స్వాత్మ సుఖమనుభవించుచు యోగచర్యయం దుండునేని యట్టివాఁ
డట్టి విఘ్నముల చేతను బాధపడఁడు.

## —♦ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు భక్తియోగసంగ్రహము జెప్పుట. ♦—

అనిన నుద్ధవుం డిట్లనియె. అచ్యుతా! జితేంద్రియులు కాని
వారికీ యోగచర్య మిక్కిలి దుష్కరమని తలంచెదను. అనాయాస
ముగఁ బురుషుండు సిద్ధినిఁబొందు నుపాయము స్ఫుటముగఁ దెలుపుము.
మనస్సును స్వాధీనపఱచుకొను యోగులుపవాసాదులఁ గృశింతురు.
కావున వారి మనస్సు కుండఁ బ్రోబాల్యకముగా క్షీణించుచున్నది.
కావున నేకదా పుండరీకాక్షా! సారాసారవివేకు లానందావహమైన
నీ పదాంబుజంబులను యథాసుఖముగ నాశ్రయించుచున్నారు. ఆ
కారణంబున విశ్వేశ్వరా! వీరు భవదీయమాయ వంచితులు గారు.
ఏలయనిన; మేము యోగుల మను గర్వంబు వీరికిఁ గలుగఁజాలదు.
ఎట్టి గర్వంబునైనను వినాశకారిగాదె కదా! ఆహా యేమి యాశ్చ
ర్యము! అచ్యుతా! యశేషబంధూ! నిన్నాశ్రయించిన మాత్ర
మున మాయనుండి తరింపఁజేసెదవు. ఇతరుల గణమునుగోరని దాసు
లకు నీవే యధీనుఁడవై యుందువు. గౌరీధవ వాణీధవాది శ్రీము
క్తికిరీటతటకీలిత పాదపీఠుఁడవయ్యు బృందావనమున మృగంబుల
తోడను, రామావతారంబున వానరులతోడను గలసిమెలసి తిరిగి
తివి. ఇది నీ వాత్సల్యమును దెలుపునుగదా! పరత్వ, వాత్సల్య,
సౌశీల్య, సౌలభ్య యుక్తుఁడును నఖిలాత్మలకుఁ బ్రియతముఁడును, నీశ్వ
రుఁడును, నాశ్రితపురుషార్థప్రదుండును నైయుండు జ్ఞాన, శక్తి, పూర్ణాద్యాఖ్య

గుణత్రయవంతుఁడ వగు నిన్నుఁ గృతజ్ఞుఁడెవ్వఁడు వదలిపెట్టును! ఏపురుషుఁడు నీకంటె నితరదైవమును, దన్నుఁ, దాను మఱచిపోవునట్లు సేయు నైశ్వర్యమునకై భజించును? ఆరోగ్యమునిమిత్తము సూర్యుని, శ్రీనిమిత్తము హుతాశనునిఁ గొలుతురుగాని భవదీయ చరణకమల పరాగ సేవాసక్తులమగు మాకు సులభంబుగఁ బొందరాని శ్రేయ స్సేది గలదు? ఈశ్వరా? బ్రహ్మవేత్తలు త్వత్కృత ముపకారంబును దలఁచితలఁచి యుత్కటహర్షులయి బ్రహ్మాయువుపఱకు జీవించినను నీకుఁ బ్రత్యుపకారము సేయఁజాలరు. నేనేమి యుపకారముఁ జేసితి నందువేని భవత్ప్రాప్తి సాధనంబయిన కరణకళేబరంబొసఁగి యంతు వెలుపల నాచార్యరూపంబునను హృదయములోఁ జింత్యమాన రూపంబునను నుండి బోధకుండవు ప్రేరకుండవునై దేహధారులయమం గళంబులను దూరముగఁ దొలగించి స్వగతిని వ్యక్తీకరించెదవు.

అని యనురక్తచిత్తుఁడై యుద్ధవు డడిగిన జగత్క్రీడనకుండును, స్వశక్తిగృహీత మూర్తిత్రయుండును నీశ్వరేశ్వరుండును నగు కృష్ణుండు సప్రేమ మనోహర స్మితుండై యిట్లనియె. ఉద్ధవా! మేలు! చక్కఁగఁ బ్రశ్నించితివి. సుమంగళంబులైన భాగవతధర్మంబులను వర్ణించెదను. వానిని మర్త్యుండు శ్రద్ధతో నాలోచించెనేని దుర్జయంబైన సంసార రూప మృత్యువును జయించును.

వర్ణాశ్రమోచితంబులయిన కర్మంబు లన్నియు మదారాధన రూపంబులనుట స్మరించి మనస్సును జిత్తమును నాయం దర్పించి సంకల్పవికల్పకాత్మకంబైన మనోవృత్తిని నాధర్మము చేయుకొఱకై వినియోగింపవలయును. నా భక్తులు సాధువులు నగువా రాశ్ర యించియుండు పుణ్యక్షేత్రముల గౌరవింపవలయు. దేవాసుర మను ష్యులందఱు నాభక్తి లాచరించిన కథల వినవలయు. ఒంటరిగాఁ గాని నలువురితోఁ గలసిగాని యాత్రామహోత్సవంబులను మహా రాజోపచారంబులతోడ, నృత్య గీత వాద్యంబులతోడ, నాకై యాచరింపవలయు. నిర్మలాంతఃకరణుండై యాకాశమువలె సర్వభూ

తములయందు నన్ను నావరణరహితుండనై వ్యాపించియున్నవాఁడ
నని పరికింపవలయు. కేవల జ్ఞానము నాశ్రయించి సర్వభూతములు
నేనని తలంచి గౌరవింపవలయు. బ్రాహ్మణునియందు, మాలని
యందు, దొంగయందు, బ్రహ్మణ్యునియందు, సూర్యునియందు, మిణుఁ
గురునందుఁ, గ్రూరునియందు, నక్రూరునియందు, సమదృష్టిగల
వాఁడే పండితుఁడు. పలుమాఱు మద్భావంబు భావించువానికి
శీఘ్రకాలమునందే స్పర్ధాసూయా తిరస్కారాహంకారంబులునివర్తిం
చును. బంధువులు పరిహసింతురను బిడియమును, దేహసంబంధ
మైన మానమును, నేనుత్తముఁడను వీ రధము లను గర్వమును,
లజ్జను వదలి సర్వమీశ్వరకళ యని తలంచి కుక్కలకుఁ జండాలు
రకు గోవులకు గాడిదలకుఁ గూడ నమస్కరింపవలయు. ఎంతవఱకు
సర్వము నేనను భావ ముదయింపదో యంతవఱకుఁ జూచినదాని
నెల్ల 'భగవతే నమ' యని వాక్కుచేతను, నీశ్వరకళయని మనస్సుచే
తను, నేలవ్రాలి నమస్కరించుటచే దేహముచేతను, నుపాసింప
వలయును. ఈవిధముగ నుపాసించువానికి సర్వము బ్రహ్మమని దృఢ
తరమైన నిశ్చయజ్ఞానము కలుగును. సర్వము పరమాత్మకత్వమను
బుద్ధిరూపకమైన విద్యచేఁ జూచుచు నిట్టిపురుషుఁడు ముక్తసంశయుఁడై
సమస్తమునుండి విరతినొందుచున్నాఁడు. సర్వభూతములు నేనని
మనోవాక్కాయ వ్యాపారములచే భావించుటే సమస్తోపాయములం
దుత్తమమైనదని నా మతము. అయ్యా యుద్ధవా! సర్వాత్మక బ్రహ్మో
పాసనమను పేరుగల యీ నాధర్మమునుమాత్ర ముపక్రమించినను
దానికి ఫలము కలుగకపోదని నా నిశ్చయము. ఏల యందువేని
నిష్కాముఁడై నా ధర్మమాచరించువానికి గుణబంధహేతువు లేదు.
దానిని బ్రారంభించినంత మాత్రమున నప్పుడో కాలాంతరమందో
గుణత్రయసంబంధమనునది లేకుండఁ జేయును. కోరికలులేని నాధర్మ
మెన్నటికిని జెడదు. ఏయేవ్యాపార మాయాసకరమై నిష్ప్రయోజన
మగునో దానిని ఫలాభిలాష లేక నావిషయమై కావించిన నది ధర్మ
మగు. ఫలహీన మెన్నఁటికిని గాదు. భయమ్ము నిరర్థకగుణమయ్యుఁ

గంసుఁడు దానిని నావిషయమున ననుసరించుటచే వానికి ముక్తిప్రాప్తి కలిగె. క్రోధమున శిశుపాలుఁడు, రాగమున గోపికలు నిశ్శ్రేయంబు గాంచిరి. బుద్ధిమంతుల నిశ్చయబుద్ధి మనీషుల హితాహిత విభాగ మనిత్యమైన మర్త్యశరీరముచే సత్యమైనిర్వికారమై యమృతమైనన్ను బొందింపఁజేయును. సాధూత్తమా ! బ్రహ్మవాదసంగ్రహము సంగ్రహముగాను విపులముగాను నీకుఁ దెలిపితి. ఇది దేవతలకైనఁ బొందరానిది. విస్పష్టములైన యుక్తులతో నెట్లట్లు చెప్పవచ్చునో యట్లట్లు మరలమరల జ్ఞానప్రకారము నీకుపదేశించితి. దీని సత్యమెఱింగిన పురుషుఁడు నష్టసంశయుఁ డగును. నీవడిగిన ప్రశ్నలకు విశదముగాఁ బ్రత్యుత్తరమిచ్చితిని. పురాతనము వేదాంతరహస్యము నగు దీని నెవఁడు ధరించునో వాఁడు పరబ్రహ్మమును బొందును. నేను వివరించి చెప్పిన దీని నా భక్తులకు నీవు పుష్కలముగ నెఱిఁగింపుము. అట్టి బ్రహ్మోపదేష్టకు నన్ను నేనిచ్చి వానిని వశపఱుచుకొని యుండెదను. పరమపవిత్రము శుచియగు దీనిని బఠించుచు దినదినము జ్ఞానదీపముచే నన్ను దర్శించునో వాఁడు ముక్తిప్రాప్తి ప్రతిబంధరహితుండై శుద్ధుఁడగును. దీనిని నిత్యము సనూహితుఁడై శ్రద్ధతో వినువాఁడు నాయం దుత్తమభక్తి గలవాఁడై కర్మములచేఁ గట్టువడఁడు.

ఉద్ధవా! దీనిని నీవు చక్కఁగ మనస్సున నిలిపితివా ? నీ మనస్సునఁ బుట్టిన మోహము శోకములోనైనవి దొలఁగిపోయెనా? దీనిని నీవు దాంభికులకు, శాస్త్రార్థమునందు విశ్వాసము లేనివారికి, మూర్ఖులకు, శుశ్రూష చేయనివారికి, భక్తులు గానివారికి, దుర్వినీతులకు, నెఱిఁగింపకుము. ఈ దోషములులేని బ్రాహ్మణోత్తమునకుఁ, బరోపకారపరులయి శుద్ధులై భక్తి శ్రద్ధలుగల శూద్రులకు స్త్రీలకును నుపదేశింపుము. అమృతముఁ ద్రావిన పిమ్మటఁ బానము చేయవలసిన దెట్లు లేదో యట్లు దీని నెఱిఁగినపిదప జిజ్ఞాసువులకుఁ దెలియఁదగిన దేదియు లేదు. ఆత్మోపాసన, కర్మ, యోగ, కృషి, దండధారణంబుల నేపురుషార్థంబులు లభించునట్టి చతుర్విధ పురుషార్థంబులు నీ యట్టి భక్తునకు నేన యగుదు. అట్టివాఁడు నన్ను విడిచి మఱిదేనినిఁగోరఁడు,

మనుష్యుఁడు సమస్త కర్మములను వదలినవాఁడై తన్ననుగ్రహింపనిచ్ఛ గల నన్ను గుఱించి యాత్మ సమర్పణంబు గావించి భారంబంతయు నాపై వైచునో యప్పుడు ముక్తిని గాంచినవాఁడై నాసాధర్మ్యమును బొందును. ఇట్లు యోగమార్గంబెల్ల నుపదేశించిన యా యుత్తమ శ్లోకుని వాక్యంబులవిని కృతాంజలియై డగ్గుత్తికపడఁ గన్నుల బాష్పంబులు గాఱుచుండ నేమియుఁ బలుకక యూరకుండి ప్రేమచే క్షుభితంబైన చిత్తంబును మెల్లగ స్వవశపఱిచికొని కృతకృత్యుండనైతినని తలంచుచు యదుప్రవీరు చరణారవిందంబులు సోఁకఁ బ్రణమిల్లి యిట్లనియె,

దేవా ! నీ సన్నిధానమువలన నాశ్రితుఁడనైన నా మోహాంధకారంబు వాసె. పితామహజనకా ! ప్రభాకరుముంగలఁ జీఁకటియు మంచు నెట్లు నిలువఁగలవు ? నీ యాశ్రితుఁడనగుట నీదయకుఁ బాత్రుఁడనైన నా హృదయమందు జ్ఞానమయ దీపంబు ప్రజ్వాలింపఁ జేసితివి. కృతజ్ఞుఁడగువాఁ డెవ్వఁడు నీ పాదపంకజంబుల విడిచి వేఱొకనికాళ్ళు పట్టుకొనును ? దాశార్హవృష్ణ్యంధక సాత్వతులయందలి సంసార వృద్ధికొఱకై వ్యాపించియుండిన నా దృఢస్నేహపాశమును నాత్మజ్ఞానమనెడు కత్తిచే ఛేదించితివి. మహాయోగివర్యా! నమస్కారంబులు. భవదీయ చరణాంభోజములయందు ననపాయంబుగ భక్తి నిలుచునట్లు ప్రపన్నుఁడనగు నన్ను ననుగ్రహింపుము. అనిన భగవంతుఁ డిట్లనియె.

నా యనుజ్ఞగొని మదాశ్రమంబైన బదరికాశ్రమంబునకుఁ బొమ్ము. అందు మత్పాదతీర్థంబుల స్నానాచమనంబుల శుచివిగమ్ము. అలకానందలను నదుల సందర్శించుటచే నిరస్త సమస్త పాపుఁడవై వల్కలంబులు ధరించి వన్యంబులైన కందమూలఫలాదుల భుజించుచు విషయాభిలాష విడిచి సుఖముండుము. శీతోష్ణాది ద్వంద్వంబుల సహించుచు నార్జవాది స్వభావయుక్తుఁడవై జితబాహ్యేంద్రియుండవు శాంతుండవునై సమాహిత చిత్తుఁడవై జ్ఞానవిజ్ఞాన సంయుతుండ

వగుము. నేను నీ కుపదేశించిన దానిని మనస్సున నిలిపి వాక్కును మనస్సును నాయం దావేశింపఁజేసి సతతము మద్ధర్మ నిరతుండవై ప్రారబ్ధాంతమున సాత్త్విక రాజస తామసుల గతుల నతిక్రమించి యామీఁదఁ బ్రకృతిమండలమున కావలనుండు నన్నుఁ బొందఁగలవు. హరిమేధుండైన భగవంతుఁ డిట్లు చెప్పినఁ బ్రదక్షిణించి పాదంబులఁ దన శిరంబునోపి భగవదనురాగాతిశయమున శ్లథమైన హృదయంబుగల యుద్ధవుం డశ్రుబిందువుల నమ్మహాత్ము నభిషేకించెను. దుస్త్యజ వియోగకాతరుండై యాతరుండై యాయనను విడిచి పోఁజాలక నిజభర్తృపాదుకల శిరసావహించి మఱిమఱి నమస్కరించుచు నెట్టెట్లో బదరికాశ్రమంబునకుఁ బోయెను. భగవంతుని మనస్సున నిలిపి యచ్చట భగవదుపదేశానుసారంబుగఁ దపంబున హరింజేరెను. ఎవఁడు యోగేశ్వరుఁడైన శ్రీకృష్ణునిచే భాగవతుఁడైన యుద్ధవు నుద్దేశించి భాషింపఁబడిన నిరతిశయానంద పరబ్రహ్మస్వరూపంబైన వేదాంత సముద్రమునుండి సముద్ధృతంబైన జ్ఞానామృతంబును శ్రద్ధచే సేవించునట్టివాని సంబంధులుకూడ సంసారమును దరించి ముక్తి తెరవునఁ బోదురు. ఎవ్వఁడు వేదకర్తయై వేదాంతకలశ వారాశినుండి జ్ఞాన విజ్ఞానామృతం బను పూఁదేనెను దుమ్మెదవోలె వెలికిఁదీసి భవభయంబుఁ బాప నిజభృత్యవర్గమునకుఁ ద్రావనిచ్చె నట్టి జగత్కారణునకుఁ బరమపురుషునకు విష్ణువునకు నమస్కరించెదను.

---

## మౌసలలీల.



భారతరణానంతరము ముప్పదియాఱవ యేఁడు దాపరించె. యదుకులనాశంబగునని గాంధారి శపించిన వర్షం బదియకదా. ఇట్లు

సీ. ప్రాప్తింప ముప్పదియాఱువర్షంబులు
　　విపరీత చిహ్నముల్ పృథివిఁ దోఁచె
వేఁడియుఁ బరుషమై గాడుపు లెల్లెడ
　　గులకరాపిండుతోఁ గూడివిసరె

నపసవ్యముగ మండలాకారముగఁ బక్షి
వితతులు చుట్లను బెట్టుచుండె
నేళులుపాఱెఁ దా మెదురొడ్డి దిక్కులు
మంచుకప్పుట తేజు మాసియుండె

గీ. నాకసంబునుండి యంగారవృష్టియు
నుల్కలనుధరిత్రి నొలుకుచుండె
ధూళిచేతఁగాంతి దూలిపోఁ దరణి క
బంధయుక్తిఁగానఁ బడియె వేగ.

క. ముప్పన్నె లగుచుఁ జివరల
నిప్పాటిలఁ గూష్మమైన నీలిమ వెల్గుం
బువ్వయు రవి యెట్టని మసి
యివ్విధమగు గుడులఁజూడ నొటయుఁ గలిగెన్.

ఆంధ్రభజయము-మౌసలపర్వము

ఈ విపరీతచిహ్నములం గని బలరాముఁడు నరకసాధ్యేయం బగు సురాపేయంబు సాపాయంబగుట యూలోచించి యుపాయంబు రోసి రాజ కృష్ణాద్యనుమతిఁగొని

చ. ఇదిమొద లెవ్వరైన బురి నెయ్యెడనైన సురాసవంబు నే
విధమునఁ జేయఁగూడ దలపేయము నెవ్వఁడు చేసె నేనియున్
బ్రదుకఁదగండు వాఁడు నిజబంధుసమూహముతోడఁ గొఱ్ఱునం
గొదుకక వ్రేయఁగాఁబడెడుఁగూ)రముగా మొగమోటపాయుచున్.

ఆంధ్రభజయము.

అని పురంబున నెల్లయెడల వాడవాడల సందులగొందులఁ జాటఁబనిచె. రామునాజ్ఞఁ బ్రజలు శిరసావహించి యుండిరి. కాని విధి యనివార్యంబుకదా. ఇట్లు చేసినను నంధ వృష్ణివీరుల యాల యములఁ గాలుఁడు విహరణశీలుఁడై సదా కానవచ్చుచుండెను.

క. ముండుఁడు వికటుండు కరా
ళుండును మఱి కృష్ణపింగళుండును నగు వాఁ

డింపుల స్వేచ్ఛగఁ దిరుగుచు
నుండెం, బ్రజలకును దోఁచుచుండెను, వారుల్.

క. పెదపెద విండ్లను దాలిచి
గుదిగుదిగా బాణములను గురిసిరి వేవే
లదవద నాపురుషునిపై
నొదవద యొకగాయమేనియున్ వానిమెయిన్.

ఆ. సర్వభూతజాత సంహారకుండఁట
మర్త్యశస్త్రనిహతి మడియునొక్కొ-
దినము దినమునకును దీవ్రవాత్యావళు
లతిశయిల్లె రోమహర్షణముగఁ

తే. ఎలుకలు చరించె వీథుల నిచ్చఁగొలఁదిఁ
గడవలెల్లను బగిలె నిష్కారణముగఁ
గూర్కువారల వెండ్రుకల్ గోళ్లఁబట్టి
తినియె నెలుకలు రాత్రులఁ దనివిదీర.

తే. గోరువంకలు రేఫగల్ కూయఁదొడఁగె
వీచికూచియటంచును విడువకెపుడు
సారసంబులు గూబల చందమునను
మేషములు నక్కలట్టుల ఘోషలిడియె.

క. కాలప్రేరితములు విహ
గాళులు శ్వేతములు లోహితాంఘ్రులు దిరిగెన్
బాలఁ గపోతంబులు గృహ
పాళులఁ జరియించె ద్వారవతి నెల్లయెడన్.

క. ఒదవెను గరు లొంటెలకును,
మొదవులు గాడిదల నీనె; ముంగిసలకుఁ బె
ల్లొదయించె మూషికంబులు;
కదుకొని కుక్కలకు బిల్లికదుపులు పుట్టెన్.

సీ. రేవతీరమణుండు కృష్ణుండునుం దక్క-
వృష్ణ్యంధకుల వృథా ద్వేషమూని
సురలను దేవ భూసురులను గురులను
పెరుల నిందింప వెఱియపడరు
భార్యలు పతుల మర్యాదలాడఁగఁబూని
భర్తలు పలుకులు భార్యల నచింత్రు
పావకుండు జ్వలించె వామంబుగాఁగను
నీల మెత్తిన పుష్పాదులు లమర

తే. నాపురంబున నుదయ సాయంతనముల
నుండుఁదరణి కబంధసంయుక్తుఁడగుచుఁ
శాకశాలల శుద్ధమౌ వంటకముల
వేలకొలఁదులు పురుగులు వెడలుచుండె.

తే. పండువులయందుఁ బుణ్యాహ వాచములను
బలువురెవ్వరో గుములుగు పరువులెత్తు
కరణి వినవచ్చు నెవ్వరుఁ గానరారు
తార లొండొంటిఁ బలుమఱు దాఁకుచుండె.

క. ఒక్కండుఁ దనదుపుట్టిన
రిక్కను గనుఁగొనఁగలేఁడు శ్రీకరశంఖం
బక్కట! యొత్తిన వీధుల
నొక్కటఁ బరుషముగ ఖరము లొండ్రలు పెట్టున్.

ఆంధ్రజయము.

ఈ యుత్పాతంబులెల్లఁ గాంచి కాంచనచేలుండు యాదవవర్యుల నందఱ రావించి యిట్లనియె. యదూత్తములారా! కాలగతి తెఱంగు చెప్పెద వినుఁడు. పురంబునను గృహంబులను దోఁచు నవలక్షణంబులు మీరును విన్నారు కన్నారుకదా. త్రయోదశి చతుర్దశి యమావాస్యయు రాహుసంబంధమున నొక్కటిగఁ జేరెను. ఇట్టిమూఁడు తిథులు భారతరణవేళఁ బ్రాప్తించె. దాని ఫలంబు

గంటిరిగదా. మహావినాశమునకై మరల నవి యిట్లు చేరె. అంతియ గాదు. పుత్రశోకాతుర గాంధారి శపించిన ముప్పదియాఱవయేఁడు నిదియె. కావున ముప్పు తప్పదు. కౌరవ పాండవ భండనమునకు ధర్మరాజు సేనలఁ బన్నిన సమయమున నెట్టి యుత్పాతచిహ్నలు గానవచ్చె నట్టివే యిప్పుడును గానవచ్చెడిని. కావున మనమిఁక నీనగరంబున నుండరాదు. తీర్థయాత్రకై యందఱు సముద్రతీరముఁ జేరఁ దని చాటింపుఁడని బోధించె. అందఱు నంగీకరించి తగిన సన్నాహములు చేయుచుండిరి.

క. తెల్లని రదములతోడను
నల్లని మోములతోడ నొకతె నవ్వుచుఁ బురిలో
నెల్లెడ రేపవలు తిరుగను
వెల్లసతుల్ కలలు గనిరి హృదయం బగలన్.

తే. అగ్నిహోత్ర గృహంబుల నాలయముల
దారుణాకార గృధ్రముల్ తద్ద చొచ్చి
తమ పలుంబడి తినెడి విధంబుగాఁగఁ
గలలు గని రెల్ల పురుషులు కలఁగు మతుల.

క. కనకంబుల ఛత్రధ్వజ
నివహంబుల భూషణముల నిశిచరులు భయో
ద్భవముగఁ గైకొని పోగిరి
సవడిం చఁగలఁ గాంచిరి నయ్యూర మఱియున్.

సీ. వజ్రనాభంబు దివ్యంబు మాయమయ్యె నగ్ని
దత్తచక్రము దివిఁ దారుకొనియె
దివ్యాంశులగు నాశ్వవర్గంబును
వాజిచతుష్కంబు వార్ధినీఁద
దారుకు డదర నుదార వేగంబున
నీడ్చికొంచేగెను; నెల్లరకును
దరలుఁడు తీర్థయాత్రకు సంచుఁ జెప్పుచు
నచ్చరల్ రామరామానుజాతి

తే. హాలసుపర్ణధ్వజంబుల బలిమిఁ గొనుచుఁ
జనిరి ఘువిఘల్లఁ గన్నులఁగనుచు వృష్ణి
కులులు శుద్ధాంతయుక్తులై లలితభంగిఁ
దీర్థయాత్రకు నేగ నుద్యోగపడుచు. ఆంధ్రభాగవతము.

ఇట్లుఁ దఱుఁ దరలి ప్రభాసతీర్థమున హర్షసముత్సుకులై పటకుటీరంబులు నిర్మించుకొని పానాహారరతిరంభాదిని విహారలోలురై యుండిరి. ప్రత్యాసన్న విపత్తిమూఢచిత్తులై మత్తులై యాదవులు భూమీసుర యోగ్యంబగు నిష్టమృష్టాన్నాదుల వాయసులకు వైచుచుండిరి. కృష్ణు సమ్ముఖమ్మున నే కృతవర్మతోడ బలరాముఁడు మదిరం గ్రోలె. అట్టులే గదయుయుధానులు బభ్రుఁడు గావించిరి. ఇట్లు మత్తక్షీన చిత్తంబులు స్వాయత్తంబులు గాక తత్తరపడ యుయుధానుండు కృతవర్మంగని యోరీ నీవలె నెవ్వాఁడును నిద్రావశులై మృతప్రాయులై పడియుండిన వారిని వధించు. నీ నిష్ఠురచరితంబు కడుంగడు గర్హ్యంబు. యాదవు లెట్లు దీని సహింతురని గేలిగావించె. ప్రద్యుమ్నుఁడు మేలు మేలు చక్కఁ జెప్పితివని నవ్వుచు నామోదించె. అంతఁ గృతవర్మండు సాత్యకిని వ్రేలఁజూపుచు సంగర ముజ్జగించి పరుండిన కరహీనుని యోగరతు భూరిశ్రవు నీవు చంపనవిధ మెవ్వ రెఱుంగరని యాక్షేపించె. ఆ పలుకులు విని కృష్ణుండు సకోపకటాక్షంబు లతనిపైఁ బఱపె. సాత్యకియు నీ కృతవర్మ తమ్ముఁడుగాఁడె నిద్దురపోవు సత్రాజిత్తును మణికై వధించెనని వచించె. అవునవును దొలుత మాకు భార్యగ నిశ్చితమైన దానినిగాదే మరల సిగ్గుమాలి మీ యన్న పెండ్లి చేసికొనియె నని యతండు పూర్వవృత్తం బెత్తి పొడిచె. ఆమాటలు విని సత్యభామ రోషశోకవివశయై కృష్ణు సమీపించి కృష్ణా వింటివా? నీ సముఖమందే నే నిట్టిమాటలు వినవలసివచ్చెను, నా తలవ్రాఁత యింకెట్టివి వినఁజేయునో యని నిష్ఠురములాడుచు నేడ్చెను. సాత్యకియు వారల సంతుష్టికై చివాలున లేచి క్రోధాగ్ని యంతరంగంబునఁ బ్రజ్వలింప ద్రోణనందనుతోడ నిద్రాలోలుర బాలురఁ జంపిన బాలిశుండు వారలతోడఁ బోవను

గాక యని యతని శిరంబు హరి యెసటన నఱకి వైచి యంతఁబోవక భోజాంధకులపై నడరె. వారిపైఁ గవియు తమ్ముని వారింపఁ గృష్ణుండు చనుఁగోన భోజాంధకులును దొమ్మి రేఁగి భోజనపాత్రంబు లాయుధంబులుగాఁ గొని యతనిపయిం గవిసిరి. కృష్ణుం డింతయు నిర్వికారుండై చూచుచుండెఁగాని యెందును బ్రవేశింపఁడయ్యె. తమ్మునకు సహాయపడఁడయ్యె. ప్రద్యుమ్నుండు బంధుర శౌర్యధుర్యుండై యనివార్య జవపరాక్రమంబు లుల్లసిల్ల సాత్యకికిఁ దోడై భోజాంధకులఁ దునుమాడె. ఆ యదువీరయుగ్మము పరాక్రమంబు సహింపక బహుసంఖ్యాకులైన భోజాంధకులు వారిని మార్కొనిరి; వధించిరి. ఇట్లు యదువృష్ణి భోజాంధకులందఱుఁ గృష్ణుండు తక్క వీరు వారనక దొమ్మియుద్ధంబుఁ గావించిరి. అల్పసంఖ్యులైన యదువృష్ణులు హతులుకాఁగ భోజాంధకులు తలమీఱ కృష్ణుపయిం గవయ నతండు తుంగలచేతనే వారలనెల్లః నిరవశేషంబు గావించె. మునివర శాపబలం బేమిచెప్ప! తీర్థయాత్రకుఁ బోవునపు డాయుధంబులు కొనిపోరాదని మున్న కృష్ణుండు నియమించె. ఆ కారణంబున నెవ్వరో ముఖ్యులొక రిరువురు తప్పఁ దక్కినవారెవ్వరు సాయుధులై వచ్చినవారు కారు. వారికెల్ల నాయుధంబులు సముద్రతీరంబున మొలచినతుంగలే. శాపకారణంబున జనించిన యినుపరోఁకటిని దుమురు గావించి సముద్రంబునఁ జల్లిన నది మునివాక్య బలంబునఁ జెడక ముమ్మొన తుంగలై మొలచియుండె. అవియే వారి కాయుధంబులయ్యె. తుంగ యెట్లు లాయుధమగుననియు దీన వ్రేసిన నెవ్వఁడు హతుఁడగుననియు నొక్కనికైనఁ దోఁచినదికాదు. శాపాయుధ శాపబలం బెట్టిదో! దాన వ్రేటుపడినవాఁడు మరల జీవించుట లేదు. వారు దానిని చేతఁ గొనినంతమాత్రమున నది యినుపరోఁకలి కత్తివలె నొప్పుచుండెను గాని తుంగవలె నుండుటలేదు. బ్రాహ్మణ శాపము రిత్తవోదయ్యె. యతినింద వంశక్షయకారణం బయ్యె. తగిలెడి వ్రేటు పడెడుపాటు చూచియుఁ దొలఁగిపోదమని తలంచినవాఁ డొక్కఁడును లేఁడు. సర్వ సంహారకర్త విశ్వభర్త కృష్ణుండు

సర్వంబు సాక్షియై చూచుచుండ, ఆయన కన్నుల యెదుటన
యాయన కొడుకులు మనుమలు చుట్టములు నెల్లవారు నేలపాలైరి.
జనకుఁడనక తనయుఁడనను, నన్నయనక తమ్ముఁడను గొడుకనక
తండ్రియుఁ దమ్ముఁడనక యన్నయు శాపబలంబున నుద్రేకించి
మదిరాపానంబు కతంబున నొడలెఱుఁగక యొండొరులఁ బడనడిచిరి.
అంత బభ్రుండును దారుకుండును కృష్ణుం జేరి యాదవబలంబు నిర్మూలం
బయ్యె. కలహారంభ కాలమందే బలరాముండు తొలఁగి చనియె.
ఆయన యెందున్నవాఁడో యెఱయుదము రమ్మనిన వాసుదేవుండును
దారుకా! నీవు చయ్యన హస్తినాపురంబునకుఁ బోయి యాదవ
కులంబు నిరవశేషంబగుట యెఱింగించి యర్జునుఁ దోడితెమ్ము. వేగ
పొమ్మని పంచి బభ్రుంగని నీవిమిగిలిన మగువలనెల్లఁ జోరులపాలఁ
బడకుండఁ బురిఁజేర్పఁబొమ్మని పంపిన వారట్లు చనిరి కాని కనుమూపు
మేరలోన బభ్రుండుండఁ దుంగ ములికికింబూనిచి యొక వేఁటకాఁ
డాతని వధించె. కృష్ణుం డదిగని శాపంబు చక్కఁబడెనని తలంచి
బలరాముం జేరంబోయి యన్నా! నేను స్త్రీలనెల్లఁ బురంబునఁ
జుట్టంబులఁ జేర్చివచ్చెద. నావచ్చువఱకు నీవిందె యుండుమని యరిగి
స్త్రీలనెల్లరఁ దోడ్కొని పురంబుఁజేర్చి వసుదేవుంగని యాయనకు
సర్వంబువినిచి నాకై యన్న వేచియున్నవాఁడు. ఇవి భవితంబులగుట
తప్పినదికాదు. అప్పుడు కౌరవకులనాశంబుఁ గంటి. ఇప్పుడు యదుకుల
నాశంబుఁ గంటి. ఇఁకనే నిందుండరాదు. అర్జునుఁడువచ్చి సర్వ
కార్యంబులు తీర్చు. అతని రాకకై మీరు వేచియుండుఁడని తన
పోకకై విలపించుస్త్రీలను బాలురను నూరార్చి రాముఁ జేరఁబోయి
యోగసమాధినున్న యాయనం గనియె.

సీ. మఘ్నునైరి కనుచుండ మహిత యోగాన్వితుఁ
డగు నాతనిముఖంబు నందునుండి
వెడలి వేపడగల శ్వేతమహానాగ
మురుగ ముఖంబు నగాధతనువు

గ్రాలఁగాఁ జనె మహార్ణవముచాయనుబట్టి
యమున వేగుడించె నదీశుఁ డమల
సరిదన్వితుండయి సర్పవరేణ్యులు
వాసుకి తక్షక వరుణ మిశ్ర
తే. కుముద ధృతరాష్ట్ర శంఖ కర్కోటకులును
చక్ర మందాది షండ కుంజరులు నంబ
రీష శితికంఠ దుర్ముఖుల్ భీషణాంగు
లైన క్రోధాంబరీషులు ప్రసేదఫణియు.
క. వరుసఁగాఁ గృష్ణుని సన్నిధిఁ
బరమమునసంబునను నర్ఘ్యపాద్యము లిడి ము
ద్భరమునఁ బూజలు సలుపుచు
నిరవున సంస్తుతి సేయుచు నేగిరి ప్రీతిన్.

ఆంధ్రభాగవతము.

అంతఁ గృష్ణుండు వనాంతరమున నొంటిగ నిచ్చమెయిఁ దిరుగుచు భూతవృత్తాంతంబులను నిట్లు లాలోచించె, మదీయ దర్శన స్పర్శనాదులను మదీయ సాంగత్యమునను నానంద మనుభవింపఁ గోరి జన్మించిన సాధువుల కోరికలఁ దీర్పను సాధువ్రాతంబునకు బాధలుగావించు నధర్మవర్తనులగు దురాత్ముల దండించి భూభారంబు తగ్గింపనుగదా నే నవతరించితిని. ప్రథమ వయోనటనకాలమందు సాధుపరిత్రాణంబుఁ గావించితి. ఏకారణంబుననైనను మనస్సు గాఢముగ నామీఁద నిలిపినవారు ముక్తులగుదురని గోపికాదుల వృత్తాంతంబున లోకంబున కెఱింగించితి. దుష్టసంహారంబున కంసురాదోపణంబునందే కానిచ్చి కొంచెపుప్రాయంబునటనంబున ఖలులనెల్ల నిర్మూలించితి. అనివార్యంబైన కాలంబు బలీయంబనియుఁ గేవల పురుష ప్రయత్నం బెట్టివారికైన వ్యర్థంబనియు దైవం బొందగలదని ప్రవర్తించువాఁడె సుఖపడుననియు లోకంబున కెఱింగించితి. పెద్దల నడవడిఁగని సదాచారప్రకారంబు గ్రహింపఁజాలనివారికై నోరార ననుష్ఠానవిధానం బాచార్యుండనై యుపదేశించితి. మఱియు ఫల్గునో

ద్ధవుల నెపంబుగాఁగాని యోగశాస్త్రంబెల్ల దేశికుఁడనై లోకంబునకు బోధించితి. సాధువులు రక్షితులై సుఖంబున్నవారు, భూభారంబడఁగె. అవతార ప్రయోజనంబెల్లఁ దీరె. ఇఁక నే నీలోకమునందుండి చేయఁదగు కార్యం బేదియులేదు. స్వస్థానంబుఁ జేరు సమయంబయ్యె. నిందలేక బొందిపోదను లౌకికగాథ పాటింపవలసియున్నది. పాయస లేపనమునాఁడు దుర్వాసుం డిచ్చినట్లుచేసిన శాపమును యాదవ క్షయంబునకై మౌనులిచ్చిన శాపశేషంబును గొనసాగఁజేసి వారిని సత్యవచనులఁజేయుభారం బొందున్నది. ఇదియు నెఱవేఱు వెరవు పరికించెదఁ గాకయని యొకచోఁ గాలిబొటనవ్రేల లాడించుచుఁ బరుండె. తుంగతునుక బాణంబునకుఁబూని వేటకై తిరుగు జరుఁడను బోయఁడొక్కఁడు దూరంబుననుండి కని కదలెడివ్రేలు మృగంబుచెవియని భ్రమించి బాణంబునవైచి చేరవచ్చి తాను ఛేదించినది మృగంబు గాదనియు శ్రీకృష్ణు పాదాంగుష్ఠమనియు నెఱింగి శోకాతిరేకంబున విహ్వలుండై స్వామీ! దేవాదిదేవా! మహానుభావా! పురందర పురహరారవిందాసన ముఖ్యసురవర పూజితంబగు భవదీయ చరణకమలంబును బాణాగ్రంబున నొప్పించిన నాకంటెఁ బాపాత్ముఁ డెవ్వఁడు? ముకుందా! శరణాగతుఁడను, మూఢుఁడను, క్రూరుఁడను, నీచుఁడను. నామహాపరాధంబు దయాపరమూర్తీ! క్షమింపుము. అపూర్ణకుక్షియగు నీదయకు నాయపరాధం బెంతమాత్రము. శరణు శరణు దేవా క్షమింపుము క్షమింపుమని పదంబులవ్రాలి లేవకున్న నతనింగని యోయీ క్షమించితి లెమ్ము. నీకట్టిభ్రాంతి కార్యార్థమై నేనే కల్పించితినని చెప్పి మునివరులెల్లఁ బూజింప తన తేజంబు లోకంబు నిండ మూర్ధ్వంబున కేగుచో దివంబుఁ జేరవచ్చు సమ్మోహ తేజోమూర్తిని వసు రుద్ర విశ్వులు సిద్ధ చారణ గంధర్వులు నచ్చరలతో నెదురొ్కని కీర్తించిరి. అందుండి భగవంతుఁడు నుగ్ర తేజుఁడు ప్రభవుఁడు నవ్యయుఁడు యోగాచార్యుఁడు నగు నారాయణుండు కాంతి పూరంబున నంతరాళంబు నించుచు నప్రమేయంబైన స్వస్థానంబుఁ [illegible] గృష్ణుఁడు దేవ ఋషి చారణ గంధర్వాప్సర సిద్ధ

సాధ్యులు నానాశిరంబులఁ బూజింపఁ బూజితుండయ్యె. దేవతలు మునులు గంధర్వులా యీశుని ఋక్కుల స్తుతించిరి. ఇంద్రుండును నాయనను నభినందించి యిట్లనియె. భగవంతుఁడా! శార్ఙ్గ ధన్వీ! నమస్కారంబులు నమస్కారంబులు. ధర్మరక్షణార్థంబు భూమిపైఁ గ్రోఁచి దేవశత్రువులైన కంసాదుల వధించి భారతప్తయగు భూమిని యథాస్థితి నిలిపితివి. ప్రభూ! దివ్యము నజరము నప్రమేయము దుర్విజ్ఞేయము నాగమగమ్యము ననాదియునగు స్థానంబున కరుగుము. పరిపన్నులగు మానవుల యార్తిని గల్పకల్పంబున నిట్లే హరించి రక్షింపుము. అని పుష్పవృష్టి గురియించె. అంత నెల్లవారు వినుచుండ సూర్యమండలంబునుండి యొకధ్వని వినవచ్చె. దేవతలారా! నేను భూమియందుఁ జతుర్భుజుండనై జనించుట వర్తించుట లోనగు మదీయ చరిత్రంబులు శ్రద్ధాభక్తులతో స్మరించుచు మద్దివ్యరూపంబు నర్చించు సాధువులయందు నేననురాగయుక్తుఁడనై వసింతును. అను పలుకులు విని దేవతలు ఋషులు నిర్భరానందమునఁ బొంది ముకుంద చరణారవింద మిళిందంబులైన బృందంబుల గోవిందు ముకుందుఁ గీర్తించుచుఁ దమ తమ మందిరంబుల కరిగిరి.

కావున నగాధాపార సంసారపారావారంబున మగ్నులై భగ్నాశులై యుద్విగ్నులై ధర్మకామార్థ లగ్న చిత్తులైనవారికి నిరపాయంబైన తరణోపాయంబు భగవచ్చరణారవిందసమాశ్రయం బొండెయగు. తపోయోగాదులు సాపాయంబులు. వివిధవ్యాధులచేఁ గామక్రోధాద్యాధులచే సర్వదాబాధితంబగుచు దుర్బలంబయిన యీ శరీరంబుచే నిక్కాలంబునఁ దపోయోగాదులనే ముక్తి సాధింతుననుట మెడకు బండగట్టుకొని సముద్రము నీదఁగోరుటయే. కామక్రోధ ధ్వజంబు విచ్చలవిడి విజృంభించి యెగురుచుండు నిక్కాలంబున దుష్కరంబయిన జితేంద్రియత దుస్సాధం బననేల యసాధ్యంబయయి యుండుటఁ జేసి తపోయోగాదుల యతిక్రమించి న్మహిమ లభింపనది యహంకారకారణంబై కామసంతర్పణమునకో క్రోధదాస్యంబునకో వినియోగపడుట సిద్ధంబు. కావుననే పెద్దలు మోక్షసాధనఁ

సీ. దానంబుసేయంగ ధనములు లేవని
వెత నొందఁబోకుఁడీ వెఱ్ఱులార
మనసు నిల్వదు యోగమును సాధనముసేయ
నని దుఃఖపడకుఁడీ యజ్ఞులార
దేహ మస్వస్థంబు తీర్థయాత్రల కని
మదిఁ గుందఁబోకుఁడీ మందులార!
అధ్యయనముసేయ నధికారి గానని
యంగలార్పకుఁడు మూఢాత్ములార
గీ. జపము లేటికి నోయథాజాతులార!
చేయ నేటికిఁ దపము నైష్ఠికులార!
రామ! కృష్ణ! యటంచుఁ గీర్తనముసేయ
నన్ని చేసిన ఫలమబ్బు నన్నలార.
సీ. పుచ్చిన పోఁకైన వెచ్చింపఁబని లేదు
వాకిలి దాఁటెడి పనియు లేదు
కదలక కూర్చుండు కష్టంబునుఁ లేదు
శ్వాసంబుఁ బిగబట్టు చావు లేదు
బుడికోళ్ళవలె నీట మునుఁగు కార్యము లేదు
నోరెండ వల్లించు తీరు లేదు
పొగదాఁకి కన్నులు పోవెడిపని లేదు
కడుపుగాల్చి శ్రమంబు పడఁగ లేదు
గీ. పరుల సాహ్యంబుఁ గోరుచు వారి వెన్కఁ
బరువుపాఱఁగఁ బని లేదు భ్రాతలార!
నాల్క మీసొత్తు రెండు వర్ణములు పల్క
ముక్తికన్యక మీసొత్తు పుణ్యులార!
సీ. ఆటలాడెడి బాలలార! మీ బొమ్మల
హరిపేరఁ బిల్వుఁడీ హర్షమునను
గొంతుని వరియించు కన్యకలార! శ్రీ
పతిని గామింపుఁడీ భర్తగాఁగఁ

బళిసేనదేసెడి సతులార! మీసేవ
కృష్ణసేవయటంచు నెంచరమ్మ
దానయుని నాడించు గొల్లలారా! వాఁడె
శ్రీకృష్ణుఁడని సాదరింపరమ్మ
గీ. భర్తలకు ద్రోహమొంచి పాపంబుచేసి
వారి యాయువు ద్రుంచిన వనితలార!
యతులపోలిక వ్రతమూని హరిని సతము
కీర్తనముసేయ ముక్తి తంగేటిజున్ను.
సీ. కామంబు మీయందు ఘనమయి యుండెనా
గోపవధూ[illegible]
క్రోధంబు మీయందు ఘనసాగు చుండెనా
శిశుపాలుఁ గొనుడు దేశికునిగాఁగ
దారిద్ర్య మింటను దట్టుముట్టాడెనా
యల కుచేలునిఁ గనుఁ డన్నఁగాఁగ
ద్రోహంబు మీయందు దోహద మొందెనా
పూతన నెంచుఁడీ మాత గాఁగ
గీ. ద్వేషబుద్ధియు మీయందు విస్తరింపఁ
గడఁగుడీ సేయ ఘంటికాకర్ణుభంగి
హరికి వినియోగమును జేయ నవగుణంబె
మేటి సద్గుణమయి చాల మేలుదెచ్చు.
చ. హరికి నివేదితంబు, దురితాపహరంబుఁ, బవిత్రముఁ, పుర
స్కారమును, దుష్టిపుష్టి శుభకారణముఁ, సుముదావహంబు, శ్రీ
కర, మపవర్గదాయకముఁ గాంతు[illegible]ప్రసాదముఁ
నిరయముఁ ద్రోవఁ బోవ మది నిష్టములేని సమస్త సజ్జనుల్!
తే. ఎంతగాలించి శోధింపఁ గృష్ణచరిత
గొల్లపిల్లల సరిగ రా కెల్లవారు
[illegible]కథ యెంతయును విమర్శనము సేయ
[illegible] ఘనుఁడు లేడు.

గీ. ప్రణవమునఁగల మూఁడక్కరముల కెనయు
మూఁడు మూర్తుల ధరియించి మ్రొక్కు భక్త
కోటికిని దారకంబయి కూర్చుచున్న
రామచంద్రుఁడె సర్వదా రక్షకుండు.

తే. అరయ నామ్నాయబద్ధులౌ నార్యులిచటి
వేదమూర్తిని గొలుచుట వింతయగునె?
వేదబాహ్యులు మ్లేచ్ఛులు విదితభక్తిఁ
గొలుతు రీ యొంటిమిట్ట రఘుప్రవీరు.

ఉ. నేరను గుళ్ళుగట్టఁగను, నేరను గోపురముల్ ఘటింపఁగా
నేరను భూరిదానముల నీకయి సల్పఁగ రిక్తహస్తుఁడన్
గూరిమి నీదు దాస్యమునకుం దనువున్ మది నప్పగించితిన్.
నేరము లెంచఁబోక దయ నీరజనేత్ర! పరిగ్రహింపవే.

ఉ. లోకులుఁ బండితాగ్రణు లలోభమనస్కులై వీని నాంధ్ర వా
ల్మీకి యటంచుఁ బిల్వ నది మిథ్యగఁ గాక యథార్థమౌటకై
శ్రీకర రాజయోగమును జేకుఱఁ జేసిన రామమూర్తి మా
యేకశిలావిహారి నను నేల స్వకింకరుఁగా గ్రహింపఁడో.

గీ. తానె బోధకుఁడయి కవిత్వంబు నేర్పె
తానె యాచార్యుఁ డగుచుఁ దత్త్వంబుఁ గఱపె
తానె గురుఁడయి యోగపద్ధతులఁ దెలిపె
ధరణి శ్రీరాముఁడే నాకుఁ బరమగురువు.

గీ. ఆపదలవేళ దాతయై యాదరించెఁ
గష్టవేళల నేతయై ఘనతఁగూర్చె
నన్నివేళలఁ దోడయి యంటితిరుగు
రామచంద్రుండె సర్వదా రక్షకుండు.

క. పరమేష్టదైవతం బని
గురుఁ డనుచుం దండ్రియంచుఁ గొడుకంచును నా
పరమప్రియుఁడని హితుఁడని
కరమున్ భజియింతు రాముఁ గరుణాధాముణ్.

గీ. తాఘునుగా ఋణబంధముల్ దలఁగుదనుక
నేకపత్నీవ్రతుండయి యెలమిఁ గనుచుఁ
గామదాసుండుగాక యఖండభక్తి
పథచరిష్ణుతఁ గన్నట్టి ...దరంబు.

సీ. జానకీరామ లక్ష్మణదివ్యమణులకు
నుదిరి బంగరుగుట్ట యొంటిమిట్ట
సాధుమందారమౌ సంజీవరాయని
కొప్పైననెట్ట మా యొంటిమిట్ట
భక్తాగ్రగణ్యులౌ పరమసాధువు లుండ
యోగ్యమౌ మెట్ట మా యొంటిమిట్ట
భవ్యచరిత్రులౌ కవిచంద్రకోటికి
నుదయించుమిట్ట మా యొంటిమిట్ట

గీ. ఉగ్రశైలురకును జెట్ట యొంటిమిట్ట
యొంటితనమునకును హట్ట యొంటిమిట్ట
యొజఁపుఁబున్నెంపుఁ బూఁబుట్ట యొంటిమిట్ట
యురవు ధర్మాళి కనకట్ట యొంటిమిట్ట.

వ. అనవిని క్షీరవార్ధియను ఖ్యాతివహించెను బోతరాజ భాగవత సుధాఘటంబునకుఁ గ్రమ్మఱ నయ్యలరాజవంశ్య సత్కవివరపాళి నిల్వఁగను గల్పధరారుహమన్న సత్ప్రథఁ దవిలిన యొంటిమిట్టకును దక్కుపురంబులు సాటి యొట్లగున్.

సీ. సీ. రాఘవా యన్న నోహోయనుచు వచ్చు
రా యొంటిమిట్ట శ్రీరాముఁ డొకఁడె
యమ్మా యనుచుఁ బిల్వ నాఁ యని బదులాడు
తల్లి మా యయోధ్య సీతమ్మ యొక తె
అన్నా యటన్న నేమన్నా యనుచు, బల్కు
గాదిలితమ్ముఁడు లక్ష్మణుఁ డొకండె
నయ్యా రాఘవా యిదిగో వచ్చితి నను
రాయఁడు సంజీవరాయఁ డొకఁడె

సీ. కర్మయోగియటంచు ఖ్యాతుఁడౌ జనకుండు
భార్యను విడిచెనే భ్రాతలార!
వనవాసు లగుచును వర్తిల్లు మునివరుల్
భార్యల విడిచిరే యార్యులార
రాజయోగులకును భార్యాత్యాగమెందైన
విధియింపఁబడియెనే వెఱ్ఱులార
ప్రహ్లాద ఫల్గున బల్యంబరీషులు
భార్యల విడిచిరే ప్రాజ్ఞులార

గీ. మీరు పతితులైన మిమ్ముద్ధరించును
నాతి శీలవతిగఁ గాదె నేని
శీలవతిగఁ గాక చెడిపోయి యగునేని
ముక్తిఁ గూర్చు మది విరక్తిఁ గూర్చు.

క. కర్మస్వరూప సంచ్యుతి
ధర్మం బని కృష్ణుఁ డెంచెఁ దత్త్వం బనెనే?
ధర్మము ఫలసంత్యాగము
కర్మేతరం బదియె సుమ్ము సకలజనులకున్.

గీ. బ్రహ్మచారికంటె వనవాసికంటెను
జ్ఞానికంటె శ్రేష్ఠ సదయుఁ డరయ
వానియందె ప్రేమ వర్తిల్లు బహురీతి
స్వాత్మరతులు మువ్వ రల్లవారు.

గీ. తమశుభంబును మాత్రమె తలఁచుచుంద్రు
పరుల కుపకారమును జేయు సరణి లేమ
పరుల యుపకార మాశించి బ్రతుకుచుంద్రు
గృహిణిని గృహస్థు విడిచినతర్వు వారు.

క. భగవంతుం డిరు తెఱఁగై
జగములుగను దనాత్మగాఁగ సంక్షోభించున్
జగతీజనసేవావిధి
నగ విశ్వపు టాటగాను నీమంబులకున్.

చ. మరలి చనుండ టన్ననుడి మానకలోపడి యజ్ఞవాటికై
యరిగిన బ్రాహ్మణీమణులె యారయ శ్రేష్ఠలొ, హోమటంచుఁ ద
చ్చరణ సరోజసేవకయి సంభ్రమ మొందిన గోపకన్యలే
గురుతరలో మహిమగలకొమ్మలు చెప్పుఁడు తారతమ్యముల్.

చ. మగలును బంధువుల్ సతులు మానుఁడటంచన ద్రోచిపుచ్చిబల్
తెగువను జన్నగాండ్లైతలె సంపరికత్తెలొ, నైజలజ్జలన్
బగటను గోడివారు గనువారిని యెంచక కొల్లపెట్టి బ
త్తిగ నిలబడ్డ కన్యకలొ? చెప్పుఁడు భామలు తెల్విగల్గినన్.

చ. తరుణులు నీచజన్మలని తర్కముసేయు మహాత్ములార! గో
పరమణు లల్లపూతనయుఁ బాండవపత్ని నిషాది బ్రాహ్మణుల్
దరుణులు గారొ వారలకుఁ దార్కొనదో యపవర్గ; మారయన్
బురుషభవంబుకంటె నొకపొత్తిగఁ బుట్టుట మేలు జ్ఞానికిన్.

సీ. మనసుసంతృప్తిన మీతనయునిగా నెంచి
చన్నుఁబాలిచ్చెడి చనవుగలదె?
మచ్చికఁ జనుచేపఁ గ్రుచ్చి కౌఁగిటనొత్తి
యద్దుముద్దాడు భాగ్యంబు గలదె?
కలనైన హరిని మీ కాంతునిఁగా నిష్ట
గతుల రమించు సౌఖ్యంబు గలదె?
స్వప్నమందైనను సర్వస్వతంత్రత
సరసనిల్చెడి యదృష్టంబు గలదె?

తే. పురుషతాజ్ఞానమే మీకు హరికి నడుమ
దయ్యమట్టుల నిల్చి భేదంబుసేయు
వత్సలతయు దాంపత్యంబు ప్రకృతిసిద్ధ
మతివ కదిమీకు నరులార! యరిది సుమ్ము.

ఆ. గగనమంత్రొ చెప్పె[illegible]న్నను
బట్టియుంద్రు కామ మట్టివాని
రక్తి హరి కొసంగి ముక్తిని గైకొన్న
యతివలార యెంత చతురమతులొ,

శా. ధ్యేయుండిష్టుఁడు రామచంద్రుఁడని ప్రార్థింపంగఁ గృత్యాది నీ
వోయారంబుగ వేఁడుచున్న రావో నిల్వవో ముంగలన్
జేయంజేసితి నీచరిత్రమిది నాచే బాలగోపాలకృ
ష్ణా! యీనాకృతిఁగొమ్ము రాధికబలెన్ సంపూర్ణ రాగంబునన్.

క. వందనము కృష్ణమూర్తికి
వందనములు నందుమంద వనజాక్షులకున్
వందనము భక్తకోటికి
వందనములు దీనిఁ జదువువారల కెల్లన్.

గద్యము.

శ్రీ రామచంద్ర
చరణారవింద మిళిందా
యమాన మానసత్వ మహావై
భవ వావిలికొలను రామచంద్రరాయ
తనూభవ సుజనవిధేయ సుబ్బరాయ నామధేయ
ప్రణీతంబైన శ్రీ కృష్ణలీలామృతం బను.
మహా వచన ప్రబంధమున భవ
తారకలీల యను తృతీయ
చుళుకము సర్వము
సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.
ఓంతత్సద్బ్రహ్మార్పణమస్తు.

